# తెలుగు సాహిత్య వికాసం

## (1900-1947 సంవత్సరాల మధ్య)



సంపాదకుడు:

డా॥ కె. కె. రంగనాథాచార్యులు



# తెలుగు సాహిత్య వికాసం

## (1900 - 1947 సంవత్సరాల మధ్య)

[అక్టోబరు 1978 నుండి సెప్టెంబరు 1979 వరకు జరిగిన
"సారస్వత వేదిక" ఉపన్యాసాల సంకలనం.]

సంపాదకుడు:
డా॥ కె. కె. రంగనాథాచార్యులు





ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001.

# స్వవిషయం

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించే ప్రధాన సాహిత్య కార్యక్రమాలలో ఒకటైన 'సారస్వత వేదిక' మూడు సంవత్సరాలు పూర్తిచేసుకుంది. ప్రతినెలా మొదటి ఆదివారం ఉదయం క్రమం తప్పకుండా ఈ సమావేశాలు జరుగుతున్నాయి. హైదరాబాదు నగరంలోని సాహితీ మిత్రులు, యువకులు ఉత్సాహంతో ఈ సమావేశాలలో పాల్గొంటున్నారు. ప్రత్యేక సాహిత్య విషయాలపైన ఉపన్యాసాలు, చర్చలు ఈ సమావేశాలలో జరుగుతుంటాయి. మొదటి సంవత్సరం వివిధ సాహిత్యాంశాలపైన, రెండవ సంవత్సరం తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియలకు సంబంధించిన గ్రంథాలపైన చర్చలు జరిగాయి. వాటికి సంబంధించిన నివేదికలను ఆయా సంవత్సరాల చివర వెలువరించటం జరిగింది. 1978 అక్టోబరుతో మొదలై 1979 సెప్టెంబరుతో పూర్తయిన మూడవ సంవత్సరంలో 1900-1947 మధ్య తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియల వికాసానికి సంబంధించిన అంశాలను ఉపన్యాస చర్చావిషయాలుగా నిర్ణయించటం జరిగింది. మొదటి రెండు సంవత్సరాలలోలాగ కేవలం నివేదిక లందించటమే కాకుండా పూర్తి ఉపన్యాసపాఠాల సంకలనాన్ని సాహితీ బంధువులకు అందజేసే ప్రయత్నం చేస్తున్నాం. 1947 సంవత్సరాన్ని అవధిగా నిర్ణయించటానికి కారణం స్వాతంత్ర్యోత్తరకాలం అంటే 1947 తరువాత తెలుగు సాహిత్యానికి సంబంధించిన వ్యాసాలు, ఉపన్యాసాలు, చర్చా సంకలనాలు ఇదివరకే కొంతవరకు వచ్చి ఉండటమే.

హైదరాబాదు
10-11-1979

—సంపాదకుడు

# ఇందులో...

# 1900-1947 మధ్య తెలుగు సాహిత్యం

# సింహావలోకనం

ఆధునిక సాహిత్యానికి ఉషఃకిరణాలు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంలోనే ప్రసరించినా అది సమగ్రతను, పరిపూర్ణతను సంతరించుకొన్నది ఇరవయ్యవ శతాబ్ది పూర్వార్థంలోనే. తెలుగు జాతి పునరుజ్జీవనానికి కారణమైన మహానుభావులు చాలామంది జన్మించింది కూడా పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలోనే అయినా వారి ఉద్యమాలు పరాకాష్ఠను పొందిందికూడా ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలోనే. ఒక్కొక్క జాతి జీవితంలో పురోగమనానికి కారణమైన వివిధ ఉద్యమాలన్నీ పరస్పరం పెనవేసుకొని వస్తుంటాయి. కందుకూరి సంఘ సంస్కరణోద్యమం, గిడుగు వ్యావహారిక భాషోద్యమం, కందుకూరి-గురజాడల సాహిత్యోద్యమాలు, కొమర్రాజు చరిత్ర పరిశోధన, విజ్ఞాన శాస్త్ర ప్రచార, గ్రంథాలయోద్యమాలు-వీటితో పాటు భారతదేశం స్వాతంత్ర్యం కోసం సాగుతున్న జాతీయోద్యమం ఈ శతాబ్ది పూర్వార్ధాన్ని తెలుగుదేశ చరిత్రలోనే మహోన్నత యుగంగా నిలబెట్టాయి. అందుకే ఈ ఉద్యమాలు భూమికగా ఉన్నత శిఖరా లందుకున్న ఈ కాలపు సాహిత్య వికాసాన్ని అధ్యయనం చేయటం తెలుగు సాహిత్య చరిత్ర అధ్యయనంలో ప్రాముఖ్యాన్ని వహిస్తున్నది.

ఇరవయ్యో శతాబ్ది పూర్వ భాగంలోని తెలుగు సాహిత్య వికాసాన్ని గురించి చెప్పుకొనేముందు ఆధునిక సాహిత్యానికి మూలస్తంభాలైన కందుకూరి గురజాడలను గురించి ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉంటుంది. కందుకూరి, వీరేశలింగం పేరు తెలుగు జాతి చరిత్రలో ముఖ్యంగా సంఘ సంస్కరణోద్యమంతోనే ముడిపడి ఉన్నా ప్రాచీన సాహిత్య క్షీణ యుగపు చీకట్లను చీలుస్తూ ఆధునిక సాహిత్యం వెలుగులను ప్రసరింపజేసిన వాడుగా తెలుగు సాహిత్య చరిత్రలో ఆయనకు ప్రత్యేక స్థానం ఉన్నది. తెలుగు సాహిత్యానికి కందుకూరి ఆధునికతను సంతరింపజేసిన నూతనాంశాలు నాలుగు. 1. సామా

జిక ప్రయోజనానికి, ముఖ్యంగా సంఘసంస్కరణకు సాహిత్యాన్ని సాధనంగా చేయటం. 2. అలంకారాలతో, దీర్ఘసమాసాలతో నిండిన కవిత్వాన్ని, గర్భ బంధ, చిత్ర కవిత్వాలను నిరసించి ఆధునికతకు ప్రధాన లక్షణమైన సరళ మైన కవిత్వం అవసరాన్ని సూచించటం. సరస్వతీ నారద సంవాదం ఈ ఆశ యాన్నే చాటి చెప్తుంది. 3. ప్రబంధ యుగంలో ప్రారంభమై దక్షిణాంధ్ర వాఙ్మయ యుగం చివర పరాకాష్ఠ పొందిన అంగాంగి వర్ణనలతో కూడి భౌతిక శృంగారం నిండిన రచనలను నిరసించటం: అందుకే ముద్దు పళని 'రాధికా సాంత్వనా'న్ని నిషేధింపజేశాడు; తారాశశాంకవిజయాన్ని తగలబెట్ట మన్నాడు; కామోన్మత్తుల్ని చేస్తుందని 'వసుచరిత్ర'లాంటి ప్రబంధాల్ని చదువకపోతే బాగుంటుందన్నాడు. 4. అంతవరకు ఒక పద్యప్రక్రియ మాత్రమే తెలుగుసాహిత్యంలో ప్రధానంగా ఉండగా అనేక వచన ప్రక్రియల్ని ప్రవేశపెట్టి ప్రచారం తీసుకొని రావటం, తెలుగులో మొదటి నవలను రాయ టమే కాకుండా, పోటీలద్వారా నవలా రచనలను ప్రోత్సహించాడు కందుకూరి. వివిధ శాస్త్ర విషయాలకు, సాహిత్య విమర్శలకు, మూఢ నమ్మకాలను ఖండించటానికి సంబంధించిన అనేక వ్యాసాలను రాయటం ద్వారా ఆ ప్రక్రి యకు ప్రచారం కలిగించాడు; నాటికలని చెప్పదగ్గ ప్రహసనాలను మొదటి సారిగా రాశాడు; శాస్త్ర గ్రంథాలను అనువాదం చేశాడు; రచించాడు; సంప్రదాయ పద్ధతిలో కాక కొత్త పద్ధతిలో తెలుగుకి వ్యాకరణం రాశాడు; తెలుగువాచకాలు తయారుచేశాడు; 'వివేకవర్ధని' లాంటి పత్రికలద్వారా తెలుగులో జర్నలిజానికి మార్గం వేశాడు; మొదటి నాటక కర్త కాకపోయినా అనేక సంస్కృత నాటకాలను, ఆంగ్ల నాటకాలను అనువాదం చేశాడు; స్వతంత్రంగా నాటకాలు రాశాడు; తరువాత తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలకు ఆధార గ్రంథం అనదగ్గ 'తెలుగు కవుల చరిత్ర'ను సమగ్రమైన విధానంలో రాసి తెలుగు సాహిత్య పరిశోధనా పద్ధతులకు మార్గం వేశాడు. పై అంశాలు కందు కూరిని ఆధునిక తెలుగు జాతి చరిత్రకే కాకుండా, ఆధునిక తెలుగు సాహి త్యానికి కూడా 'యుగ కర్త'ను చేశాయి.

కేవలం సాహిత్యాన్ని మాత్రమే తీసుకొన్నప్పుడు వస్తువులో, రూపంలో, భాషలో, సంవిధానంలో-సాహిత్యానికి సంబంధించిన అన్ని అంశాలలో నవ్య తకు అభ్యుదైనవాడు గురజాడ అప్పారావు. గురజాడ కేవలం కవి రచయిత

మాత్రమేకాదు మేధావి; భవిష్యత్సమాజాన్ని దర్శించగల ద్రష్ట; మానవతా వాది. కందుకూరి సంఘసంస్కరణోద్యమం, గిడుగు వ్యావహారిక భాషో ద్యమం రెండూ గురజాడలలో సమన్వయం పొంది తెలుగు సాహిత్య నవ యుగవైతాళికుణ్ణి చేశాయి. ఆయన సాహిత్యానికి వస్తువు సమకాలీన సమాజం; సద్యః ప్రయోజనం సంఘసంస్కరణం; అంతిమ ప్రయోజనం విశ్వమానవ సౌభ్రాతృత్వం; ఆలోచనా విధానం శాస్త్రీయం; దృష్టి ప్రజాదృష్టి; భాష అంత వరకు తెలుగు కావ్యాలలో కనిపించే సంస్కృత జటిలమైన శైలికి భిన్నమైన సరళమైన వ్యావహారిక భాష; కవితారూపం అంతవరకు పండితులకు మాత్రమే పరిమితమైన వృత్తాలు, గణబద్ధ ఛందస్సు కాక సామాన్యులు పాడుకోవ టానికి అనుకూలమైన మాత్రా చ్ఛందస్సు, గేయ ఫణితి-ఇవి గురజాడ ఆధునిక కవి వాల్మీకి కావటానికి కారణాలు. తెలుగులో తొలి ఆధునిక నాటకం 'కన్యా శుల్కాన్ని', తొలి కథానికను రాసింది గురజాడే. ఆధునిక యుగ ప్రధాన లక్షణమయిన ఖండకావ్య రచనకు కూడా గురజాడనే మొదటి వాడుగా పేర్కొనాలి. అయితే గురజాడ మరణించిం తరువాత ఇరవై అయిదు సంవత్స రాలకుగాని ఆయనకు గుర్తింపు, ప్రచారంరాలేదు. దీనికి మొదటి కారణం భావ కవిత్వం. ధోరణి నవ్యమైనదైనా భాష, ఛందస్సు మొదలైనవన్నీ ప్రాచీన పద్ధతికి సంబంధించినవే భావకవిత్వంలో. ఆ కారణం వల్ల పండితులు, సాంప్రదాయికులు నవ్య కవిత్వం పేరిట భావకవిత్వాన్నే ఆదరించారుగాని అన్నింటా నవ్యతగల గురజాడను తట్టుకోలేకపోయారు. భావకవిత్వంతోపాటు దేశభక్తి పేరిటా, ఆంధ్రాభిమానం పేరిటా వచ్చిన గత పునరుద్ధరణ వాద కవిత్వం రెండవకారణం. వేదకాలం నాటి భారతీయ సంస్కృతిని, శాతవాహ నుల నాటి ఆంధ్ర వైభవాన్ని వర్ణించే కవిత్వానికి ప్రచారం ఇచ్చిన సాంప్ర దాయికులు 'దేశమంటే మట్టికాదోయ్', 'మంచిగతమున కొంచెమేనోయ్' అన్నే గురజాడ భావాలను జీర్ణించుకోలేకపోయారు. మూడవదీ, అన్నిటికంటే ముఖ్య మైనదీ అయిన కారణం గురజాడ తాను నివసించిన కాలం కంటే నూరేళ్లు ముందుండటం (చూ. ఇదే గ్రంథంలో బూదరాజు రాధాకృష్ణ పే. 185). 'కొయ్య బొమ్మలు మెచ్చు కనులకు, కోమలులు సౌరెక్కునా' అని ఆధునిక కవితను గురించి గురజాడ వెలువరించిన అభిప్రాయాలు, 'మగడు వేల్పన పాతమాటది, ప్రాణ మిత్రుడ నీకు....' అని భార్యా భర్తల సంబంధాన్ని

నిర్వచించిన విధానం, 'మలిన దేహుల మాలలనుచును, మలిన చిత్తుల కధికుకల ముల, నెలవొసంగిన వర్ణ ధర్మమధర్మ ధర్మంబే' అని వర్ణాధర్మాన్ని అధర్మ ధర్మంగా భావించటం, 'మంచి చెడ్డలు మనుజులందున, యెంచి చూడగ రెండు కులములు, మంచియన్నది మాలయైతే, మాలనేఅగుదున్' అని కుల భేదాలను కాదనటంతోపాటు సమాజంలో అట్టడుగున ఉన్న మాలలను గురించి ఆలోచించటం, 'మతములన్నియు మాసి పోవును, జ్ఞానమొక్కటి నిలచి వెలుగును' అని మతాలనే తోసి రాజనటం, 'యెల్ల లోకము వొక్కయిల్లై' అని విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రకటించటం సమకాలీన కవులకే కాదు నేటి కవులలో చాలామందికి కూడా ఆలోచనా స్థాయికి అందని విషయాలు, ఊహాలోకి రాని అంశాలు. తెలుగు దేశంలోనేకాదు మొత్తం భారతదేశంలోనే సాహిత్య రంగంలో తాను చేస్తున్న కృషికి సమతుల్యమైన కృషి కనిపించదని గురజాడే స్వయంగా చెప్పుకున్నాడు. అభ్యుదయ సాహిత్యోద్యమం పుంజుకున్న తరువాతనే గురజాడ ప్రగతిశీల చారిత్రక పాత్రను గుర్తించటం జరిగింది.

1900-1947 మధ్య తెలుగు కవిత్వం ప్రధానంగా రెండు పాయలుగా కనిపిస్తుంది. ఒకటి సంప్రదాయ కవిత, రెండవది ఉద్యమశీలమైన నవ్య కవిత లేక ఆధునిక కవిత. ఖండ కావ్యాలు కొన్ని ప్రాచీన ఛందస్సులో ఉన్నా కవిత్వం కథనుంచి వేరు కావటం అనే నవ్య కవితా లక్షణానికి సంబంధించినవి కాబట్టి ముఖ్యంగా సుదీర్ఘకావ్యాలను మాత్రమే సంప్రదాయ కావ్యాలుగా స్వీకరించ వలసి ఉంటుంది. వీటిని ముఖ్యంగా నాలుగు భాగాలుగా విభజించవచ్చు. 1. ప్రాచీన పురాణేతిహాసాలు వస్తువులుగా రచించినవి. వావిలికొలను సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మొదలైన వాళ్లు ఈ కోవలోకి వస్తారు. విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షము'లో కొన్ని కాండలు స్వాతంత్ర్యానికి పూర్వమే వచ్చాయి. 2. జాతీయోద్యమ కాలంలో అంతకు ముందు కావ్య వస్తువులు కాని వీరుల కథలను వస్తువులుగా తీసుకొన్న గ్రంథాలు. గడియారం వేంకటశేషశాస్త్రిగారి 'శివభారతము,' దుర్భాక రాజశేఖర శతావధాని 'రాణా ప్రతాపసింహ చరిత్ర' ఈ పద్ధతికి సంబంధించినవి. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి 'మహాత్మకథ' జాతీయ

నాయకుణ్ణి వస్తువుగా తీసుకొన్న కావ్యాలలో ప్రధానమైంది. 3, పురాణ కథలకు కొత్త వ్యాఖ్యానాలు చేసి, భావపరివర్తన కోసం సమన్వయం చేసి రాసిన కావ్యాలు. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'సూత పురాణము' లాంటివి (చూ. నాయని కృష్ణకుమారి పే. 1-21) 4. ఆశు కవితలు-అవధానాలు. నిజానికి ఇవి సుదీర్ఘ కావ్యాల కోవలోకి రాకపోయినా రూపం, వస్తువు. ధ్యేయం మొదలైన వాటిని బట్టి ఇవి సంప్రదాయ పరిధిలోకే వస్తాయి. ఈ శతాబ్ది పూర్వార్ధంలో ప్రక్రియగా ఆశుకవిత-అవధానాలు ఎక్కువ ప్రచారంలోకి వచ్చినా సాహిత్య స్థాయిని దృష్టిలో పెట్టుకొన్నప్పుడు అది ఉత్తమ కవిత్వం కావటానికి అవకాశాలు తక్కువ (చూ. జి. వి. సుబ్రహ్మణ్యం పే. 22-36). రాజ్యాలు, రాజులు పోయి భూస్వామ్య వ్యవస్థ వేళ్లపెకిలించుకొని పోతున్న తరుణంలో భూస్వామ్య సమాజ స్వభావాన్ని వదులుకోలేని సంప్రదాయ కవులకు ఆలంబనగా నిలిచింది అశుకవిత—అవధానాలు. ఈ ప్రక్రియ ఈ కాలంలో ఎక్కువ వ్యాప్తి చెందడానికి కూడా ఈ అవసరమే పనిచేసింది. ఈ ప్రక్రియను పూర్తిగా వినియోగించుకొని దానినొక ప్రధాన సాహిత్య ప్రక్రియగా గుర్తింపు తెచ్చిన ప్రతిభావంతులు తిరుపతి వేంకట కవులు. అయితే ప్రాచీన కవితకు భరత వాక్యం, ఆధునిక కవితకు నాందీ వాక్యం పలికిన వారుగా వారిని పేర్కొనటం ఆధునిక సాహిత్య పరిణామంలో వారికి అవసరాన్నిమించిన పీట వేయటమే ఔతుంది. 'కాలము బట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి, దేశభాష మారుతుంది, వంటి కొన్ని వారి అభిప్రాయ ప్రకటనలను వదిలేస్తే ఛందస్సులో, భావంలో, అభిప్రాయంలో, వస్తువులో తిరుపతి వేంకటకవులు సాంప్రదాయకులు. అయితే కవిత్వాన్ని సాధారణ జనుల దగ్గరకు తీసుకొని వెళ్లటం అనే అంశాన్ని వీరు కాలానుగుణంగా సాధించారు. సంప్రదాయ పద్ధతిలోని ఖండ కావ్య కర్తలలో రాళ్లపల్లి, పుట్టపర్తి మొదలైన వాళ్లను చెప్పుకోవాలి. ప్రాచీన పద్ధతిలోనే అయినా సామాజిక స్పృహతో వస్తు నవ్యత చూపిన ప్రతిభావంతులైన కవులలో జాషువాను ముఖ్యంగా పేర్కొనాలి.

1900-1947 మధ్య తెలుగు సాహిత్యానికి ప్రత్యేకతను, ఆధునికతను సంతరింపజేసిన ఉద్యమశీలాలైన నవ్య కవితా ధోరణులు భావకవిత్వం, అభ్య

దయ కవిత్వం, భావ కవిత్వానికి సమాంతరంగా వచ్చిన దేశ భక్తి కవిత్వం. తెలుగులో ఉద్యమాల ప్రత్యక్ష ప్రభావం కవితారంగంమీద పడినట్లుగా ఇతర ప్రక్రియలమీద పడినట్టు కనిపించదు. ప్రబంధయుగం, దక్షిణాంధ్ర వాఙ్మయ యుగాలనాటి భౌతికశృంగారం స్థానంలో మానసికమైన ప్రేమను, అమలిన శృంగారాన్ని నిలబెట్టిన భావకవిత్వం కందుకూరి ఉద్యమాలలో ఒకటైన పచ్చిశృంగారాన్ని వ్యతిరేకించటానికి లక్ష్యంగా నిలిచింది. పద్దెనిమిదవ శతాబ్దం ఉత్తరార్థం, పందొమ్మిదవ శతాబ్దం పూర్వార్థం మధ్యకాలంలో యూరప్‌లో, ముఖ్యంగా జర్మనీ, ఇంగ్లాండ్, ఫ్రాంసుదేశాలలో వచ్చిన "రొమాంటిక్" కవితా ఉద్యమానికి సుమారు వందసంవత్సరాల తరువాత తెలుగులో వచ్చిన ప్రతిధ్వనే భావకవిత్వం. (చూ. ముకురాల రామారెడ్డి, పే. 97-46.)

పారిశ్రామికవిప్లవం, తదితర కారణాలవల్ల పాతసంస్కృతి, విలువలు, కుటుంబ సంబంధాలు శిథిల మౌతున్నదశలో స్వేచ్ఛపేరుతో, స్వాతంత్ర్యం పేరుతో వైయక్తిక మానసిక ప్రపంచాన్ని సృష్టించుకొని వ్యక్తిప్రాధాన్యాన్ని నిలబెట్టే ప్రయత్నంలో "రొమాంటిక్"కవిత యూరప్‌లో బయలుదేరింది. నిజానికి భావకవిత్వానికి ప్రేరకశక్తులు, అలాంటి కవిత్వం రావటానికిగల పరిస్థితులు ఈ దేశంలో ఆనాడు లేవు. ఆంగ్లవిద్యావ్యాప్తి కారణంగా, ఆంగ్ల సాహిత్య పఠన ఫలితంగా, అనుకరణగా, అనుసరణగా మాత్రమే భావకవిత్వం తెలుగు దేశంలో వచ్చింది. భావకవులు వర్ణించిన ప్రణయం, విరహవేదన వారి జీవితానుభవం నుంచి వచ్చినవి కావు. అయితే ఆ మార్గంలోని కవులు కొందరు ప్రతిభావంతులు కావటంవల్ల, కవితాశిల్పంవల్ల భావకవిత్వం కొంతకాలమైనా తెలుగు దేశంలో నిలదొక్కుకోగలిగింది. శైలిలో, అభివ్యక్తిలో, పదప్రయోగంలో కనిపించిన నవీనగుణాలు ప్రబంధ క్షీణయుగం రచనలతో విసుగెత్తిన పాఠక లోకానికి కొత్తవెలుగు నివ్వటంకూడా భావకవిత్వం కొంత ప్రచారం పొందగలగటానికి మరో కారణం. దేవులపల్లి కృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, తల్లావఝుల శివశంకరశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వర రావు, విశ్వనాథ సత్యనారాయణ భావకవులలో ఎన్నదగ్గవారు.

1910-1935 మధ్య భావకవిత్వంతోపాటు దేశభక్తి పేరిట ప్రాచీనత పైన అభిమానాన్ని, పునరుద్ధరణ కాంక్షనీ అభివ్యక్తీకరించే కవిత్వం కూడా

భావకవులలో చాలామంది ఇలాంటి కవిత్వం కూడా రాశారు. మానికి దోహదంగా దేశభక్తి ప్రేరేపక గీతాలు, పద్యాలు రాసిన కుల సత్యనారాయణశాస్త్రి, గరిమెళ్ళ సత్యనారాయణ మొదలయిన నిజానికి ఇలాంటి కవిత్వానికి నాందిగా చిలుకమర్తివారి పద్యం ంబు చక్కని పాడియావు" 1906 లో వచ్చింది. ఈ కాలంలోనే మర పాత్రలతో, పామరభాషలో రచించిన నండూరి వెంకట రచించిన "ఎంకి పాటలు," "బసవరాజు అప్పారావు గీతాలు" చెప్పుకోదగ్గవి.

ష్ణశాస్త్రిబాధ ప్రపంచానికి బాధ, ప్రపంచపుబాధ అంతా శ్రీశ్రీ చలం మాట ఆ ఇద్దరూ వరుసగా ప్రాతినిధ్యం వహిస్తున్న భావ అభ్యుదయకవిత్వానికి సరిగ్గా ఇముడుతుంది. కవి తాను కల్పించు ను పాఠకుడికి వినిపించుకొనే రోజులు పొయ్యాయి. భావకవితా పడికట్టు పదాలతో పాఠకులు విసుగెత్తిపోయిన దశలో శ్రీశ్రీ, ష్, శ్రీరంగం నారాయణబాబు భావకవిత్వంపైన తిరుగుబాటు లో చివరి ముగ్గురూ వ్యక్తులుగామాత్రమే భావకవిత్వంపైన తిరుగు గా, శ్రీశ్రీ అభ్యుదయ కవితోద్యమానికి ప్రారంభకు డయ్యాడు. యణబాబులలో ప్రజాజీవితానికి, పీడితులకు, హీనులకు సంబంధం బు లేకపోలేదు. (చూ. కడియాల గోపాలరావు, పే. 63–66.)

భ్యుదయ కవిత్వానికి యుగకర్త శ్రీశ్రీ యే. ఈ శతాబ్ది పూర్వా ర్జాతీయ, జాతీయరంగాలలో ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగా గా అనేకమైన మార్పులు వచ్చాయి. అంతర్జాతీయంగా వచ్చిన లితం ప్రతిదేశంపైనా పడటం సహజం. ఆర్థిక, సామాజిక సమ చమానవు లందరికీ సంబంధించినవి. అందుకే అభ్యుదయకవిత్వా క్తులు అంతర్జాతీయ మైనవే కాదు, జాతీయమైనవి కూడా. అందు ంలో వచ్చిన "రొమాంటిక్" ఉద్యమానికి, తెలుగుదేశంలో వచ్చిన ద్యమానికి ఉన్నంత ఎడం పాశ్చాత్యదేశాలలో వచ్చిన "ప్రోగ్రె ట్రీ ఉద్యమానికి, అభ్యుదయకవితోద్యమానికి లేదు. అభ్యుదయ మార్క్సిస్టు సిద్ధాంతాలు ఆత్మ, సమసమాజ నిర్మాణం ధ్యేయం.

1917 లో వచ్చిన రష్యావిప్లవ ప్రభావం ప్రపంచం అంతటా పడింది. (చూ. కడియాల గోపాలరావు, పే. 47-55). 1932 లో "న్యూ సిగ్నేచర్స్" పేరుతో లండన్ నుంచి ప్రోగ్రెసివ్ రచయితల కవితా సంకలనం వచ్చింది. 1935 లో అఖిల భారత స్థాయిలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడగా తెలుగు దేశంలో 1943 లో మొదటి అభ్యుదయ రచయితల మహాసభలు జరిగాయి. శ్రీ శ్రీ "మహాప్రస్థానం" కవితలు 1933-41 మధ్య వచ్చాయి అభ్యుదయ కవితా రచన 1933 లోనే మొదలైనా ముఖ్యమయిన అభ్యుదయ కవితాసంకలనాలన్నీ 1947 తరువాతనే వచ్చాయి. (చూ. కడియాల గోపాలరావు, పే. 70-72.)

సామాజిక దృక్పథం, మానవసమస్యలు భూమిక కావటం కారణంగా అభ్యుదయకవిత్వమే ఈనాటికీ ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నది. అభ్యుదయ కవిత్వంతో పాటు వచ్చిన అధివాస్తవిక కవిత్వంలాంటివి తెలుగుదేశంలో నిల్వనుకోలేదు. పాశ్చాత్యదేశాలలోని మేధావులలో నిరాశా, నిస్పృహలు, అరాచక పోకడల ఫలితంగా వచ్చిన ఈ కవిత్వానికి ఈ దేశంలో సామాజిక ప్రేరణ లేదు. (చూ. కడియాల గోపాలరావు, పే. 62-64).

ఆంగ్లసాహిత్య సంపర్కంవల్ల తెలుగులో చేరి పాఠకులలో ఎక్కువగా ప్రచారం పొందిన వచన ప్రక్రియలు నవల, కథానిక. నాటికీ నేటికీ తెలుగునవలా వాఙ్మయంలో మొదటిస్థానం ఇవ్వదగ్గ నవల ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు గారి "మాలపల్లి" ఈ యుగం మధ్యకాలంలో వచ్చింది. సమకాలీన జీవితాన్ని, వివిధ సామాజిక సమస్యలనూ అద్దం పట్టేదే నవల అయితే 'మాలపల్లి' దీనికి సరియైన లక్ష్యం అవుతుంది. జాతీయోద్యమం, రష్యన్‌విప్లవం, గ్రామీణవాతావరణం, మాలవాడలు, ఆర్థికపోరాటాలు, కార్మికసంఘాలు—తెలుగుదేశం సమకాలీన చరిత్రను చక్కని వాడుకభాషలో చిత్రించిన నవల మాలపల్లి. అభ్యుదయ కవిత్వంలో కనిపించే అనేక అభ్యుదయభావాలు అంతకుముందే ఈ నవలలో కనిపిస్తాయి. నవలలోని తీవ్రభావజాలం కారణంగా ఆనాటి ప్రభుత్వం దాన్ని చాలాసార్లు నిషేధించిందంటే దాని ప్రాధాన్యం బోధపడుతుంది. ఈ నవలకు భిన్నంగా భూస్వామ్యవ్యవస్థలోనే అభ్యుదయాన్ని దర్శించిన నవల విశ్వనాథ సత్యనారాయణ నవల "వేయిపడగలు" ఈ యుగంలోనే వచ్చింది.

స్త్రీస్వేచ్ఛ, స్వేచ్ఛాప్రణయం వస్తువులుగా చలం నవలలు ఈ కాలంలోనే వచ్చాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం, అడవి బాపిరాజు మొదలయినవాళ్ళు తమ ఉత్తమమైన నవలల్ని ఈ కాలంలోనే వెలువరించారు. 1947 తరువాత ఎక్కువ ప్రచారం పొందిన మనోవిశ్లేషణాత్మక నవలలు గోపీచంద్ "అసమర్థుని జీవితయాత్ర," బుచ్చిబాబు "చివరకు మిగిలేది," కొడవటిగంటి కుటుంబరావు రచనలు ఈ యుగం చివర వచ్చాయి (చూ. మొదలి నాగభూషణశర్మ, పే. 73-88.). గురజాడతో ప్రారంభమైన తెలుగుకథానిక ఆధునిక తెలుగుసాహిత్యంలో ఉత్తమస్థాయినిపొందిన ప్రక్రియలలో ఒకటి. నవలా రచయిత లందరూ సుమారుగా కథానికలనుగూడా రచించారీ యుగంలో—(చూ. దివి వెంకటరామయ్య, పే. 89-102.)

నాటకాలు, నాటికలు భారతీయసాహిత్యంలో ప్రాచీనప్రక్రియలే అయినా తెలుగులోమాత్రం అవి ఆంగ్లసాహిత్య సంపర్కం ఏర్పడ్డతరువాతే మొదలయినాయి. 1909లో రెండవ ముద్రణగా సమగ్రస్వరూపంతో వచ్చిన తొలి ఆధునిక నాటకం గురజాడ 'కన్యాశుల్కం.'. నవలలలో మాలపల్లిలాగే నాటికీ, నేటికీ మొదటిస్థానంలో నిలచే నాటకం. ఈ యుగం చివర వచ్చిన సుంకర, వాసిరెడ్డి ల 'మా భూమి'నాటకం ఆర్థిక సమస్యలు ప్రధానవస్తువుగా 1947 తరువాత వచ్చిన అనేక నాటకాలకు ఒరవడిగా నిలచింది. ఈ కాలంలోనే సాంఘిక, చారిత్రక, పౌరాణిక, జాతీయోద్యమ నాటకా లెన్నో వచ్చాయి. (చూ. అడపా రామకృష్ణరావు, పే. 128-132.). సాహిత్యపరంగా చెప్పుకోదగ్గ నాటకాలను మాత్రమే ఈ గ్రంథంలో పేర్కొనటం జరిగింది. రంగస్థల ప్రదర్శనల వల్ల ప్రసిద్ధి పొందిన నాటకా లనేకం ఈ కాలంలో వచ్చాయి. ఈ కాలంలో వచ్చిన నాటికలు అనేక సామాజిక, కౌటుంబిక సమస్యలను చిత్రిస్తాయి. (చూ. పాతూరి శ్రీరామశాస్త్రి, పే. 103—112.)

కట్టమంచి రామలింగారెడ్డిగారితో ప్రారంభమైన ఆధునిక విమర్శనాధోరణులు ఈ యుగంలో అనేక రకాలుగా విస్తరించింది. ఆధునికవిమర్శనారీతులను ఒకచోట చేర్చే సమగ్రప్రయత్నం ఈ గ్రంథంలో జరిగింది. (చూ. చేకూరి రామారావు, పే. 133—181). ఈ కాలంలోనే వచ్చిన చర్చలూ, వాదోపవాదాలు, ఉద్యమాలు ఆధునిక తెలుగుసాహిత్యవికాసానికి ఎంతగానో దోహదం చేశాయి. వాటిని ఒకచోట సంగ్రహించి క్రోడీకరించే ప్రయత్నం నాకు తెలిసి

వంతవరకూ తొలిసారిగా ఈ గ్రంథంలో జరిగింది (చూ. బూదరాజు రాధాకృష్ణ, పే. 132-167.). ఈ కాలంలో సాహిత్యవికాసానికి పత్రికలు ఎంతగానో దోహదం చేశాయి.

రచనాభాషావిషయంగా చూచినప్పుడు ఈ యుగానికి ప్రత్యేకప్రాధాన్యం ఉంది. సాహిత్యానికి ఆధునికతను సంతరింపజేసే గుణాలలో సమకాలీన వ్యావహారిక భాషలో రచనలు చేయటం ఒకటి. ప్రాచీన సాహిత్యంలో సృజనాత్మక సాహిత్యం అంతా సుమారుగా పద్యరూపంలోనే ఉండేది. అందుకే నన్నయ భారతభాషే కావ్యభాషగా ప్రాచీనసాహిత్యం చివరిదశవరకు కొనసాగింది. శాసనాల్లో సాధారణ వచనం, రాయవాచకంలాంటి చరిత్రగ్రంథాలు, లక్షణ గ్రంథాల్లోని వివరణలు మాత్రం సమకాలీన వ్యావహారికభాషలోనే ఉండేవి. సృజనాత్మక సాహిత్యంలో వచన ప్రక్రియలకు ప్రాధాన్యం ఏర్పడ్డ ఆధునిక యుగంలో భాషను ఎన్నుకోవటం విషయంలో అనేక వాదోపవాదాలు ఏర్పడ్డాయి. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమం అన్నిరకాల రచనలూ సమకాలీన వ్యావహారిక భాషలో ఉండాలని ప్రచారం చేసింది. వచన ప్రక్రియలో కూడా గ్రాంథికభాషనే అంటే నన్నయ భారతభాషవంటి భాషనే వాడాలని సాంప్రదాయకులు వాదించారు. సంఘ సంస్కరణోద్యమ నాయకు డయిన కందుకూరి మొదట గ్రాంథికంలోను, తరువాత సరళగ్రాంథికంలోను రచనలు చేశారు. జీవితం చివరికాలంలో గిడుగువారి వాదాన్ని అంగీకరించారు కందుకూరి. అయితే ఆయన తన ప్రహసనాలలో, సాంఘికనాటకాలలో వ్యావహారిక భాషను ఉపయోగించారు. జాతిలో వైజ్ఞానికదృష్టిని, హేతువాదాన్ని ప్రచారం చేసిన కొమర్రాజు లక్ష్మణరావు పంతులువంటివారు కూడా వ్యావహారిక భాషావాదాన్ని వ్యతిరేకించి గ్రాంథికాన్ని సమర్థించారు. విశ్వనాథ సత్యనారాయణగారు మొదట కొన్ని రచనలు వ్యావహారికభాషలో చేసినా చివరిదశలో గ్రాంథికంలోకి మారారు. (చూ. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, పే. 198-211.). అయితే గ్రాంథికం గాని, సరళగ్రాంథికం గాని వ్యాసాలకు మాత్రమే పరిమితమైపోయింది. సృజనాత్మకరచయితలు స్వేచ్ఛగా తమ మార్గాన్ని ఎన్నుకొన్నారు. ఉన్నవ వాడుకభాషలో రాయాలని ఉద్యమించి రాసిన నవల "మాలపల్లి." అంతకు ముందే గురజాడ "కన్యాశుల్కం," ఇతరకథలూ వ్యావహారిక భాషలో వచ్చాయి. తమ ప్రాంతపు నుడికారంతో చక్కని తెలుగులో కథానికలు రాశారు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. చలం, గోపీచంద్, కొడవటిగంటి వాడుకభాషలోనే తమదంటూ ప్రత్యేకమైన శైలిని నిర్మించుకున్నారు. ఆంగ్లరచనల శైలీప్రభావం బుచ్చిబాబు వంటివారిమీద కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. అయితే కవిత్వంలో మాత్రం గురజాడ శైలీసారళ్యాన్ని తరువాతి భావకవులు అనుసరించలేదు. అటు గురజాడ కవితలలోను, ఇటు అభ్యుదయ కవుల కవితలలోను గ్రాంథిక, వ్యావహారిక భాషారూపాలు కలగాపులగమై కనిపిస్తాయి. జాతీయోద్యమ గీతాలు కొన్ని దీనికి అపవాదంగా నిలుస్తాయి. పామర మాండలికంలో రచనలు చేసే ప్రయత్నం నందూరి వంటివారిలో కనిపిస్తుంది. పూర్తిగా మాండలికాలలో వచనరచన చేయటం 1947 తరువాతే ఎక్కువగా జరిగింది.

తెలుగు సాహిత్యప్రక్రియలతోపాటు 1900-1947 మధ్య తెలుగుదేశంలో ముఖ్యంగా హైదరాబాదులో ఉర్దుసాహిత్యం తీరుతెన్నులగురించి చివరివ్యాసంలో పరిశీలించటం జరిగింది (చూ. రాజబహదూర్‌గౌడ్, పే. 212-219). ఈ కాలంలో ఉరుదూ, తెలుగు సాహిత్యాలు పరస్పరం ప్రభావితాలయ్యాయేమో ఉభయ సాహిత్య నిష్ణాతులు పరిశీలించవలసి ఉంది.

— కె. కె. రంగనాథాచార్యులు

—o—

# సంప్రదాయ కవిత

డా॥ నాయని కృష్ణకుమారి

ఈ శీర్షికమీద ఉపన్యసించడానికి ముందు, ఈ శీర్షిక ఉద్దేశించిన అర్థాన్ని అవగతం చేసుకోవడంలోనూ, ఆ అవగాహననుబట్టి ఉపన్యాస విషయానికి హద్దులు నిర్ణయించుకోవడంలోనూ నేను చాలా శ్రమపడవలసి వచ్చింది.

సంప్రదాయ కవిత్వం అన్న పదానికి సమానార్థక పదం ఆంగ్లంలో Traditional Poetry. దాన్నే మన భాషలో తిరిగి చెప్పడానికి ప్రయత్నిస్తే ఆ ఆంగ్ల పదానికి ప్రాచీన కవిత్వం అనే అర్థాన్ని యిచ్చేవాళ్ళు చాలామంది ఉంటారు.

అందుకని, 1900-1947 మధ్య కాలంలో అసంఖ్యాకంగా తలయెత్తిన నూతన గుణాలుకల కావ్యాలమధ్య ప్రాచీన కవితాఫక్కికను అనుసరించి మాత్రమే తీర్చిదిద్దబడిన కవిత్వం ఈ నాటి నా ఉపన్యాస విషయంగా స్థిరపడుతుంది.

ప్రాచీన కాలంలో ఉన్న కవిత్వంవంటిదే ఈ నలభైయేడు సంవత్సరాలలో కూడా ఉన్నదని చెప్పడానికి ఉపన్యాస మెందుకు ? మార్పు ఉద్ధృతంగా కొనసాగే కాలంలో ఏ మార్పూ లేకుండా గతానుగతికంగా కావ్యరచన కొనసాగుతున్నదని నిర్ధారించడం, ఆ సాహిత్యానికి గొప్పదనం ఆపాదించడానికి కాబోదు కదా ! అయినా మార్పులమధ్య ఏ మార్పూ లేకుండా ఎంతోకొంత సాహిత్యం ఉన్నదని నిర్ణయించడం సులువుకూడా కాదు. ఒకవేళ క్వచిత్తుగా అటువంటి కవిత్వం ఉన్నా కాల లక్షణాన్నిబట్టి దానికి విలువ ఉంటుందని

నిరూపించడమూ అసాధ్యమైన విషయమే. ఈ శీర్షిక మూలంగా ఇన్ని ఇబ్బందులు!

అయినా సంప్రదాయమన్న మాటకు, మనం లోతుగా తరిచిచూచి, నిర్ధారించగల అర్థం యేమిటి? ఇది ఒకరకంగా మనకు అనాదినుండీ సంక్రమిస్తున్న వారసత్వం. తొలి మానవుడి మెదడులో మతస్థాపక బీజాలు ఎప్పుడు ఏర్పడ్డాయో, అప్పుడే ఆ మతాన్ని ఆధారంగా చేసుకొని పెరిగిన పరాశ్రయ జీవిలాంటిది ఈ సంప్రదాయం. పరాశ్రయ తత్త్వం కలిగిన కొన్ని మొక్కల్ని మనం ఎరుగుదుము. వాటిని ఇక్కడ బదనిక అంటారు. ఈ బదనిక తొలుత మూల వృక్షంనుండి ఆహారాన్ని గ్రహిస్తూ, బ్రహ్మాండంగా పెరిగి, చివరకు ఆ వృక్షాన్ని బలహీనం చేసేట్లుగా తొలుత ఈ సంప్రదాయం మతం వలన జీవితాన్ని నిలువబెట్టుకుని. ఆపైన క్రమంగా ఆ మతాన్నే నిరాకరించవచ్చు. కొన్ని వేల సంవత్సరాలు కొనసాగుతూవచ్చే సంప్రదాయ పరిణామంలో ఈ విషయాన్ని మనం గ్రంహించవచ్చు. అందుకే భూత కాలంనుండి వర్తమానానికీ, వర్తమానాన్నుండి భవిష్యత్తుకూ, ఎప్పటికప్పుడు మూలాన్ని బలహీనం చేసే మార్పుల్నీ చేర్పుల్నీ పొందుతూ మనకు లభించే వారసత్వమే సంప్రదాయం. ఈ వారసత్వం మనుష్య జీవితానికి సంబంధించిన కళలలోనూ, శాస్త్రాలలోనూ, వివిధ విషయాలలోనూ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మనిషికి తాత ముత్తాతలనుండి జీవలక్షణాలు సంక్రమించినట్లే సాహిత్యాది కళాస్వరూపాలకు చెందిన మౌలిక లక్షణాలు కూడా సంక్రమిస్తయ్. కాని యిలా సంక్రమించిన లక్షణాలలో మార్పు క్రమంగా, నెమ్మదిగా, చాపకింది నీటిపొరలాగా, జరిగివస్తూనే ఉంటుంది. ఎప్పుడైనా ఒక్కసారి ఆ మార్పు వరదనీటికి మల్లే ఉద్ధృతంగానూ రావచ్చును. కాని ఆ వేగానికి మౌలిక లక్షణాలు కొట్టుకుపోవడమో, సమూలంగా తుడిచిపెట్టుకుపోవడమో జరగదు. అనగా సంప్రదాయానికి సమూలచ్ఛేదమంటూ జరగడం చాలా అరుదు.

ఉదాహరణకు, పురాణ యుగంలోని కావ్యాలలో ప్రబంధ లక్షణాలు ఆనుషంగికంగా ఉండడం మన మెరుగుదుము. తర్వాత అవి ప్రధాన లక్షణాలై పురాణాలబదులు ప్రబంధావతారం జరిగింది. కాని యే పురాణంలోనూ ప్రబంధ లక్షణాలు లేవని యెట్లా అనలేమో, ఏ ప్రబంధంలోనైనా పురాణ లక్షణాలు

లేవని అదేవిధంగా అనలేము. ఒక్కో లక్షణంయొక్క ప్రాధాన్య, అప్రాధాన్యాల విషయమే మనం చూడగలంగాని, వాటియొక్క అభావాన్ని మనం చూడలేము. 1900 నుండి 1947 వరకూ వచ్చిన తెలుగు సాహిత్యంలో చాలా క్వచిత్తుగాతప్ప సంప్రదాయానికి వైరుధ్యాన్ని చూడలేము. ప్రాచీన సంప్రదాయ శాఖకు కొత్తగా తొడిగిన రెమ్మలను, నిండుగా చూడగలమన్నది సత్యమే అయినా, అసలు శాఖయొక్క అస్తిత్వాన్ని గమనించకుండా ఉండలేమన్నదికూడా సత్యమే. అందువల్ల 'సంప్రదాయ కవిత్వం' అన్న పదానికి ఖచ్చితంగా అర్థ నిర్దేశంచేసి, ఇది సంప్రదాయ కవిత్వంకాదు అని కొంత భాగాన్ని విడిగా పెట్టడం కష్టమే.

అయితే సంప్రదాయాన్ని ఖాతరుచెయ్యకుండా కొన్ని అసాంప్రదాయికమైన కవితాధోరణులు తెలుగు సాహిత్యంలోకి రాలేదా అని మీరనవచ్చు. అవి కేవలం ధోరణులేకాని సంప్రదాయానికి మౌలిక విచ్ఛేదం జరగడంవలన ఏర్పడిన సంప్రదాయాభావమైన స్థితిగల సాహిత్యరూపాలు కావు. అవి ధోరణులే కాబట్టి ఆ ధోరణులెట్లా వచ్చాయో అట్లాగే మరుపుతెరల మాటున పడిపోవడం నిజం. అసలు సంప్రదాయమనేది ఆహ్లాదకరమైన మార్పుల్ని చెందుతూనే ప్రవాహంలాగా సాగిపోతూ ఉంటుంది.

ఉదాహరణకు, మొదటి ప్రపంచయుద్ధం తర్వాత యూరపియన్ దేశాలలో 'డాడాయిజం' తలయెత్తింది. అర్థరహితంగా, అరాజకంగా సాహిత్యాన్ని రంగంమీదికి లాక్కురావాలని కొందరు పూనుకున్న నూతనోద్యమం అది. అది సంప్రదాయంతో పొత్తు చెరిపేసుకుని, ఒంటరిగా, ఖిలంగా నిలిచిపోవాలని రంగప్రవేశం చేసింది. కాని అది కేవలం ఒక ధోరణి మాత్రమే కావడంవల్ల ఎలా వచ్చిందో అలాగే పోయింది. సరిగ్గా ఆటువంటిదే యిటీవల తెలుగు సాహిత్యంలో తలయెత్తి వెంటనే కొడిగట్టుకుపోయిన దిగంబర కవితా ధోరణి. దాని గతీ అంతే. సంప్రదాయపు పునాది లేని కట్టడంగనుక కూలిపోక తప్పలేదు.

సంప్రదాయమంటే అంతా ప్రాచీనమూ, చాదస్తమైనదీ అని అర్థంకాదనీ గతం వర్తమానానికి అందించే కాలానుగుణమైన మార్పుల్ని సంతరించుకున్న

వారసత్వమనీ చెప్పడానికి ఇంత తంటాలు పడుతున్నాను. ఇటువంటి వార సత్వంలేని కవిత్వమంటూ ఏదైనా ఏర్పడినా అది స్థిరంగా నిలవగలుగుతుందా మరి ?

1848 లో పుట్టిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంప్రదాయ విచ్ఛేదకులు కారు. కాని ఆనాటి సాహిత్యంలో ప్రచురంగా లేని కొన్ని కొత్త పోకడల్ని ప్రవేశపెట్టాలనీ, కొన్ని పనికిమాలిన పోకడల్ని మార్చాలనీ, దృఢ మైన సంకల్పం కలవారు. వీరి సరస్వతీ నారద సంవాదం 1900 కు పది పన్నెండేండ్లు ముందు పుట్టింది. ఇందులో ఆయన అప్పటి కవిత్వంలోని వ్యర్థ శబ్దాడంబరాన్ని నిరసించారు. రసహీనతను ఏవగించుకున్నారు. పదాటోపాన్ని కవితకు అలంకారం కాక సంకెలసుమా అని గర్జించారు.

సుందర బహురస పుష్టి న
మందానందంబు బుధుల మదికిడ దేనిన్
ఛందో బద్ధంబగు పద
బృందాటోపంబు తా కవిత్వం బగునే: — అని స్పష్టంచేశారు.

ఇటువంటి వన్నీ సాంప్రదాయికమైన కవితా మార్గంలో జరిగిన మార్పులూ, చేర్పులు మాత్రమే.

తర్వాత, పాతికేళ్ళ లోపున గురుజాడ, రాయప్రోలు కొత్త దనాన్ని తెలుగు సాహిత్యంలోనికి ప్రయోగరూపాన కావ్యరచనలు చేసి కొనిరావడం, ఒక ఉద్యమ రూపంగా కొనసాగింది. రాయప్రోలు, గురజాడల వలన నవ్య కవితోద్యమమూ, తర్వాత ఇందులోనుండే మరొక చేవగల చిగురుకొమ్మై, భావ కవితోద్యమమూ, ఆపైన అభ్యుదయ కవితోద్యమమూ తెలుగు సీమలో ప్రవేశించాయి. ఈ మూడు ఉద్యమాలూ 1900-1947 మధ్యకాంలో వీర విహారం చేసినవే. 1909 న లలిత, 1910న ముత్యాలసరాలూ జనం మధ్యలోకి వచ్చి నవ్య కవితోద్యమానికి నాంది పలికినట్లయింది. 1924 నుండీ సౌభద్రుని ప్రణయ యాత్ర, మాతృగీతాలు, ప్రవాసం, ఉర్వశి దీపావళి, గిరికుమారుని ప్రేమగీతాలు శ్రోతల్లో ప్రచారానికి వచ్చి కవితోద్యమానికి నాంది పాడి నట్లయింది. 1920 లో సాహితిపత్రిక, 1924 లో భారతి వెలిసి, ఈ ఉద్యమా

లకు ఊపిరి పోశాయి. 1934 న శ్రీ శ్రీ మహాప్రస్థానం ఉదయించి అభ్యుదయ కవిత్వానికి నాంది పలికింది. అందువల్ల ఈ మూడు ఉద్యమాలూ 47 ఏండ్లలో జనించి, ముమ్మరమైన ప్రచారాన్ని పొంది స్థిరత్వాన్ని సంపాదించుకొన్నవే. ఇవేవీ దాడా యిజంలాగా, దిగంబర కవిత్వంలాగా సంప్రదాయ విరుద్ధమైన కవితారీతులు కావు.

అయినా మార్పులూ చేర్పులూ అవే రెమ్మలు ముమ్మరంగా ఉన్న ఈ మూడు కవితా విధానాలనూ, ప్రస్తుతం నా ఉపన్యాస పరిధిలోనుండి తప్పిస్తు న్నాను. 1900-1947 మధ్యకాలంలో సంప్రదాయ కవిత్వం అన్న విషయాన్ని ఒక నిర్దిష్టమైన పద్ధతిలో బంధించి దీన్ని కొనసాగించాలనుకుంటున్నాను. నేను సంప్రదాయ కవిత్వంచుట్టూ గళ్ళుగీచి చేసిన విభాగాలు ఇలా ఉంటాయి.

1. 1900-20 మధ్య కనిపించే ఆస్థానకవుల, ఆశ్రితుల, పండితుల కవిత్వం. ఈ కవిత స్తుతి, ఆశీస్సు, ప్రశంస వంటి అంశాలను కలిగి ఉంటుంది.

2. పురాణ కథలను తిరిగి కావ్యాలుగా మలిచిన కవిత్వం.

3. 1900-34 మధ్య ప్రస్ఫుటంగా కనిపించిన అవధాన కవిత్వం.

4. పల్లెపట్టుల్ని ప్రకృతి వస్తువుల్ని వర్ణించే వస్తుకవిత్వం.

5. జాతీయతా భావ ప్రబోధకమైన కవిత్వం.

ఈ అయిదు గళ్ళలోనూ ఇమిడిన సంప్రదాయ కవిత్వం సాధారణంగా కథన లక్షణం కలిగిఉంటుంది. ఛందో బంధాలను విదిలించుకోదు.

## ఆస్థాన కవుల ఆశ్రితుల కవిత్వం

ఇరవయ్యోశతాబ్దపు ఆరంభంలో కూడా కవిత్వం ఎక్కువగా బ్రాహ్మ ణాశ్రితమై ఉండేది. కవులలో ఎక్కువగా కృష్ణా, గుంటూరు మండలాలకూ, ఉభయగోదావరులకూ, ఆపైన రాయలసీమకూ సంబంధించిన బ్రాహ్మణులు

కనిపించేవారు. వీళ్ళల్లో నియోగి, వైదీకి శాఖలమధ్య అంతశ్శైత్యా లుండేవి. అప్పటి కవులు మొదట పండితులూ, ఆపైన కవులు! పాండిత్యంలేని కవిత్వం గణనకెక్కే రోజులు కావవి. అందుకే వీరేశలింగం పంతులుగారు తను పాండిత్య ప్రకర్షను సూచించే నిరోష్ఠ్య నిర్వచన ద్వ్యర్థికావ్యాలూ, చిత్ర కవిత్వాదులూ ప్రకటించి జనాన్ని మెప్పించవలసి వచ్చింది.

(1) ఈ కవుల కవిత్వాలకు సాధారణంగా ఇతివృత్తం ఉత్పాద్యమే. స్వీయ కల్పనో, సాంఘిక వస్తువు నెన్నుకోవడమో అనేది ఇంచుమించు లేదనే చెప్పాలి. (2) వీళ్ళు శతకాలు ఎక్కువగా వ్రాసేవాళ్ళు. కవిత్వం భగ వంతుణ్ణి స్తుతించడానికి మాత్రమే యేర్పడిందని వీళ్ళ నమ్మకం. ఇటువంటి శతకాలలోనైనా ఆత్మాశ్రయ లక్షణం ఎక్కడోతప్ప. ముమ్మరంగా కనిపించేది కాదు. కేవలం భగవన్మాహాత్మ్య వర్ణన, ప్రశంస, స్తుతి కనిపించేవి. (3) క్షేత్ర కావ్యాలు వ్రాయడం వీరికిష్టం. వారు నివసించే క్షేత్రాలనో, ఇష్టదైవాలనో ఆగ్గించే కావ్యాలే యెక్కువ. (4) తాము ఆశ్రయించిన వ్యక్తుల ఆదేశాన్ననుస రించి, వారిమీదా, వారి కుటుంబ వ్యక్తులమీదా చెప్పే కవిత్వం ఇక్కడ ఎక్కువ.

లక్కవరం జమీందారు రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారు 1913 లో ఏలూరులో తమ కుమార్తె వివాహం ఎనిమిది రోజులపాటు కొట్టి కోలాహలంగా జరిపించారు. ఆంధ్రదేశం నలుమూలలనుండీ కవులను ఆ వివా హానికి ఆహ్వానించి కల్యాణవేళ ఆశీస్సులను పద్యరూపంలో అందించిన వారి జీవిత వివరాలతోసహా 1916 లో "ఆధునిక కవి జీవితములు-అను, హైమ వతీ పరిణయము" అనే గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో స్వయంగావచ్చి కల్యాణాన్ని తిలకించి ఆశీర్వదించిన కవులూ, ఆశీర్వచన పద్యాలు పంపిన కవులూ అందరూ కలిసి 233 మంది లెక్కతేలారు. వీళ్ళ కవిత్వ విధానంలో పూర్వపు సంప్రదాయ వాసనలుపోని పద్ధతి స్ఫుటంగా కనిపిస్తుంది. వీళ్ళందరూ దాదాపు పూర్వోత్తర మీమాంసా తర్కాలంకార పండితులు. వ్యాకరణ శాస్త్రాధికారులు. సాంఖ్యయోగ, అద్వైత తత్త్వపారదర్శకులు. సంస్కృ తాంధ్ర భాషాసాహిత్య ప్రవీణులు. మరో విశిష్ట లక్షణమేమంటే, వీరిలో చాలా

మంది తాము అష్టావధాన శతావధాన విద్యల్లో ప్రవీణులమని చెప్పుకోవడం. ఆ నాటి కవి పరిషత్తుకు అధ్యక్షులు శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రిగారు.

1900 - 1947 నడిమి కాలపు సంప్రదాయ కవిత్వ మార్గానికి ప్రతినిధులుగా వీరిలో కొందరు ప్రసిద్ధుల వివరాలను పొందుపరుస్తున్నాను.

1. కొక్కొండ వెంకటరత్న శర్మ : వినుకొండలో 1842 లో ఈయన జననం. ఈయన కొక్కొండ మాహాత్మ్యాన్ని రచించారు. పానకము అనే పేర మంగళగిరి క్షేత్రమాహాత్మ్యం, పాయసము అనే పేరున సత్యనారాయణీయం, ఇంకా ఘటికాచల మాహాత్మ్యం వ్రాశారు. అంతేకాక 'బిల్వనాథ' అను మధ్యార్కా శతకాలను వ్రాశారు. గోదావరీ వర్ణనను విడిగా పద్యాలలో చేశారు. క్షేత్రదైవతాలను వర్ణించడం, ఒకవిధంగా ప్రకృతివర్ణనమే. గోదావరీవర్ణనమూ అంతే. అయితే వీటికి భూమిక ప్రకృతిని వర్ణించాలనే ప్రీతి కాదు. మతం మాత్రమే. ఆ విధంగా ఈ వర్ణనాకావ్యాలన్నీ సంప్రదాయకావ్యాలే అవుతాయి. కవి, తా నా పరిసరాలలో లీనమౌతున్నట్లు తాదాత్మ్యం చెందుతూ, ఆత్మాశ్రయ లక్షణయుక్తంగా ఆ వర్ణనను ఆవిష్కరించితేనే తప్ప అది భావకవిత్వంలో చేరడానికి వీలుండదు. ఇవికాక ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఇండియాకు వచ్చినప్పుడు, ఆయన ప్రశంసను చేస్తూ తారావళిని వెలయించారు. హైమవతీపరిణయ శుభ సందర్భాన ఆశీషాలను కురిపిస్తూ,

> శ్రీ మహామహోపాధ్యాయ నామ బిరుద
> రత్న కొక్కొండ వేంకటరత్నశర్మ
> సరసుడైనట్టి రాజ భుజంగరాయ
> ప్రభుని తొలి కూతు పెండ్లివర్ణనము చేసె - అని ముగించారు.

2. వడ్డాది సుబ్బరాయ కవి : ఈయన 1854 సం॥లో జనించారు. కేవలం శతకాలవల్ల ఈయన పేరుతెచ్చుకున్నారు. ఈయన భక్తచింతామణి, నందనందన శతకాలు ప్రసిద్ధమైనవి. శతకాలే కాక సతీ స్మృతి, సుత స్మృతి, చాటూక్తి ముక్తావళి అనే లఘుకావ్యాలను వ్రాశారు. స్మృతి కావ్యాలను రచించడం వలన ఈయనను ఎవరైనా భావకవుల జాబితాలో చేర్చే ప్రమాద మున్నదేమో ! కాని యీ స్మృతికావ్యాలలో భావకవితా నిర్ణాయకమార్గాలు లేవు.

3. కాళ్ళకూరి నారాయణరావు : వరవిక్రయ నాటక కర్తగా ఈయన స్థానం తెలుగు సాహిత్యంలో సుస్థిరమైనదే. ఈయన మహాకవి బిరుదు కలవాడు. "బుద్ధిరాజులు, రాజసుందరి, పెద్దలనాటి ముద్దుకథలు" అనే చిత్ర కావ్యాలకు కర్త. కల్యాణ సమయంలో గీతమాలికలో వధూవరుల నాశీర్వదిస్తూ వరు నుద్దేశించి,

... ... ... ... " పరిణయమ్ము
నాటి ప్రేమ యెప్పటికష్టు నాటి యట్టి
క్రొత్తదిగ నుండజూడు మే కోర్కె నైన
మరల నడిగించు కొనకుము మనసు నొచ్చు
హాస్య మెన్నడు నాడకు మాజ్ఞ వెట్ట
బోకు మూరకయే తిక్క పొదమునట్లు ; "

అని బుద్ధులు చెప్పారు.

వధువు నుద్దేశించి,

"ప్రథమమున చెలివై తరువాత గృహిణి
వై యవల నీడవై దాది వగుచు పిదప
చతురవస్థల భర్తకు హిత మొనర్పు
మెప్పు దర్హుడుగా జోచునప్పుడెల్ల
ముద్దియా యాతనికి నొక్క ముద్దొనగుము ;"

అని వివరించారు.

సంప్రదాయబద్ధంగా, ఏదో ఒక భావాన్ని ఎట్లాగో ఒకలాగ తంటాలు పడి ఛందస్సులో బిగిస్తే అది కవిత్వమైపోతుందనే భ్రమా, ఆ రకంగా ఛందో బద్ధ పద్యరచన చేస్తే చాలు తాము మహాకవులమనే ధీమా, ఈ కాలంలో చాలామందిలో కనిపిస్తుంది. అందు కీ పద్యాలు మచ్చుతునకలు.

4. మధిర సుబ్బన్న దీక్షితులు : వీరి పేరు వినగానే మనకు జ్ఞాపకం వచ్చేవి కాశీమజిలీ కథలు. కాని వీరు కావ్య నిర్మాతలు. అవి (1) గౌతమీ మాహాత్మ్యం (2) సప్తసాగర సంగమ మాహాత్మ్యం (3) భద్రాద్రి

రామ చరితం (4) గౌతమ పుష్కర మాహాత్మ్యం- మొదలైనవి. అంతేకాక వీరు సంస్కృతంలో కవిత్వం చెప్పనేర్చిన దిట్ట.

ఈ పద్ధతిలో రచనలు సాగించినవారిలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, జయంతి రామయ్య పంతులు గారు, కాశీ కృష్ణాచార్యులుగారు, మొదలైన వారెందరో ప్రసిద్ధులు. అందరివీ యించుమించు పైన పేర్కొన్న మార్గానికి భిన్నమైన మార్గాలు ఎంతమాత్రమూ కావు.

ఇక ఈ విభాగానికి చెందే రచనలు చేసిన స్త్రీలను గూర్చి ప్రత్యేకంగా చెప్పక తప్పదు. వీళ్ళ రచనలు కూడా పై కోవకు చెందినవే అయినా, వీళ్ళ శతక రచనలో ఆత్మాశ్రయ లక్షణం ఎక్కువగా కనిపిస్తున్నది. వీరేశలింగం గారి స్త్రీ జనోద్ధరణ కార్యక్రమానికి ఫలితంగా ఎందరో స్త్రీలు తమ గృహ జీవన పరిధిలో నుండి బయటికివచ్చి, కలంపట్టి కావ్యరచన కుపక్రమించారు. అట్లా ప్రభావితులైనవారిలో శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారొకరు. వారి సాధురక్షాశతకంలో,

కోపము మెండు నాకెపుడు కుత్సితబుద్ధి యఖండ వృత్తితో
కాపురముండు నా మదిని కల్మష మింక నశింపదయ్య నా
పాపపు చిత్తవృత్తులను భస్మము చేయగదయ్య వేగ సం
తాప హరుండ భక్త వరదా శరణాగత సాధురక్షకా !

అని, ఆత్మ పరివేదనం కనిపిస్తుంది.

అంతేకాక ఆ నాటి స్త్రీలుకూడా సమకాలిక సంఘంలోని ఎగుడు దిగుడులను గమనిస్తూ, కావ్యరచనకు పూనుకోవడం ఇక్కడ కనిపిస్తుంది. కుమారీ శతకం వ్రాసి ఆడపిల్లల్ని ప్రబోధించిన పురుషులకుమల్లే కుమారశతకం వ్రాసి మగపిల్లల్ని హెచ్చరించిన స్త్రీలూ ఉన్నారు.

తప్పులెన్నువారు తమ తప్పు లెఱుగరు
అని వచించు సామెతను దలంచి
నీదు తప్పు లెరిగి నేర్పున సవరించి
సఖుల నీతి గఱుప జను కుమార - అని మందలిస్తూ,

2)

సిరులు గలిగెనంచు సరగున గర్వించి
చిర్రుముర్రు లాడి చెడకుమయ్య
ప్రజల కష్టములను బాపని సిరియేల
వరుల వెంటరాదు సిరి కుమార !

అని బుద్ధులు గరపినవారు శ్రీమతి ఆత్మూరి అన్నపూర్ణమ్మ గారు.

ఇంతేకాక వీళ్ళల్లో పురాణాలను ఆంధ్రీకరించినవారూ, పురాణ కథల్ని కావ్యాలుగా మలచినవారూ ఉన్నారు. దేశ నాయకుల చరిత్రల్ని కీర్తించిన వారూ, పవిత్ర శీలలైన స్త్రీ గుణగానం చేసినవారూ ఉన్నారు. కవి కలహంసి చేబోలు సరస్వతీదేవి, విద్వత్కవయిత్రి కాంచనపల్లి కనకాంబ, శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ, శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి మొదలైన యెందరో స్త్రీలు కవితారంగంలో పరిశ్రమించినవారే. నిజానికి 1900-1947 మధ్య కాలంలో వచ్చినంతమంది కవయిత్రులు ఈనాడుకూడా లేరనడం అతిశయోక్తి కాదు. ఛందో రచనావిధానంలో పరిచయంకలిగి, మంచి ధారాశుద్ధి కలిగి, సరళమైన తెలుగు భాషమీద అధికారం కలిగిన కవయిత్రులానాడు ఎందరో ఉండేవారు. కీర్తికోసమూ, ప్రతిష్ఠకోసమూ పాకులాడే తత్త్వం కాదుగనుక, కవిత్వ సాధన ఇహపర సాధన లక్షణంగా భావించారు గనుక, వారందరూ కాలం తెరలవెనుక ఎవరికీ కనపడకుండా ఉండిపోయారు. సమకాలికంగా వచ్చిన మంచి కావ్యాలతో దీటైన కావ్యాలు వ్రాయడంలో తమ ప్రజ్ఞను చాటు కున్నారు ఆ నాటి స్త్రీలు. అందుకే వీరికికూడా 1900 - 1947 మధ్య కాలంలో వచ్చిన సంప్రదాయ కవిత్వ విభాగంలో స్థిరమైన స్థానం ఉన్నట్లుగా గుర్తింపక తప్పదు.

## పురాణ కథల్ని తిరిగి కావ్యాలుగా వ్రాసే శాఖ

మన సంప్రదాయం అచ్చంగా ఆదినుండీ ఇదే. "కేవలం కల్పనాకథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథలే వావిరిపుట్టు రత్నములు" అన్న రామరాజ భూషణుని మాటలోని అంతరార్థమూ ఇదే. సంప్రదాయంమీది మోజుతోనే వీరు ప్రాచీన పురాణ కథల్ని తిరిగి చెప్పే కార్యక్రమాన్ని చేపట్టడం జరిగింది. వీరంతా భారతీయ ప్రాచీన సంస్కృతిని శిథిలం కాకుండా కాపాడాలనే తీవ్ర

మైన ఆదర్శం కలవారు. మార్పులనే గాలిదుమారాలు ఎన్ని వీస్తున్నా పాతుడు రాళ్ళకుమల్లే, ఆ మార్పుల్ని లక్ష్యపెట్టకుండా నిటారుగా నిలిచిపోయినవాళ్ళు వీళ్ళు. ఆ కాలంలోని యీ రకపు రచయితల్ని చూస్తే, వాళ్ళు పరమ భక్తులో, యోగులో, సాంసారిక స్పృహ తెంచుకుని దైవానికీ, మతానికీ సేవచేస్తూ, త్యాగజీవితం గడిపే నిస్సంగులో అయి కనిపిస్తుండడం ఒక విశేషం. అటు వంటివారిలో ప్రముఖుల్ని ఒకరిద్దరిని సూచించి వాళ్ళ ఆదర్శాన్ని స్పష్టం చెయ్యడానికి ప్రయత్నిస్తాను.

1. శ్రీ వావిలికొలను సుబ్బారావు: ఈయన జననం 1863 లో. కడప మండలం వీరిని పెంచి పెద్దచేసింది. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు తెలుగు దేశంమీద విజయ విహారం చేస్తున్న రోజులవి. అప్పుడే కట్టమంచివారి కవిత్వ తత్త్వ విచారం వెలువడ్డది. వావిలికొలను వారికి తన సాహిత్యం పరభాషాప్రభావ జుష్టం కాకూడదనే తపన ఉండేది. తెలుగు గ్రంథాలలో వ్యావహారిక రచనా విధానానికి స్థానం ఉండకూడదనే వీరమైన అభిప్రాయం పాతుకుపోయి ఉండేది. ఆ రోజుల్లో ఆయన ఆంధ్ర కవితా విమర్శన మండలి అనే ఒక సంఘాన్ని స్థాపించారు. అందులో శ్రీ బసవరాజు అప్పారావు, శ్రీ వింజమూరి రంగాచార్యులు, శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ పాటిబండ అప్పారావు ప్రముఖ సభ్యులు. వీరి ఆదర్శాలు చిత్రంగా ఉండేవి. ఈ సంస్థ తరుపున ప్రచురితమయ్యే గ్రంథాలు కేవలం సాహిత్య విమర్శనాపద్ధతులను గూర్చి వ్రాయబడినవిగా ఉండాలి. ఇందులో పూర్వాధునిక సంఘ చరిత్రకు గానీ, విమర్శనకుగానీ తావులేదు. సంఘ సంస్కరణోపన్యాసాలకు స్థానంలేదు. ఆంగ్ల విమర్శనా నియమాలు ఆంధ్ర కావ్యాలను విమర్శించడానికి బొత్తిగా పనికిరావని యీ సంస్థ అభిప్రాయం. దాన్ని ప్రచారం చేయడమే దాని ధ్యేయం. దీన్ని బలపరుస్తూ కురుగంటివారు అలంకార తత్త్వవిచారాన్ని తొలి కుసుమంగా వ్రాసి ప్రకటించారు. ఈ ఉద్యమానికి తెరవెనక సూత్రధారి వావిలికొలనువారే. వావిలికొలను వారు వీర గ్రాంథికవాది కూడా.

శ్రీ గిడుగు వారి వ్యావహారిక భాషావాదం 1904-1920 ప్రాంతాలలో చాలా ముమ్మరంగా ఉండేది. వాడుకభాషను కళాశాలల్లో ప్రవేశపెట్టాలని గిడుగూ, గురజాడా, ఏట్సుదొరా, సెట్టీ- తీవ్రంగా పాటుపడ్డారు. ఈ

నలుగుర్నీ ఉద్దేశించి ఇందులో ఒకడు సవర భాషను ఉద్ధరించేవాడూ, మరొకడు అవకతవక నాటకాలు వ్రాసేవాడూ, ఇంకొకడు తెలుగుభాష మొహమైనా సరిగా ఎరగని ఇంగ్లీషు దొరా, నాలుగోవాడు అరవ సెట్టీ అంటూ హేళనచేస్తూ-వీళ్ళని దుష్టచతుష్టయంగా వ్యవహరించేవారు, అప్పటి గ్రాంథిక పక్షపాతులు. అప్పుడు ఉద్దండులైన పండితులమధ్య జరిగిన భాషాయుద్ధం, ఎన్నో గ్రంథాలు ఆవిష్కృతాలవడానికి ఆస్కారమిచ్చి ఆంధ్రభాషకు మేలే చేసింది గిడుగు వారు, బాలకవి శరణ్యం పండిత భిషక్కుల భాషాభేషజం ప్రకటించగా, వాటికి ప్రతిగా శారదాకాంచిక కింకిణి, గ్రామ్యభాషానిరసనం వంటివి జనించాయి. ఆ రోజుల్లోనే వావిలికొలను వారు సులభ వ్యాకరణాన్ని రచించారు. దీనికి మంచి ప్రశస్తి వచ్చింది. ఇటువంటి నేపథ్యంకల సుబ్బారావుగారు సహజంగా సంప్రదాయ కవి. కుమారాభ్యుదయం అనే పేరుతో రుక్మిణీ కృష్ణులకు మన్మథుడు ప్రద్యుమ్నుడై జనించడం కావ్యంగా వ్రాశారు. వీరి రచనల్లో పదాడంబరం బంధకవిత్వం, దీర్ఘసమాస రచనా వ్యామోహం ఎక్కువ. ఈ కావ్యంచూచి నెల్లూరిలో పండితులు, ఇంత చిన్నవాడు ఇటువంటి కావ్యం వ్రాశాడా అని సందేహించగా, వెంటనే ఆయన నెల్లూరి తల్పగిరి రంగనాయక స్వామిమీద ఆశువుగా ఒక శతకం చెప్పారట. చివర చివర రామాయణాన్ని తెనిగించాలనే కాంక్షతో ఉత్తిష్ఠ నరశార్దూల అన్న పాదాన్ని 'లెమ్ము నరశార్దూలా' అంటూ మొదలుపెట్టి, రామాయణాన్ని ఒంటిమిట్ట కోదండరామ స్వామికి అంకితం చేశారు. ఒంటిమిట్ట అంటే జ్ఞాపకం వచ్చింది. 1916 ప్రాంతంలో పోతన నివాసం ఒంటిమిట్టా, లేక ఓరుగల్లా అని సాహిత్యయుద్ధం పత్రికల్లో నడిచింది. ఈయనతోపాటు శ్రీ జనమంచి శేషాద్రిశర్మ, శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రి ఒంటిమిట్ట అని వాదించగా కందుకూరి, జయంతి, వంగూరి సుబ్బారావు గారలు దానికి ప్రతిగా ఓరుగల్లుగా వాదించేవారు. ఆ ఊపున వావిలికొలను పోతరాజు విజయం అనే కావ్యాన్ని వ్రాశారు. అంతేకాక ఉభయ పక్ష వాదాలకు కోర్టులాంటి విద్వత్సభను కడపలో జరపడానికి సన్నద్ధం చేసుకున్నారు. కాని అది ఒనకూడలేదు.

1902 లో తమ తల్లిగారు కౌసల్యావృత్తాంతాన్ని, మహారాష్ట్రి భాషలోని కథను చెప్తే దాన్ని ఆధారంగా కౌసల్యాపరిణయం వ్రాసి భద్రాద్రిరామస్వామి కంకితం చేశారు. భారతాన్నికూడా చేపట్టారుగాని అది అసంపూర్ణంగా ఉండిపో

యింది. ఈయన శతకాల్లో ఘటికాచలవాస కేశవా శతకం, టెంకాయచిప్ప శతకం, భక్తకల్పద్రుమ శతకం ప్రశస్తి వహించాయి. ఈయన రామసేవకై ఇంటింటికీ తిరిగి భిక్షించినప్పుడు తన అనుభవాలన్నీ చేతుల్లో ఉన్న చిప్పకు చెప్పుకునేవారట. ఇదే టెంకాయచిప్ప శతకం. ఈయన మందరవ్యాఖ్య రామాయణ క్షీరసముద్రానికి మందర పర్వతం. దాన్ని చుట్టుకున్నది వాసుదాసుగారి బుద్ధి రజ్జువు. ఇలాగా సుబ్బారావుగారి సంప్రదాయ కవిత్వరచన ఒక ముఖ్యమైన లక్ష్యసాధనకై రూపు దిద్దుకున్నది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారూ, ఇంకా చాలామంది పురాణానువాదాలు చేశారు. పురాణకథల్ని కావ్యాలుగా మలచినవాళ్ళూ చాలామందే ఉన్నారు. వాళ్ళనుగూర్చి విశేషించి చెప్పుకోవడానికి ఏమీ దొరకదు.

## అవధాన కవిత్వం

అవధాన కవిత్వాన్ని గురించీ, దాన్ని ప్రచారం చేసిన తిరుపతి వేంకట కవుల్ని గురించీ తెలియనివా రెవరూ ఉండరు. ఈ ప్రక్రియ ప్రాచీన సాహిత్యంలో ఉన్నట్లుగా కనిపించదు. ప్రాచీనకవు లెవరూ తమ్ము తాము అవధానులమని చెప్పుకోనూ లేదు. అయితే దీనికి మూలబీజ మనదగిన ఆశుకవిత, కవితావిధానాల్లో ఒకటిగా పేరు పొందింది. చతుష్షష్టి కళలలో, సమస్యా పూరణం, పుస్తక పఠనం, పద్యపాద పూరణం కూడా ఉన్నవి. అవధాన కవిత్వంలో ఇవి ప్రధానాంగాలే. శ్రీనాథుడూ, రాయల ఆస్థానకవులూ, రామకృష్ణుడూ, భట్టుమూర్తీ, అందరూ ఆశుధారను వెలయించినవారని వినికిడి. ఆశుకవిత ఆధారంగా పుట్టి అలంకారాలు చేసుకుని, శాస్త్రాన్ని పెంచుకుని, అందంగా తయారైన సంప్రదాయ కవిత్వపు రెమ్మ అవధాన కవిత్వం. తిరుపతి వేంకట కవులు అవధాన విద్యను శ్రీ మాడభూషి వేంకటాచార్యుల వారిని చూచి అభ్యాసం చేసి, రాపాడాడని వాడుక. ఆయన నూజివీడు మొదలైన సంస్థానాలలో శతావధానం చేసేవారట. తిరుపతి వేంకటకవులు అవధానం చేయడమంటే సిద్ధహస్తులైన పనివాళ్ళు అవలీలగా సర్కస్ చేసి, చూచేవాళ్ళకు ఆనందం కలిగించడమే! అందుకే,

తిరుపతి వ్యాఘ్రమై బయలుదేరిన శిష్యులు గున్నయేన్గులై
పరుంగ తేరగా తగినవారలు బెబ్బులి పిల్లలెల్ల మా
ద్భుత కపి కుర్కురమ్ములయి తోపగ వేంకటశాస్త్రి వీర తే
సరిగ శతావధానమను సర్కసు చూపితివమ్మ శాంకరీ !

అని చెప్పుకున్నారు. అంతేకాక, సంపూర్ణ శతావధానమనే మాటేమిటి సహ స్రావధానమైనా చేయగలమని సవాలు చేశారు.

ఆశువుగా ఇలా పద్యాలు చెప్పే సంప్రదాయాన్ని పునరుద్ధరించి, వీరు పద్యగంగాప్రవాహాన్ని మామూలు మనిషి అనుభవంలోనికి తెచ్చి విడిచారు. తరువాత ఎప్పుడో అభ్యుదయ కవులు చేసిన "కాదేదీ కవిత కనర్హం" అనే నినాదాన్ని వీళ్ళు ముందుగానే అమలులో పెట్టారు. వీళ్ళు పద్యం చెప్పడానికి గ్రహించకుండా విడిచిపెట్టిన వస్తువులేదు. వీళ్ళచేత ప్రభావితులై సామాన్యులు కూడా ఆ రోజుల్లో కవితావేశాన్ని పెంచుకుని అన్ని వస్తువుల్నీ కవితావస్తువు లుగా స్వీకరించారు.

వీళ్ళవల్ల అధిక్షేప కావ్యరచన ఈ శతాబ్దంలో కొత్త బలంతో తిరిగి పొడచూపింది. లంకావిజయం అనే రావణదమ్మీయం, చంద్రరేఖా విలాపంగా మారిన చంద్రరేఖా విలాసం వంటి కావ్యాలలోని అధిక్షేప లక్షణం, తీవ్రత్వాం తగ్గించుకుని, చదివించే లక్షణాన్ని పెంచుకుని, తిరిగి వచ్చింది.–ఇందుకు ముఖ్య మైన కారణం తిరుపతి కవులకూ కొప్పరపు కవులకూ మధ్య పెరిగిన స్పర్థ. ఈ స్పర్థ అప్పుడంగా వీరి మధ్య పుట్టిందికాదు. మధ్యవర్తులు పెంచింది. ఆమధ్య వర్తుల్ని గురించే తిరుపతి కవులు,

"…. …. …. ఆకాశ సౌధమొకటి
కట్టిపెట్టిరి కొప్రంపు కవులకొరకు
ఎక్కలేము మొరో యన నెక్కి తీర
వలయు నని త్రోయుచున్నారు బలము కొలది"—

అని హేళన చేశారు. వీరితో కలిగిన వాదం వల్ల గుంటూరిసీమ ఒకటి పుట్టగా, రామకృష్ణ కవులతో వాదవివాదాల వల్ల, గీరతం, శృంగభంగం, బిడాలో పాఖ్యానం మొదలైన అధిక్షేపకావ్యాలు జనించాయి. తిరుపతి కవులు రామకృష్ణ కవుల్ని హేళన చేస్తూ,

గారెల పిండి వంటకయి కాంతుడు కాంతను పృచ్ఛసేయ నా
సారస నేత్ర వ్రేలొకటి చయ్యన చూపి యిదొక్కడున్నదా
దారమటన్న సామెతగ ధార యొకించుక గల్గు మాత్రనే
వీరవధానపుం బనికి వీరిదులై ప్రయతించి రక్కటా!

అని చెప్పిన పద్యం వీరి యుద్ధవైఖరిని తెలియజేస్తుంది. రామకృష్ణ కవులు తిరుపతి కవుల్ని అధిక్షేపిస్తూ తాము తిరుపతికవి భోగి భోగముల కీశ్వర వేరులమన్నారు. తిరుపతి శాస్త్రిగారు, మీరీశ్వర వేరులా, జీలుగు బెండ్లా, విద్వల్లోకం నిర్ణయిస్తుందనగా దాన్ని పట్టుకుని రామకృష్ణకవులు "పోనీ మేము మీరన్నట్లు కాకవి కాచపాత్రల మొగంబులు మూయగ జీల్గు బెండ్లమే" అని ఒప్పుకున్నారు. దానికి సమాధానంగా తిరుపతి వేంకటేశ్వరులు, "కాకవి!" అని సంబోధించి,

కాకవి కాచ పాత్రల మొగంబులు మూసెడి జీల్గుబెండ్లకుం
జేకురునే సభాస్థితియు, చేకురుగా కది తద్దనంబులన్
గైకొనువేళ నొక్కకడగా బడవైవరె, పట్టు పట్టినన్
మేకు బిగించి లాగి బలిమి న్బలు ముక్కలు చేయకుందురే?

అని తిప్పికొట్టారు. ఆ విధంగా గీరతంలో మేకు బిగింపుపర్వం తయారయింది. పద్యరచనా సంప్రదాయాన్ని యీ రకమైన అధిక్షేప కావ్యాలూ అవధాన కవిత్వాలూ, పటిష్ఠం చేసి నిలువ బెట్టడం జరిగింది. సంప్రదాయ కవిత్వవళ ఉచ్ఛస్థితి నందుకుంది.

చిత్రమేమిటంటే, ఈ కాలంలో ప్రతికవీ అవధానాలు చేయ సాహసించినవాడే. అవధానాలు చేయలేకపోవడం చిన్నతనంగా భావించి, "అవధానములు చేయ ప్రయత్నించుచున్నారు" వంటి గుణాలను కవులు నమోదు చేయించుకుంటుండేవారు. దాదాపు 20 మంది, తిరుపతి వెంకటకవులు అవధానాలు చేసే కాలంలో అవధానాలు చేస్తూ ఉండేవారు.

## వర్ణనాత్మకమయిన వస్తు కవిత

ప్రకృతి వస్తువుల్ని, పల్లెపట్టుల్ని, ఆ యా స్థలాలలో ప్రసిద్ధమైన గాథల్నో, వ్యక్తుల్నో, విశేషాలనో ఆప్తితో వర్ణిస్తూ, తీర్చిదిద్దిన కావ్యాలు ఈ

కాలంలో ఎక్కువగానే కనిపిస్తున్నాయి. ఇవన్నీ సంప్రదాయ పద్ధతిలో సాగిన రచనలే! ఇతివృత్తం ఒక్కోసారి కథను కలిగింది కావచ్చు. మరోసారి కేవలం సంఘటనల్ని మాత్రమే చేపట్టింది కావచ్చు. అటువంటి కావ్యాలలో తొలుత ఎన్నదగింది శ్రీ కట్టమంచి వారి ముసలమ్మ మరణం. ఈయన గ్రహించిన యితివృత్తం స్థానికమైంది. అనంతపురం దగ్గర 'బుక్కరాయ సముద్రం' చెరువుకు సంబంధించిన కథ యిందులో పొదగబడ్డది. జానపద వ్యవహారంలో స్థిరమై, పేరంటాలుగా స్థానికులచే పూజలందుకునే కాపు పడుచు ముసలమ్మే యీ ఖండికలో నాయిక. పల్లెని వర్ణించేపట్ల మానవ మనస్తత్వాన్ని చిత్రించే పద్ధతిలో, కథ ఎత్తుగడలో, ఛందాన్ని నడిపించే తీరులో అంతటా సాంప్రదాయిక లక్షణం ముమ్మరంగా కనిపిస్తుంది. కాని చివరకు, కాపు పడుచు లోక హితార్థం గంగకు తన్నుతాను ఆహుతి చేసుకోవడంలో విషాదాంతత ఉంది. ఇది అసాంప్రదాయికమూ, పాశ్చాత్య విషాదాంత కావ్యాలచే ప్రభావిత మైనదీ అనేదానికంటే జనపదాలలో ఏ పల్లెలో చూచినా ఇంచుమించు ఈ విధంగా కనిపించే స్త్రీ ఆత్మాహుతిని ఆ కాలపు సంప్రదాయంగా భావించడమే సబబు. కేవలం విషాదాంతం చేయడానికి రెడ్డిగారు సామాజిక నేపథ్యంతో ఒక పాత్రను ఈ కావ్యంలో స్వయంగా తీర్చిదిద్దలేదు. ఈ ముసలమ్మ రెడ్డిగారి ముసలమ్మ కాదు. ఈవిడ దేవతగా జనంచేత పూజింపబడే జానపదుల పేరంటాలు.

ఇంచుమించు ఇటువంటిదే దువ్వూరి రామిరెడ్డిగారి నలజారమ్మ అగ్ని ప్రవేశం. మీదుమిక్కిలి ఇది కవి కుటుంబంలో తాత ముత్తాతలనాడు జరిగిం దని చెప్పుకోబడుతున్న కౌటుంబికగాథ. న్యాయానికి ఎవరైనా తలఒగ్గవల సిందేనన్న సాంప్రదాయిక ధర్మసూత్రానికి కట్టుబడిన కథ. అందుకే ఇది విషాదాంతమైనా సంప్రదాయబద్ధమైన కావ్యం.

శ్రీ నిడదవోలు వెంకటరావు గారి మించుపల్లె, ఈ తరహా కావ్యాలకు చక్కని ఉదాహరణగా ఈయదగిన కావ్యం. విమర్శ విద్యలో ఆరితేరిన శ్రీ వేంకటరావు గారు, కవిత్వాన్ని వాహికగా గ్రహించి ఒక ఆదర్శమైన పల్లె ఎట్లా ఉండాలో కళ్ళకు కట్టినట్లుగా చూపించడం ముచ్చట గొల్పుతుంది. పల్లె పరిసరాలు, వివిధ కులాల జనులు, వారివృత్తులు, అక్కడి జనుల మనస్తత్వం కేవలం వాస్తవంగా వర్ణించాలనే కాంక్షతో, కవి ఈ కావ్యాన్ని నడిపినట్లుగా

కనిపిస్తుంది. ఇటువంటి కావ్యాలేకాక, చెదురుమదురుగా వివిధ ప్రకృతివస్తువుల్ని, చిన్నచిన్న సంఘటల్ని, చిన్న కథల్ని, ఈ రకమైన వర్ణనాత్మ పద్ధతిలో తీర్చిదిద్దిన ఖండికలు ఈ కాలంలో ఎన్నో ఉన్నాయి. శ్రీ నాళంవారి మధుర కవితల్లో చిన్న కథలూ, విశ్వనాథ వారి కొండవీటి పొగమబ్బుల వంటి ఖండికలూ, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి, ఉదయశ్రీ, కరుణశ్రీలూ ఈ కోవలో పేర్కొదగినవి.

## జాతీయతాభావ ప్రబోధకమయిన కవిత

1900–1947 మధ్య కాలం జాతీయతను పెంపొందించే సంఘటనలెన్నో జరిగిన కాలం. దేశం దాస్య శృంఖలాలలో దీనంగా అంగలార్చిన కాలం అది. స్వేచ్ఛా వాయువులకోసం దేశ జనం తహతహ లాడడం, 1857 న జరిగిన సిపాయి కలహంతో ఆరంభమైంది. తాంతియాతోపే, ఝాన్సీ లక్ష్మీబాయి, మొదలైన వారు స్వాతంత్ర్య కాంక్షతో తెల్ల వాళ్ళ మీద చేసిన తిరుగుబాటు దేశజనుల కొక మార్గం చూపించినది. తరువాత గాంధీజీ సత్యాగ్రహ సమరం ఆరంభించి ప్రజలకందరికీ పిలుపు నిచ్చారు. తొలుతగా వంగదేశం ఈ పిలుపు చేత ప్రభావిత మైంది. వంగ నాయకులు మన రాష్ట్రంలో పర్యటించడం వలన ఆంధ్ర దేశం కూడా ఈ ఉద్యమానికి సన్నద్ధమైంది. ఈ సమయం లోనే ఇక్కడ దేశభక్తి కవిత ఆవిర్భవించింది. అనాది నుండీ జనుల నరాల్లో జీర్ణించుకు పోయిన రాజభక్తి దేశభక్తిగా మారిపోవడం ప్రారంభించింది. ముఖ్యంగా సంప్రదాయ పరిరక్షకులైన ఆనాటి కవులు చాలమంది, దేశభక్తిని ఉద్యమ నాయకులైన మహా వ్యక్తుల పట్ల భక్తిగా మార్చుకుని, తమ అభిమానాన్ని వారిపరంగా కావ్యరూపాన చాటు కోవడం జరిగింది.

తుమ్మలవారి మహాత్మకథ గాంధీజీ జీవితాన్ని అద్దంపట్టి చూపినట్లుగా స్పష్టంగా చూపించింది. వారి ఆత్మకథ సత్యాగ్రహసమర వివరాల్ని చక్కగా అందించింది. ఛందోబద్ధమై, తీయగా, సరళంగా సాగిన తుమ్మలవారి శైలి మధురమైన శైలి.

శ్రీ గడియారం శేషశాస్త్రిగారి శివభారతం జాతీయైక్యతను చాటే శివాజీ చరిత్ర. ఒక తెలుగుకవి మహారాష్ట్ర వీరుణ్ణి ఉగ్గడించడంలోనే కవిత్వానికి

ఎల్లలులేని తనాన్ని చాటుతూంది. శివభారతంలో నాంది, ప్రస్తావన, పూర్వ రంగం అనే విభజనలుండడం వలన దీన్నొక పద్యనాటకంగా స్వీకరించవచ్చు. అందుకు ఉపబలకంగా కావ్యమంతా సంభాషణా సహితంగా నడవడం గమనార్హం. కావ్యారంభం, నమస్క్రియ, అష్టాదశ వర్ణనలు ఉండడంచేత, ఆశ్వాస విభజన జరగడంచేత దీన్ని ఒక ప్రబంధంగా మనం గణించవలసి ఉంటుంది.

ఇటువంటిదే శ్రీ రాజశేఖర శతావధానిగారి రాణాప్రతాపసింహ చరిత్ర కూడా.

నాయకత్వం వహించే వ్యక్తుల్నేకాక, స్వాతంత్ర్య కాంక్షను వస్తువుగా గ్రహించి, తమ దేశభక్తిని చాటుకున్న కావ్యాలూ, ఖండికలూ ఎన్నో ఉన్నాయి. ఈ దేశభక్తిని ప్రచురంచేసే పద్ధతీ, గ్రహించిన కవితామార్గమూ సాంప్రదాయికమైనవే.

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి—

అన్న శ్రీ చిలకమర్తి వారి పద్యమూ,

మా కొద్దీ తెల్లదొరతనమూ — అన్న శ్రీ గరిమెళ్ళ వారి గీతమూ, ఆ నాటి స్వాతంత్ర్య కాంక్షకు, పరిపాలనా నిరాసానికి మచ్చుతునకలు. ఇటువంటి జాతీయకవిత ఆ రోజుల్లో కోకొల్లలుగా ఉద్భవించి ఆంధ్రదేశాన్ని ముంచెత్తిందనే చెప్పాలి. శ్రీ తుమ్మలవారి రాష్ట్రగానంలో

"అదుగో తెల్గుల తల్లి దివ్యరథ ముద్యత్కాంతి పుంజంబులన్
పది దిక్కుల్ వెలిగించుచున్ కదలెడిన్ ప్రస్థానభేరీ ధ్వనిన్
బధిరంబయ్యె జగంబు మీకుఁగల కాన్కల్ తల్లి కర్పించి తద్
రథమున్ లాగుడు మాతృభక్తి దయివారన్ తెల్గు వీరాగ్రణుల్ !"

అన్న పద్యంలో చూపట్టిన ఉత్తేజమే ఆనాటి జనులందరిలో నిండి ఉండేది.

ఐతం ఇందిరా, భారతులనే కవయిత్రులు వ్రాసిన లేఖికా కావ్యంలో కావ్య నాయిక మాగంటి అన్నపూర్ణ. ఆవిడ జాతీయవాదిని. సత్యాగ్రహ సమరంకోసం గాంధీజీ పిలుపు విని, అందులోకి దూకడానికి నిశ్చయించింది. కాని భర్త విదేశాలలో చదువుకుంటున్నాడు. విదేశీ వేషభాషలమీద మోజు కల వాడు. సీమనుండి సూటు బూటు వేసుకున్న ఫొటోను భర్త పంపగా,

చేరినది మీరు పంపిన చిత్రపటము
పొంగిపోతిని అటుపైన క్రుంగిపోతి
దుస్తు తీరు నిల్చిన భంగి దుర్భరమ్ము
కోపగించితి యేడ్చితి కూలబడితి—
అని బాధపడి,

కాల్చనిచ్చితి భక్తితో గాంధి కేను
రెండు వేల్చేయు పట్టుచీరెలను మరియు
పెండ్లి చీరెనుగూడ నర్పించు కుంటి
వలయుచో ప్రాణమే నిత్తు భరతధరకు—
అని రోషపడి,

పెండ్లి యుంగరమును గూడ ప్రీతితోడ
తిలకు నిధి కిచ్చినాను మీ విలువ గలుగు
చేతి గడియార మిచ్చితి చేత మలర
అకట మిము నిచ్చుకొనెడి భాగ్యంబులేద !
అని వాపోయినది.

ఈ విధమైన భావావేగంతో కూడినా, సంప్రదాయచ్ఛేదం చెయ్యకుండా దాన్ని పరిరక్షించుకుంటూ వచ్చిన కావ్యాలెన్నెన్నో ఆ కాలంలో !

అంతేకాక, రాష్ట్రంలోని చారిత్రక ఉజ్జ్వలత్వాన్నీ, క్షీణతనూ వివరించిన కావ్యాలెన్నో వచ్చాయి. విశ్వనాథ వేగిక్షేత్రం, కొడాలి హంపీక్షేత్రం, శ్రీనివాస సోదరుల ఓరుగల్లుకోట అటువంటివాటిల్లోనివే.

శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలో
పల గుడి గోపురంబులు సభాస్థలులైనవి కొండముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగిపోయిన దాంధ్ర వసుంధరాధి పో
జ్జ్వల విజయప్రతాప రథసంబొక స్వప్న కథావిశేషమై—

అన్న హంపీక్షేత్రపు పద్యం తెలుగు గుండెల్లో అచ్చుపడి నిలిచిపోయింది. వ్రాసింది ఒక్క కావ్యమే అయినా, నిరంతరం కాంతిని వెదజల్లే రత్నాన్ని విడిచిపోయారు కొడాలి వెంకట సుబ్బారావుగారు.

ఈ సంప్రదాయ కవితా సమీక్షలో చేర్చడమో, చేర్చక మానడమో అన్న విచికిత్సను కలిగించే అంశం మరొకటుంది. సంప్రదాయం అన్న పదాన్ని కవితారీతికి, కథన పద్ధతికీ, శైలికీ, ఛందో విన్యాసానికీ మాత్రమే అన్వయిస్తే ఈ అంశాన్ని ఇందులో చేర్చకతప్పదు. అట్లాకాక, ఆ కవితా వాహికద్వారా వెలువరించే అభిప్రాయాలకూ, పురాణవైర ధోరణికీ మాత్రమే ఆ పదాన్ని పరిమితంచేస్తే, దీన్ని ఇందులో చేర్చడానికి వీలుకాదు. ఈఅంశమే త్రిపురనేని రామస్వామిచౌదరిగారి కావ్యసంపుటి చిత్రంగా ఈయన కావ్యాలలోవలే సంప్రదాయ విధేయతా, విచ్ఛేదనమూ ఈయన జీవితంలోనూ లేక పోలేదు. ఈయన తిరుపతి వేంకటకవుల శిష్యుడు. గురువుల పక్షాన కొప్పరపు కవులతో వాదానికిదిగి స్వయంగా అష్టావధానాలు నిర్వహించిన శక్తిమంతుడు. గురుభక్తి కలవాడు.

కాని బ్రాహ్మణ ద్వేషి- ఈ లక్షణం ఆయనకు జన్మతః కాక సమకాలిక సాంఘిక స్థితి యొక్క ప్రభావం చేత లభించినదై ఉంటుంది. ఆ కాలంలో ఉత్తర దేశంలోనూ, తమిళ దేశంలోనూ, కులాలకూ, కులాలకు, కట్టుబాట్లను విధించిన బ్రాహ్మణాధిక్యానికే నిరసనగా ఉద్యమాలు బయలుదేరాయి. తమిళ దేశంలో ద్రావిడ సంఘాలూ, బెంగాల్‌లో మైకేల్ మధుసూదన దత్ మొదలైన వాళ్ళు కొమ్ము కాచిన సంప్రదాయ ప్రతిఘటనా, బ్రాహ్మణాధికార నిరాసాన్ని చేపట్టినవే. అప్పుడే దక్షిణంలో ఆర్య ద్రావిడ వాదాలు చెలరేగడం చేత

ఉత్తర దేశీయులు ఆర్యులనీ, స్థానికులైన ద్రావిడులపై పగబూని వారిని నాశనం చేయడానికే ఆర్యులు ప్రయత్నించారనీ, ఆ ప్రయత్నాలూ, వారిమీద పీరి విజయాలూ ఇవన్నీ రూపాంతరం చెంది రామాయణాది కావ్యాలుగా, మత గ్రంథాలుగా పరివర్తన చెందా యనీ ఒక అభిప్రాయం వేళ్ళు దన్నుకో నారంభించింది. అటువంటి అభిప్రాయానికి బలాన్నిస్తూ పురాణ కథల్ని ఈ దృక్పథంతో చూడాలన్న సంకల్పంతో సాహిత్య సీమలో పరిశ్ర మించినవాడు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి — ఈ ఒక్క అంశంలో ఇతడు సంప్రదాయ విచ్ఛేదకుడు. కాని కులవ్యవస్థను సమూలచ్ఛేదం చెయ్యాలనే విప్లవ వాది కాడాయన. బ్రాహ్మణాధిక్యం తగ్గించాలని మాత్రమే కంకణం కట్టి, కమ్మ కులంలో ఉత్సాహ వంతులైన యువకులకు సంస్కృత మంత్రాలకు తెలుగు చేతలు నేర్పి వారిని కమ్మ బ్రాహ్మణులుగా తీర్చి దిద్దారు. తెనాలిలో ఈయన ఇల్లు సూతాశ్రమం. అక్కడ నుండే సూతాశ్రమ గీతాలు వెలువడ్డాయి. అంతే కాక, కమ్మకుల చరిత్రను వ్రాయించిన, కుప్పు స్వామి చౌదరి అనే ధనవంతుడైన దాతమీద కుప్పుస్వామి శతకాన్ని రచించి, కమ్మ మహాసభల్ని జరిపించి, అధ్యక్షస్థానాన్నలంకరించి ఉపన్యాసాలిచ్చే వారీయన. ఇవన్నీ సంప్రదాయాన్ని ఆమోదించే చర్యలే. అయినా ఈయనకు ప్రాచీన మత గ్రంథాలలో స్థిరపడి పోయి, రాటు దేలిన విప్రత్వం మీద ద్వేషమేకాని విప్రుల మీద కోపం లేదు. ఈయన కెందరో బ్రాహ్మణ స్నేహితులు; వ్యక్తిగతమైన కక్షలకు ఈయన హృదయంలో స్థానం లేదు.

ఈయన రచించిన సూత పురాణం, పురాణ శబ్దాన్ని సార్థకం చేస్తూ ఐదాశ్వాసాలుగా విభజితమైంది. సూతుడు అబ్రాహ్మణుడైన పౌరాణికుడు. ఆయన్ని కవి కలుసుకుని మీరు చెప్పిన పురాణాల్లో ఇన్ని అవక తవక లెందుకున్నయ్ అని నిలదీశాడు. సూతుడు తాను చెప్పిన కథలన్నిటినీ స్వార్థ పరులు మార్చారంటూ అసలు కథలు చెప్పడం ఆరంభించాడట. ఈ కథలన్నీ ఆర్య ద్రావిడ దృష్టితో చూచి వింగడించిన కథలు. ఇదుగో ఈ దశలో ఆయనలో గల సంప్రదాయ వైముఖ్యం తల చూపుతుంది. ఇట్లా కవి రాజు, అటు సంప్రదాయాన్ని కొంతవరకూ గౌరవిస్తూనే, ఇటు, తనకు నచ్చనిచోట,

తెగతెంపులు చేసుకోవాలనే తీవ్రతత్వాన్ని కూడా ప్రదర్శించ గలిగాడు— అయితే ఇది ఒక ధోరణి మాత్రమే కావడం వల్లా, దీన్ని ఆమోదించి, ప్రచారం చేయడం కోసం కొమ్ము కాచిన వాళ్ళు లేకపోవడం వల్లా, ఎట్లా పుట్టిందో అట్లాగే ఈ ధోరణి సమసి పోవడం జరిగింది— అయినా అష్టావధాన విద్యాకుశలుడుగా, ప్రాచీన కవిత్వ పద్ధతినీ, ఛందోవిధానాన్నీ చేపట్టిన దిట్టమైన కవిగా, తిరుపతి వేంకట కవుల శిష్యుడుగా, సంప్రదాయ కవిత్వ విభాగంలో, త్రిపురనేని తన పేరును నమోదు చేసుకోగల అర్హత కలవాడు.

ఈ విధంగా ఐదు పాయలుగా ప్రసరించిన సంప్రదాయ కవితా వాహిని ఆంధ్ర దేశంలో 1900-47 సంవత్సరాల మధ్య కాలంలో, తన సోయగాలను వెలార్చింది.



# ఆశుకవిత - అవధాన ప్రక్రియ

—డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

"All good Poetry is the spontaneous overflow of Powerful feelings" అని వర్డ్స్‌వర్త్ అన్నాడు. శక్తిమంతమైన భావం కవితకు బీజం. భవ్యకవితావేశం దానికి ప్రాణం. అవిచ్ఛిన్న ధారామధురంగా వెలువడటం దాని స్వభావం. అనుభూతి దాని జీవితం.

ప్రక్రియనుబట్టి కవితకు పేర్లు పెట్టటం పరిపాటి అయింది. ఆశుకవిత, మధురకవిత, చిత్రకవిత, బంధకవిత, గర్భకవిత, విస్తరకవిత, గేయ కవిత, వచనకవిత—వంటి పేర్లు సాహిత్య లోకంలో ప్రచారంలో ఉన్నాయి. అందులో అతివేగంగా చెప్పిన కవిత ఆశుకవిత. అంటే- అతివేగంగా చెప్పటం ఒక ప్రక్రియ. నిజానికది కవిత్వానికి సహజ లక్షణమైతే ప్రత్యేక విశేషణంతో ఆ గుణాన్ని నిరూపించవలసిన అవసరం లేదు. కవిత ఆవిష్కరింపబడటానికి ఆవేశం కావాలి. ఆవేశంలోనుండి కవిత అనర్గళంగా ఆవిర్భవిస్తుంది. అప్పటి దాని అవిచ్ఛిన్న ధారాప్రవాహ రూపం ఆశువుగా ఉండవచ్చు. అట్టి స్థితి ప్రతి కవికీ అనుభవంలో ఉండేదే. వాల్మీకి 'మానిషాద' శ్లోకం కూడా అలాంటిదే. అట్లని వేగంగా కవులు చెప్పిన కవితనంతా ఆశుకవిత అని పిలిచే పరిపాటి లేదు. ఆశువు నొక ప్రక్రియగా భావించటమే దానికి కారణం. ప్రక్రియ ప్రయత్న విశేష సాధ్యం. కవిత అప్రయత్నమూలమైన ఆవేశ జన్యం. ఆవేశం రసభావసాంద్రం. రసోన్నిద్రమైన ఆవేశం అప్రయత్నంగా అత్యంత వేగంగా లయాన్వితమైన వాక్యరూపం దాల్చినపుడు, అది ఎటువంటి ఛందోగతి నాశ్రయించి ప్రసరించినా కవిత అనిపించుకుంటుంది. అట్టి కవితావిష్కా

రానికి వెనుక సమాధిరూపమైన కవి మానసిక చిత్తావస్థ ఆలవాలంగా నిలుస్తుంది. సమాధినుండి సముద్భవించిన కవిత ఆశుస్వభావాన్ని సంతరించుకొన్నా, అది ప్రయత్నకృతం కాకపోవటంచేత ఆశుకవిత అనిపించుకోదు. "Poetry has its own origin in emotion recollected in tranquility" అంటాడు వర్డ్స్ వర్త్ అందుకనే.

అయితే, ప్రక్రియగా భావించే ఆశువుయొక్క స్వరూప స్వభావాలెటువంటివని వివేచించవలసి ఉంది. ఆశువు అభివ్యక్తి విధానానికి సంబంధించిన పద్ధతి. దీన్ని ప్రధానంగా రెండు రకాలుగా సంభావించటానికి వీలుంది. సమాధినుండి శక్తిమంతమైన భావాన్ని సహజవేగంతో అప్రయత్నంగా కవి కవితగా ఆవిష్కరించే విధం ఒకటి. సాధనాజన్యమైన శక్తిమూలంగా సప్రయత్నంగా ధారామధురంగా భావాన్ని ఛందోమయంచేసి కవితగా వెలువరించే విధం మరొకటి. మొదటిది సమాధిజన్యమైన కవిత; రెండవది సాధనజన్యమైన కవిత. మొదటిదానికి ప్రక్రియాగతమైన ప్రయత్నం నియతంకాదు; రెండోదానికి ప్రక్రియయే ప్రధాన భూమిక. కవితాస్వభావం మొదటిదాంట్లో సిద్ధం; రెండవదాంట్లో సాధ్యం. 'ఆశుకవిత' అనే అభిధానం లోకంలో రెండువిధాలకూ వర్తించినా రెండోవిధానానికే రూఢమై చెల్లుతోంది. అందువల్ల వేగంగా చెప్పటం ఒక పద్ధతిగా సప్రయత్నంగా సాధించి కవితాస్వభావంకంటె ప్రక్రియా ప్రభావానికే ప్రాధాన్యం కలిగేటట్లు కవిత చెప్పటమే ఆశుకవితగా సాహితీజగత్తు సంభావిస్తోంది.

ఆశుకవితకు కవిచిత్త సమాధికంటె ప్రక్రియాసాధనమే ప్రధానమైనప్పుడు ఉత్తమ కవితకు ఉండవలసిన ఉజ్జ్వల స్వభావం లోపించటం సహజం. అందువల్లనే ఆశుకవితకు అత్యుత్తమ కవితాగౌరవం లేదు. అప్పకవి అన్నట్లు—

> "ఆశుధారా కవిత్వంబులందు శయన
> ఉపమ లుత్ప్రేక్షలును లేకయుండు గాన
> ఎంత యోజించినను పద్యమంత సార
> వంతమగు గాన- నింకద వలయు కృతికి.'

అప్పకవి వివేచనం అన్నివిధాలా ఆదర్శప్రాయం కాకపోయినా ఆశుకవిత్వానికీ, అచ్చమైన కవిత్వానికీ భేదాన్ని పర్యాలోచించటానికి పనికివస్తుంది. నిలకడయే సమాధి. పద్యం సమాధిజన్యం కావటంచేత హృద్యం, సారవంతం. ఆశువు వేగానికిచ్చినంత గౌరవం వేదన కివ్వదు; 'పరుగెత్తుతూ పాలు తాగా'లని ప్రయత్నిస్తుంది. ఆశువుకు అలంకార గౌరవం లేకపోవటం అనుపపత్తిగా అప్పకవి భావించాడు. అలంకారం కావ్యశోభాతిశయహేతువేకాని శోభాహేతువుకాదు. గుణం కవితకు శోభాహేతువు. గుణం రసాత్మ సహజాభివ్యక్తి. గుణముండి అలంకారం లేకపోయినా గొప్ప కవిత్వం కావచ్చు. అనుభవసాంద్రమైన రసం దానికి ఆత్మ. అది ఆశుకవిత్వంలో ఎంతవరకు ప్రతిష్ఠింపబడుతుందనేదే ప్రశ్న. ప్రయత్నసాధ్యమైన ఆశుకవిత్వంలో ఆత్మావిష్కారం అనుకున్నంత సులభం కాదని అభిజ్ఞుల అభిప్రాయం. దానికి కారణాలూ లేకపోలేదు.

'ఏకపాద-త్రిపాద - కతిసప్రాస - విషమసమస్యాపూర్తులు - వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబులును - ఇష్టార్థ దేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు - అష్టావధానంబులు - ఘటికాశతగ్రంథ కల్పనయు - ఆకాశ పురాణంబులని తత్కాలోచితాతి త్వరితగతిని రచియింపబడునది' ఆశుకవిత్వ మని లాక్షణికోక్తి. ఈ స్వరూపాన్ని వివేచించి చూస్తే ఆశువితలో కవి స్వేచ్ఛకు ఆస్కారమే కనపడదు. కవిస్వేచ్ఛనుండి పుట్టేదే కవిత. పై ప్రక్రియల్లో కవి స్వీయాభివ్యక్తికి చోటులేదు. పరేచ్ఛాధీనంగా పద్యాల నల్లటమే ప్రధానంగా కనబడుతుంది. ఇది ఒక విధంగా పద్యరచనా ప్రావీణ్యానికి పెట్టే పరీక్షలలో పట్టభద్రులు కావటానికి చేసే ప్రయత్నమనే చెప్పాలి. దీనిలో ఆత్మీయతకంటె అభ్యాసానికే అగ్రతాంబూలం. పైప్రక్రియల్లో పృచ్ఛకుడు పరీక్షకుడు. పృచ్ఛకుడికి కవి పాండిత్యాన్నీ, ఆశువునూ పరీక్షిద్దామన్న ఉత్సాహమే ముఖ్యంగాని సోరన్నిద్రమైన కవితా స్వాదనాకాంక్ష కాదు. ఆశువేగానికి అవరోధాలు కల్పించటం అతని వంతు; వాటి నధిగమించి వేగాన్ని ప్రదర్శించటం కవిగారి వంతు. అనుభూతి మీద దృష్టి ఇరుపక్షాలకూ లేదు. అందువల్ల అదివైకల్పికమే కాదు; బహుళమై పోతుంది. అనుభూతికి దూరమైన ఆశువు ఆత్మ తేజస్సు లేని ఆకృతిగా అవత

రిస్తుంది. ఆశు వొక్కటే కవితాస్వరూపమని భావించే వాదాన్ని అధిక్షేపిస్తూ తిరుపతి వేంకటకవులు చెప్పిన పద్యం ఈ సందర్భంలో పేర్కొనదగింది.

> 'గారెలు పిండివంటకయి కాంతుఁడు కాంతను బ్రిచ్చ్రచేయ నా
> సారసనేత్ర వ్రేలొకటి చయ్యనచూపి యిదొక్కటున్న దా
> ధార మటన్న సామెతగ ధారయొకించుక కల్గు మాత్రనే
> వీరవధానపుం బనికి వీఁడులై ప్రయతించి రక్కటా!'

అవధాన ప్రక్రియలోనే ఆశువు ముఖ్యంకాదని ఆ జంటకవుల అభిప్రాయం. అవధానమే ఉత్తమ కవితకు ఆలవాలంకాదని అభిజ్ఞులవాదం. అయినప్పుడు ఇక ఆశుకవితకున్న స్థానమేమిటి? ఏమీ లేదనటానికి వీలులేకుండా కొప్పరపు సోదరకవుల ఆశువికతాశక్తిని ప్రశంసించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పద్యాలు సాక్ష్యాలుగా నిలుస్తున్నవి.

> 'ఆలోచించుటలేదు, కల్పనకు పద్యారంభ యత్నంబు ము
> న్నేలే దించుక ప్రాసకేని యతికేనిన్ గొంకు కన్పట్ట దే
> యాలస్యంబును కల్గబోదు భళిరా! అయ్యారె! యివ్వారికిన్
> బాలేయొజుమి యాశుధారకవితా ప్రారంభ నిర్వాహముల్.'

> 'నాల్క తుదిన్నిరంతరము నాట్యము సల్పుటకీ సహోదరుల్
> పల్కు వెలంది నెట్లు తొలిబామున గొల్చిరో? తేటతేనియల్ •
> చిల్కినయట్లు విందొసగు చెప్పిన పద్యము లెల్ల వహ్వరే
> పల్కిన పల్కులన్నియును పద్యములయ్యెడు నేమి చెప్పుదున్.'

పలికిన పలుకులన్నీ పద్యాలుగా పరవళ్ళు త్రొక్కుతున్న ఆశుకవితాపై ఖరి ప్రభాకరశాస్త్రిగారిని ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. దానివలన శాస్త్రిగారు పొందింది చమత్కార విశేషం. తన్మయీభవన ఆనందస్థితి కాదు; ఆలోచనామృతాస్వాద పారవశ్యంకాదు. రొమ్మరివనిత తాడుమీద గబగబానడిచి నేర్పు ప్రకటిస్తుంది. నాట్యకత్తియ రసాభినయంతో లాస్యం చేస్తుంది. ఈ రెండూ ప్రేక్షకుల కిచ్చే అనుభవాలు వేరు. ఒకటి అబ్బురపాటుతో కూడుకున్న వినోదం; మరొకటి

తన్మయీభావంతో కూడిన ఆనందం. ఆశుకవిత - ఉత్తమకవితలు కూడా అందించే అనుభవాలు వరుసగా ఆలాగే ఉంటాయి. ఆసక్తినీ, ఆహ్లాదాన్నీ, ఆకర్షణనూ, ఆశ్చర్యాన్నీ, వినోదాన్నీ పఠితలకు కలిగించటానికి మాత్రమే ఆశుకవిత పనికివస్తుంది. భావసారళ్యం, శయ్యావైరళ్యం ఆ కవితకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. అందువల్ల సర్వజన సులభంగా ఉండి సమాజంలో సాహిత్య చైతన్యాన్ని కలిగించటానికి శక్తిమంతమైన సాధనంగా ఉపయోగపడుతుంది. ఆశుకవిత ఉత్తమకవితా గౌరవాన్ని పొందకపోయినా, ఉపయోగానికి అనువైన ఉపకరణంగా సాహితీ వ్యవసాయానికీ, సమాజచైతన్యానికీ తోడుపడటమే సాహిత్యజగత్తులో దాని కొక స్థానాన్ని కలిగించింది. పండితులు మెచ్చి బంగరుగద్దె వేయకపోయినా, సామాన్యులు మెచ్చి సాదరంగా సమ్మానిస్తారు. కవితను బట్టే కవికీ, సంఘంలో గౌరవం కాబట్టి - ఆశుకవి పండితకవిగా పరిగణింపబడడు ; ప్రజారంజకుడైన వినోదకవిగా భావింపబడతాడు.

విద్వత్కవులు కూడా ఎడనెడ వినోదప్రాయమైన ఆశుకవిత చెప్పటం కద్దు. వారి సహజపరిణత ప్రజ్ఞావిశేషం దానిలో ప్రతిబింబించటం కూడా సహజం. కావ్యగౌరవం పొందగలిగిన ఆశువులు - మహాకవులు చెప్పినవి తెలుగులో ఎన్నో ఉన్నాయి. వాటిని విని నాల్కమీద నిల్పుకొని నాలుగు కాలాలపాటు నిలిచేటట్లు పరంపరగా ప్రచారం చేసింది ప్రజలే. ఆ కవులు కూడా తమ కావ్యాలకు ప్రతులు వ్రాయించుకొన్నారేకాని,ఆశువుకు ఆకులు కేటాయించలేదు. అందువల్ల అవి ప్రధానంగా మౌఖికప్రచారంలో ఉండిపోయాయి. అప్పటికీ ఇప్పటికీ ఆంధ్రసాహిత్యంలో ఆశుకవితకు పట్టిన అదృష్టం అంత వరకే. అయితే ఆధునిక పరిశోధకులు వీటివిలువను గుర్తించి సాహిత్య వినోద బీజాలుగా భద్రపరచి సంపుటీకరించే ప్రయత్నాలు జరిపారు. ప్రభాకరశాస్త్రి గారి చాటుపద్య రత్నాకరం సంకలనం ఆ మార్గంలో ఆదార్యకం. ఆశుకవిత ఆధునికులకు చరిత్రాంశ నిర్మాణానికి తోడ్పడుతున్నది. సామాజిక జీవితాధ్యయనానికి సహాయకారి అవుతున్నది.

ఆశుకవితకు శిష్టసాహిత్యంలో కంటె జానపద సాహిత్యంలో ప్రచారమధికం. ఆశుసాహిత్య సంప్రదాయాన్ని వివరిస్తూ డా॥ వెల్చేరు నారాయణరావు "తెలుగులో విప్లవాల స్వరూపం" అనే గ్రంథంలో ఇలా అన్నారు. "ఆశు

సాహిత్యంలో రచించటం, పాడటం - ఈ రెండిటికీ పరస్పర నిరపేక్షమైన అస్తిత్వం లేదు. ఆశుకవి రచిస్తూ పాడుతాడు ; పాడుతూ రచిస్తాడు. అందు చేత ఒకరి రచనలు మరొకరు పాడటం ఆశుసాహిత్యంలో వుండదు. తరువాతి కాలంలో చతుర్విధకవిత్వంలో ఒకటిగానూ, భట్రాజుల విద్యగానూ, దరిమిలా అవధానాలలోనూ నిలిచిపోయిన ఆశుకవిత్వవిద్య, ఆదిమ ఆశుకవిత్వలక్షణమూ లిఖిత సాహిత్యప్రభావమూ కలిసిన ఒక విలక్షణరూపం (పుట 7). పాటల లోని నిర్మాణాన్నీ, అందులో వాడటానికి వీలయేరీతిగా పదబంధాలనూ నేర్చు కోవడం ఆశుసాహిత్యంలో కవి లేక కవయిత్రి పొందే శిక్షణ. వ్యవసాయంలో పరువుల పేనడందగ్గర్నుంచి గడ్డికుప్ప వెయ్యడంవరకూ ఏవీ నేర్చుకోనిదే రాని విద్యలు కానట్లే ఈ రకంగా ఆశువుగా పాటలు రచించటంకూడా నేర్చు కోనిదే రానివిద్య. లిఖితసాహిత్యంలో ఛందస్సు నేర్చుకోవటం, దానితోపాటు పద్యరచనలో ఒరుపులు నేర్చుకోవటం ఎలాంటివిద్యో, అలాంటి విద్యే ఇదీను. సులువుగా పద్యరచన చెయ్యగలిగినవాళ్ళు చాలామంది లిఖిత సాహిత్యంలో వున్నట్లే ఆశువుగా గేయరచన చెయ్యగలవాళ్ళు ఆశుసాహిత్యంలో వుండడం సాధ్యం." రావుగారి వివేచన సమన్వయించి జానపదగేయాలు చాలవరకు ఆదిమ ఆశుకవిత్వ లక్షణాలను సంతరించుకొన్నవని భావించటానికి వలనుపడుతుంది. అది పద్యసాహిత్యంలోని ఆశువుకంటె భిన్నమైందనే చెప్పాలి. అయితే, ఒకరు భావాన్ని పాటల్లో ఆవిష్కరిస్తే, మరొకరు పద్యాల్లో వెలువరించటం జరుగు తుంది. అయినా ఆ యా పాటల పద్యాలను గురించిన సంస్కారం వారికి అభ్యాసవశంగా వచ్చేదే. ఆశుత్వం మాత్రం ఇరుపక్షాల్లోనూ సమానమే. కాని, ఒక భేదంమాత్రం కొట్టవచ్చినట్లు కనపడుతుంది. జానపదసాహిత్యంలో ఆశువు కవి స్వేచ్ఛానుకూలంగా ప్రవర్తించేది. శిష్టసాహిత్య సంప్రదాయంలోని మొదటివిధాని కది సరిపోలుతుంది. అందువల్ల సమస్యా పూరణం, వ్యస్తాక్షరీ పంమటనం. నిషేధాక్షరీ చమత్కారం, అవధాన ప్రక్రియావిధానంలాంటి పరేచ్ఛాబంధనాలు దానికి లేవు. అనుభూతిని ఆవిష్కరించే ప్రయత్నం అందులో మౌలికాంశంగా నిలుస్తుంది. ప్రక్రియాగతమైన సాధనం దానికి గౌణంగా భాసి స్తుంది. దానివల్ల జానపదసాహిత్యంలోని ఆశుకవితా సంప్రదాయం, శిష్టసాహి త్యంలో రూఢికెక్కిన సంప్రదాయంకంటె విలక్షణంగా వివేచన కందుతుంది. సాధనాత్మకమైన ఆశువు ప్రధానపాత్ర నిర్వహించే జానపద సాహిత్యానికి ఉత్తమ కవిత్వ గౌరవాన్ని ఇవ్వాలని వాదించేవారి మతంలోని బలంకూడా అదే.

అయితే దాని కా గౌరవం ఇవ్వకపోవటానికి కారణంకూడా అదే కావటం విశేషం. శిష్టులు అనుభవావిష్కారానికి ఆలంబనంగా అనువైన రచనా సౌష్ఠవాన్ని కూడా సాహిత్యానికి అవశ్యలక్షణమని భావిస్తారు. ఉక్తికున్న శక్తిని ఉన్మీలింప చేసేది రచన. ఆ శక్తివలన అనుభవసాంద్రతను సాధించా లంటారు సాహిత్యకోవిదులు. ఆత్మతేజస్సును అభివ్యక్తీకరించే అభినయంవంటిది రచన. అభినయం తెలియని ముగ్ధను అమాయకురాలిగా భావించి ఆమోదిస్తూ, అభినయంలో ప్రౌఢను కళావతిగా గౌరవించే రసికప్రవృత్తి సాహిత్యలోకంలో ఉండటముచేత ఆశుకవితామాధుర్యాన్ని ముగ్ధసుందరంగా సంతరించుకొన్న జానపద సాహిత్యాన్ని శిష్టులు మందహాసంతో మన్నించినంతగా, పూవుల్లో పెట్టి పూజించలేదు. ఆలోచనంకంటె అనుభవానికి అగ్రతాంబూల మిచ్చేది ఆదిమ ఆశుకవితా సంప్రదాయం. ఆలోచనంతో అనుభవాన్ని సాధిస్తూ, సాహిత్య గౌరవాన్ని సంపదించుకొనే శిష్టసంప్రదాయం. ఈ రెండింటికీ స్వభావాలు భిన్నం కావటంచేత వాటిని పరిశీలించేటప్పుడు భిన్నప్రమాణాలతోనే సమీక్షించవలసి వస్తుంది. ప్రస్తుతం శిష్టసాహిత్య సంప్రదాయానికి సంబంధించి రూఢి కెక్కిన "ఆశుకవిత్వమే" ఇక్కడ అనుశీలానికి పాత్ర మౌతున్నది.

ఆశుకవిత్వ పర్యాలోచనలో చాటుకవిత్వ ప్రసక్తిరాకమానదు. చాటువులంటే మనసు నలరించే తియ్యనైన మాటలు. ప్రాచీనులు ముక్తకాలను చాటు కవిత లన్నారు. పరిమాణంలోని పరిమితిని మాత్రమే వారు నిర్దేశించారు కాని ఆ కవితకుండే స్వభావాన్ని నిరూపించలేదు. అందువల్ల 'లాక్షణికదృష్టిని విడిచి చాటు శబ్దమునకు దాని రూఢ్యర్థమున గ్రహించుకొని అర్థము చెప్పుకొనవలయునని డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారు వివేచించటలో ఔచిత్యం ఉంది. వారి మాటల్లో– 'చాటు పద్యము క్రింది లక్షణము లన్నింటితో గాకపోయినను కొన్నింటితో నైన నుండును. 1, ఆశురచనలై యుండుట. 2. దూషణ భూషణ రూపమున నుండుట. 3. సమస్యాపూరణ రూపమా నుండుట. 4. ముక్తకలక్షణ లక్షితములై యుండుట. 5. చమత్కార ప్రయోజనము కలిగియుండుట. 6. పొడుపుకథలుగా నుండుట. 7. వర్ణన నుండుట. 8. దైనందిన కష్టసుఖముల తోడి దినచర్యా రచనలట్లుండుట 9. పేరడీరచనలుగా నుండుట. 10. గాథలుగా నుండుట... చాటువులయందు సాధారణముగా కావ్యవస్తు లక్షణము లేని కవుల యొక్క రాగద్వేష విషయ

ములే విషయములుగా నుండును. కొందరయందివి శాపానుగ్రహ రూపమున నవ ప్రత్యక్ష మగుచుండును. మిక్కిలిగా శృంగారాత్మకము గాను, రాజపురుష స్తోత్రాత్మకముగాను, హాస్యచమత్కారాత్మకముగాను చాటువుండును. అందు విషయ మిదే యుండవలయునని యేమున్నది ? ఏదైన నుండవచ్చును. ఎట్లయిన నుండవచ్చును". (ఆశుకవితలు - అవధానములు - చాటువులు - పుట 65).
చాటువులు ఆశువులుగా నుంటమే అలంకారము. అట్లని అన్ని చాటువులు ఆశువు లనటానికి వీల్లేదు. కాని, అందులో అధిక శాతం ఆశువులని భావించటంలో ప్రమాద ముండదు. అయితే, అలా నిరూపించటం కష్టం కావచ్చు. ఇందులో గమనింప వలసిన ముఖ్యమైన అంశం ఒకటి ఉంది. రూఢికెక్కిన 'ఆశుకవితా' ప్రక్రియలో ఉన్న పరేచ్ఛా ప్రాధాన్యం చాటుకవితలో లేదు. చాటువు కవి స్వేచ్ఛా ధీనం. అతని అంతర్గతమైన భావాలెన్ని అనర్గళంగా ఆవిష్కరించ టానికి అందులో వెసులు బాటుఎంతో ఉంది. దానివల్ల ఆశువైన చాటువు ఆశుకవిత్వ సహజస్వభావాన్ని సంతరించు కుంటుంది. తెలుగు సాహిత్యంలో ఆశుకవితలోని అధిక భాగం చాటువులుగానే నేడు లభి స్తోంది. అందుకు కారణం ఆశువులో కంటె చాటువులో కవియొక్క ఆత్మీయత అధికంగా ప్రతిబింబించటమే. ఆశువు, చాటువు కవలపిల్లల్లాంటివి నీరక్షీ రాల్లాగా కలిసి బ్రతుకుతాయి. చక్కనలో. చిక్కనలో చాటువే ఆశువుకంటె ఆకర్షణీయంగా ఉంటుంది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో కవితాప్రక్రియలను బట్టి యుగవిభజనం చేసే పరిపాటి ప్రచారంలో ఉన్నా ఆశువిత్వానికి ఆగౌరవం ఎన్నడూ కలగ లేదు. కలిగే వీలుకూడ లేదేమో ; ఎందువల్లనంటే - అది అన్నియుగాల్లోనూ అంతశ్శ్రోతస్వినిలాగా కనుగప్పి ప్రవహిస్తూనే ఉంది. మహారాజు వెంట విదూషకుడిలాగా చమత్కారకారిగా సంచరిస్తూ చరిత్ర కెక్కకుండా పోయింది. అందువల్ల ఆశుకవిత్వంలేని యుగంలేదు. ఆశువులూ, చాటువులూ చెప్పని కవులు ఏయుగంలోనూ ఉండరు. మెదడుకు మేతవేసి అలసినప్పుడు, మనసును కవ్వించి నవ్వించే తరుణంలో ప్రతికవీ ఆశువు ల్లి ఉంటాడు. ఆధునిక మహాకవులతో పరిచయమున్న ఏ సహృదయుడైనా ఈమాటలోని సత్యాన్ని గమనించగలడు. వెలుగు చూడని ఆశువులు వేలకొద్ది రసికుల ముఖపేటికల్లో

క్షుద్రంగా బ్రతుకుతున్నాయి. సేకరించి ప్రకటిస్తే కప్పురాల కుప్పల్లా గుబాళిస్తాయి. ఔచిత్యానౌచిత్యాల జోలికి పోకపోతే అభిరుచుల వైవిధ్యాన్ని పరిశీలించటానికి అవి యెంతో తోడ్పడతాయి.

ఆశువుకు ఆలంబనాన్నిచ్చి రంగప్రవేశం చేసిన ప్రక్రియల్లో అవధాన ప్రక్రియ అగ్రతాంబూలాన్ని అందుకుంటుంది. శత, సహస్రావధానాల్లో ఆశువే ఆయువుగా నిలుస్తుంది. అష్టావధానంలో అధికభాగం ఆవరించి జీవిస్తుంది. అవధానప్రక్రియలో ఆశువు భిత్తికలాంటిది. దానిమీద ప్రక్రియాపరమైన వర్ణచిత్రాలను అవధాని సంతరిస్తాడు. చారిత్రకంగా పరిశీలిస్తే తెలుగు సాహిత్యంలో అవధాన ప్రక్రియల్లోని అంశాలు ఒక్కొక్కటే స్వయంగా ప్రాచీనకాలంలో పరిణతి చెందుతూవచ్చాయని గమనించవచ్చును. వేములవాడ భీమకవి ఆశువులైన చాటూక్తులు వెలయించిన ఉదంతాలు ప్రసిద్ధాలు. శ్రీనాథుని కాలంనుండీ ఆశువుకూ, చాటువుకూ ప్రచారం బాగా లభించింది. ప్రబంధయుగంలోని ప్రసిద్ధ కవులందరూ ఆ యా ప్రక్రియలను యథావకాశంగా పోషించినవారే. తెనాలి రామకృష్ణాదులు కొంతవిశేషంగా వెలువరించారు. ఆశువులైన చాటూక్తులను వేమన్న జీవితమంతా పండించాడు. తెలుగు చాటూక్తికి ఆయన ప్రమాణమై పరిఢవిల్లాడు. దక్షిణాంధ్రయుగంలో అంతకు పూర్వంకంటె సమస్యాపూరణానికీ, నిషిద్ధాక్షరిక్తి, శతఘంట కవనానికీ, ఆకాశపురాణానికీ, ఆశుప్రబంధ నిర్మాణానికీ రాజాదరణమే లభించింది. స్త్రీలుకూడా ఆ ప్రక్రియల్లో అందెవేసి అవుననిపించుకొన్నారు. అవధానప్రక్రియ అంతకు పూర్వం దోబూచులాడుతూ తెరమరుగున ఒదిగిఉన్నా, ఆధునిక యుగంలో దానికి అధికప్రచారం లభించింది. శతావధాన అష్టావధానాల్లో ఒదిగి ఒరవలో పారిన ఏరులా ఉరవళ్లు త్రొక్కింది. తిరుపతి వేంకటకవుల కాలంలో అది జలపాతంలా దూకి విద్వత్తునూ, విద్యుత్తునూ ప్రదర్శించింది.

ఆంధ్ర సాహిత్యచరిత్రలో అవధానప్రక్రియకు 20వ శతాబ్ది పూర్వార్ధం స్వర్ణయుగం. అందులోనూ మొదటి దశాబ్దం ఉజ్జ్వలకాలం. అంతకుపూర్వం ఉన్న కాలాన్ని అజ్ఞాతయుగంగా భావించవచ్చు. ఆ తరువాతకాలాన్ని క్షీణయుగంగా పరిగణించవచ్చు. దానికి కాలంకూడా తోడుపడింది. ఆశుకవిత,

అవధాన ప్రక్రియ అర్థవంతంగా జంటకలిపి జంటకవుల నాశ్రయించి జయభేరి మ్రోగించిన యుగమే ఈ వ్యాసానికి వస్తువుకావటం విశేషం. క్రీ. శ. 1900 నుండి 1947 వరకు అవధాన ప్రక్రియను అధికరించి ఆలోచిస్తే దాన్ని తిరుపతి వేంకటకవుల యుగమని పేర్కొనక తప్పదు.

తిరుపతి వేంకటకవులు తెలుగుదేశానికి మొదట శతావధానులుగా పరిచయమయ్యారు. శతలేఖిన్యవధాన ప్రక్రియ సంస్కృతాంధ్రాల్లో వేర్వేరుగా చేపట్టి నిర్వహించినవారు ప్రాచీనకవుల్లో లేకపోలేదు. కాని, అటువంటివారు నూటికీ కోటికీ ఒక్కరు. తెలుగులో చరికొండధర్మన, రామరాజభూషణుడు. మాడభూషి వేంకటాచార్యులు మొదలైనవారిటువంటివారే. కాని, వారి శతావధానప్రక్రియ దేశవ్యాప్తంకాలేదు. ప్రజలలో ఒక నూత్నసాహిత్య చైతన్యాన్ని కల్గించలేదు. కాగా, సంస్కృతాంధ్రాలలో నల్లేరుపై బండినడకలాగా ఆశుకవిత్వాన్ని ధారావాహికగా నడిపి 'రెండు బాసలకు మేమె కవీంద్రుల' మంటూ శతావధానాలే కాక అష్టావధాన సహస్రావధానాలను సైతం చేసి మేటికవు లనిపించుకున్నారు తిరుపతి వేంకట కవులు.

'శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్నఁ
గరతలామలమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
నంబికొండయ దండనంబు మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
నల్లేరుపై బండినడక మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
షడ్రసోపేత భోజనము మాకు

వ్యర్థమగు వాదము లొనర్చునట్టి వారి
దంబ మడగించు టాపోశనంబు మాకు'

అని ధీమాగా చెప్పుకున్నారు వారు. పూర్వకవుల్లో ఒక్కొక్క రొక్కొక్క భాషలో ఒక్కొక్క అవధాన ప్రక్రియను ప్రదర్శించిఉండగా, వీరు జంట

కవులుగా అవధాన ప్రక్రియ లన్నింటినీ ప్రదర్శించి చూపించారు. జంటకవులు- ఆశుకవిత- అవధానప్రక్రియ అనే మూడు లక్షణాలు సంగమించిన తీర్థం తిరుపతి వేంకటకవుల కవితాప్రయాగ.

జంట కవులకు యోగ్యమైన సర్వలక్షణాలూ సమగ్రంగా సమకూరాయి తిరుపతి వేంకటకవుల్లో. నందిమల్లయ, ఘంట సింగయల తరువాత తెలుగులో ప్రశస్తికెక్కింది వీరిపేర్లే. క్రీ. శ. 1892 లో కాకినాడలో విశాఖానక్షత్ర ద్వయంలాగా దివాకర్ల తిరుపతిశాస్త్రిగారూ, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారూ జంట కట్టి శతఘంటకవన సరస్వతిని సాక్షాత్కరింపజేయటంతో జాతికొక కను విప్పయింది. నాడుమొదలు ఆ కవిద్వయం శ్రీకాకుళం మొదలు చెన్నపట్టణం దాకా అవధాన కవితాయాత్రలు చేసి, నానారాజ సందర్శనంచేసి అవధానాశు కవిత్వ భారతికి బంగురుపల్లకీ సేవలు జరిపించారు. తెలుగువారి రసహృద యాలు వారి కవితాశక్తికి పులకించి పొంగులువారాయి. వారిని తలిస్తేచాలు తెలుగువారి నాలుకలపై ఛందస్సు లాస్యం చేసింది. వారి అవధానసభలు దర్శిస్తేచాలు జంటకవిత్వాన్ని ఆశువుగా చెప్పాలన్న కోరిక లీరికలెత్తాయి. వీరి తర్వాత తలయెత్తిన జంటకవుల కందరికీ వారే ఆదర్శప్రాయులు.

తిరుపతి వేంకటకవులు ఆశుకవిత్వం చెప్పి అవధాన సభలను రంజింప చేసేంతవరకూ జంటకవుల కవిత్వం ఎలా ఉంటుందో తెలుగువారికి స్పష్టమైన తెలివిడిలేదు.

> "ఒక చరణం బతండు మతియొక్కటి నేను మఱొక్కఁ డాతఁడున్
> సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగాఁ
> బ్రకటతరాశుధార దనరన్ రచియింపగ నేర్తుమయ్య ! 'నూ
> టికిసెల' గయ్య ! నిక్కమిది డెబ్బదిమాటలు సెప్ప నేటికిన్."

అని విడమరిచి చెప్పి, చేసి చూపించారు తిరుపతి వేంకటకవులు. ఇద్దరు చెప్పినా ఒక్కడు చెప్పినట్లుండటం వారి కవితావైలక్షణ్యం.

"ఇరువురు గూడియే రచన యెప్పుడు చేయుదు రొక్క వేళ నొ
క్కరొకటి, యొక్క రింకొకటి కైకొని చేయుచు; రందు హెచ్చుత
గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసిన భంగినుండు, నొ
క్కరు రచియించిరేనియును గాఁదగు తిర్పతి వేంకటీయమై".

అని నీరక్షీర న్యాయంగా కలిసిపోయిన జంటకవులు వారు.

అభిరుచికొద్దీ అవధానాలు చేయటం, అలవాటుకొద్దీ ఆశువు చెప్పటం ఎందరో చేసినపని. కాని, ఆ కవితకు సమకాలీన సామాజిక సాహిత్య ప్రయోజనాన్ని సాధించటానికి సాధనంగా ప్రయోగించి ఉద్యమ స్ఫూర్తిని ఉన్మీలింప జేసినవారు తిరుపతి వేంకటకవులే. ఆంగ్ల భాషా సాహిత్య వ్యామోహం ఒకవైపు, పాతబడ్డ పద్యకావ్య ప్రక్రియల మీద ఏవగింపు మరోవైపు ముంచుకొనివచ్చి తెలుగు దేశంలో మాతృ భాషా సాహిత్య చైతన్యం మందగించిపోతున్న గడ్డు రోజుల్లో తిరుపతి వేంకటకవుల అవధానకవితోద్యమం ఆంధ్రకవితా వ్యవసాయానికి తొలకరి జల్లులా పని చేసింది. సరళమైన పద్యం హృద్యంగా ఆశువుగా చెప్పటం అవలీలగా సాధించే విద్యగా ప్రజలకు ప్రత్యక్షమైంది. మాటలే మనోజ్ఞమైన పద్యాలుగా జాలువార్చే ప్రక్రియ మనసుకు హత్తింది. పద్యవిద్య జాతిలో నూతనావతారం తాల్చింది. ప్రజల నాల్కలమీద లాస్యం చేసింది. మరో అర్ధశతాబ్దం పద్యానికి జీవం వచ్చింది. దీనికి తోడు జాతిలో సాహిత్యంమీద అభిలాష పెరిగింది; సృజనాత్మక చైతన్యంమీద ఆదరం కలిగింది. పాతపద్ధతులకు భరతవాక్యం పలికి, కొత్తపుంతలకు నాంది నాలపించటం మొదలైంది. ఆశుకవితలు–అవధాన ప్రక్రియలు ఇంత ముమ్మరంగా జాతిసాహిత్యజీవితాన్ని పునరుజ్జీవింప చేసిన కాలం ఆంధ్రసాహిత్యచరిత్రలో నభూతో నభవిష్యతి. అందువల్లనే తిరుపతి వేంకట కవులు జీవించినకాలం ఈ ప్రక్రియలకు స్వర్ణయుగ మనటం!

తిరుపతి వేంకట కవులను చూచి దేశంలో నలుమూలలా శతసంఖ్యల్లో అవధానకళను చేపట్టి అవధానిబిరుదాంకితులైనారు. వారందరూ తిరుపతివేంకట కవు లారంభించిన ఉద్యమంలో తరంగాలు మాత్రమే. యుగకర్తలు తిరుపతి కవులు. అనుకర్తలు ఆ తరువాతి అవధానులు. అవధానాలను వారికన్న వేగంగా

చేసినవారూ, అధిక చమత్కారాలను ప్రదర్శించినవారూ వారి యుగంలో కొందరు కనపడవచ్చు; కాని, వారివలె శాస్త్రపాండిత్యప్రాభవంతో వాదులుచేసి జయపత్రాలు పొంది, సభారంజకంగా గీర్వాణాంధ్రాల్లో దిగ్విజయంగా అవధానాలు నడిపినవారు ఆరుదు. వారివలె అవధానాలతోపాటు బహుళ సాహిత్య ప్రక్రియలను నిర్వహించినవారూ కానరారు. అవధానాశుకవితా ప్రావీణ్యంలో కనిష్ఠికాధిష్ఠితులు తిరుపతి వేంకట కవులు.

"వానలోఁ దడియనివారు మధురవధాన మృదూక్తి మరందధారలోఁ గడుగనివారు మా కెచట కానఁగరా రిలఁ దెల్గునాఁడునన్'' అని విశ్వనాథవా రన్న మాటలు ప్రత్యక్షర సత్యాలు.

ఇక్కడ మరో సత్యాన్ని గూడా గమనించాలి. తెలుగులో భావకవిత్వ యుగం దాదాపు 1910 సం॥లో వెలుగులోకి వచ్చింది. ఆ తరువాత అవధాన ప్రక్రియ, ఆశుకవితా ప్రాచుర్యం కొంత వెనుకంజ వేసింది. ఆశువేగంలో జిగినీ, బిగినీ, భావపౌష్ట్యాన్నీ, రచనాశిల్పాన్నీ కొంతవరకు కోల్పోయిన పద్య రచన వేగాన్ని తగ్గించుకొని, క్రొత్త వేషాన్ని వేసుకొన్నది. భావకవిత్వ యుగంలో పద్యం శిల్పమార్గాన నడిచింది. రచనకు రాణింపు కలిగింది. 1935 తరువాత అభ్యుదయకవితా యుగం మోహరించింది. గేయం పద్యస్థానంలో నిలిచింది. వచనానికి దగ్గరగా ఆవేశంతో అడుగులు వేస్తూ నడిచింది. ఈ యుగంలో అవధానప్రక్రియకు ఆదర గౌరవాలు చాలవరకు పోయా యనే చెప్పాలి. సంప్రదాయవాదుల పంచల్లో అది జీవికకోసం తిరగటం మొదలు పెట్టింది. ఈ పరిణామాన్నిబట్టి చూస్తే అవధానప్రక్రియ నాశ్రయించిన ఆశు కవిత్వస్థితిని ఈ విధంగా విశ్లేషించవచ్చు.

| | | |
|---|---|---|
| 1895 కు పూర్వం | — | ప్రయోగయుగం |
| 1895 నుండి 1910 వరకు | — | ప్రకాశయుగం |
| 1910 నుండి 1935 వరకు | — | స్తంభన యుగం |
| 1935 నుండి 1950 వరకు | — | తిరోగమన యుగం |
| 1950 నుండి నేటి వరకు | — | క్షీణయుగం. |

సాహిత్యంలో ఆశుకవితలు సాహిత్యప్రమాణాలను సృష్టించినదానికంటె సామాజిక చైతన్యాన్ని సమర్థవంతంగా సముద్ధరించగలవనే సత్యాన్ని తిరుపతి వేంకటకవులు నిరూపించారు. కవిత్వం ప్రజలదగ్గరికి పోవటానికి ఆశుకవితలు అమూల్యసాధనా లనీ, అవధానాలు జాతి సాధించిన సాహిత్య వినోద ప్రక్రియల్లో విలువైన విధానా లనీ ఈ కవితాస్వరూప స్వభావాలనూ, చరిత్రనూ సమీక్షిస్తే వెలువడే నిజాలు. కవు లున్నంతకాలం ఆశుకవిత జీవిస్తుంది ; అవసరం వచ్చినప్పుడు జాతిని మేల్కొల్పుతుంది. దానికి ఆలంబనమై ప్రచారానికి తెచ్చిన అవధానప్రక్రియ జాతిసొత్తుగా రక్షించుకోతగింది. అవధాన ప్రక్రియ నేడు అవధానులకు జీవనోపాధిగా ఉపకరిస్తోంది. గతకాలచరిత్ర వైభవాన్ని చూచి గర్వపడే జాతిలాగా ఆ ప్రక్రియను మ్యూజియంలో పెట్టకుండా సమకాలీన సామాజిక ప్రయోజనాల కనువుగా మలచుకొనే మార్గాలను అన్వేషించవలసిన బాధ్యత దేశప్రజ కున్నది. అవధానం ఆకృతి మాత్రమే. అది జీర్ణిస్తే క్రొత్తరూపం రావచ్చు. ఆశువు ఆత్మ వంటిది. దాన్ని జీర్ణశరీరం నుండి తప్పించి క్రొత్త రూపాన్ని కల్పించే అవకాశంకూడా రావచ్చు. అది పద్యం కాకపోయినా పాట కావచ్చు ! పాట కాకపోయినా మాట కావచ్చు ! ఆ ఉషస్సు కోసం ఎదురుచూద్దాం !



# భావకవిత - ప్రణయం

డా॥ ముకురాల రామారెడ్డి

భావకవిత పుట్టుపూర్వోత్తరాలనూ, భావకవుల ప్రణయ దృక్పథాలనూ చూచాయగా చూపడమే ఈ పత్రరచనలోని ముఖ్యోద్దేశం.

ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత ఒక శాఖ. ఇంగ్లీషు సాహిత్యంలో వెలసిన లిరికల్ పోయెట్రీ, రొమాంటిసిజమ్ ఈ రెండూ తమ ప్రభావముద్రను మన భావకవితపై బాగా వేశాయి. వాటి వైనం ఎలా ఉందో మొదలు ముచ్చటించుకొందాం.

## లిరికల్ పోయెట్రీ, భావ కవిత

ఇంగ్లీషులో లిరికల్ పోయెట్రీ అన్నదాన్ని తెలుగులో భావకవిత అన్నారు. ఇంగ్లీషు పదబంధానికి తెలుగు సమానార్థకం సార్థకంగా అతకినట్లు కనిపించదు. స్వేచ్ఛానువాదం చేస్తే 'గేయకవిత' అవుతుంది, భావ కవిత కాదు. భావకవిత అన్నది టంకింపు (Coining) అనవచ్చు. అది అలాగే ప్రచారాని కెక్కింది. ఇంగ్లీషులోని లిరికల్ పోయెట్రీకి చెప్పుకొన్న లక్షణాలు మన భావకవితకు సరిపడుతున్నాయి కాబట్టి టంకింపు బాగా అమరింది. ఉదా॥ Lyric 1. A Poem having the form and musical quality of a song. 2. a short subjective poem with a songlike outburst of the author's inner most thoughts and feelings. 3. an objective meaning "spontanious, rapturous and undisciplined." 4. is applied to any poem expressing personal emotion, to any short poem that does not primarily tell a story...... (Dictionary of Literary Terms by Harry Show) – లిరిక్ అంటే గానగుణం అమరిన రచన. అది గేయం కావచ్చు. కవిలోని ప్రాంతరభావాలూ, స్పందనలూ, సంవేదనలూ అభివ్యక్తి

కరించే ఆత్మాశ్రయ రీతిగల ఖండగీతి కావచ్చు. స్వేచ్ఛగా ప్రకటింపబడ్డ రసనిర్భరమైంది కావచ్చు. రచనలో కొంత అనియతత్వంకూడా ఉంటే ఉండ వచ్చు. అది కథచెప్పే కావ్యం మాత్రం కారాదు. ఇది లిరిక్ లక్షణ సారాంశం.

కృష్ణశాస్త్రి, జాషువా, బసవరాజు, వేదుల, దువ్వూరి వంటి ఆధునికు లెందరో చేసిన ఖండకావ్య, గీతికావ్య రచనలకు లిరికల్ పోయెట్రీ లక్షణాలు సరిపడతాయి. లిరిక్ అంటే పాట ఆ దృష్ట్యా మన భావకవిత అంతా గేయ రూపంలో రానిపైనం ఉంది. భావకవులు ప్రాచీన పద్యాలలోకూడా విరివిగా రచనలు చేశారు. ప్రాచీన పద్యాలనుకూడా పాడుకొంటారు తెలుగువారు. అందు కని అలా పద్యాన్ని ఉపయోగించి ఉంటారు.

ఇంగ్లీషులో లిరికల్ పోయెట్రీ అవతరించిన సందర్భం కాస్త తెలుసుకో దగ్గది : కాలరిడ్జ్, వర్డ్స్‌వర్త్ ఇద్దరూ సమకాలిక కవులు. ఇద్దరూ దాదాపు ఒకే ధోరణిలో రచిస్తూ పోతున్నారు. ఆ ధోరణులు కలిసిపోవడం వారికి నచ్చ లేదు. ఇద్దరూ చర్చించుకొని ఒక ఒప్పందానికి వచ్చారు. కాలరిడ్జ్ తన రచనా ధోరణిని పరాశ్రయకవిత, పాత్ర చిత్రణ, అతివాస్తవికత, కాల్పనిక గుణం వీటికి పరిమితం చేసుకొని తాను విడిపోతానన్నాడు. వర్డ్స్‌వర్త్ కూడా తన మార్గం మలచుకొని, తన వస్తువునూ, శైలినీ ప్రత్యేకం చేసుకొని జీవిత వాస్త విక చిత్రణ, రమణీయ గేయరచన, అకస్మికంగా స్ఫురించే భావనకు సమ కూర్చే సరళ సుందర రచన, ఇలాంటి ప్రత్యేకతతో విడిపోతానన్నాడు. ఇద్దరూ అలా తమ ప్రత్యేకతలు నిలబెట్టుకొన్నారు (కాలరిడ్జ్ వ్రాసిపెట్టిన ఈ ఉదంతం సమకాలిక కవులు ఏనాటివారైనా జ్ఞాపకం ఉంచుదగింది). తర్వాత వర్డ్స్‌వర్త్ రచనలపై విమర్శల దుమారం బాగా చెలరేగింది, అణగింది, అనుకూల వాతావరణం ఏర్పడింది. అతను రూపొందించిన ప్రక్రియలలోంచి వెలువడిందే ఈ లిరిక్ పోయెట్రీ.

## రోమాంటిసిజమ్ - భావ కవిత

క్రీ. శ. 1798 - 1832 వరకు పాశ్చాత్య సాహిత్యరంగంలో బాగా ప్రసరించిన ఉద్యమం రోమాంటిసిజమ్ (కాల్పనికత). కవిత్వంలో నైతేనేమి,

వచన రచనలో నైతేనేమి రకరకాల భావరతులను ప్రదర్శించింది ఈ ఉద్యమం. ముక్తసరిగా కాల్పనిక సాహిత్య లక్షణాలు ఇవి : 1. వీరసాహస పాత్రల, సంఘటనల వర్ణన 2. అలాంటివే వచన రచనలు : కథ, నవల వగైరా. 3. రంగురంగుల దృశ్యాల చిత్రణ 4. ప్రేమ వాంఛ 5. అలౌకికానుభూతి 6. పగటికలవంటి అనుభూతి 7. లాక్షణికనియమాలను ఉల్లంఘించే స్వేచ్ఛ 8. విప్లవాత్మక రాజకీయ భావాలు 9. గతపునరుజ్జీవనం 10. సుందరతకు జోడించే నూత్నత 11. పలాయన మనస్తత్వం 12. హేతుబుద్ధి కొరవడిన అతిశయ కల్పన 13. మానవానుభూతి 14. మార్మికత 15. వినూత్న అద్భుత వర్ణన 16. అనంతభావన 17. భావోద్రేకం 18. ఆలోచనాత్మకతను దిగదొక్కే చిత్తధృతి 19. పరాశ్రయత నుంచి ఆత్మాశ్రయతవైపు. ఈ భావనలు (Concepts) గల రచనలు రొమాంటిసిజమ్‌లో చేరతాయని చెప్పారు పాశ్చాత్య సాహిత్యవేత్తలు. ఈ కాల్పనిక సాహిత్యలక్షణాలు ఏ నాటి సాహిత్యానికైనా సరిపడేటట్లే కనిపిస్తున్నాయి. కాల్పనిక సాహిత్యంపై విమర్శకులు దాడచేసినా 'మొత్తంపై ఈ భావనలు ఆధునిక ప్రజాస్వామ్య స్థాపనకు తోడ్పడ్డాయి' అని Harry Shaw అభిప్రాయం.

## భావకవిత - నిర్వచనం

కాల్పనిక సాహిత్య లక్షణాలు, పై పందొమ్మిది, తెలిసినతర్వాత తెలుగులో వెలసిన భావకవిత్వ లక్షణాలు తెలుసుకోవడం సులభమైంది. పై పందొమ్మిదింటిలో రెండోది (వచన రచన) మినహా మిగతావి అన్నీ మన 'భావకవిత' కు అన్వయిస్తాయి. ఆ రెండోదాని స్థానంలో లిరిక్ లక్షణం చేరుతున్నది. అంటే సరికొత్తగా కవి సృష్టించుకొన్న ఏదైనా ఒకానొక కాల్పనిక భావుకత (భావం/భావన) ను ఛందస్సాంగత్యంగల నగిషీ రచనతో రూపొందించింది అంతా భావకవిత్వ పరిధిలోకే చేరుతున్నది. భావకవిత్వంపైగల లిరిక్, రొమాంటిక్ ప్రభావాలను ఇలా ముక్తసరిగా గ్రహించవచ్చు.

"ఆధునికాంధ్ర కవిత్వం" పరిశోధించిన ఆచార్య డా॥ సి. నారాయణ రెడ్డి భావకవిత్వం (శాఖలు), అభ్యుదయ కవిత్వం (నూత్న భేదాలు), అతి నవ్య కవితాధోరణులు అని వింగడించి చూపినకృషిలో పాఠకులకు విశేషమైన

అవగాహన దక్కింది. వాటి పుట్టుపూర్వం చూస్తే ఆ భేదాలన్నీ రొమాంటిక్ లక్షణాలవే అయినట్లు సూటిగా గ్రహించవచ్చు.

భావకవిత్వాన్ని ప్రారంభంలో "భావగీతం" అన్నారు. భావం రొమాంటిక్ ప్రభావానికీ, గీతం లిరిక్ ప్రభావానికీ సంకేతంగా గుర్తించవచ్చు.[1]

1. భావగీతాలు మొలకప్రాయందాకా ఎదిగాయి గురజాడ రచనలలో (క్రీ. శ.1900). ఆయన రూపొందించిన నవీనభావనలలో చారిత్రక పాత్రల సంఘటనల వర్ణన; లాక్షణిక నియమాల ఉల్లంఘన, గతపునరుజ్జీవనం, మానవానుభూతి, ఆత్మాశ్రయత ఇవి ముఖ్యమైనవి. ఇవి కాల్పనిక సాహిత్య లక్షణాలలోనివే. పాఠకులనుగానీ, ప్రాజ్ఞులనుగానీ మెప్పించలేని కాల్పనికభావనలను గురజాడ స్పృశింపలేదని పై పందొమ్మిదితో సరిచూడవచ్చు.

తర్వాతి తెలుగుకవులు ఇంగ్లీషుకవులను అనుసరిస్తూ రూపొందించుకొన్న భావనలెన్నో కొత్తవే. అయినా వాటిని మొదలు ప్రాచీనపద్యాలలో రచించాడు. కొన్నిటిని ఖండికావ్యాలుగా రచించారు. ప్రాక్పశ్చిమాల అంతశ్చర్య (interaction) ఇలా కొంత చూడవచ్చు. గేయాలు కొందరు మాత్రమే రచించారు. అంటే భావకవులు ప్రారంభంలో గేయాలు రచించడానికి వెనుకంజవేశారన్నమాట. తెలుగుకవులకు 19వ శ॥ దాకా ఉన్న సాధారణ మనస్తత్వం ఇది. ప్రజలకోసమని భక్తిసంకీర్తనలూ, జానపదగేయాలూ రచించిన వర్గాన్ని మినహాయించి చూస్తే వెనకటి కవులు పాటలు రచించే ప్రయత్నమే చేయనట్లుంది. పాల్కురికి సోమనాథుడు ద్విపదలు రచిస్తే సమకాలికులు వెక్కిరించారు. ఆధునికులైన తెలుగుకవులు పాటలు బాగా రచించనేర్చింది లిరిక్ పోయెట్రీ ప్రభావంతోనే.

## ప్రణయ భావకవిత

కాల్పనికోద్యమ ప్రభావంతో ఆయా తెలుగు కవులు ప్రదర్శించిన రకరకాల భావరతుల చరిత్ర భావకత్వ చరిత్ర. 'ప్రణయ భావన' అందులో ఒక భాగమే. కానీ, తెలుగులో భావకవిత్వం అనగానే 'ప్రణయకవిత్వం' అని

స్ఫురిస్తుంది సాధారణ పాఠకులకు. దీనికి కారణం రాయప్రోలు కాదు, కృష్ణశాస్త్రి.

"నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజు వాటి
ఏ నాక వియోగగీతిక—"

కృష్ణశాస్త్రి కవితోద్యమం, ప్రాంతరం జీవిత లక్ష్యం, ఎక్కడ వెదికినా ఇలాంటి వ్యక్తీకరణమే లభిస్తుంది. పలుకులు మార్చిచెప్పిన శృంగార భావనలు ఆయనవి. 1. ప్రబంధశృంగారం 2. భావకవి ప్రణయం 3. సినీ ప్రేమ ఈ మూడూ విభిన్నాలు అంటారు కొందరు. 1. బెల్లం 2. పంచదార 3. ఖండసారి ఈ మూడింటి రుచులూ మూడు రకాలే, అయినా మూలతత్వం ఒకటే. నాయిక అంగాంగ వర్ణన ప్రబంధ శృంగారం; పైటకొంగు నుంచి పై అంగాలు వర్ణిస్తే అది ప్రణయ భావకవిత; ప్రబంధ శృంగారాన్ని తగిన మోతాదులో వాడుకొంటూ, భావకవిప్రణయాన్ని అనుకరిస్తూ రూపొందింది సినీకవుల ప్రేమ— విరహచాంచల్యం, ఊహామోహం, మరులు, వియోగ విషాదా లాపన, ఇలాంటివి రాముడు ఈ వర్గాల కవులకూ సాధారణమే. భావ కవులు ప్రకృతినో, కవితా కళనో మనస్సులో పెట్టుకొని, దానిని ప్రేయసిగా కల్పించుకొని, ఊహాసుందరిగా, దివ్యసుందరిగా, కులపాలికగా, ఇంకా ఏదో విచిత్ర ప్రణయమూర్తిగా భావించి, పాఠకులను ఋలిపించేటట్లుగా చేసిన రచనలు మలుపులో కాస్త కొత్తగా తోస్తున్నా. భారతీయ సాహిత్య తత్వం తెలిసిన వారికి అవి కొత్తవి కావు.

ఉదాహరణకు :—

"చంచచ్చంద్ర కరస్పర్శ సముస్మీలిత తారకా
అహో ! రాగవతీ, సంధ్యా, జహాతి స్వయ మంబరమ్."

వాల్మీకి రూపించిన ఈ విచిత్రసుందరిని ఊహాసుందరి అనవచ్చు, దివ్య సుందరి అనవచ్చు, లౌకికసుందరి (కులపాలిక) అనవచ్చు, ఇంకేమైనా అన వచ్చు. అది వ్యాఖ్యాత ధీచాతుర్యంపై ఆధారపడి ఉంటుంది.

మాది దివ్యప్రణయమే అన్నంతవరకు చెప్పుకున్నారు భావకవులు. అసలు ప్రణయినిలో సిసలైన దివ్యత్వం దర్శించాడు క్రీడాభిరామకర్త.

"పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు, ముట్టుదునా ! ఓ కర్ణాటతాటంకినీ !"

"పూర్ణమేవావ శిష్యతే" అనుకొన్న దివ్యభావన ఇది. అలాంటి దర్శన భాగ్యం భావకవులకు కలిగిందా ? కనీసం ఆ ప్రణయిని స్పర్శకైనా నోచుకోని వలపుపస్తు కవులు భావకవులు. తన భావనాప్రేయసితో స్పర్శాసౌఖ్యం అనుభవించిన ప్రాప్తి లభించింది కాస్త జాషువాకే.

" .... .... .... కీలుగంటులో
పూలు సుగంధమున్ దొలగిపోయిన ముద్దున తీపి నిల్చునే"

అని తెలుసుకొని విలాపించాడు.

మొత్తంపై భావకవుల ప్రణయిని పెక్కుచోట్ల ఊహాసుందరిగానే కనవిస్తుంది. "ఈ ఊర్వశి నా ప్రేయసి" అనుకొన్న సంతృప్తి కృష్ణశాస్త్రిది. మిగిలిన కవులు ప్రణయభావరతిలో వెనకబడతామనుకొని ప్రవేశించినట్లున్నది.

"ఏదొ నన్ను వెంటాడెడు నెందుకొరకొ"

అని విశ్వనాథ వికలగీతాలు వినిపించాడు.

"ప్రేమరత్న మ్మో పేద కొచవునని ఈ మహాబ్ధి లోతెరుగక వెడలితి,
ఏమగునో ఇక నా బతుకు" - అని వేదుల అంగలార్పు.

కులపాలికా ప్రణయమే తమ లక్ష్యంగా చూపినవారిలో నండూరి, నాయని గణనీయులు. "దివ్యారాధన" భావనలు సరే.

కృష్ణశాస్త్రి నడకనే అనుసరిస్తూ "నేను సైతం మొక్కాకునై యెనయాడేని" అన్నాడు శ్రీ శ్రీ. అదీ 1926 లో. 1905 నాటికే చిలకమర్తి కవి "భరతఖండంబు చక్కని పాడియావు" తెల్లవాడనే గొల్లవాడు పిండుకొని

పోతున్నాడు జాగ్రత్త అని హెచ్చరిస్తే ఈ భావకవులు కొందరు అలాంటి జాతీయ భావాలు ఏమీ పట్టించుకోకుండా 1930 దాకా రాత్రింబవళ్ళూ ఊహా సుందరి వ్యామోహంలోనే పడి ఉన్నారు. మీసాలు వచ్చినా దేశం కనిపించని కవులు వీళ్ళు. వాస్తవానికి తిండీ, తీరికా పుష్కలంగా ఉన్న (leisure class) నుంచి వచ్చిన నాజూకుకవులు వీళ్ళు. ఇలా అప్రాప్త మనోహరికోసం అన్వేషించడమే జీవితలక్ష్యంగా భావించిన ఈ కవుల కవితాధోరణికి మనప్రాంతీయ భాషలలో వెలువడ్డ సమకాలిక కవితాధోరణి కూడా కొంత కారణ మనియే భావించవచ్చు.

ఉదాహరణకు అస్సామీకవి అంబికారాయ చౌదరీ రచించిన "తుమి" కావ్యం ; ఒరియాకవి రాధానాథుని "చిలక" (సరోవర) కావ్యం ; కన్నడకవి హెచ్. నారాయణరావు చేసిన భావగేయానువాదాలు ; గుజరాతీకవులు ప్రకృతి, ప్రణయం ఆలంబనంగా రచించిన కరుణ శోకగీతాలూ; పంజాబీకవి వీర్‌సింగ్ రచించిన కవితాసముచ్చయాలూ ; హిందీలో నిరాలా, సుమిత్రానంద్‌పంత్‌వంటి కవుల రచనలూ ; ఉర్దూలో సూఫీకవుల అప్రాప్త మనోహరి వర్ణనలూ వగైరాలలో ఉండే కవితాధోరణులకూ, తెలుగుకవుల ప్రణయభావ ధోరణికీ చాలా దగ్గరి పోలికలు ఉన్నాయి .

"కబ్ ఆయే, కబ్ చలేగయే తుమ్
సత్వర గతిసే హేఛవి మాన్"

(హిందీ భావగీతం)

తళుకుమని కనిపించి, వలపు వెల్లువ ముంచి,
వలపించి, మాయమై వనట గూర్చితివా !"

(కృ.శా. భావగీతం)

ప్రణయ భావకవుల జాడల వెంట శ్రీ శ్రీ బాగానే తిరిగాడు. మఖ్దూమ్ కూడా మొదలు ఆవలలో పడ్డాడు :

"ఖుదాకీ ముస్కురాదేతాథా
జబ్ హమ్ ప్యాకర్ కర్తేథే"

అని ఇలా దివ్యరీతితో సమర్థించుకొన్నాడు. "నీ బుగ్గమీది పుట్టు మచ్చను చిన్ననాడు చూసి మురిసి పోతూ నవ్వుకొనే వాణ్ణి, ఇప్పుడు నన్నది బాధిస్తున్నది" అన్నాడు మరో ఉర్దూ కవి.

ప్రణయ భావకవిత ఎన్ని శాఖలుగా పెరిగిందనుకొన్నా ఒకతరం కవులంతా దీక్షవహించి అదేపనిగా నేర్పవలసినంత అపరిచిత విషయం కాదు ప్రణయం. ఈ ధోరణి కవిత 1930 నాటికే ఉర్దూ సాహిత్య వేత్తలకు వెగటుగా తోచింది. 'ఊహా మోహాలు ప్రేరేపించే కవిత సోమరి పోతులు ఉత్పత్తి చేసిన నిరుపయోగకర మైన సరుకు' అని ఉర్దూ విమర్శకులు సూటిగా విమర్శించి ఆ ధోరణి పై దెబ్బకొట్టారు.

నిదానించి చూస్తే దీని లక్షణాలు: అనవసర అన్వేషణ, అమాయికత, కృత్రిమమైన జాలి, కల్పిత వియోగబాధ, అవాస్తవికమైన అనుభూతి, సాంఘిక బాధ్యతా రహితత్వం, సందేశలుప్తత వగైరా ఇలాంటివే కనిపిస్తాయి. "అమలిన శృంగారం" అన్న దానికి కూడా ఇవే లక్షణాలు వర్తిస్తాయి. ఈ ధోరణి కవితలు చూసి తెలుగు విమర్శకులు కూడా విరుచుకపడ్డారు. "కన్నీటి కెరటాల వెన్నెలేలా?" అని కృష్ణ శాస్త్రి అంటే "వంకాయ తొడిమలో వంకరేలా" అని జరుక్ శాస్త్రి వెటకారించారు. "ఏడ్వనీరు నన్ను" అని అదే పాటగా పాడుతుంటే "మరెవరొద్దన్నారు" అని బహిరంగంగా అనేశారు. తనసొగసు చూచి ఏడ్చే సుందరివలె తమ కవితా ప్రాగల్భ్యం చూచి దుఃఖిస్తున్నట్లు కనిపిస్తున్నారు కృష్ణశాస్త్రిగారు" అన్నారు దేవులపల్లి రామానుజ రావు.

ఏం సాధించారండీ ఈ భావ కవులు? అంటే "పులియాకు సూటుగా పొడిచినారు" అన్నారు సురవరం ప్రతాపరెడ్డి. ఇది రాయప్రోలు రచించిన 'పులియాకు విస్తరి' అనే పద్యాలు విన్నతర్వాత అన్నమాటే. హైదరాబాదులో ఉన్నంత కాలం నిజాం రాజు పాట పాడడం, బెజవాడ రైలు దిగిన తర్వాత జాతీ యోద్యమాన్ని గురించి పాడడం రాయప్రోలు వారు అనుసరించిన యుక్తి ఈ ద్వంద్వ మనస్తత్వం గమనించిన యువకవి కాళోజీ విక్షేప

భావకవికి అధిక్షేప భావ కవిత్వ ఫక్కీలోనే జవాబు చెప్పడం సబబు అని ఒక లిరిక్ రచించాడు. మచ్చుకు:

"లేమావి చిగురులను లెస్సగా మేసేవు
ఋతురాజు వచ్చెనని అతిసంభ్రమముతోడ
మావికొమ్మల నెక్కి మైమరచి పాడేవు
తిన్నతిండె వ్వానిదే?
కోకిలా, పాడు పాటెవ్వానిదే?"

సుప్రసిద్ధమైన ఈ అధిక్షేపగీతం అమలిన ప్రణయ భావకవికి నిజాం రాజును గురించిన పొగడ్త వస్తువు కాకూడదని ఎదురు బోధించింది.

ఆత్మాశ్రయరీతి పెరిగిపోయిన భావకవిని "అహంభావ కవి" అన్నారు విమర్శకులు. చివరకు "నా మరణశయ్య పరచుకొన్నాను నేనె" అని గ్రహించాడు అడ్డా దిడ్డి భావకవి.

## ప్రయోజకత

ప్రణయభావకవిత మిగిల్చిపోయిన ప్రయోజకత బొత్తిగా శూన్యం అనలేం. కేవలం కళాత్మకమైన ప్రతినిధిగానే దిగుమతి అయినా, ఈ ధోరణి కవితలోని నగిషీశైలినీ, సున్నితమైన ఆలోచననూ, సృజనాత్మకమైన ఆధునిక రీతినీ తర్వాతి యువకవులు కొందరు అలవరచుకొన్నారు. తిలక్ రచించిన "శర్వరీ ప్రియ" ఒక ఉదాత్తమైన ఉదాహరణ:

"రావే నల్లనిదాన....
... ... ... ... ... ... ... ... ... ...
రావె మిణుగురు లద్దిన రమ్య చేల
ముల కొసలు నేల జీరాడ మోహనాంగి!

చిత్తుగా త్రాగి వచ్చిన శ్రామికుని కన్ను
రెప్పల మైకమ్ము రేక హత్తి,

పాడింటి అరుగుపై పడి గతించిన ముష్టి
ముసలిపై నల్లని ముసుగు గప్పి. ...
.... రమ్మ భావదుఃఖితుడ నా ప్రాంగణమున
అంధకారసుందరివి నా అనుగు చెలివి.

నీలోన వైదేహి నిందాచరిత్రంబు
జాలి జాలిగ కర్దపాశి సోకు,
నీలోన క్లియొపాత్ర నీహార సౌందర్య
మలసి వ్రాలిన విషాదాంత మొలుకు."

చీకటిని ప్రేయసిగా భావించి ప్రదర్శించిన సున్నితమైన ఆలోచనలూ నగిషీకూర్పులు ఈ శీర్షికనిండా కోకొల్లలు.

Shakespearian Dark Lady కంటె కూడా మనోజ్ఞంగా మురిపిస్తున్నది ఈ "శర్వరీ ప్రియ." ప్రణయభావకవితకు మచ్చుతునకలుగా ఇలాంటి శీర్షికలు ఏర్చి కూర్చి ప్రకటించడం అవసరం.

ప్రణయ భావకవులలో చాలామంది స్ఫూర్తిని సద్వినియోగం చేసుకోలేదని నాకు తోచింది. ఈ అభిప్రాయాన్ని కాస్త వివరించి చెప్పడానికే పై విధంగా కొంత వ్రాయవలసివచ్చింది.

ప్రణయభావన ఇలా ఉన్నా తదితర ఆధునిక భావనలైన దేశభక్తి, జాతీయత, సంస్కరణాభిలాష, అభ్యుదయబోధ మొదలైనవాటిని కవితావస్తువులుగా గ్రహించిన పట్టులలో రాయప్రోలు శ్రీ శ్రీ, దువ్వూరి, జాషువా వగైరా కవులు ఉత్తమ కవితలు రచించి అభ్యుదయకవితకు మార్గదర్శకులైనారు.

** **

# అభ్యుదయ కవిత్వం

—కడియాల గోపాలరావు

మానవ చరితలోనే అతి ప్రధానమైనది 20వ శతాబ్దపు తొలి అర్ధ శతాబ్దం. ఈ కాలంలోనే మానవ జీవితంలో అన్ని రంగాలలోనూ ఎన్నో చరిత్రాత్మకమైన గుణాత్మకమైన పరిణామాలు జరిగాయి. రెండు ప్రపంచ యుద్ధాలు ఈ కాలంలోనే జరిగాయి. ఫాసిజం, నాజీజం నాశనం అయ్యాయి. సోవియట్ రష్యాలో రాచరికం, భూస్వామ్య బూర్జువావ్యవస్థలు రద్దుగావించబడ్డాయి. దోపిడీ దౌర్జన్యాలు లేని వర్గరహిత సోషలిస్టువ్యవస్థ నిర్మింపబడింది. ఈ కాలంలోనే మరి 14 దేశాలలో సోషలిస్టుసమాజం ఏర్పడి నూతన శకారంభమయింది. 50 దేశాలు స్వాతంత్ర్యాన్ని పొందాయి. సామ్రాజ్యవాదం చావు దెబ్బతిని ప్రపంచ రాజకీయాలలో తన నిర్ణయాత్మక పాత్రను కోల్పోయింది.

1929 – 35 మధ్యకాలంలో పెట్టుబడిదారీ ప్రపంచం తీవ్ర ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోంది. పెట్టుబడిదారీ దేశాలలో కార్మిక వర్గం పాలక వర్గాలను సవాలు చేస్తూ పెద్దయెత్తున తిరుగుబాటుకు ఉపక్రమించింది. నిరుద్యోగం దారిద్ర్యం రోజురోజుకు పెరిగిపోతోంది. పాలక వర్గాల దోపిడీ దౌర్జన్యం, నిరంకుశత్వం పెచ్చుపెరిగిపోతుంది. వలస దేశాలలో జాతీయ ఉద్యమాలు తారస్థాయికి చేరుకుంటున్నాయి. ఈ పరిస్థితులలో యూరప్‌లో ప్రధానంగా తమ దేశాలలో ఉత్పన్నమైన పరిస్థితిని ఎదుర్కోలేక అదివరలో ఉన్న నామమాత్ర బూర్జువా ప్రజాస్వామ్యాన్ని రద్దుచేసి జర్మనీలో ఇటలీలో పెట్టుబడుదారులు హిట్లరు, ముస్సోలినీల నాయకత్వాన ఫాసిస్టు ప్రభుత్వాలను స్థాపించారు. స్పెయిన్‌లో ఏర్పడిన ప్రజాప్రభుత్వాన్ని పడగొట్టి ఫ్రాంకో సైనిక నియంతృత్వాన్ని స్థాపించడానికి తోడ్పడ్డారు. ఫ్రాన్సులో ఫాసిస్టుప్రభుత్వాన్ని ఏర్పరచడానికి జరిపినప్రయత్నాన్ని ఫ్రాన్సు కార్మికవర్గం ప్రజలు, కమ్యూనిస్టులు తిప్పికొట్టారు ఒకవైపు హిట్లరు నాయకత్వాన ప్రపంచా

నికి ఫాసిస్టు ప్రమాదం ముంచుకు వస్తున్న సమయం, రెండవవైపు సోవియట్ రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం సాధిస్తున్న విషయాలు ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించాయి. ఆ దేశంలో ఫ్యూడల్ పెట్టుబడిదారీ వ్యవస్థలను రద్దు చేసి సర్వహక్కులు ప్రజాయత్తం చేసి ఆదర్శ సామ్యవాద సమాజాన్ని నిర్మిస్తూ దినదినాభి వృద్ధి పొందుతోంది. జారు చక్రవర్తి కాలంలో వలస దేశాలుగా ఉన్న వాటిని స్వాతంత్ర్య దేశాలుగా ప్రకటించారు. అంతే గాక ప్రపంచంలో సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా జరుగుతున్న జాతీయోద్యమాలకు తోడ్పడుతోంది. ఫలితంగా అనేక దేశాలలోని జాతీయ ఉద్యమ నాయకులు, ప్రజలు, మేధావులు, సోషలిస్టు దేశం వైపుకు ఆకర్షించబడ్డారు. మన దేశంలో నెహ్రూవంటి జాతీయ నాయకులు, రవీంద్రనాథ్ టాగూరు వంటి కవీంద్రులు ఎంతో ఉత్తేజాన్ని పొందారు. యువమేధావులు మార్క్సిస్టు సిద్ధాంతంతో ప్రభావితులయ్యారు. 1925లో కమ్యూనిస్టు పార్టీ మనదేశంలో అవతరించింది. భారతదేశంలో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ప్రచారాన్ని, రష్యా సోషలిస్టు వ్యవస్థ పలుకుబడి ప్రభావాలను లేకుండా మొగ్గలోనే త్రుంచి వెయ్యాలని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఉన్న 40 మంది కమ్యూనిస్టు మేధావుల అరెస్టుచేసి 1929లో మీరట్ కుట్ర కేసును బనాయించారు. దీని విచారణ $4\frac{1}{2}$ సంవత్సరాలు జరిగింది. కోర్టులో ముద్దాయిలు ఇచ్చిన మార్క్సిస్టు సిద్ధాంతాలతో సోషలిస్టు భావాలతో కూడిన స్టేట్ మెంట్లను జాతీయ పత్రికలు సానుభూతితో ప్రకటించాయి. మోతీలాల్ నెహ్రూ వంటి ప్రముఖ నాయకులూ, న్యాయవాదులూ ఈ కేసులో తోడ్పడ్డారు. ఈ కుట్ర కేసు భారత దేశంలో సోషలిస్టు భావ ప్రచారానికి బాగా తోడ్పడింది.

లాహోరు కుట్రకేసులో శిక్షించబడిన స్వాతంత్ర్యయోధులలో భగత్ సింగు మొదలగు వారిని ఉరితీయడం యువశక్తులను ఆవేశపరచి రాజకీయ రంగలోనికి ఉరికించింది. 30, 32 లో దేశవ్యాపితంగా గాంధీనాయకత్వాన బ్రహ్మాండ మైన సత్యాగ్రహ పోరాటాలు జరిగాయి. జైళ్ళలో, ప్రతిరాష్ట్రంలో వేలసంఖ్యలో మేధావులు, కార్మిక, కర్షక యువకులు, నిర్బంధించబడ్డారు. జైళ్ళలో స్వాతంత్ర్య, ప్రజాతంత్రాలను సాధించే మార్గాలను గురించి సోషలిజాన్ని గురించి, మార్క్సిస్టు తత్వశాస్త్రం మొదలగు విషయాలపై

చర్చలు, అధ్యయన తరగతులు జరుగుతూ వుండేవి. 30, 32 సంవత్సరాల నాటి సత్యాగ్రహోద్యమాల వైఫల్యాన్ని గుర్తించిన కాంగ్రెసులో ఉన్న అతివాదులు గాంధీమార్గాన్ని విడనాడి మరొక మార్గాన్వేషణలో 1934 లో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని నిర్మించారు. అదివరలోనే బొంబాయి, కలకత్తా, అమృత్ సర్ వంటి నగరాల నుండి సోషలిస్టు భావాలను ప్రచారం చేయడానికి వార మాస పత్రికలు వచ్చాయి. మార్క్సిస్టు సాహిత్యం, గోర్కీ రచనలు మొదలగు వాటిని ప్రచురించడం జరిగింది. 1934, 35 లలో కమూనిస్టు పార్టీ పట్టణాలలో, నగరాలలో, వివిధ రాష్ట్రాలలో గ్రూపులు గ్రూపులుగా పనిజేస్తోంది. వర్గసంఘాలను, యువజన, విద్యార్థి సంఘాలను సంఘటిత పరుస్తోంది. కాంగ్రెసులో నెహ్రూ కూడా వర్గసంఘాలను సంఘటితపరచడం, సోషలిజాన్ని అంగీకరించడం సోవియట్ రష్యాను ప్రశంసించడం జరిగింది. ఆర్థికరంగంలో బ్రిటీష్ ప్రభుత్వ ఆర్థిక రాజకీయ విధానాలవల్ల ప్రజల జీవన పరిస్థితులు నానాటికి దుర్భరమవుతున్నాయి. అదివరలో వున్న చేతి పరిశ్రమలు మూల బడ్డాయి. దేశంలో పెద్ద పరిశ్రమలు అభివృద్ధికావడానికి అవకాశం కూడా పోయింది. రైతులలో చేతివృత్తుల వాళ్ళలో, కార్మిక వర్గంలోను ప్రభుత్వవ్యతిరేక భావం తీవ్రమవుతోంది. వర్గ సంఘాల ఆవశ్యకతను అందరూ గుర్తించారు. ఈ నూతన పరిస్థితులలో ప్రజలను చైతన్యవంతులను చేసి బానిసత్వాన్ని, దారిద్ర్యాన్ని పోగొట్టుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వాన్ని దెబ్బతీయడానికి అందరూ ఆయత్తమవుతున్నారు. బొంబాయి కాన్పూరు మొదలగు నగరాలలో కార్మిక వర్గం పెద్ద సమ్మెలు జరిపింది. రెండవ వైపున ప్రపంచానికి పెద్దప్రమాదంగా పరిణమిస్తున్న ఫాసిస్టు ప్రమాదాన్ని కూడా గుర్తించారు ఈ ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో వచ్చిన నూతన పరిణామాలు ప్రపంచ వ్యాపితంగా సాహిత్యరంగాలలో కూడా ప్రతిబింబించడం సహజమే. 1932 లోనే లండనులో కొంతమంది వామ పక్షీయులు ఆడేన్ మొదలగు వారు మార్క్సిస్టు సిద్ధాంతంలో ప్రభావితులై సోవియట్ రష్యాలో సోషలిస్టు వ్యవస్థ వివిధ రంగాలలో సర్వతో ముఖమైన విజయాలను సాధించడం చూచి ఉత్తేజితులై కొత్త పుంతలలో New Signatures అనిపేరుతో అభ్యుదయ కవితా సంపుటిని ప్రకటించారు. 1934, 35 లో ఫ్రాంసులో ఫాసిజం, నాజీజం నుంచి

సంస్కృతిని, కళలను రక్షించడానికి ఫాసిస్టు వ్యతిరేక రచయితల సమావేశం జరిగింది. ఫాసిస్టు వ్యతిరేక ప్రపంచ ప్రగతివాద రచయితలకు ఇదొక కేంద్రంగా పనిచేసింది. అప్పుడు లండనులో ఉన్న భారతదేశ మార్క్సిస్టు మేధావులు కొంతమంది సజ్జాద్ జహీర్, ముల్కరాజ్ ఆనంద్ మొదలైనవారు 1935 లో భారతదేశ అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించారు.

భారతదేశంలో ఆనాడు అతి త్వరితగతిని వివిధ రంగాలో జరుగుతున్న పరిణామాల దృష్ట్యా రచయితలకు అభ్యుదయభావాలలో తమ రచనల ద్వారా ప్రజలు ప్రగతి పథంలో పయనించడానికి తోడ్పడమే ప్రధాన కర్తవ్య మైంది.

1936 లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన ప్రథమ అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. ఈ సంఘానికి జవహర్‌లాల్ నెహ్రూ, రవీంద్రనాథ్ టాగూర్, సరోజినీదేవి, శరత్‌చంద్ర చటర్జీ, వల్లథోల్, ప్రేమ్‌చంద్ వంటి ప్రముఖుల సహకారం లభించింది. ఈ సభకు సరోజినీదేవి, హసరత్ మొహాన్ హాజరయ్యారు. ఈ మహాసభకు నెహ్రూ అందజేసిన సందేశంలో "ప్రాచీన రచయితల దృష్టిలో ధనిక, దరిద్రభేదం శాశ్వతమైంది. ఈ భేదభావాన్ని నిర్మూలించవచ్చుననే విషయం వారికి స్ఫురించలేదు. ఆధునికకాలంలో, శాస్త్ర విజ్ఞానం, పరిశ్రమలు, రాకపోకల సౌకర్యం అభివృద్ధి పొందటంతో ఈ భేద భావాన్ని నిర్మూలించే అవకాశం కలిగింది. ఈ అవకాశానికి వాస్తవిక పరిస్థితిని కల్పించటానికి ప్రయత్నించటం అభ్యుదయ రచయితల కర్తవ్యం'' అన్నారు.

ఈ సమావేశంలోనే మొదటి ప్రణాళికను ప్రకటించారు. ఆనాడు భారతీయ సాహిత్యం జీవితవాస్తవాలనుండి పలాయనమవుతూ మార్మికవాదం మాటున, ఆధారరహితమైన ఆధ్యాత్మికవాదాల చాటున వస్తువులోనూ, రూపంలోనూ నిర్జీవ నీరసమైన రచనలు చేస్తూవున్న దుస్థితిని ఈ మహాసభ గుర్తించింది. సాహిత్యాన్ని కళలను అభివృద్ధినిరోధకుల ప్రాబల్యంనుండీ రక్షించటం అభ్యుదయరచయితల ఆశయం. అభ్యుదయరచయితల చారిత్రకకర్తవ్య మైంది. అంతేగాక వాటిని ప్రజలకుసన్నిహితంగాతీసుకువచ్చి ఈశకంలోఉజ్జ్వల భవిష్యత్తుకోసం పోరాడే మానవాళికి మార్గంచూపించటం అభ్యుదయ రచయితల

కర్తవ్యమని ప్రకటించింది. భారతీయసంస్కృతిలో ఉత్తమసంప్రదాయాలనుస్వీకరిస్తూ వినాశకర ధోరణులను ఖండించటం తన విధానంగా ప్రకటించింది. మనం సృష్టించబోయే సాహిత్యం ప్రజల కీలక సమస్యలను, ఆకలి, దారిద్ర్యం, సాంఘికంగా వెనుకబడి ఉండటం, రాజకీయ బానిసత్వం మొదలైన సమస్యలను తీసుకుంది. నిష్క్రియాపరతను, మూఢనమ్మకాలను ప్రోత్సహించే సాహిత్యం అభివృద్ధి నిరోధకమని ప్రకటించింది. హేతువాదదృష్టితో మూఢనమ్మకాలను పోగొట్టూ, క్రియాశీలమైన కార్యాచరణకు పూనుకునేలా చేసే సాహిత్యాన్ని అభ్యుదయ సాహిత్యంగా భావించింది. దేశవ్యాపితంగా వివిధ భాషా రాష్ట్రాలలో సంఘాలను సంఘటిత పరుస్తూ అభ్యుదయసాహిత్యాన్ని ప్రచురిస్తూ వాక్, రచనా స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటూ పురోగమించడానికి కార్యక్రమాన్ని రూపొందించింది.

తెలుగు కవితారంగంలో ఒక దశాబ్దం వివిధ రూపాలలో అభ్యుదయ కవిత్వం ప్రజాసాహిత్య సృష్టి సర్వకళారూపాలలో సాంస్కృతి కార్యకలాపాలు ముమ్మరంగా జరిగిన తరవాతనే 1943 లో అభ్యుదయ రచయితల సంఘనిర్మాణం జరిగింది. 1933లో జమీందారీ వ్యతిరేక పోరాటాలు ప్రారంభమయ్యాయి. పన్నుల భారం, రీసెటిల్మెంటు విషయంలో బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేకంగా ఉద్యమం సాగింది. 1930-32 లో జరిగిన సత్యాగ్రహోద్యమంలో పాల్గొని 1933 లో జైళ్ళ నుండి వచ్చిన యువకులంతా సోషలిస్టు భావాలతో ఉత్తేజాన్ని పొందారు. గాంధీజం వైఫల్యాన్ని గుర్తించారు. సోవియట్‌లో జరిగిన అక్టోబరు విప్లవ విజయాలతో ప్రభావితులయ్యారు.

1934 లో ఏప్రిల్ 12వ తారీఖున శ్రీ శ్రీ "మహాప్రస్థానం" గేయం వస్తే, ఏప్రిల్ 22వ తారీకున రైతు భజనావళి పుస్తక రూపంలో వచ్చింది. 1934 లోనే కమూనిస్టు పార్టీ అవతరించింది. 1935 లోనే ప్రభ అనే పక్ష పత్రిక గద్దె లింగయ్య సంపాదకత్వాన మార్క్సిస్టు సిద్ధాంతాలకు, అభ్యుదయ రచనలకు ప్రచార వేదికగా పని చేసింది. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, గోర్కీ వగైరాలు వ్రాసిన గ్రంథాల అనువాదాలు వచ్చాయి. 1935లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సంఘటిత మయింది. సోషలిస్టు భావాలు గల యువకులతో రాష్ట్ర యువజన సంఘం ఏర్పడింది.

1930-40 మధ్యకాలంలో ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో వచ్చిన పరిణామాలలో, ప్రజాజీవిత పరిస్థితులు వివరించాను. వీటిలో మార్పులకు అనుగుణ్యంగా సాహిత్యరంగంలో కూడా మార్పులు రావడం అవసరమేగాక అనివార్యం చారిత్రక అవసరం అయింది. కాని గత 20 సంవత్సరాల నుండి సాహిత్యరంగంలో ఎదురులేకుండా రాజ్యమేలిన భావకవిత్వం ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించ లేక పోయింది. ప్రజాజీవితాన్ని వాస్తవిక జగత్తును వదలి స్వప్న జగత్తులో విహరించింది. ప్రకృతి, ప్రణయ కవిత్వానికి పరిమితమై ఆత్మాశ్రయ రీతిలో ఊహాలోకాన్ని సృష్టించుకుని పలాయన మంత్రాన్ని వరించింది. దివినుండి భువికి దిగిరానని సమ కాలీన సమాజం యెడ తన పాత్రను కోల్పోయింది. సాహిత్యరంగంలో సమాజాభివృద్ధికి ఈ చారిత్రక పాత్ర నిర్వహించడానికి అభ్యుదయ రచయితల సంఘం అవతరించింది.

1933-34 లోనే అభ్యుదయ కవిత్వం తెలుగు నాట ప్రారంభ మయింది. 1943 లో అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ జరిగి సంఘం ఏర్పడింది.

అభ్యుదయ కవి ఎవరు? ఏది అభ్యుదయ కవిత్వం? అభ్యుదయ రచనకున్న ప్రత్యేక లక్షణాలేమిటి? దీని విశిష్టత ఏమిటి? అభ్యుదయ రచయితల సంఘం నిన్నా మొన్నా వచ్చింది. 'గతకాలంలో అభ్యుదయ కవులు లేరా? అ. ర. సం. సభ్యులేనా అభ్యుదయ రచయితలూ, కవులూ? వెలుపల ఉన్నావారు అభ్యుదయ రచయితలు కారా? ఈ ప్రశ్నలు సందేహాలు తెలుసుకోవాలనే కుతూహలం కల మిత్రుల నుండి వచ్చాయి.

ఇక వ్యతిరేక భావంతో వేసే నిందలు, ప్రచారాలు ఉన్నాయి. ఇది అసలు కవిత్వమే గాదని శ్రీ శ్రీ రాసిన మహా ప్రస్థాన గేయాన్ని తిరిగి పంపిన పత్రికలు ఉన్నాయి. ఈ సంఘం ఏదో రాజకీయాలతో, పార్టీతో సంబంధించి ఉన్నదని, ఇది విదేశాలనుండి దిగుమతి అయిన సరుకని, అభ్యు

దయ రచయితలు గతాన్ని సంప్రదాయాల్ని ధ్వంసం చేస్తారని, అభ్యుదయ కవిత్వం శిల్పాన్ని విస్మరిస్తుందని మొదలైనవి మచ్చుకు కొన్ని విమర్శలు. నన్నయ కాలంనుండి వచ్చినది అభ్యుదయ సాహిత్యమే. ఇదేమీ కొత్తకాదు అని ఒక వాదన. సమకాలీన సమస్యలను కావ్యవస్తువులో తీసుకుంటే దానికి శాశ్వతత్వం రాదని మరొక వాదన. 1936లో ప్రథమ అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం సభలకు అధ్యక్షత వహిస్తూ ప్రేమ్‌చంద్ చెప్పిన "నా దృష్టిలో జీవితాన్ని విమర్శించేది సాహిత్యం. ఏ రూపమైనా కావచ్చును. జీవితాన్ని తప్పనిసరిగా వ్యాఖ్యానించాలి. భాష్యం చెప్పాలి ......... రచయితలు దళితులు, పీడితులపక్షం వహిస్తారు" అనే మాటలే దీనికి సమాధానం.

## భావకవిత్వంపై తిరుగుబాటు

భావకవిత్వంపై తిరుగుబాటు చేసి సరికొత్త ప్రయోగాలు చేసినవారిలో ముఖ్యులు నలుగురు. శ్రీ శ్రీ, శిష్ట్లా, పఠాభి, నారాయణబాబు. వీరు నలుగురు ఒక దృక్పథంతో ఒక మాట అనుకుని చేసిన తిరుగుబాటు కాదు. భావకవిత్వంపై తిరుగుబాటు చేయాలనే విషయంపై వీళ్ళందరికీ ఏకాభిప్రాయం ఉన్నా ఎవరి మార్గం వారిది.

శిష్ట్లా 1931 నుండి అతి నవ్యరచనలను, అనేక కొత్త ప్రయోగాలను చేసినవాడు. ఈయనే వచన కవిత్వానికి ప్రారంభకుడని ఒక అభిప్రాయం. తన కవిత్వానికి ప్రహ్లాదకవిత్వమని పేరు పెట్టుకున్నాడు. ఇలా నిర్వచించాడు. "ఇది పూర్వకవిత్వం గాదు. నవ్యకవిత్వం గాదు. భావకవిత్వం గాదు...... ప్రహ్లాదకవిత్వం. ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పాతిపోయే పామరుని నిలవేస్తుంది......"

ఈయన పేదవాని దైన్యస్థితిని గురించి కొన్ని గేయాలు రాశాడు. నవమి చిలుకలో వస్తువును ప్రజాజీవితానికి సంబంధించినదే తీసుకున్నాడు. కాని ఈయనరచనలు అభ్యుదయకవిత్వ స్థాయి నందుకోలేదు. కొత్తబాట వేయలేదు.

పఠాభి:

ఫిడేలు రాగాల డజను అనే పేరుతో 1936, 37 లలో 12 గేయాల సంపుటి ప్రచురించుకొని తాను అహంభావకవి నని చెప్పుకున్నాడు. తన కన్ను లలో టెలిస్కోపులు, మైక్రోస్కోపులు ఉన్నాయని చాటుకున్నాడు.

"నా వచనపద్యాలనే దుడ్డుకర్రతో పద్యాల
నడుములు విరుగదంతాను. చిన్నయసూరి
వ్యాకరణాన్ని చాలా దండిస్తాను."

ఈయన రచనలలో భావంలోను, భాషలోను వ్యక్తీకరణలో అరాజక, విధ్వంసక ధోరణులే ప్రబలంగా వున్నాయి. భాషలో గ్రాంథిక వ్యావహారిక, ఆంగ్లభాషాపదాల సమ్మేళనంగా ఉంటుంది. నగరజీవితమును గురించి వ్రాసిన ప్రథముడు. భావకవిత్వం మీద పనిగట్టుకుని దాడి చేసినా ఈయన అభ్యుదయకవిత్వానికి సాయపడిందేమీ లేదు. తాత్వికంగా పఠాభి అరాచక వాది, విధ్వంసక వాది. ఒకానొక చారిత్రకదశలో పాశ్చాత్యదేశాలలో రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో అక్కడ మేధావులలో నిరాశ నిస్పృహలతో అంతులేని అశాంతితో కసితో..... కర్తవ్యమెరుగని అరాచక ధోరణులు చెలరేగాయి. మన తెలుగుదేశంలో వాటికి భౌతిక పరిస్థితులు లేకపోయినా ఇది పాశ్చాత్యదేశాలలో వచ్చిన ధోరణులకు గుడ్డి అనుకరణ మాత్రమే. ఈ వ్యాధి ఇంకా కొంతమంది రచయితలలో విభిన్నరూపాలలో ప్రత్యక్షమయింది.

ఈ ధోరణి ఈయనతోనే ఈ రచనలోనే అంతం కావడం శుభదాయకం.

భావకవిత్వంపై తిరుగుబాటుజేసి శ్రీ శ్రీతో బాటు వాస్తవికతా వాదాన్ని చేపట్టినవాడు శ్రీరంగం నారాయణ బాబు. ఆయన సంఘర్షణకు రాసిన ప్రవరలో ఇలా వివరించాడు........"అంతవరకూ భావకవులతో పాటూ మేముకూడా జీవిత గ్రీష్మాన్ని దర్శించేందుకు మనోనేత్రానికి తగిలించిన గాగుల్సు నేల విసరికొట్టుదుం కదా! హృదయంలో పొగలూ సెగలూ రేగా పీడికాలవ నీటిలో బురదలో ఆపసోపాలు పడిపోతున్న విశ్వనాథుడు. ఊరి

ప్రైట పొలంలో ఇన కిరణాలు క్రౌర్యంతో కాయక్లేశ పడుతున్న సేద్యగాని శరీరం మీద పండిస్తున్న ఘర్మ మౌక్తికాలతో ఒక తాజ్‌మహల్ కట్టాలని బుద్ధి పుట్టింది. మా కవిత్వంలో ఉండకూడని వస్తువు, వాడకూడని భాషా లేనే లేదు.........పలాయన తత్వం పనికిరాదు.........యథార్థంగా జీవితాన్ని దర్శిస్తాము. జీవితంలో మాలిన్యాన్ని గాలించి శాళితం చేస్తాము.........మేము శోకాన్ని, జీవితాన్ని, ప్రకృతిని కూడా మారుస్తాము." ఈ దృక్పథంతో కొన్ని అభ్యుదయ కవిత్వ రచనలు చేశాడు.

ప్రజాశక్తుల విజృంభణను గుర్తించి రష్యా వైపు దృష్టిని మరల్చి

రక్త పతాకం
శక్తి నాలుక
అగ్ని కిరీటం
ఆకాశమ్మున
ముని మాపు
కేకలువేస్తూ
పిలిచింది

అన్న కొత్త గొంతు వినిపించాడు.

భావ కవిత్వ ధోరణులను

"వెన్నెల విహారాలకు
కన్నెగాలి కౌగిళ్ళకు
ఇది కాలం కాదంది'' అని నిరసించాడు.

భావనలు వర్ణనలు, ఊహాలు తెనుగు నుడికారంలో బాధితుల వాస్తవ జీవిత గాధలను ప్రతిభావంతంగా వ్యక్తంచేయ కలిగాడు నారాయణ బాబు. అయితే రుధిర జ్యోతిలో 7, 8 గేయాలు మాత్రమే వాస్తవికతా దృక్పథంతో రాసినవి అభ్యుదయ కవితలుగా పరిగణించదానికి వీలున్నవి కనిపిస్తాయి. ఇది పెద్ద

కావ్యసంపుటి. దీనిలో పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో ప్రధానంగా ఫ్రాయిడ్ సిద్ధాంత ప్రభావంతో అధి వాస్తవికత దృక్పథముతో వ్రాసినవే ఎక్కువ.

## అభ్యుదయ కవిత్వం : యుగకర్త - శ్రీ శ్రీ

శ్రీ శ్రీ భావకవిత్వంపై తిరుగుబాటు బావుటా నెత్తిన విప్లవకవి. అభ్యు దయకవితోద్యమానికి పైతాళికుడు. కవిత్వానికి క్రొత్త తాత్విక ప్రాతిపదిక కవితా మార్గాలు రూపొందించిన స్రష్ట, మహాశిల్పి.

ఏ విశ్వపరిణామాలు ఏ జాతీయరంగంలో ప్రత్యేక చారిత్రక పరి తులు శ్రీ శ్రీని సృష్టించాయో ప్రారంభంలోనే వివరించాను. ఏ ప్రేరణతె తెలుగు కవితా రంగంలో చరిత్రాత్మకమైన అభ్యుదయ కవిత్వానికి ప్రారం గీతం (మరో ప్రపంచం) మహా ప్రస్థానాన్ని రచించాడో స్పష్ట పరిచాను.

శ్రీ శ్రీయే తన రచనకు ప్రోద్బల శక్తులు ఏవో అనేక సందర్భాలల వివరించిన ప్రసంగాలను వ్యాసాలను కొన్నింటిని ఇక్కడ ఉటంకించ టు ఉచిత మనుకుంటాను.

తన కవితకు ఆవేశాన్ని, ప్రేరణను ఇచ్చిన రచనలను గురించి శ్రీ శ్రీ స్వయంగా పేర్కొన్నవి ఇవి. (1) ఫ్రెంచి జాతీయ గీతం (2) హరేంద్రనా చటోపాధ్యాయుని 'శురూహువా హైజంగ్' అనే పాట (3) నజ్రుల్ ఇస్లా విప్లవ గీతాలు (4) ఎడ్గార ఎలన్‌పో గేయాలు (5) గురజాడ, కవి కొండల గేయాలు. ఇంకా పాశ్చాత్య కవుల రచనల ప్రభావంకూడా ఉందని మరొ సందర్భంలో చెప్పాడు.

1934లో అనేక ప్రేరణలతో ప్రభావాలతో వచ్చిన మహా ప్రస్థా గేయం నవశకానికి నాందీ ప్రస్తావన. మహాప్రస్థాన గేయం 1934 లో రచి చినా పుస్తకరూపంలో 1950 లో గాని రాలేదు. శ్రీ శ్రీ 1933 నుండి 4 వరకు రచించిన 40 గేయాల సంపుటి మహాప్రస్థానం అనే పేరుతో పుస్త కంగా ప్రచురించ బడింది.

ఈ కవితా సంపుటికి చలం ముందుమాట వ్రాశారు. శ్రీ శ్రీ కవిత్వాన్ని ఆయన గొప్పగా సరిఅయిన తూకంతో విలువ కట్టాడు. "నెత్తురు, కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారు జేశాడు శ్రీ శ్రీ ఈ వృద్ధప్రపంచానికి."

భావకవిత్వం కుబుసం విడిచిన శ్రీ శ్రీ ప్రపంచ దృక్పథాన్ని మార్క్సిస్టు ప్రభావంతో పెంపొందించుకున్నాడు. కావ్య వస్తువులో విప్లవం తీసుకువచ్చాడు. భౌతిక వాద దృక్పథంతో చరిత్రను వ్యాఖ్యానించాడు. క్రొత్త ఆదర్శాలతో ప్రజాదృక్పథంతో అభ్యుదయ కవితను ఆవాహన చేశాడు. మరో ప్రపంచాన్ని దర్శించాడు. మహా ప్రస్థానం సాగించాడు. "ఈ నాడే....... నరజాతికి పరివర్తన।నవజీవన శుభసమయం। అభ్యుదయం" అని ఉద్ఘాటించాడు. అభ్యుదయ కవిత్వం లక్ష్యాల్ని నవకవిత అనే గేయంలో నిర్వచించాడు.

"కదిలేది కదిలించేది
మారేది మార్పించేది
మును ముందుకు సాగించేది
పెను నిద్దర వదిలించేది
పరిపూర్ణపు బ్రతుకిచ్చేది
కావాలోయ్ నవ కవనానికి"

పీడిత ప్రజాకోటి పతాకను పైకెత్తి వర్గవిభజన సిద్ధాంతాన్ని తన కవిత్వానికి ప్రాతిపదికగా చేసుకున్నాడు. కష్టజీవుల జీవితాలు మొదట సారిగా కవితా వస్తువులయ్యాయి.

వీరంతా "దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో
విప్లవ శంఖం పూరిస్తా"రని గర్జించారు.

శ్రీ శ్రీ కున్న ఈ క్రొత్త మార్గాలన్నీ ప్రజలను ఆకర్షించాయి. పాఠకులు, రచయితలు ఈ క్రొత్త మార్గాలతో ప్రభావితు లయ్యారు. అసంఖ్యా

కంగా యువ కవులు ఈ నవయుగ నిర్మాత మార్గాన్ని అనుసరించారు. శ్రీశ్రీ అభ్యుదయ కవితా ఉద్యమానికి యుగకర్త.

శ్రీశ్రీ నవ్యకవితా ప్రభంజనం ప్రపంచ సరిహద్దుల్నే కదిలించింది. "దిక్కులను దేవుళ్ళను ఊగించి ప్రశ్నించే" కవిత్వం "నక్షత్రాలు అదిరి చూచే కేక ఆయన కవిత్వం (చలం)"

ఇంతవరకూ ఎన్నడు ఏకవులు తాకని కావ్యవస్తువు లెన్నింటినో స్పృశించిన ప్రత్యేకత వుంది శ్రీశ్రీకి. మహాప్రస్థానకవితా సంపుటిలో ప్రధాన గేయాలన్నీ ఆయన మార్క్సిస్టు సిద్ధాంత ప్రభావంతో వ్రాసినవే.

శ్రీశ్రీ 1933 లో వ్రాసిన "జయభేరి" గేయాన్ని ఆత్మాశ్రయ కవిత నుండి అభ్యుదయకవి ఆవైపు వేసిన తొలి అడుగుగా భావించ వచ్చు.

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను"

"నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను."

ఈ గేయం మొదటిసారిగా భావ కవిత్వ బంధాలనుంచి బయటపడి తన దృష్టిని సమాజం వైపు ప్రపంచం వైపు మరలించి కవిత నాలపించాడు.

శ్రీశ్రీ మహా శిల్ప ప్రతిభాశాలి. శబ్దాల మీద ఆధిపత్యం అద్భుతంగా ఉంది. శబ్ద చక్రవర్తి ఏ పదాన్ని ఎక్కడ వినియోగించాలో, ఎలాకూర్చాలో ఎలా పలికించాలో నిజంగా అతనికే తెలుసు. సంవిధాన చాతుర్యం, భావనా పటిమ గలవాడు. ప్రాచీన, పాశ్చాత్య సాహిత్యాలలో ప్రజ్ఞ గలవాడు. అభ్యుదయ కవిత్వానికి నాందీ గీతం అయిన మహాప్రస్థానం చరిత్రలో చిర స్థాయిగా నిలిచి పోయింది.

మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది.
పదండి ముందుకు
పదండి తోసుకు
పోదాం పైపైకి
కదం త్రొక్కుతు
పదం పాడుతూ
హృదయాంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం
... .... .... .... ....
దారి పొడుగున గుండె నెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు.

కదనరంగానికి కదలివెళ్ళే సైనికనడకలో గేయనడక ఉంది. అందులో తురగవేగంలో పరుగులు తీస్తోంది. వ్యర్థపదాలులేకుండా అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని స్ఫురింపజేస్తూ అనేక పదాలు హృదంతరాళం గర్జిస్తూ నయాగరా వేగంతో గంభీరభావాన్ని ఒకమాటలో కూర్చగల శిల్పి. ఆ మాటలు చలం తన యోగ్యతాపత్రంలో వ్రాసినట్లు, "మాటల్ని కత్తులు, ఈటెలు, మంటలుగా మార్చడం అతనికి చేతనవును. ఇవి మాటలు, అక్షరాలు కావు. ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు, అతని హృదయంలోంచి మన హృదయంలోనికి Direct గా పంపిన ఉత్సాహాలు, నెత్తురుకాల్వ లనిపిస్తుంది."

నవయుగనిర్మాణానికి కదలిపోయేసైన్యం ఈ గేయం. ఈగేయం సైన్యానికి క్రొత్త రక్తం ఎక్కించి కదను తొక్కించే సంగీతం. ఈయన చూపించే మరో ప్రపంచం ఎక్కడ ఉంది ? మార్చి చేయించింది ఎక్కడకు ?

"కనబడలేదా మరో ప్రపంచం
అగ్నికిరీటపు ధగధగలు

ఎఱ్ఱబావుటా నిగనిగలు
హోమజ్వాలల భుగభుగలు."

సోవియట్‌రష్యాలో శ్రామికవర్గం ఎఱ్ఱజెండాక్రింద సోషలిస్టు వ్యవస్థను స్థాపించిన విషయాన్ని ప్రస్తావించాడు. మరో ప్రపంచం సోవియట్ రష్యాకు ప్రతీకగా భావించాడు. అక్టోబరు విప్లవవిజయాలతో సోవియట్ దినదినాభివృద్ధితో ప్రభావితుడై రాసిన గేయం. అంతర్జాతీయ దృక్పథంతో రాసిన ప్రపంచ ప్రజాగేయం. విశ్వవ్యాపిత వాతావరణాన్ని సూచిస్తోంది.

ఈ శతాబ్దం తొలిరోజుల్లోనే గురజాడ ప్రపంచమంతా ఒక కుటుంబంగా స్వర్గమే అవనిలో అవతరిస్తుందని భవిష్యత్తును చూడగలిగాడు.

ఆయన రాసిన గేయం :

"ఎల్లలోకము ఒక్క ఇల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
.... .... .... .... ....
మతము లన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్."

శ్రీ శ్రీ మార్క్సిస్టు దృక్పథంతో చారిత్రక పరిణామాలను, మానవ జీవితచరిత్రను వ్యాఖ్యానించారు :

"ఏ దేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం."

బూర్జువా చరిత్రకారు లందరూ ఇంతవరకూ రాసిన చరిత్ర లన్నీ ప్రజల పాత్రను విస్మరించి రాజులచరిత్రగాను, యుద్ధాలచరిత్రగాను, అందులో రాజులు మంత్రులు సేనానుల పాత్రలే ప్రముఖంగా చిత్రించడం జరిగింది.

ప్రజలే చరిత్రనిర్మాత లనే సూత్రాన్ని, వాస్తవాన్ని మార్క్స్, ఎంగెల్స్ తత్వశాస్త్రరీత్యా, ఆర్థికశాస్త్రరీత్యా ధ్రువపరిచారు. చరిత్రను అధ్యయనం చేయడానికి కొత్త దృక్పథాన్ని కలుగచేశారు. కొత్త కొలతబద్దను ఇచ్చారు. శ్రీశ్రీ ఈ దృక్పథంలోనే చరిత్రలోతులను చూడగలిగాడు. బూర్జువా చరిత్రకారులను సవాల్ చేస్తున్నాడు. గతచరిత్ర అంతా పరపీడనం, రణరక్తప్రవాహసిక్తమని, దరిద్రులను కాల్చుకు తినడమేనని, రణరంగం లేనిచోటు లేదని, గత మంతా తడిసె రక్తమున, కాకుంటే కన్నీళ్ళతో అని గొంతెత్తి చాటాడు.

ఒక వ్యక్తిని మరొక వ్యక్తి
ఒక జాతిని మరొక జాతి
పీడించే సాంఘికధర్మం
ఇంకానా ? ఇకపై సాగదు

అని దోపిడీవర్గాలను హెచ్చరించాడు.

ప్రపంచ కార్మికులారా ! ఐక్యము కండి – అనే మార్క్స్, ఎంగిల్స్ కమ్యూనిస్టు ప్రణాళికలో ఇచ్చిన పిలుపును చక్కగా యీ గేయంలో చిత్రించాడు.

"చీనాలో రిక్షావాలా
చెక్ దేశపు గని పనిమనిషి
ఐర్లాండు ఓడకళాసీ
అడగారిన అర్తు లందరూ
... ... ... ... ... ... ... ...
ఖండాంతర నానా జాతులు
చారిత్రక యథార్థ తత్వం
చాటిస్తా రొక గొంతుకతో."

ఇప్పుడు కావలసినది రాణుల ప్రేమపురాణాలు కాదు.

"నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది ?
తాజ్ మహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీ లెవ్వరు ?"

చీకటి కోణంలో ఉండి దాచినా దాగని సత్యాలను సామాన్యుని చరిత్ర పాత్రను ఇప్పుడు బయటకు లాగాలని కవి ఆవేశంలో ప్రబోధిస్తున్నాడు. ఇంత వరకు ప్రపంచ విజేతలుగా ప్రఖ్యాతి పొందిన వారంతా హంతకులే నని ఘోషిస్తున్నాడు.

మానవ చరిత్ర అంతా వర్గపోరాట చరిత్ర అనీ కమ్యూనిష్టు ప్రణాళికలో ప్రకటించిన అంశాన్ని

పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

అనే గంభీరమైన చారిత్రక సత్యాన్ని ఒక్క మాటలో చాకచక్యంగా చెప్పగలిగాడు శ్రీ శ్రీ.

ఇంకా మహా ప్రస్థానంలో మార్క్సిజం ప్రభావంతో వాస్తవికత వాద దృక్పథంతో వ్రాసిన గేయాలెన్నో వున్నాయి. శ్రీ శ్రీ దాదాపు ఈ గేయాలు మాత్రా ఛందస్సులోను, వచన గీతాలలోనూ రాశాడు. దీనిలో ఎన్నో విలువైన ప్రయోగాలు చేశాడు. చమత్కారాలు ప్రదర్శించాడు. అభ్యుదయ కవితారంగంలో యుగకర్తగా, మహాకవిగా, మహాశిల్పిగా విజ్ఞాన వెలుగులు వెదజల్లిన మహా మేధావి శ్రీ శ్రీ.

## అధివాస్తవికత (Surrealism)

అభ్యుదయ కవితా యుగారంభంలోనే అధివాస్తవికతా వాదం కూడా తెలుగు కవిత్వంలో తలెత్తింది. అయితే తెలుగు కవిత్వంలో ఏనాడూ అది ఒక ఉద్యమ రూపం ధరించలేదు. పుట్టలో పుట్టి మట్టిలో మాడి పోయింది. ఈ ధోరణి కేవలం ఇద్దరు కవులకే పరిమితమయింది. తెలుగు సాహిత్యంలో ) ప్రభావం కలిగించలేదు. అభ్యుదయ కవితా యుగకర్తయే అధివాస్తవిక కవితా ప్రారంభకులు కావడం ఒక విచిత్ర ఘటన. ఆరోజులలో చాలమందికి రచయితలకు కూడా వాస్తవికతకు అధి వాస్తవికతకు ఉన్న తేడా ఏమిటో తెలియదు. దీనికి ఒక కారణం రెండు వాదాలకు పెద్ద కాలభేదం లేకుండా శ్రీ శ్రీయే మూలవిరాట్ కావడం. రెండవకారణం ఫ్రాయిడ్ సిద్ధాంతాలకు,

మార్క్స్ సిద్ధాంతాలకు భేదం తెలియకపోవడం. మూడవవిషయం అభ్యుదయకవితకు తెలుగు ప్రజాజీవితం ప్రేరణ. అధివాస్తవిక కవితాధోరణికి ప్రేరణ తెలుగు ప్రజలనుండి రాలేదు. సంక్షోభంలో వున్న పాశ్చాత్యదేశాలలో నిరాశ, నిస్పృహ, అశాంతితో వున్న మేధావులు, కవులు గమ్యం తెలియని గమనంతో రాసిన అరాజక, విధ్వంసక ధోరణులతో కూడిన అధివాస్తవిక కవితకు ప్రోద్బల శక్తి. తెలుగు దేశంలో అధివాస్తవికత అవతరణకు కారణాలు లేవు. భౌతిక పరిస్థితులు లేవు. తెలుగు దేశంలో ఉన్న కొద్ది మంది కవులు శ్రీ శ్రీ, నారాయణ బాబు వ్యక్తిగత వ్యామోహంతో, మోజుతో, కొత్త ఒక వింత అనే ధోరణితో, ఏవో కొత్త కవితా ప్రయోగాలు చేయాలనే (ప్రయోజనం లేకపోయినా) ఉత్సాహంతో గుడ్డిగా చేసిన అనుకరణ మాత్రమే.

ఈ సందర్భంలో మనస్తత్వ శాస్త్రవేత్త ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వివరించడం సాధ్యం కాని పని. కాని వాస్తవికతావాద కవిత్వానికి, అధివాస్తవిక కవిత్వానికి గుణభేదాల పర్యవసానాన్ని వివరిస్తూ ఆకవుల రచనలను రెంటినో మూటినో క్లుప్తంగా సమీక్షిస్తే సరిపోతుందనుకుంటాను.

| | | |
|---|---|---|
| అభ్యుదయ కవిత్వం | - | ప్రజలకోసం |
| అధివాస్తవిక కవిత | - | హద్దు అదుపు లేని వ్యక్తి స్వేచ్ఛకోసం |
| అభ్యుదయ కవితకు | - | ప్రజాజీవితానుభవాల నుండి ప్రేరణ |
| అధివాస్తవికతకు | - | ఆత్మాశ్రయత ప్రేరణ |
| అభ్యుదయ కవిత్వం | - | లక్ష్యం కళను, సాహిత్యాన్ని ప్రజలకు సన్నిహితం చేయడం. |
| అధివాస్తవికత | - | కళ కళకోసం |
| అభ్యుదయ కవిత్వం | - | వస్తుప్రాధాన్యం, ప్రజా ప్రయోజనం. |
| అధివాస్తవిక కవిత్వం | - | ఉన్మాదం, అరాజకం, పర్యవసానం. |
| అభ్యుదయ కవిత్వం | - | వాస్తవికత, విజ్ఞానం, భౌతికం, వాస్తవిక జగత్తు |

అధివాస్తవిక కవిత్వం - అవాస్తవికం, స్వప్నం, అజ్ఞానం, వ్యక్తా వ్యక్తం. వ్యక్తాన్ని నిరాకరిస్తుంది.

శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వం రాసిన మానసికస్థితికి అధివాస్తవిక కవిత రాసిననాటి మానసికస్థితికి ఎంతో భేదం వుంది. మహాప్రస్థానం రాసిన శ్రీశ్రీ ఉన్నతశిఖరాలకు చేరుకున్నాడు. ఆయన వ్రాసిన అధివాస్తవిక కవితలను చదవండి :

1 తురాయికంటె
ఆకురాయి కంటె
కీచురాయి కంటె
హిమాంశురాయి గొప్పవాడు.

2 జీబ్రాకి ఆల్‌జీబ్రాకి చిహ్నాల
లాంకోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం యిస్తే
వెర్రిగాదు Sur realism సోదరా !

3 5, 3, 2 ఆముక్తమాల్యద
ఆటవెలది ద్విపద కర్తగారు.

పైన రాసిన 3 కవితలకు సాహిత్యందృష్ట్యా అర్థం చెప్పడానికి పూనుకోవడం అవివేకం. అర్థం అనర్థమని, ఛందోబందోబస్తులను బ్రద్దలు చేయడం, ఒక పాదానికి రెండవ పాదానికి సమన్వయం లేకపోవడం, వ్యక్తావ్యక్త మానసిక స్థితిలో ఏది తోస్తే అది రాయడం, మనసుతోనే క్రీడలాడడం ఇందులో కనిపిస్తుంది. కవితారంగంలోకూడా అడ్డు, అదుపులేని స్వేచ్ఛను, అరాజక ధోరణిని ప్రదర్శించడం కనిపిస్తుంది. శబ్దచమత్కారం, అర్థంపర్థంలేని ప్రయోగాలు అవహేళన నియమాలు, కట్టుబాట్లు లేకపోవడం కనబడుతుంది.

ఈ ఫ్రాయిడ్ కామ సిద్ధాంతం బాగా జీర్ణించుకుని కవిత్వం రాసిన వాళ్ళలో నారాయణ బాబు ఒకడు.

ఏ దృష్ట్యా చూచినా అధివాస్తవికకవితాధోరణి సాహిత్య రంగంలో సాధించిందేమి లేదని, రచయితలను ఆకర్షించలేదని తేల్తోంది. పరిమితమై మొగ్గలోనే వాడిపోయింది.

అభ్యుదయ కవితా యుగంలో అచ్చయిన తొలి కావ్యం నయాగరా నరసరావు పేటనుండి నవ్యకళా పరిషత్ తరపున 1944లో అచ్చయింది. బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం ముగ్గురు కవులు వేరు వేరుగా రాసి ప్రకటించిన గేయసంపుటి. ఈ కావ్యాన్ని తమ మిత్రులైన శ్రీ అనిశెట్టి సుబ్బారావుకు అంకితం యివ్వడం జరిగింది. సాహిత్య రంగంలో ఆనాడు యీ కావ్యం పెద్ద సంచలనాన్ని కలిగించింది. 1975 లో ద్వితీయ ముద్రణకు "మళ్ళీ ఇన్నాళ్ళకు" అనే శీర్షికతో తమ కావ్యంపై వచ్చిన విమర్శలను తమ కవిత్వ స్వభావాన్ని యిలా వివరించారు. "ఆరోజులలో కుండపోతగా ఆవేశం కుమ్మరించడమే కవిత్వమనే వాదం మాది. దీనికితోడు ఎర్రజెండా నాయకత్వాన యీ సమాజ వ్యవస్థ మారాలని మాకవితలో వుండే సందేశం. కమ్యూనిస్టు మానిఫెస్టోను మించిన ఉత్తమ కవిత్వం ప్రపంచంలో లేదని మేము వాదిస్తూ వుంటే సంప్రదాయ వాదులైన కవి మిత్రులు కొందరు నిర్ఘాంతపోయి వింటూ వుండేవారు". దీనినిబట్టి నయాగరా కవిత్వ స్వభావ స్వరూపాలను అర్థం చేసుకోవడం మనకు సులభమవుతుంది. వీరి కవిత్వంలో ఆవేశ పరత, గతాన్ని ఖండించటం వర్తమాన వ్యవస్థలో జరుగుతున్న వర్గసంఘర్షణ ప్రాధాన్యత వహించాయి. అన్యాయాలను, అక్రమాలను తీసుకుని నూతన వ్యవస్థకు, ఉజ్వల భవిష్యత్తుకు ప్రజలను ఉత్తేజ పరిచే విధంగా, ప్రబోధాత్మకంగా వుంది.

వీరి కవిత్వంలో పసిఫిక్ యుద్ధం, మన్య విప్లవం, ఠాకూరు చంద్ర సింహు తిరుగుబాటు మొదలైన సంఘటనలు వీరికి కావ్యవస్తువులైనాయి. బర్మా అడవులు, చైనా లోయలు, పారిస్ వీధులు, సోల్జర్లు, నిప్పుల కంఠం, మాస్కో గేట్లు, గెరిల్లా గుంపులు, బిచ్చగాళ్ళు, కొడవలి పదును, కార్మిక, కర్షకుల కష్టాలు, ఎర్రజెండా, సమ్మెటపెట్టు, వీరి కవితలో చోటు చేసుకున్నాయి. సామ్యవాద సిద్ధాంతాలు, కమ్యూనిస్టు ప్రణాళికలోని ప్రధానాంశాలు వీరికి కావ్య వస్తువులయ్యాయి. నయాగరా వచన పద్యకావ్యం. శ్రీ రమణా రెడ్డి రాసినట్లు "శ్రీశ్రీ సృష్టించింది ఆ వాతావరణంలో స్థూలరేఖలు".

9)

నయాగరా కవులతో పాటు నరసరావు పేట నుండి నవ్యకళాపరిషత్తును నడిపిన ముఖ్యులలో ఒకడైన అనిసెట్టి సుబ్బారావు 1941-47 మధ్యకాలంలో రచించిన గేయసంపుటి అగ్నివీణ. తాత్వికత, వాస్తవికత, సౌందర్యం సమ పాళ్ళలో మేళవించిన ఈయన కవిత్వంలో పటుత్వం ఉంది. అగ్నివీణ సందేశాన్ని ప్రారంభంలోనే "నరబలిలో।పరపీడనలో। యంత్రపు దోపిడిలో। హతులౌపతితుల ప్రాణజ్వాలలతో। లోకపు చీకటి। కన్నుతెరుస్తూ। నూత్న మానవుని। కూపిరి పోస్తూ।.........। సమధర్మం స్థాపిస్తూ। అధోజగత్సహోదరుల। కండగ నిలిచిన వీరుల। అజ్ఞాతుల్, అనామకుల। కభివందన సందేశం। అగ్నివీణ సంగీతం।" అని వినిపిస్తాడు అనిసెట్టి.

అనిసెట్టి తనకవిత్వానికి ఇలా వ్యాఖ్య చెప్పుకున్నాడు. "ఆద్యంత రహితమైన ప్రాణ వాహినికి మార్గాన్వేషులైన రెండు చైతన్య తరంగాలు తత్వశాస్త్రం, కవిత్వం. ఇవి మానవుని విజ్ఞాన నేత్రాలు. ఈ సుందర నేత్రాల కాంతిలోనే జీవిత రహస్యాలను శోధించాలి. నేడు కాంతి ఒక్కటే చాలదు. ప్రచండమైన ఉష్ణోగ్రత కూడా కావాలి."

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో జపాను మనదేశంపై కాకినాడ, విశాఖ పట్టణంపై బాంబులు వేయడం జరిగింది. బెంగాల్, విశాఖ, రాయలసీమ తీవ్రమైన క్షామానికి గురయ్యాయి. 1941-45 మధ్యకాలం. బెంగాల్‌లో తీవ్రక్షామం వల్ల వేల సంఖ్యలో ఆకలి మరణ వార్తలు, ఆంధ్రదేశంలో విశాఖ, రాయలసీమ కరువు దృశ్యాలు కళాకారులను, కవులను, ప్రజా సేవకులను కదలించాయి. కరుణామయ గాథలను విని, హృదయ విదారక దృశ్యాలను చూచి వీరి హృదయాలు స్పందించాయి. అనేక రూపాలలో తమ వేదనలను వ్యక్తం చేశారు. ప్రాచీన కళా రూపాలను పెద్దయెత్తున పునరుద్ధరించారు. ప్రజాకవులు వాస్తవికతా దృష్టితో గేయాలను, పాటలను, బుర్రకథలను, గొల్ల సుద్దులను, జముకుల కథలను, హరికథలను, వీధిభాగోతాలను రచించారు. గాయకులు, కళాకారులు, వైజ్ఞానిక దళాలు వీటిని ప్రజలలో ప్రదర్శించి ఆంధ్ర ప్రజానీకాన్నంతటినీ ఉత్తేజపరచి కర్తవ్యోన్ముఖులను చేశారు. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసినది ప్రజాసాహిత్య సృష్టి జరగటం, కొత్త వస్తువుతో జానపద గేయరీతులలో కవిత్వ సృష్టి జరగటం. రెండవ విషయం ప్రజాబిడ్డలే ఉద్య

మంలో ఉద్భవించి కవులుగా ఎదిగి కావ్యస్థాయిని అందుకోవడం. జాతి పునర్వి కాస తొలిదశలోనే దేశికవితా ఫణితుల కొత్తకాంతిలో ప్రజల హృదయంలో చైతన్యం కలగటం మొదలైనవి. గురజాడ ఆశుకవితా రీతులను స్వీకరించి గొంతెత్తి తెలుగు ప్రజాఉద్యమానికి కవితా గానం చేశాడు. ముత్యాల సరాలను రూపొందించాడు. కొత్త కవితారీతికి బీజం వేశాడు.

జాతీయ ఉద్యమ కాలంలో దేశీరీతులలో గరిమెళ్ళ సత్యనారాయణ మొదలయిన వారు "మాకొద్దీ తెల్లదొరతనము" అనే గీతంతో జాతి జను లందరినీ కదిలించిన విషయం మనకు తెలుసు.

34, 35 నుండి ప్రారంభమయి ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ కాలంలో సంఘటిత అభ్యుదయ కవితా ఉద్యమ కాలంలో దేశికవితా రీతులలో రచనలు సర్వకళా రూపాలలో పదరచనలు ఉన్నతస్థాయికి చేరుకున్నాయి. జపాను వ్యతిరేక బుర్రకథలు హిట్లరు భాగోతాలు వగైరా వచ్చాయి. ఈ దశలో సుంకర సత్యనారాయణ 37-47 మధ్యకాలంలో బుర్రకథలు రాయడంలో, ఇతర గేయ రచనలో ఉత్తమ కవిగా పేరు పొందాడు. వీరు రచించిన "కష్ట జీవి" అనే బుర్రకథ ఆంధ్ర ప్రజాకోటికి చెవిలో యిల్లు కట్టుకుని తెలుగు జాతి జీవనపరిస్థితులను ప్రబోధించింది. వీరకరుణరసమిశితమై ఈ కథ ఉత్తమ కావ్యంగా రూపొందటం వల్లనే... ఎన్నో బుర్రకథలకు మాతృత్వం వహించి మన సాంస్కృతిక జీవనంలో బుర్రకథల రూపాలకి మరల శాశ్వత స్థితిని కలి గించింది. గ్రామీణులనే గాక నాగరికులను సైతం ఆనందావేశంలో ముంచె త్తింది. వీరి రెండవ "వీరేశలింగము" బుర్రకథ సర్వే సర్వత్రా ప్రజలను రంజింప జేసింది. అల్లూరి సీతారామ రాజు కథ, వీరరసోద్భరితమై, కర్తవ్యా వేశ భరితమై ప్రజలలో నూతనాను భూతులను కలిగించింది" (సోమ సుందరం)

నాజరు ప్రథమంలో బుర్రకథకుడుగా పేరుగాంచి తరువాత బెంగాలు కరువుపై బుర్రకథను రచించాడు. ఇది ప్రజా హృదయాన్నే గాక భారత మేధావుల హృదయాన్నికూడా చూరగొంది.

కరువు వచ్చి ఇళ్ళనూ వాకిళ్ళనూ వదలి కుటుంబంలో తిండి కోసం పట్టణాల కెగబ్రాకే దృశ్యాలను చిత్రిస్తూ కరుణరస భరితాలైన గేయాల్ని రచించాడు కొనకళ్ళ వెంకటరత్నం. ఆయన హైలెస్సా గేయంలో వేదప్రజల బ్రతుకు భారం ప్రతిధ్వనిస్తోంది.

జానపద సాహిత్యంలో ఎన్నదగిన "సైసై చెన్నాప రెడ్డి, ఓ గుఱ్ఱాల గోపిరెడ్డి" వంటి అనేక కొత్త పాటలను రచించారు. వీరిలో ముఖ్యుడు కోగంటి గోపాలకృష్ణయ్య. తెలంగాణాలో టి. రామానుజులు "అనాధ" అనే బుర్రకథను రచించారు. తెలంగాణాలో పేరెన్నికగన్న శ్రీ కాళోజి నారాయణరావు జానపద రీతులలో ఎన్నో గీతాలను రచించాడు.

"తెలుగు తేజము దీప్తిజెందగ-తెలుగు వెలుగు దిశలనిండ
తెలుగు తల్లిని గొలువ దీక్షతో-తరలి రావోయ్ తమ్ముడా"

అని ఆంధ్ర జాతీయ గీతం రాసి బహుమతి పొందారు. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో ప్రబోధగీతాలు కూడా రాశాడాయన.

ఒకటి, రెండు గేయాలు వ్రాసి తెలుగు కవితా రంగంలో విశిష్టస్థానం పొందిన వారు వేములపల్లి శ్రీ కృష్ణ, పులుపుల శివయ్య, కొండేపూడి లక్ష్మి నారాయణ, తిమ్మరం వెంకట్రామయ్య మొదలైన వారు. 1945లో వేములపల్లి శ్రీ కృష్ణ వ్రాసిన

"చేయెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతొ ఘనకీర్తి గలవాడా!
.... ... .... ... ....
నివుర గప్పి నేడు-నిదురపోతుండాది
జైకొట్టి మేల్కొల్పు తెలుగోడా!

అనే గేయం ఎక్కువ ప్రజాదరణ పొందింది.

కోగంటి గోపాలకృష్ణయ్య "తొలిమబ్బు మెరెసరా, తొలకరి కురిసెరా దుక్కులు దున్నవేమిరా రైతా రైతా" అని కర్షకులను ప్రబోధిస్తూ రాశారు.

అయ్యప్ప వెంకట కృష్ణయ్య గారు 1946లో వ్రాసిన "మనది భారత దేశమమ్మా మనది భారత జాతి తల్లీ" అనే గేయం అన్ని విధాల ఉన్నత ప్రమాణాల నందుకుంది.

గురజాడ ప్రారంభించిన దేశకవితా రీతులను, తరువాత 25 సంవత్సరాలకు ఆంధ్రదేశంలో అభ్యుదయ కవితాయుగ ప్రారంభదశలోనే యువకవులు తిరిగి పెద్దయెత్తున పునరుద్ధరించారు.

అభ్యుదయ రచయితలను సంఘటితపరుస్తూ, అభ్యుదయ రచయితల సంఘం 1943 లో ఏర్పడింది. 1943-1947 మధ్యకాలంలోనే 5, 6 సంవత్సరాలలో తెలుగుసాహిత్యంలో అభ్యుదయ కవిత్వం, సాహిత్యం ఒక మహోద్యమంగా పెరిగి ఉన్నత శిఖరాలను చేరుకుంది. ఎదురులేని స్థానాన్ని అలంకరించింది. అభ్యుదయ కవులనే, యువతరాలనే గాక అదివరలో పేరుమోసిన భావకవులు, అగ్రశ్రేణికి చెందిన సంప్రదాయకవులు కూడా అభ్యుదయ వేదికపై నిలబడ్డారు. 1947 నాటికి అభ్యుదయసాహిత్య ప్రవాహంనుండి ఎక్కడ వేరుపడిపోతామో నని ఖంగారు, ఏదోరకంగా సన్నిహిత సంబంధం పెట్టుకోవాలని తహతహపడ్డారు కొంతమంది భావకవులు, సంప్రదాయకవులు. ఇది దేనిని సూచిస్తుంది ?

1947 లో నాలుగవ మహాసభ జరిగిననాటికే అభ్యుదయకవిత్వం విజృంభించి అన్నివైపుల వ్యాప్తిజెంది ఎదురులేని శక్తిగా పురోగమించిం దనే సత్యాన్ని తెలియజేస్తుంది. అభ్యుదయకవిత్వం, మొత్తం అభ్యుదయసాహిత్యం సకల కళారూపాలలో ప్రదర్శనాలు అన్నీ కలిసి ప్రజలను ప్రభావితం చేశాయి. ప్రజలలో ఉన్న మూఢనమ్మకాలను, దురాచారాలను పోగొట్టి విజ్ఞానస్థాయిని పెంచాయి. ప్రజలలో నూతనచైతన్యాన్ని కలుగజేశాయి. పీడితవర్గ ప్రజలు సమాజంలో తమ స్థానం ఏమిటో, తాము అభివృద్ధి కావాలంటే ఏమి చెయ్యాలో అర్థం చేసుకోవడం ప్రారంభించారు. ఈ సందర్భంలో బుర్రకథలు కొత్త వస్తువుతో, వ్యాఖ్యానాలతో ప్రజలకు ఎంతో విజ్ఞానాన్ని సులువుగా అందజేశాయి. సామాన్యునిలో కూడా కొత్త ఆలోచనలను రేకెత్తించాయి. ఈ కొద్ది కాలంలోనే అన్ని ప్రజా ఉద్యమాలు అభివృద్ధికి తోడ్పడింది. అభ్యుదయ క

త్వమూ, సాహిత్యమూ, ఇతర సాహిత్యసంస్థలన్నీ మూలపడ్డాయి. పేపరు సంస్థలుగానే ఉండిపోయాయి.

1947 లో అటు తెలంగాణా విముక్తిపోరాటం, ఇటు ఆంధ్రలో భూమి కోసం జమీందారీ వ్యతిరేకపోరాటం సాగుతున్నాయి. ఈ పోరాటాలను అణచడానికి ప్రభుత్వం తీవ్రనిర్బంధవిధానాన్ని ప్రారంభించింది. అభ్యుదయ రచయితల సంఘకార్యకలాపాలు సాగించడానికి అవకాశం లేకుండా పోయింది. కాని, అభ్యుదయకవిత్వం ఈ పోరాటకాలంలోనే అభివృద్ధి జెందింది. వందలు, వేల సంఖ్యలో కొత్త గొంతులతో కొత్త కవులు కొత్త కవితలతో గ్రామసీమలలో కూడా విప్లవ జ్యోతులను వెలిగించారు.

## ముగింపు

కాలపరిమితివల్ల చాలమంది ముఖ్యమైన కవులరచనలను ఈ వ్యాసంలో తీసుకురాలేకపోయాను. ఈ కాలంలోనే రాసిన కవులందరి రచనలను కూడా సమీక్షలోనికి తీసుకోలేదు. కొద్దిమంది రచనలను సంక్షిప్తంగా మాత్రమే సమీక్షించగలిగాను. నా వ్యాసానికున్న పరిమితులవల్ల వారు రాసిన రచనల కాలమేదో తెలియక అమూల్యమైన రచనలను వదలివేయవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. అందుచే క్లుప్తంగా అభ్యుదయకవిత్వ చారిత్రక అవసరాన్ని దానికి పుట్టుపూర్వోత్తరాలను, ప్రగతిని, విశిష్టలక్షణాలను విమర్శనాత్మకంగా వివరించాను. శ్రీశ్రీ రచనలను, మరికొంతమంది రచనలను అభ్యుదయకవితా విమర్శనా సూత్రాల ఆధారంతో విలువగట్టాను. ఈ ఉద్యమంలో వచ్చిన పెడధోరణులను బట్టబయలు చేశాను. నిర్ణయించిన కాలానికి నా సమీక్షను 1947 కే ఆపివేస్తున్నాను, అయితే ఈ కాలనిర్ణయం అనేక చిక్కులను కలిగించింది. ప్రముఖ రచయితలెవరు ? సాహిత్యపరంగా అభ్యుదయశాఖలో వచ్చిన ఉత్తమ రచనలేవి ? అనే ప్రశ్నలకు సమాధాన మివ్వడం కష్టం. 34 లో వచ్చిన మహాప్రస్థానంతో అభ్యుదయకవిత ప్రారంభమయింది. 1947 ఆగస్టులో నా వ్యాసం

పూర్తి చేస్తున్నాను. అసలు యీ 18 సంవత్సరాలలో లేక 1949 జనవరి వరకు పొడిగించినా యీ మధ్యకాలంలో అభ్యుదయ కవితాసంపుటాలు, సంకలనాలు, కావ్యఖండికలు పుస్తకరూపంలో వచ్చినవి ఏవీ లేవనే చెప్పాలి. 1949 జనవరికి పూర్వం అభ్యుదయకవిత అని చెప్పుకోదగ్గది (1944 లో) ఒక్క నయాగరా, రాగాల డజను, నవమి, చిలుక - 37, 38 లో అచ్చు కాబడినా వాటిని అభ్యుదయ రచనలుగా తీసుకోలేము. 1934 లో రాసిన మహాప్రస్థానం 1950 లో పుస్తక రూపంలో వెలువడింది. అనిశెట్టి అగ్నివీణలో రాసిన గేయా లన్నీ 41–47 మధ్య రాసినవే. పుస్తకరూపంలో 49 లో వెలువడింది. ఉత్తమ రచనలను సమీక్ష చేయడానికి మనం ఒకటి రెండు గేయాలపై ఆధారపడలేము. 48, 50 సంవత్సరాలలో 15–20 పైగా కావ్యఖండికలు పుస్తకాలుగా వెలువడ్డాయి. వీరు ఏ సంవత్సరం ఏ గేయం రాసినది తెలియదు. శ్రీ శ్రీ తో ప్రారంభించిన నారాయణబాబు రచనలు ఏ ధోరణికి చెందినా 1950 లో రుధిరజ్యోతి అనే పేరుతో పుస్తకరూపంలో ప్రకటించబడింది.

1948 జులైలో ఆరుద్ర వాసిన త్వమేవాహం 1949 లో అచ్చయింది. నయాగరా మడమలు తొక్కుతూ నార్ల చిరంజీవి రాసిన విప్లవాత్మ వచ్చిందని రమణారెడ్డి వ్యాసంలో రాశాడు. కాని, దానిని చదివే అవకాశం లభించలేదు. చిరంజీవి బాలబాలికలకు రాసిన తెలుగుపూలు 1946 లో ప్రకటించబడింది. విద్వాన్ విశ్వం 36 నుండి అభ్యుదయకవిత్వం రాస్తున్నాడు. ఆయన కవితలు గ్రంథస్థ మైనవి 1950 తరువాతనే. రమణారెడ్డిగేయాలు అలానే. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు 1947 లో విముక్తి పూర్తిగా లేదు. తెలంగాణా విముక్తిపోరాటం పూర్తికానిదే మనకు రాజకీయంగా గాని, అభ్యుదయసాహిత్యోద్యమ దృష్ట్యాగాని అసంపూర్ణ మైనదే. తెలంగాణావిముక్తిపోరాట కాలంలోనే అసలు అభ్యుదయకవిత్వం వెల్లువగా వచ్చింది. ఆంధ్రదేశంలోని ప్రధానమైన కవులు తెలంగాణాపోరాటాన్ని కావ్యవస్తువుగా తీసుకుని కావ్యాలు, గేయాలు రాశారు. అజ్ఞాతకవులు, యువకవులు అసంఖ్యాకంగా ఆ మహావిప్లవంలో ఉద్భవించారు. మహోద్రేకంతో రచనలు చేశారు. కత్తి, కలం చేయాని ప్రాణా

లొడ్డినవారున్నారు. తెలంగాణా విప్లవం భారతమేధావులను, కవులను కదిలించింది. 1950 వరకూ మన కాలపరిమితిని పొడిగిస్తేనేగాని మనకు సంపూర్ణ అభ్యుదయకవిత్వ విప్లవం సాక్షాత్కరించదు. కాని, నా సమీక్ష శ్రీశ్రీ మహాప్రస్థానం, నారాయణబాబు రుధిరజ్యోతి, నయాగరా, అనిశెట్టి అగ్నివీణ, ఈ కాలంలో జానపదసాహిత్యరీతులలో వచన ప్రజాకవిత్వానికే పరిమితమయింది. తెలంగాణా పోరాటకాలంలో వచ్చిన త్వమేవాహమ్, వజ్రాయుధం, అగ్నిధార, రుద్రవీణ, ఉదయిని, సంఘర్షణ మొదలగున వెన్నో అభ్యుదయకవితాశాఖలో ఉత్తమరచనలు వచ్చాయి. ఈ కవులంతా ముఖ్యమైన కవులే. ఇంకా ఇక్కడ ఉదహరించని గ్రంథాలు, కవులు చాలమంది ఉన్నారు.

ఈ అసంపూర్ణదశను 1947-71 విప్లవ రచయితల సంఘం అవతరణ వరకు ఒక దశగా నిర్ణయించిన కాలంలో పూర్తిచేయవలసి వుంటుంది. అందుచే నేను నా వ్యాసానికి నిర్ణయించిన కాలానికే పరిమితమై వ్యాసాన్ని ముగించాను.



# తెలుగు నవల

— డా॥ మొదలి నాగభూషణశర్మ

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభానికి తెలుగు నవల పుట్టి 28 సంవత్సరాలు అయింది. 1872 లో ప్రారంభమైన తెలుగు నవలా స్రవంతి మొదటి ఇరవై యెనిమిది సంవత్సరాలు కొండల్లో కోనల్లో, కష్టసాధ్యమైన దారుల్లో పయనించే సెలయేరులా మొదలై, ఇరవయ్యో శతాబ్దంలోకి వచ్చేసరికి విస్తృతమై సమతలంలో ప్రవహించే మందాకిని అయింది. దీనిని ఈ సమతలానికి నడిపించిన భగీరథుడు కందుకూరి వీరేశలింగం పంతులు. దీనికి అవధులను నిర్ణయించింది ఆయన సారథ్యంలో నడిచిన "చింతామణి" పత్రిక. ''నేనే మొదటి వచన ప్రబంధమును చేసితిని'' అన్న కందుకూరి మాటలు సాంకేతికంగా నిజాలు కాకపోయినా, సూక్ష్మంగా పరిశీలిస్తే సత్యదూరాలు కావనిపిస్తుంది. తరువాత నవలలన్నీ నరహరి గోపాల కృష్ణమ చెట్టిగారు వ్రాసిన మొదటి తెలుగు నవల ''శ్రీరంగరాజ చరిత్ర''ను కాక, వీరేశలింగం గారి "రాజశేఖర చరిత్ర"ను ఆదర్శంగా స్వీకరించి, ఆ నవల కొక గురుస్థానాన్ని యిచ్చాయి. ఒకవ్యక్తి జీవితంలోని వివిధ సంఘటనలను ఆలంబనంగా చేసుకొని ఆ వ్యక్తి చుట్టూ కథ నడపాలనే కథన విధానం కూడా కందుకూరిదే! సంఘటనలకన్న వ్యక్తి జీవితానికి, నైతిక విలువలకూ నవల్లో ప్రాముఖ్యాన్ని యిచ్చే పద్ధతిని ప్రవేశ పెట్టిందీ కందుకూరే! కథా నిర్మాణ వైచిత్రిలోను, సంవిధానంలోను తరువాత నవలారచయితలు తు.చ. తప్పకుండా ఈయన పద్ధతులను మన్నించి, అనుసరించడం వల్లనే కందుకూరి నవలావైతాళికు డైనాడు.

కొత్త శతాబ్దంలోకి అడుగు పెడుతున్న తెలుగు నవలకు ఒరవడి దిద్ది ప్రభావితం చేసింది 'చింతామణి' పత్రిక. తరువాతి నవలలకు ఒక నిర్వచనాన్ని, ఒక గతి విధానాన్ని రూపొందించింది యీ పత్రికే. 1892లో కందుకూరి వారి ప్రోత్సాహంతో, న్యాయపతి సుబ్బారావు పంతులుగారి సంపాద

కత్యాన వెలువడ్డ యీ పత్రిక అదే సంవత్సరంలో నవలల పోటీలు నిర్వహించి 1898 వరకు నిర్విఘ్నంగా కొనసాగించి తెలుగు నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. మొదటి, రెండవ బహుమతులు వచ్చిన నవలలను ఆ పత్రిక ధారావాహికంగా ప్రచురించి రచయితలకు ప్రోత్సాహా న్నిచ్చింది. నవలను "వచన ప్రబంధం"గా నిర్వచించి, దానికి కొన్ని సూత్రాలను నిర్ణయించింది. ఈ నిర్ణయింప బడ్డ సూత్రాలు ఆంగ్లేయ నవలలకు ఆనాటి విమర్శకులు నిర్దేశించిన సూత్రాలు మాత్రమే కాదు. ఆ సిద్ధాంతాలు తెలుగు వాతావరణానికి ఏ విధంగా వర్తింప చేయాలో కూడా 'చింతామణి' పత్రిక పరోక్షంగా సూచించింది.

"ప్రబంధ మనగా కల్పిత మైనకథ. ఆకథను పురాణేతి హాసాదులనుండి గాని చరిత్రల నుండిగాని గ్రైకొని కథా సారస్యమున కనుకూలముగ నుండు లాగున దానికి నూతనాంశములను చేర్చి పెంచి వ్రాయవచ్చును, లేదా కవి మొదటి నుండి కడవరకును స్వబుద్ధి చేతనే నూతన కథను కల్పించి యైనను వ్రాయవచ్చును. కథాంశము వ్రాయువారి బుద్ధి విశేషము ననుసరించి యుండును గాన దానిని గురించి విధులు చెప్పుట యావశ్యకమే యైనను కథ పూర్ణముగా కల్పిత మైనను, కొంతవర కితరగ్రంథముల నుండి గ్రహింపబడిన దైనను చమత్కారముగ నుండి చదువువారికి హృద్యముగ నుండవలెనని చెప్పుట యనావశ్యకము కాదు... శృంగారమో, వీరమో యేదో యొక రసమును ప్రధానముగా జేసి కాని వివిధరస సంయుతముగ నుండు నట్లు గాని యాయా రసమును పోషించుటకయి వివిధ కష్ట సుఖములను ప్రయత్నములను కార్యవిఘాతములను కార్యసాఫల్యములను మధ్య మధ్య సందర్భోచితముగా తీసుకొని వచ్చుచు కథ యంతయు నొక్కని చరిత్రమువలె నుండునట్లు వ్రాయవలెను. మధ్య మధ్య నెన్ని పాత్రములు వచ్చుచున్నను కథ కంతకును ముఖ్య నాయకు డొకడుండ వలెను. నాయకుని తోడి పాటుగా కథానాయికయు ఉండవచ్చును."

"ఈ వచన ప్రబంధముల యందు కథ కేవలము కల్పితమైనను స్వభావ విరుద్ధముగ నుండక నిజముగ జరుగుచున్న చరిత్రమువలె నుండి చదువువారికి హృదయాహ్లాదకరముగా నుండవలెను. కథలో సందర్భోచితముగా జనుల యాచార వ్యవహారములను, కార్యములో జరిగిన స్థలములు మొదలయిన వానిని వర్ణింప వలసి వచ్చునప్పు డావర్ణనలను అసంభావ్యములుగా నుండునట్లు చేయక నైసర్గికముగాను వినోదకరముగాను జేయవలెను.

"సంభాషణములు కాక మిగిలిన కథాంశము నందు సహితము సాధ్యమయినంత వరకు కేవలగ్రాంధిక పదములను దీర్ఘ సమాసములను విడిచి మృదు మధుర పదములతో సులభశైలినే ఉపయోగించవలెను."

"ఇంగ్లీషువారు వ్రాసిన గ్రంథములను చూచి యిప్పటి మనవారు వచన ప్రబంధములను వ్రాయనారంభించినారు గాని యింకను మనభాషలో నుండవలసినన్ని పుస్తకములు పుట్టలేదు."

'చింతామణి' పత్రిక నిర్ణయించిన సూత్రాలను స్థూలంగా యిలా క్రోడీకరించ వచ్చు. సాంఘికేతి వృత్తం గల నవలలకు ఒకవ్యక్తి చరిత్ర ఆలంబనం కావాలి. అది వ్యక్తినిష్ఠం, సంఘటన నిష్ఠంకాదు. ఆ వ్యక్తి జీవితంలోను ఆటుపోటులను ప్రదర్శిస్తూనే సమయానుకూలంగా సమకాలీన జీవన వ్యవహారాలపై విమర్శను జోడించ వచ్చు. అన్ని సంఘటనలకు నైతిక విలువలే ప్రాతిపదిక కావాలి. తరువాత ఇరవై సంవత్సరాలుగా ప్రచురితమైన తెలుగు నవలలు చాలవరకు ఈ సూత్రాలనే అనుసరించాయి.

1892–95 సంవత్సరాల మధ్యకాలంలో సాంఘిక నవలా రచనకు ఒరవడి దిద్దిన 'చింతామణి' పత్రికే, 1896వ సంవత్సరంలో చారిత్రక నవలా రచనకు బహుమానాలు ఇవ్వడానికి నిశ్చయించి, దానికి వలసిన సూత్రాలను కూడా నిర్ణయించింది.

పయి సంవత్సరము వచన ప్రబంధములను వ్రాయదలంచు గొప్పవాడు భూగోళ, హిందూ చరిత్రాంశములతో గూడి యుండునట్లుగా కథను హృద్యముగా కల్పన చేసి వ్రాయవలెను. ఈ యంశములు లేని గ్రంథములకు బహుమానము లీయబడవు."

ఈ సందర్భంలోనే చరిత్రాంశాలు ఎలావుండాలో కూడా పత్రికాధిపతులే నిర్ణయించారు.

"కేవల చరిత్రము వ్రాయగూడదు. చరిత్రాంశములును, కాలములును సరియైనవిగా నుండవలెను. చరిత్రలో వచ్చువారు కాక కల్పిత పురుషులను

స్త్రీలును ఉండవచ్చును. చరిత్రాంశము లీయైదు కాలములలో నొకదానికి సంబంధించినవిగా నుండవలెను. (1) శ్రీ కృష్ణ దేవరాయల కాలము (2). అక్బరు లోనుగా గల చక్రవర్తులలో నొకని కాలము (3) శివాజీ మొదలగు మహారాష్ట్ర ప్రభువులలో నొకకాలము (4) ప్రతాపసింగు మొదలగు రాజపుత్ర సంస్థానప్రభువులలో నొకనికాలము (5) హైదరాలీ టిప్పు సుల్తానుల కాలము."

ఈ ప్రకటన చివర పత్రికాధిపతులు ఆ యా పోటీ రచయితలకు సలహాలనిస్తూ, తెలుగులో ఇటువంటి రచనలు ఇంతవరకు రాలేదు కనుక, "ముందుగా ఇంగ్లీషులో నున్నతార, సీత, అక్బర్, చాంద్ బీబీ, టిప్పు సుల్తాన్ మొదలైన హిందూదేశముతో సంబంధించిన ప్రబంధములను, స్కాట్, జూల్స్ వరన్స్ మొదలైన వారు రచించిన ప్రబంధములను కొన్నిటిని జదువుట మంచిదని తలంచుచున్నాము'' అని వ్రాశారు.

ఈ సూత్రాల నన్నింటినీ తరువాతి ముప్ఫయి సంవత్సరాలలో వచ్చిన తెలుగు చారిత్రక నవలలన్నీ అనుసరిస్తూ రావడం 'చింతామణి' పత్రికకు ఆనాడున్న ప్రభుతకు నిదర్శనం. ఈ పత్రిక చేసిన పొరపాటు వల్లనే తెలుగులో పరిశోధనాత్మకంగా చరిత్రను తరచిచూచి అందులోనుంచి నిజమైన సంఘటనలను పునర్నిర్మించడానికి రచయితలు ప్రయత్నించక, కేవలం చరిత్రను నామావశిష్టంగా పైపై మెరుగులకు మాత్రమే వాడుకొని, కల్పనాత్మకమైన కథలను (pseudo-historical) వ్రాశారనే ప్రథకు అవకాశం దొరికింది.

1900 వ సంవత్సరం వరకు నవలలు వ్రాసిన వారిలో చాలమంది సంఘ సంస్కరణప్రియులు కావడంతో ఆనాటిసంఘంలోని దురాచారాలను విమర్శించడానికి నవలను ప్రధాన సాధనంగా గ్రహించారు వారు. హేతువాదం ఆధారంగా మూఢవిశ్వాసాలను విమర్శించి, నూతనాదర్శాలైన స్త్రీ జనోద్ధరణ, జీవితం యెడ శాస్త్రీయ దృక్పథం, మనుష్యుల నడవడిలో నిజాయితీ వంటి సామాజిక పరమైన నైతిక విలువలకు ప్రాధాన్యాన్నిచ్చాయి, నాటి నవలలు, ఈ రచయితల్లో చాలమంది గోదావరీ తీరానికి చెందిన బ్రాహ్మణులు కావడం ఒక విశేషం. అందువల్లనే ఆనాటి మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాల ఆచార వ్యవహారాలను, వారి సమస్యలను ఎక్కువగా చిత్రించారు ఆరచయితలు.

ఈ విధంగా కందుకూరి ప్రారంభించిన ఓ ఉద్యమం, ఎందరో సహాయ సహకారాలతో దిగ్విజయం అయింది. తెలుగు నవల ఇరవయ్యో శతాబ్దం మలుపులో కొంత పుష్టినీ, కొంత బలాన్ని, కొంత బలగాన్ని పెంచుకొని కొత్త ఒరవళ్ళకు సిద్ధమై నిలిచి వుంది. మారుతున్న సమాజానికి అద్దం పడుతూనే, తాము చెడుగా భావించిన సాంఘిక విధానాలను దుయ్యబట్టే తెలుగునవల 1900-47 మధ్యకాంలో వచ్చే మార్పులకు సరైన పృష్ఠభూమిని సిద్ధం చేసిందన్న విషయం నిర్వివాదం.

ఇక ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో తెలుగు దేశంలోని రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వాతావరణాన్ని పరిశీలిస్తే ముఖ్యంగా నాలుగు లక్షణాలు ద్యోతకం అవుతాయి. (1) జాతీయభావ విస్ఫూర్తి (2) ఆంగ్ల విద్యావ్యాప్తి, తత్ఫలితంగా పరంపరానుగతంగా వస్తున్న వృత్తి విద్యలకు స్వస్తి చెప్పిన మధ్యతరగతి వారు ఆంగ్ల విద్య నభ్యసించి ఉద్యోగాలకై అన్వేషించడం (3) సంఘ సంస్కరణోద్యమాలు (4) పత్రికల, పుస్తక ప్రచురణ సంస్థల ప్రాబల్యం. నిజానికి ఈ నాలుగు ఒకదాని మీద ఒకటి ఆధార పడివున్న లక్షణాలు. ఈనాలుగూ తెలుగు నవలపై తమ ప్రభావాన్ని ప్రసరింపచేశాయి. చదువుకున్న, చదువుకుంటున్న మధ్యతరగతి ప్రజల కొత్త ఆశల్ని, విస్తృత మౌతున్న వారి వ్యక్తిత్వాన్ని ఈ లక్షణాలు వ్యక్తం చేస్తాయి.

రాజకీయంగా జాతీయోద్యమం 1905 లో జరిగిన బెంగాల్ విభజనతోనే ప్రజల్లోకి చొచ్చుకొనిపోయినా, విద్యాధికులలో 1895 ప్రాంతాలలోనే ఈ భావం అంకురించి వుంది. 1896 లో "చింతామణి" పత్రిక ప్రవేశపెట్టిన చారిత్రక నవలల పోటీ పరోక్షంగానైనా — ఆనాటి పరిస్థితుల ప్రభావమేనని చెప్పవచ్చు. అప్పటికే బహుళ ప్రాచుర్యం పొందిన బంకించంద్ర నవలలు 'చింతామణి' అధిపతులను ప్రోత్సహించాయి. రాజస్థాన మహారాజుల జీవితచరిత్రలను, శివాజీ చరిత్రను పోటీ రచనలకు పృష్ఠభూమిగా స్వీకరించాలని ఆ పత్రిక చేసిన నిర్ణయం అప్పుడే దేశంలో చెలరేగుతున్న దేశాభిమాన సంచలనానికి నాందీ రూపమే!

ఈ సంచలనానికి ఆనాటి పత్రికలు ఎంతో దోహదం చేశాయి. 187 నుండి 1899 వరకు దాదాపు పది పత్రికలు వెలువడి తెలుగుదేశం నలుమూలల్లో

కొత్త చైతన్యాన్ని రేకెత్తించాయి. 1902 లో కొండా వెంకటప్పయగారిచేత ప్రారంభింపబడి, తరువాత ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వాన వెలువడ్డ "కృష్ణాపత్రిక," 1904 లో చిలకమర్తి ప్రారంభించిన "దేశమాత" అటు రాజకీయ, జాతీయ భావాలను రేకెత్తించగా, 1880 లో పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వాన వెలువడ్డ "అపూర్వగ్రంథ చింతామణి"తోపాటు సరస్వతి (1896), హిందూసుందరి (1903), మనోరమ (1906), ఆంధ్రవారపత్రిక (1908) వంటి పత్రికలు సాహిత్యవ్యాసంగంతోపాటు సాంస్కృతిక పునరుజ్జీవనానికి కూడా దోహదం చేశాయి.

ఇదే సమయంలో పుస్తకప్రచురణ సంస్థలు కొత్తకొత్త పథకాలతో పాఠకులను ఆకట్టుకోవడానికి ప్రయత్నించి సఫలీకృతం అయినాయి. ఇందులో ముఖ్యమైంది విజ్ఞానచంద్రికా మండలి (1906). కొమర్రాజు లక్ష్మణరావుగారి ఆధిపత్యంలో ఉన్న ఈ సంస్థ చారిత్రక నవలారచయితలను ప్రోత్సహించింది. ఇటువంటి ఉన్నతాదర్శాలు కలదే ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల. 1900-1920 మధ్యకాలాన్ని తెలుగు చారిత్రక నవలాయుగమని, అనువాదయుగమనీ అంటే దానికి సరియైన దోహదం చేసిన సంస్థ ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలే ! వేంకట పార్వతీశ కవుల ప్రాభవంలో అయ్యగారి నారాయణమూర్తిగారి సంపాదకత్వాన నడిచిన ఈ గ్రంథమాల మౌలికమైన చారిత్రకరచనలనే కాక, అనువాదాలకు కూడా ప్రాముఖ్యమిచ్చింది. సరస్వతీ గ్రంథమండలి, వేగుచుక్క గ్రంథమాల వంటివి పాఠకుల ఆసక్తికి అనుగుణంగా పుస్తకప్రచురణ చేసి పఠనాసక్తి కలవారికి ఎంతగానో ఉపకరించాయి.

ఇటువంటి వాతావరణంలో ఎదిగిన తెలుగునవల జాతీయభావ స్ఫోరకమైన స్వతంత్ర చారిత్రక నవలలను వెలువరించడానికి ముందు, వానికి ప్రాతిపదికగా చారిత్రక నవలానువాదాలతో పరిపుష్టమైంది. ముఖ్యంగా చారిత్రక నవలలు, అపరాధపరిశోధక నవలల అనువాదాలు ఈ కాలంలో ఆధిక్యత కలిగి వుండడం వల్లనే ఈ యుగానికి అనువాదయుగం అన్న పేరు సార్థకమే ! చారిత్రక నవలల్లో ఓ. వై. దొరస్వామయ్య అనువదించిన "ఆనందమఠం"(1907), కనకవల్లి భాస్కరరావు అనువదించిన "ప్రఫుల్లముఖి"(1909), చాగంటి శేషయ్య అనువదించిన "రాధారాణి"(1910) వంటివి బెంగాలీనుంచి అనువదింపబడ్డాయి.

మళయాళంలో చాంద్ మీనన్ వ్రాసిన "ఇందులేఖ" దొడ్ల వెంకటరామరెడ్డి చేసిన "కళావతి"అన్న అనువాదం కూడా పేర్కొనతగ్గదే !

ఇదే కాలంలో ఆంగ్లచారిత్రక నవలానువాదాలకు కూడా ప్రాముఖ్యం వచ్చింది. కేతవరపు వేంకటశాస్త్రిగారి "ఐవాన్ హో" (1910) చెప్పుకో తగ్గది. ఈ కాలంలో వచ్చిన అనూదితనవలల సంఖ్యాధిక్యతను గమనిస్తే జాతీయభావస్ఫూర్తిని, దానిని వెలువరించే నవలలను కూడా మనం బెంగాల్ నుంచి దిగుమతి చేసుకొని, ఆ తరువాత దానికి మనదైన తెలుగుతనాన్ని ఆపాదించుకున్నట్లు స్పష్టమౌతున్నది.

ఈ శతాబ్దం మొదటి పది సంవత్సరాలలో జాతీయాభిమానాన్ని పరోక్షంగా వెలువరించిన చారిత్రకానువాదాలు వస్తే, రెండవదశకంలో చరిత్ర ఆధారంగా వ్రాయబడిన స్వతంత్రనవలలు అత్యధికంగా వచ్చాయి. శివాజీ విజయ పరంపరలలో ధరణీప్రెగ్గడ వెంకటశివరావు వ్రాసిన 'కాంచనమాల' (1908) యిట్టి నవలలకు శ్రీకారం చుట్టిం దనవచ్చు. వేంకట పార్వతీశకవుల "వసుమతీ వసంతము"(1911), ఎ.వి. నరసింహంపంతులు వ్రాసిన 'వసంతసేన'(1912) సత్యవోలు అప్పారావు వ్రాసిన 'పున్నాబాయి' (1913) వంటి ఎన్నో స్వతంత్ర నవలలు ఈ కాలానికి చెందినవే ! కేతవరపు వేంకటశాస్త్రిగారి మెడోస్ టేలర్ వ్రాసిన 'తార' అన్న ఆంగ్లనవలను 'తారాబాయి'గా తెనిగించారు.

ఇదే సమయంలో ఆంధ్రరాష్ట్రోద్యమానికి కొండా వెంకటప్పయ్య పంతులు ప్రభృతులు బీజాలు నాటారు. 1910 లో మద్రాసులో ప్రారంభమైన ఆంధ్రమహాసభ యీ ఉద్యమానికి ఒక స్పష్టమైన రూపం కల్పించింది. ఆంధ్రోద్యమం తెలుగురచయితలకు వెతుక్కోనక్కరలేకుండా దొరికిన మరో కథా వస్తువు. జాతీయోద్యమం ప్రభావంతో ఎలా పరోక్షంగా, చారిత్రక మహా పురుషులు దేశస్వాతంత్ర్యం కోసం పోరాడిన భారతీయచరిత్ర ననుసరించి వ్రాసిన నవలలు చూపితే, తెలుగుప్రభువుల వ్యక్తిత్వ సంప్రదాయాలు తెలుగువారి ప్రత్యేక అస్తిత్వాన్ని చూపుతున్నాయని, అందువల్ల తెలుగువారికి ప్రత్యేక ప్రతిపత్తి, గుర్తింపు ఉండాలని తెలుగుచరిత్రమీద వ్రాయబడ్డ నవలలు పరోక్షంగా చాటి చెప్పాయి.

దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రిగారి 'విజయనగర సామ్రాజ్యము' (1913), కేతవరపు వేంకటశాస్త్రిగారి 'రాయచూరుయుద్ధము'(1914), వేంకట పార్వతీశ కవులు శ్రీకృష్ణదేవరాయల కాలంలోని జీవితాన్ని ప్రతిబింబింపచేస్తూ వ్రాసిన 'ప్రమదావనము' (1914), శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "విష భుజంగము"(1917), భోగరాజు నారాయణమూర్తిగారి 'ఆంధ్రరాష్ట్రము'(1918) ఈ రకం నవలలో గణనీయమైనవి.

"నవ్యులకు చారిత్రక విజ్ఞానమును, నున్నతాశయములను గలిగించి యాంధ్ర జాతీయ ఘనతను లోకమున బ్రకాశము సేయనెంచు నాంధ్ర గ్రంధ కర్తల కాఖ్యాయికా రచన మవశ్యక ర్తవ్యము.... .... ఆంధ్రమున నింతవరకు ననేకాఖ్యాయికలు వెలసినవి గాని యిందొక్కటియు నాంధ్రుల వైభవమును బ్రకటించునది లేదు." అని 1914 లో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు విచారించారు. కాని 1920 వచ్చేసరికి దాదాపు ఇరవై నవలలు తెలుగు చరిత్ర ఆధారంగా రచించబడ్డాయి.

తెలుగులోని చారిత్రక నవలలలో చాలాభాగం తక్కువ చరిత్రతో ఎక్కువ కాల్పనికతను జోడించి వ్రాయబడ్డాయి. అవి భారతీయ చరిత్ర ఆధారంగా వ్రాసినా, తెలుగు చరిత్ర ఆధారంగా వ్రాసినా ఈ కాల్పనికత మాత్రం చరిత్రను తోసి రాజన్నది. నిజానికి ఈ నవలా పఠనంవల్ల నవలకు కొత్త పాఠకలోకం సృష్టింప బడ్డదన్నమాట నిర్వివాదం. అయితే ఇందులో చరిత్ర భాగం మృగ్యం కనుక దీనిని "ఆభాస చారిత్రకాలు" (Pseudo historical novels) అనవలసి వస్తుంది.

1900–1920 మధ్యకాలంలో వచ్చిన చారిత్రక నవలారీతుల్లో కనిపించినంత వినూత్నతా సాంఘిక నవలల్లో కూడా కానవస్తుంది. తరువాతి కాలంలో వచ్చిన విభిన్న భావవ్యక్తీకరణలకు, విస్తృతమైన కథావస్తువులకు ప్రాతిపదిక ఈ కాలంలోనే జరిగింది. ముఖ్యంగా పాశ్చాత్య ప్రభావంవల్ల, హేతువాద దృష్టి వల్ల సమాజంలో ఆనాటి సమస్యల జటిలత్వం రచయితలను వానిని చిత్రించడానికి ప్రోత్సహించింది. వితంతూద్వాహం, ప్రేమ పెళ్ళిళ్ళు, హరిజనాభ్యుదయం వంటి సంస్కారభావ ప్రతిపాదనలు మనకు ఈ నవలల్లో

కనిపిస్తాయి. 1908లో ప్రచురింపబడ్డ నేదునూరి గణేశ్వరరావు గారి "సుగుణవతీ పరిణయము" హిందూ వివాహధర్మ పరిణామాన్ని, జాతీయ విజాతీయ సంస్కార ప్రభావాన్ని ద్యోతకం చేసే నవల. అలానే హద్దనూరి గోపాలరావు వ్రాసిన "సుందరి" (1912) వితంతూద్వాహాన్ని గురించి చర్చించిన నవల శ్రీ క్రొత్తపల్లి సూర్యారావు 1912లోనే వ్రాసి ప్రచురించిన "కమల పాలిక" కమల అనే విద్యావతి ప్రేమించి పెళ్ళిచేసుకొని తద్వారా పడ్డ కష్టాలను చిత్రించింది.

19'3లో తల్లాప్రగడ సూర్యనారాయణ గారు వ్రాసిన "హేలావతి" హరిజనాభ్యుదయం మీద తెలుగులో వ్రాయబడిన మొదటి నవల. 1920లో వేటూరి శివరామ శాస్త్రిగారు "అహోబలీయం" కూడా జాతీయ దృక్పథాన్ని, హరిజనులపై జరుగుతున్న అత్యాచారాలను, కులాంతర వివాహ సమస్యను చిత్రించింది. వేంకట పార్వతీశ కవుల మాతృమందిరము (1919) కూడా ఇలానే వితంతూద్వాహాన్ని హరిజనాభ్యుదయాన్ని గురించి వ్రాయబడిన నవల. ఈ విధంగా చూస్తే గాంధీజీ రాజకీయ రంగం మీదకు అవతరించి హరిజనాభ్యుదయ కార్యక్రమాన్ని చేపట్టడానికి ఎంతో ముందుగానే తెలుగు నవలా రచయితలు సంఘాన్ని పట్టి పీడిస్తున్న ఈ సమస్యను వివిధకోణాలనుంచి పరిశీలించి దానికి తమకు వ్యక్తిగతంగా తోచిన సమాధానాలను తమ నవలలలో రూపొందించారు.

ఈ విధంగా ఈ యుగం (1900-1920) మధ్యకాలంలోని రచయితలు తొలియుగం (1872-1900) లోని రచయితలకు వలె 'చెడు'ను విమర్శించడమే ప్రధానంగా ఎంచక సామాజిక స్పృహగల సమస్యలను చిత్రీకరించి వానికి తగిన పరిష్కారాలను సూచించడానికి కూడా కృషిచేశారు.

ఈ అనువాద, చారిత్రక నవలా యుగం చివరి రెండేళ్ళలో వచ్చిన మూడు నవలలు రాబోతున్న కాలానికి మార్గదర్శకాలని చెప్పవచ్చు. ఇది మాతృ మందిరము, గణపతి, మాలపల్లి. మొదటి నవలలోని సమస్యలు సామాజిక మైనవి. వ్యక్తులు సమాజంలోని కట్టుబాట్లకు లొంగి ఉండి ఎట్టి కష్ట

నష్టాలకు లోనౌతారో యీ నవల చూపుతుంది. జాతీయతా భావం కులాంతర వివాహ సమస్య ఈ నవలలోని నాయకుడు రంగనికి ఎదురై నిలిచాయి. చివరకు ప్రేయసీ ప్రియులు ఈ జన్మకు యిలా ప్రేయసీ ప్రియులుగానే ఉండి పోవడానికి, తమతమ కులాలకు చెందిన వారని చేసుకోకుండా ఉండడానికి నిశ్చయించుకొంటారు. ఇది సమస్యకు ఉచితమైన పరిష్కారం కాదు. ఒకరకమైన పలాయనమే. కాని ఆ సమస్యను చిత్రించడంలోనే ఈయిద్దరి రచయితల ధైర్యం కనిపిస్తుంది.

చిలకమర్తి వారి గణపతి (1919) వ్యంగ్య రచన, ఇందులోని సమస్యలు వైయక్తిక మైనవి. ఒక నిర్భాగ్యుడైన బ్రాహ్మణుడు బ్రతుకు తెరువు కోసం బహుకృత వేషాలు ధరించడం యిందులో కథ. అతడు శవవాహనం చేసినా, బోగం మేళంలో కృష్ణ పాత్ర ధరించినా, అతని మాటలు, చేష్టలు, మాత్రం హాస్యజనితాలు కావు. 'గణపతి'లో చేష్టాగతమైన హాస్యమే కాని, భావగతమైన హాస్యం లేదు. 1920 ప్రాంతాల మధ్యతరగతి బ్రాహ్మణుల కుటుంబాలలో వచ్చిన కల్లోలాలకు యీ నవల నిదర్శనం. కులవిద్య పనికి రాకుండాపోయి, ఇంగ్లీషు చదువు అబ్బని గణపతి కథ కరుణనే కలుగచేస్తుంది కాని, హాస్యం కాదు. అయితే కథావస్తు స్వీకరణలో ఇది "రామచంద్ర విజయం" వలె ఒక వ్యక్తికి చుట్టు అల్లబడిన కథ మాత్రమే.

ఇక మూడవ నవల మాలపల్లి (1919-20). దీని రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ గారు "సుప్రసిద్ధాంధ్ర నాయకులు, సంస్కర్తలు, సాహిత్య విశారదులు, కార్యశూరులు." తాము జాతీయ రంగంలో చేపట్టిన ఒక సంఘ సంస్కరణ కార్యక్రమానికి అక్షరరూపం కల్పించారు ఉన్నవవారు ఈ నవలలో. హరిజనులన్న పేరును గాంధీజీ ప్రయుక్తం చేయకముందు అస్పృశ్యులుగాను, కడజాతివారుగాను చూడబడుతున్నవారినిగురించి నవల వ్రాయడం ఎంతో సాహసం ఆరోజుల్లో.

ఈనవల ప్రాముఖ్యానికి మరోకారణం ఇది వ్యావహారిక భాషలో వ్రాయబడడం. ఉన్నవవారు గుంటూరు జిల్లా మెట్ట తాలూకాల మాండలికాన్ని, తెలుగుల వ్యవహార భాషను వాడి భాషకు మహోపకారం చేశారు.

ఈ నవలలోని మరో ముఖ్యమైన లక్షణం అందులోని తెలుగుతనం. కేవలం గ్రామీణ జీవితాన్ని, అందునా అట్టడుగున ఉన్న గ్రామీణులను తీసుకొని వారి అభ్యుదయాన్ని కాంక్షిస్తూ వ్రాయబడిన రచనలలో ఇది ఉత్కృష్టమైనది. ఆంధ్రుల సహజ జీవనవిధానంతో పాటు, అగ్రవర్ణాలవారి అహంకారం కూడా ఇందులో వివరంగా వ్యక్తంచేశారు. "జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతివారికి మేమెక్కువను అభిమానముండదు. గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము అజన్మసిద్ధము. కడజాతికి అనహంకారము జన్మసిద్ధము."

ప్రేమకు మించిన సాధనం లేదని, సంఘసేవ చేయనిదే ఎవరూ దానిచేత పోషించబడడానికి అర్హుడు కాదని, ఆత్మోపలబ్ధికి కర్మయోగం ఉత్తమ మార్గమనీ చెప్పి యీ నవలను ఆధునిక గీతగా ప్రపంచించారు ఉన్నవ వారు.

## 1920 - 1947 వికాస యుగం

1920 నాటికి భారతదేశం అంతా ఒక రాజకీయంగా, సాంఘికంగా ఉత్తేజకరమైన పునర్నిర్మాణ కార్యక్రమంలో మునిగివుంది. 1919, 20 లలో గాంధీజీ ప్రారంభించిన సహాయనిరాకరణోద్యమం ఒక రాజకీయ సంచలనాన్ని కలిగించింది. అలాగే సాహిత్యంలోకూడా ఎన్నో కొత్త పోకడలు ప్రారంభమైనాయి. ముఖ్యంగా తెలుగుసాహిత్యం 1920-47 మధ్య ఒక నూతన వికాసాన్ని, ఉత్తేజాన్ని ఆవిష్కృతం చేసింది. దీనికి నాందీవాక్యం పలికింది నవ్యసాహిత్య పరిషత్తు. శివశంకరులు అధ్యక్షులుగా ఈ సంస్థ నవ్యకవిత్వానికి పట్టం కట్టింది. ఈ సంవత్సరాలమధ్య వచ్చిన తెలుగునవల కూడా నవ్యకవిత్వం వలెనే నూతన పంథాలో నడిచింది. రాజకీయ రంగంలో జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం ఎటువంటి సంచలనాన్ని కలిగించాయో, అలానే సాహిత్య రంగంలో కూడా వ్యావహారికభాషావాదం, నవ్యసాహిత్యోద్యమం, కాల్పనిక వాదం సంచలనాన్ని కలుగచేశాయి.

వ్యావహారిక భాషావాదానికి గిడుగు రామమూర్తిపంతులు నాయకుడు. పి. టి. శ్రీనివాస అయ్యంగారు, గురజాడ అప్పారావు ప్రభృతుల సహాయంతో

ఆయన యీ వాదానికి బహుముఖమైన ఆదరాన్ని సంపాదించే ప్రయత్నం చేశాడు. నవ్యసాహిత్యోద్యమానికి కాల్పనికవాదం పట్టుకొమ్మ. భావనకు, ఆత్మాశ్రయతకు ప్రాముఖ్యమిచ్చి, మానవతావాదాన్ని చాటే యీ ఉద్యమాన్ని భావకవిత్వ కవులు నడిపించారు. ఈ కాలంలోని నవలారచయితలలో కూడా యీ లక్షణాలన్నీ ద్యోతకం అవుతాయి. వీనికి తోడు యీ నవలారచయితలు చాలమంది తీవ్రవాదులు. తమ సిద్ధాంతాలకు అనుగుణంగా యితరులను మార్చాలన్న ఆతురత, ఒక భావ విప్లవాన్ని తీసుకొనిరావాలన్న ఆకాంక్ష, తమ భావాలపై తమకున్న నిశ్చితమైన, గాఢమైన అభినివేశం వీరిని తీవ్రవాదులను చేశాయి. ఈ కాల్పనికోద్యమానికి నవలా సాహిత్యంలో ప్రతినిధులు చలం, విశ్వనాథ, అడివి బాపిరాజు.

చలం పాశ్చాత్యనాగరికతమీద వ్యామోహం లేనివాడే అయినా, ఆ సాహిత్యంద్వారా స్త్రీ పురుషుల సంబంధాల విషయంలో భారతీయ పాశ్చాత్య దృక్పథాలలో వున్న తేడా తెలుసుకొన్నవాడు. తనచుట్టూ సంప్రదాయం పేరిట నీతిపేరిట జరుగుతున్న దుర్మార్గాలు ఆయనకు ఏవగింపు కలిగించాయి. అందువలన స్త్రీలకు స్వేచ్ఛ, స్వేచ్ఛాప్రణయం - అవి తప్ప సమాజకళ్యాణానికి మరొకటి పనికిరావన్నాడు.

చలం రొమాంటిస్ట్. స్వేచ్ఛ ఆయనకు ఊపిరి ముఖ్యంగా క్రిందటి తరంవాళ్ళు నీతిపేరిట స్త్రీలకు చేసిన అన్యాయాలకు విచలితుడై ఆ నీతిశాస్త్రాలకు, వానిని ఆదరించే సంఘపు కట్టుబాట్లకు ఎదురునిలిచాడు.

తన చుట్టూ ఉన్న సమాజం ఎలా పనికిమాలినదై, చేవ లేనిదై ఉన్నదని చలం అనుకున్నాడో, దానినుంచి మరో వినూత్నమైన సమాజాన్ని సృష్టించాలని కలలు కన్నాడో, విశ్వనాథకూడా అలానే భావించాడు. అయితే సమకాలీన సమాజం యింకా పటిష్ఠం కావాలంటే యీ సమాజపు నీతినియమాలను, కట్టుబాట్లను యింకా దృఢతరం చేయాలని విశ్వసించాడు విశ్వనాథ.

ఒక విధంగా ఇద్దరూ తీవ్రఅన్వేషులు. ఒకరు స్వేచ్ఛాన్వేషి. ఒకరు నైతిక జీవనాన్వేషి. వారు నమ్మిన అభిప్రాయాలయెడ వారికున్న అభినివేశంలోను, భాషమీద వారికున్న అధికారంలోను వారికి వారే సాటి.

మూడవవాడు బాపిరాజు. ఇతడు వైవిధ్య కళామూర్తి. కవి, కథకుడు, గేయకారుడు, శిల్పి. పై ఇద్దరికన్న విరుద్ధమైనవాడు. వారికున్నంత నిశితమైన భావన, తీవ్రత లేనివాడు. అయినా బాపిరాజులో తెలుగువాది తియ్యదనం ప్రతిబింబిస్తుంది. ఆయన వ్రాసిన నవలల కన్నింటికీ తెలుగుదేశమే కార్యస్థానం. ప్రాచీన, అధునాతన తెలుగుదేశచరిత్రకు రూపు కట్టేలా ప్రాణం పోసినవాడు బాపిరాజు.

విశ్వనాథ, చలం, బాపిరాజులలో మొదట నవలారచనకు పూనుకొన్నవాడు విశ్వనాథ. ఈయన 1918 నాటికే తన మొదటినవల 'అంతరాత్మ'ను వ్రాశాడు. భావవైశిత్యంలో, పద, వాక్యనిర్మాణంలో చలానికి ప్రత్యర్థిగా నిలచినవాడు విశ్వనాథ. చలానికన్న శిల్పంమీద ఎక్కువ మక్కువ చూపాడాయన. సంఘటనలను నిర్వహించడంలోను, కథకు ఆలంబనంగా ఉండే వర్ణనల్లోను, కథాకథనంలోను విశ్వనాథ అందెవేసిన చేయి. ఆయన యాభైకి పైగా నవలలు వ్రాశారు. అందులో చారిత్రకాలు, సాంఘికాలు, పురాణాల పునర్నిర్మాణాలు - ఎన్నో రకాలు ఉన్నాయి. అతి చిన్న నవలిక (హాహాహూహూ) నుంచి తెలుగులో అతి విస్తృతమైన "వేయిపడగలు" వ్రాసిన ఖ్యాతి ఆయనది. వాస్తవిక నవలల నుంచి, అధివాస్తవిక నవలల దాకా ఆయన రచనావైదగ్ధ్యం తెలుగునవలాసాహితి నంతా ఆవరించుకొన్నది. "ఏకవీర"లో ప్రేమసూత్రానికి పరాకాష్ఠ చూపిన విశ్వనాథ "బద్దన్న సేనాని"లో సంఘబద్ధం కాని ప్రేమపడే ఆరాటాన్ని, విషాదాన్నీ ప్రస్ఫుటంగా చూపాడు. "మా బాబు"వంటి కరుణమయగాథని, "విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు"వంటి వ్యంగ్యనవలని వ్రాసి శహబాష్ అనిపించుకొన్నాడు. సర్వతోముఖమైన విశ్వనాథ ప్రతిభకు "వేయి పడగలు" తార్కాణ. ఒకటేమిటి? తాను వ్రాసిన ప్రతి నవలనూ ఉత్కృష్టంగా తీర్చిదిద్దిన ప్రతిభ ఆయనది.

ఈ తరం రచయితల్లో చలం ప్రత్యేకమైన ప్రతిపత్తి గలవాడు. సంప్రదాయవాదులు ఆయనరచనలోని భావాలను విమర్శించినా, ఆయనశైలిని, పటిష్ఠమైన భాషాపాటవాన్ని కాదనలేకపోయారు. అలంకారాల పొదుగులు లేకుండా నిష్కర్షగా, డైరెక్ట్‌గా రాయడం చలం సొత్తు. 1926 లో చలం మొదటి నవల 'శశిరేఖ' వచ్చింది. ఆ తరువాత మైదానం, అమీనా, దైవమిచ్చిన భార్య వంటి

నవలలు వచ్చాయి. వీని అన్నింటిలోను చలం చాటి చెప్పదలుచుకొన్న విషయం స్వేచ్ఛాప్రణయం, వివాహవ్యవస్థలో కామగతమైన సంబంధాన్ని, ప్రేమరహిత మైన జీవితాన్ని విమర్శించి, కాదని తోసిపుచ్చి, స్వేచ్ఛతో స్త్రీ పురుషులు పర స్పరాకర్షణలతో, అర్థం చేసుకొన్న మనస్సులతో జీవితాలు గడపాలని చలం ఆశించాడు. అలా లేని స్త్రీ పురుషులు అటువంటి జీవితాన్ని వెతుక్కుంటూ వెళ్ళే అన్వేషణని నవలారూపంలో వెలువరించాడు.

చలం సృష్టించిన స్త్రీలందరూ సంఘంచేత వంచింపబడ్డవారు. పీడితులు. వారికి స్వేచ్ఛాజ్ఞానం కలగచేయడానికే ఆయన కలం పట్టాడు.

అయితే చలం కర్తవ్యానికి, బాధ్యతలకు ప్రాముఖ్యం యివ్వలేదు. ఆయన స్త్రీ పురుషులకు ఆకర్షణను మించిన ఆలోచన లేదు. తరువాత పిల్లలు పుట్టడం, వారి భవితవ్యం వాటిమీద నిశ్చితమైన, సృజనాత్మకమైన అభి ప్రాయాలు లేవు.

చలం రొమాంటిసిజమ్‌లో కూడా ఎదగడం కనిపిస్తుం దనుకుంటాను. మొట్టమొదట చలానికి శరీరాకర్షణ స్త్రీ పురుష సంబంధానికి మొదలూ, తుదీ కూడా. రెండోదశలో వీరి సంబంధం శరీరాకర్షణ దాటి సౌందర్యాన్వేషణ వైపుకు ఎదిగింది. ఆదర్శవివాహానికి హృదయాల కలయికే ముఖ్యం కాని శరీ రాలు కావంటాడు. మొదటిదశకు 'అమీనా,' 'మైదానం' ఉదాహరణ లైతే - రెండోదశకు ఉదాహరణ "దైవ మిచ్చిన భార్య." ఇక మూడవదశలో చలం మానసికమైన సౌందర్యానుభూతినే పరాకాష్ఠగా చూపాడు. ఆధ్యాత్మికతకు దగ్గ రగా ఉంటుంది యీ సంబంధం. ఇది నవలల్లోకన్న 'పురూరవ'వంటి నాటకా లలో, 'ఓ పువ్వు పూసింది' వంటి కథల్లో చూడవచ్చు.

యువకుల ఆదర్శమైన స్వేచ్ఛాగీతాల్ని పాడిన చలం వారికి ఆదర్శ ప్రాయుడైన రచయిత అయ్యాడు. తెలుగుభాషకు చలం యిచ్చిన పటుత్వం, భావాలకు కూర్చిన ఉద్వేగం - చలాన్ని రచయితగా కలకాలం నిలచేటట్లు చేస్తాయి.

ఇక బాపిరాజు - కాల్పనికోద్యమంలోని ప్రతిలలితమైన భావానికి అక్షర రూపం యిచ్చినవాడు. బాపిరాజు నవలల్లో నాలుగు ముఖ్యమైనవి. హిమబిందు, కోన గన్నారెడ్డి, నారాయణరావు, కోనంగి. ఇవి నాలుగూ తెలుగుదేశం తెలుగు వీరుల కథలే!

బాపిరాజు నవలల్లో ముఖ్యమైనది హిమబిందు. ఇది ఆంధ్ర శాతవాహనుల కథ. బౌద్ధ శకము 458లో ధాన్యకటకము రాజధానిగా ఆంధ్ర సామ్రాజ్యాన్ని ఏలిన శ్రీముఖ సాతవాహన చక్రవర్తి కథ ఆనాటి మత, రాజకీయ పరిస్థితులను, బౌద్ధ వైదిక ధర్మాలకు ఆనాడు ఉన్న స్పర్థలను అతి సహజంగా చిత్రించాడు బాపిరాజు. ఈయన వ్రాసిన రెండవ చారిత్రక నవల 'గోన గన్నారెడ్డి'. శ్రీశ్రీ రుద్రమహాదేవి ఆంధ్ర సామ్రాజ్ఞిగా ఉండగా ఆమెకు దక్షిణ హస్తంగా ఉండి వర్ధమాన పురం రాజధానిగా పశ్చిమాంధ్ర భూమిని ఏలిన ప్రసిద్ధ వీరుని గాథ.

బాపిరాజుగారి "నారాయణరావు" విశ్వనాథ "వేయిపడగలు"తో పాటు ఆంధ్ర విశ్వవిద్యాలయం బహుమతిని గైకొన్న నవల. జమీందారుల ఇళ్ళలోని ఆచార వ్యవహారాలు, మనస్తత్వాలు, సంఘర్షణలు ఇందులో వివరంగా వర్ణించబడ్డాయి. "కోనంగి" జాతీయోద్యమ ప్రభావాన్ని ప్రస్ఫుటంగా చూపిన నవల.

బాపిరాజు చారిత్రక నవలల్లో ఆనాటి చారిత్రక జీవితాన్ని పునర్నిర్మించే ప్రయత్నం కానవస్తుంది. ముఖ్యంగా వర్ణనలలోను, పాత్రలను మలచడంలోను ఈ చారిత్రకతను నేర్పుతో సాధించాడు బాపిరాజు.

ఇదే కాలంలో ప్రఖ్యాతులైన మరో ముగ్గురు రచయితలను ఇక్కడ తప్పక పేర్కొనాలి. వారు — మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారలు. వీరంతా తెలుగు నవలా సాహిత్యానికి, కథా సాహిత్యానికి ఎనలేని సేవచేశారు. మొక్కపాటివారి 'బారిష్టరు పార్వతీశం' 1925 లోనే ప్రచురింపబడ్డది. తెలుగులో చక్కని హాస్య నవలలు లేవన్న అపఖ్యాతిని తొలగించిందీ నవల. వీరి మరొక నవల 'ఏకోదరులు' (1931) మతాంతర వివాహాల్లోని బాధల్నీ, మానసిక మైన సాంఘిక మైన సంఘర్షణలని నేర్పుగా వర్ణించిన కరుణామయ గాథ.

మునిమాణిక్యంగారు ఆంధ్రులఇళ్ళలో కనిపించే తెలివి, సంస్కారమూ, ఒకింత స్వాభిమానమూ, హాస్య ధోరణి గల ఇల్లాలిని సృష్టించిన ధన్యుడు ఆవిడ పేరు కాంతం. ఈ కాంతంచుట్టు చాల కథలు అల్లారు మునిమాణిక్యం. కాని ఆయన వ్రాసిన 'దీక్షితులు', 'రుక్కుతల్లి' 'తిరుమాళిగ' మూడు కూడా హాస్యరస స్ఫోరకాలు కాదు. కథల్లో చూపిన మునిమాణిక్యానికి నవలల్లో

మునిమాణిక్యానికి సంబంధం లేదు. ఈ మూడుకూడా విషాదాంతాలు. సున్నితమైన హాస్యాన్ని చూపిన మునిమాణిక్యం మధ్యతరగతి తెలుగు జీవితాలలో విషాద భారాన్ని కూడా హృదయాలను కదిలించే విధంగా వెలువరించారు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి తెలుగు తనంమీద అభినివేశం చెప్పనలవికానిది. స్మశానవాటిక, మిథురానురాగము వారితొలి రచనలు. తెలుగు వారి చరిత్ర నుంచి గ్రహింపబడిన కథలు ఆధారంగా వ్రాయబడ్డవి. ఆతరువాత ఆయన 'ఆత్మ బలి', 'రక్షాబంధము', నవలలుకూడా రచించారు. ఈయన వ్రాసిన పెద్ద కథలని పిలువబడే నవలికల్లో "వడ్ల గింజలు," 'ఇల్లు పట్టిన వెధవాదబడుచు" వంటివి ప్రసిద్ధాలు.

1920-47 చివరి భాగంలో, ముఖ్యంగా రెండో ప్రపంచయుద్ధం పూర్తి అయ్యాక తెలుగు సాహిత్యంలో మరో నూతనాధ్యాయం ప్రారంభమైనదని చెప్పవచ్చు. తరువాతి యుగానికి ప్రాతినిధ్యం వహించగల రచయితల తొలి రచనలు 1944-47 మధ్యకాలంలో వచ్చాయి. కొడవటిగంటి కుటుంబరావు తొలి రచనలు ఇప్పటివే! ఇక గోపీచంద్ "అసమర్థుని జీవ యాత్ర", బుచ్చిబాబు "చివరకు మిగిలేది" కూడా 1947కు ముందు రచనలే! 1919-20లో తరువాతి తరంలోనికి అద్దంపట్టే రచనలు వచ్చినట్లే ఈ ముగ్గురు ప్రముఖ రచనలు కూడా ఈ యుగం చివరి రోజుల్లో వచ్చి రానున్న యుగ లక్షణాలను ప్రతిపాదించాయి. కుటుంబరావు వాస్తవిక రచనలు, గోపీచంద్ తాత్విక రచనలు, బుచ్చిబాబు మనస్తత్వాత్మక రచలు 1947 నుంచి ఈనాటివరకు వస్తున్న అసంఖ్యాకమైన నవలలకు మూలంగా చెప్పుకోవచ్చు. రచనా కాలాన్ని బట్టి ఈ నవలలు 1900-1947 మధ్యకాలానికి చెందినా, నిజానికి అవి తరువాతి ఆధునిక యుగానికి చెందినవి. అందువల్ల వానిని గురించిన చర్చ ఇక్కడ అప్రస్తుతం.



# తెలుగు కథానిక

— డి. వెంకట్రామయ్య

మనవాళ్ళు చాలా గొప్పవాళ్ళు.

ఆధునిక మానవుడి అపార విజ్ఞానానికి అపూర్వవిజయాలుగా మనం ఇవ్వాళ చెప్పుకునేవన్నీ మన పూర్వులు ఏనాడో సాధించారు. 'టెలివిజన్'లో ఎక్కడో జరిగింది, జరుగుతున్నది ఇక్కడ చూస్తున్నామని ఆశ్చర్య పోతున్నారా ? అక్కర్లేదు - జరిగిందీ, జరుగుతున్నదీ, జరగబోయేదీ కూడా పూర్వకాలపు మునులూ, పురాణ పురుషులూ 'దివ్యదృష్టి'తో చూడగలిగేవారు - వినలా ?

'టెస్ట్‌ట్యూబ్ బేబీ' అంటారా ? కుండల్లో పిండాలు దాచి పిల్లల్ని పుట్టించిన కథలు మన పురాణాల్లో పుట్టెడున్నాయి-చదవలా ? అంచేత మనవాళ్ళు చాలా గొప్పవాళ్ళు, తెలుగువాళ్ళు మరీనూ.

తెలుగు కథ ఎప్పుడు పుట్టిందీ అని ఒక్కమాట అడిగారంటే 'అనగనగా ఒకరాజు... ఆ రాజుగారికి ఏడుగురు కొడుకులు...'-అను కథ పుట్టినప్పుడే'- అంటా డొక విమర్శకాగ్రేసరుడు.

'కాదు ఇంకా అంతకంటే ముందే పుట్టింది...'బృహత్కథ' అసలు ప్రపంచ కథాసాహిత్యానికే మూలం...అది ప్రాకృతంలోనో పైశాచికంలోనో వుండొచ్చు....కాని అది రాసినవాడు అచ్చమైన తెలుగువాడు...అంచేత తెలుగు కథ అప్పుడే పుట్టింది...' అంటాడు మరో పరిశోధక చక్రవర్తి.

ఇవేంకాదు-ఆదిలో అచ్చులో వచ్చిన కథలేవీ అని అడిగితే-కాశీమజిలీ కథల నుంచి, కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'సత్యరాజా పూర్వదేశ

యాత్రలు' వరకూ ఎన్నో వున్నాయంటారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు 'రాజస్థాన కథావళి' రాశారు; పానుగంటివారు 'కథావల్లరి'; 'కథాలహరి' అనే పేర్లతో కథా సంపుటాలు వెలువరించారు. ఇక – మదనకామరాజు కథలు; మర్యాదరామన్న కథలు; శుకసప్తతి కథలు; తెనాలి రామలింగడి కథలు; ఇలాంటివన్నీ సరేసరి. ఇవన్నీ కాక- సి.పి. బ్రౌన్ అనే ఇంగ్లీషాయన-'తాతాచార్ల కథలు' అన్న పేరుతో-తనదగ్గర పనిచేసే ఒకానొక తాతాచార్లు గారు చెప్పిన కథలన్నీ గ్రంథస్థం చేశాడు.

ఇవన్నీ, ఇంతకుముందు చెప్పిన వాటిలో దాదాపు అన్నీ-ఇరవయ్యో శతాబ్దం ప్రారంభం కాకముందు వెలువడినవే.

అవన్నీ అలా వదిలేసి, అసలువిషయానికొస్తే-'కథానిక'అనీ,'చిన్నకథ' అనీ తెలుగులోనూ, 'Short Story' అని ఇంగ్లీషులోనూ మనం అనుకునేది నిర్దిష్టమైన లక్షణాలు గల ఒక సాహిత్యప్రక్రియ. నిక్కచ్చిగా ఇది ఆంగ్ల సాహిత్య సంపర్కం వల్లనే తెలుగులోకి వచ్చింది.

అచ్చంగా వచనంలో వచ్చిన మొదటి తెలుగు నాటకం 'కన్యాశుల్కం' అవునో కాదో గాని - అచ్చంగా వాడుకభాషలో వచ్చిన మొదటి నాటకం మాత్రం అదే. అదేవిధంగా ఆధునిక మని చెప్పకోదగ్గ మొదటి తెలుగు కథ- 'దిద్దుబాటు'. కన్యాశుల్కం రాసిన మహాకవి గురజాడ అప్పారావే ఈ కథ కూడా రాశాడు.

"దిద్దుబాటు"అన్న కథానిక 1910 లో "ఆంధ్ర భారతి" అన్న పత్రికలో అచ్చయింది. అప్పారావుగారు మొదట ఈ కథని గ్రాంథికంలో రాసి, తర్వాత వ్యావహారికంలోకి మార్చి, మంచిపని చేశారు.

"I believe my play in the first ambition work in the spoken dialect and certainly it has not failed......" అని, గురజాడ వారే స్వయంగా కన్యాశుల్కం రెండో ఎడిషన్‌లో రాసుకున్నారు. ఆమాట అక్షరాలా నిజమే. అయితే ఆ తర్వాతనే రాసిన "దిద్దుబాటు" కథలో కన్యాశుల్కంలో

వున్నంత అసలు సిసలైన వ్యావహారికం కనబడదు - మొదట గ్రాంథికంలో రాసి, ఆ తర్వాత మార్చటంవల్ల కావచ్చు.

అప్పారావుగారు "కన్యాశుల్కం" మొదటికూర్పు సాధించిన విజయం గురించి రాస్తూ - "The Press gave it a cordial reception and hailed it as an event in the History of Telugu literature, and men, women and children read it with interest. The only reception was Mahamahopodhyaya K. Venkataratnam Pantulu Garu, who cannot stand two things in this otherwise perfect world - social reform and spoken Telugu" - అంటారు. అంటే వాడుకభాషమీదా, సంఘసంస్కరణమీదా తనకున్న అభిమానాన్ని వ్యక్తపరుస్తూ ఆ రెండూ గిట్టని కొక్కొండ వెంకటరత్నం పంతులుగారికి ఒక చురక తగిలించారు.

"కన్యాశుల్కం" మొదటికూర్పు 1897 లోనూ, రెండో కూర్పు 1909 లోనూ వెలువడగా - "దిద్దుబాటు" కథానిక 1910 లో అచ్చయింది. ఈ కథ ఏదో పత్రికలో అచ్చయినా, కన్యాశుల్కం నాటకం మాత్రం అప్పారావుగారే స్వయంగా అచ్చేసుకోవలసివచ్చింది — అందుకు విజయనగరం మహారాజావారో, మరొకరో డబ్బిచ్చారనుకొండి - అది వేరే సంగతి.

"In the Telugu Country an author has generally to be his own publisher and book-seller. There is no book-selling enterprise, and what book reading enterprise then is, is due entirely to the exersions of that venerable body, to the Board of Studies !"— అని కన్యాశుల్కం పీఠికలో అప్పారావుగారు రాశారు.

అంతటితో వూరుకోకుండా, అప్పటి విద్యావ్యవస్థమీద కూడా ఒక బాణం విసిరారు -"The Christian Gospels do not speak of an eleventh commandment - 'Thou shalt read,' but it is given to the Telugu Board of Stuhies, to command - 'Thou shalt read,' and straight throusands of unfortunate young men read books, that no mortal can read with profit or with pleasure"— అని కూడా ఆ పీఠికలో రాశా రాయన.

ఆనాటి సాంఘిక దుస్థితులు, దురాచారాలే అప్పారావుగారిని కన్యాశుల్క నాటక రచనకి ప్రేరేపించాయి. విజయనగరం మహారాజావా రంతకు పదేళ్ళ క్రితం ఒకసారి కన్యాశుల్కం యిచ్చి పుచ్చుకునే వివాహాల గురించీ, బాల్య వివాహాల గురించీ ఒక చిన్న సర్వేలాంటిది చేయించారట. ఆ సర్వే ప్రకారం విశాఖపట్నం జిల్లాలో ఏడాదికి సగటున-344 పెళ్ళిళ్ళయితే-అందులో 99 మంది వధువులు-అయిదేళ్ల వాళ్ళు; 44 గురు నాలుగేళ్లవాళ్ళు; 36గురు మూడేళ్ల వాళ్ళు; ఆరుగురు ఆడపిల్లలు-రెండేళ్ళవాళ్లు; ముగ్గురు-ఒక్క ఏడాది వయసు గలవాళ్ళు !

అప్పారావుగారిని ఈ ఘోరం కదిలించి, 'కన్యాశుల్కం' లాంటి గొప్పనాటకం రాయించింది. అయితే ఆతర్వాత సుమారు పదేళ్ళకి రాసిన 'దిద్దుబాటు' కథ అంత గొప్పది కాదు. అయినా ఆరోజుల్లో అది-వస్తువులోనూ రూపంలోనూ కూడా కొత్తదనాన్ని చూపింది. కట్టుకున్నదాన్ని మరచిపోయి, అర్ధరాత్రిదాకా అడ్డమైన తిరుగుళ్లూ తిరిగే ఒక పెద్దమనిషి-ఒకనాడలాగే ఆలస్యంగా యింటికి వెళ్ళి, ఇల్లాలు కనబడక కంగారుపడి, ఆవిడ పుట్టింటి కెళ్ళి పోయిందన్న పైనం విని, పశ్చాత్తాపపడి, సేవకుణ్ణి భార్యవద్దకు రాయబారం పంపే ప్రయత్నంలో వుండగా-అంతసేపూ నాటకమాడిన ఆ యిల్లాలు మంచం కిందినించి మధురంగా నవ్వుతుంది-ఇదీ కథ.

"తలుపు ! తలుపు !

తలుపు తెరవబడలేదు. ఒక నిమిష మత డూరుకొనెను....గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టినది...."-అంటూ ఆసక్తికరంగా ప్రారంభమైన కథ,-ఉత్కంఠమ కలిగిస్తూ కించిత్తు హాస్యాన్ని జోడిస్తూ-అంతట మంచముక్రింద నుండి అమృతనిష్యందిని యగు కలకల నగవును, కరకంకణముల హృద్యారావమును విన నయ్యెను"-అంటూ అద్భుతమైన కొస మెరుపుతో ముగుస్తుంది. గురజాడవారి కథల్లో- దీనికంటే, "మనుషులు చేసిన దేవుళ్ళారా, దేవుడు చేసిన మనుష్యులారా మీపేరేమిటి"? 'సంస్కర్త హృదయం'; 'మెటిల్డా' మొదలైన వింకా మంచి కథలు; మరింత ప్రయోజనం గల కథలు. 'పెద్ద మసీదు' అనేది అసంపూర్తి రచన. అప్పారావుగారు అన్నీ కలిపి అయిదారు కథల కంటే ఎక్కువ రాయలేదు.

ఇంచుమించు 'దిద్దుబాటు' కథ వెలువడిన సమయంలోనే ఆంధ్రదేశంలో అక్కడక్కడా కొత్త పత్రికలు పుట్టడం, వాటిలో ఎడనెడా కథలు అచ్చు కావటం ప్రారంభమైంది. ఆరోజుల్లో 'ఆంధ్రభారతి' 'త్రిలింగ' మొదలైన పత్రికల్లో కథలు వేసేవారు. 1910 లో 'సాహితి' పత్రిక ప్రారంభమైంది.

తల్లావఝుల శివశంకర శాస్త్రిగారి-'సువర్ణరేఖ' కథలు, 'మదరాసు కథలూ' ఆరోజుల్లోనే అచ్చయినాయి మాడపాటి హనుమంతరావుగారు రాసిన "మల్లికా గుచ్ఛం' అను కథల సంపుటికూడ ఆరోజుల్లోనే వెలువడింది. హను మంతరావుగారు - "హృదయ శల్యం"; "ముసలిదాని ఉసురు"; "అగ్ని గుండం" మొదలైనవి పది పన్నెండు కథలు రాశారు.

"సూరీ సీతీ వెంకీ" పాత్రల సృష్టికర్త చింతా దీక్షితులుగారు- తెలుగు కథ చేత ముద్దు ముద్దు మాటలు పలికించి, ముచ్చటగా మూడు నాలుగడుగులు వేయించారు. ఆయన రాసిన "దాసరిపాట"; "గోదారి నవ్వింది" "చెంచురాణి" "మొదటి బహుమానం" వంటివి తేలిగ్గా మర్చిపోలేని మంచి కథలు.

ఆధునిక తెలుగు కథకి ఆద్యుడు గురజాడ అనుకున్నా, ఆ కథకి అపురూపమైన అందాన్ని చేకూర్చి, ప్రామాణికతనీ, పరిపూర్ణతనీ కలిగించి, తెలుగు కథకుల్లో అగ్రగణ్యు లయిన అయిదారుగురిలో ఒకరు - శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. 1891లో పుట్టి, 1961 లో మరణించిన ఈ మహా రచయిత కథలు దాదాపు అన్నీ కూడా స్వాతంత్ర్య పూర్వం వచ్చినవే. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పండితుడు; అయినా ఆయన భాష అతి సరళం; ఆయన శైలి అతి సుందరం; ఆయన శిల్పం అనితరసాధ్యం. ఆయనవి అన్ని విధాలా అచ్చమైన తెలుగుకథలు. ఆనాటి సాంఘికదురాచారాలను ఆయన అద్భుతంగా తనకథల్లో చిత్రించారు. ముఖ్యంగా ఆనాటి బ్రాహ్మణ కుటుంబాల్లోగల ఛాందసత్వాన్నీ,అపనమ్మకాలనీ అర్థంలేనిఆచారాలనీ,హద్దులుదాటిన మౌఢ్యాన్నీ, అద్దంలో చూపించినట్టుగా వుంటాయి ఆయన కథలు. ఈ దురాచారాలనూ, దుర్నీతినీ ధైర్యంగా ఎదుర్కొన్న పాత్రలు అనేకం ఆయన సృష్టించారు. "చిన్న కథలు" అన్న పేరుతో ఆయన రాసినవన్నీ పెద్ద కథలే. అయినా ఆ విస్తరణ విసుగు కలిగించదు; కథ మొదలెడితే చివరంటా చదవాల్సిందే.

"వడ్లగింజలు"; "రాచపీనుగు తోడు లేకుండా వెళ్ళదు"; "గులాబీ అత్తరు" "ఇల్లుపట్టిన వెధవాడపడుచు"; "కలుపు మొక్కలు"; "కీ తెరిగిన వాత"; "అరికాళ్ళకింద మంటలు"; "మార్గదర్శి" మొదలైన వన్నీ ఆయన రాసిన అద్భుతమైన కథలు.

'మార్గదర్శి, 'కలుపుమొక్కలు' మొదలైన కథలు పూర్తిగా సంభాషణా రూపంలో నడుస్తాయి. మధ్యలో రచయిత మాట ఎక్కడా వుండదు. 'వడ్లగింజలు'....'రాచపీనుగు...' మొదలైన వన్నీ రాజులకాలంనాటి కథలు.

"ఒక్క అడుగు వేస్తే దివాన్జీ కనబడుతాడు. అత డొక్కమాటు తమ కేసి చూస్తే చాలు నని ఆత్రపడుతూనూ, అతని కటాక్షం ఆశించీ, అతని అనుగ్రహం కోసం ఎదురుచూస్తూ అతని ఆలంబనం నమ్ముకునీ, అతని చేత 'సరే' అనిపించుకోడానికి తగ్గ ఎత్తు లాలోచించుకుంటూనూ, అయినా అతని లోభగుణం మాత్రం లోపల్లోపల గర్హించుకుంటూనూ, ఆ గదిలో పరివేష్టించి వుండిన ఆశ్రితులూ, పౌర ప్రముఖులూ, రాజబంధువులూ, రాజపురుషులూ కొంద రక్కడికి కనబడుతున్నారు.

వారిలో కొందరు తనకేసిన్నీ చూశారు. అలాంటి చోట మంచుని, మొదట వొఖమాటు గదిలోకి తొంగిచూసి, తరవాత నిటారుగా నించుని, నుంచున్న వెంటనే తాపీగా రెండు చేతులూ చాపి, గభీమని బిరడా తీసి, సీసా గాలివాటాన పెట్టాడు-మకురల్లీఖాను-తల వెనక్కి విరుచుకుంటూ."

ఇది శ్రీపాదవారి 'గులాబీ అత్తరు' ఘుమఘుమ.

కవిగా పేరుమోసిన కవికొండల వెంకటావుగారు కథలు కూడా రాశారు. 'సుమనోహ్లాదిని' అన్నది వీరి కథల సంపుటి. "తోలు బొమ్మలు"; "మట్టెల రవళి" ; "బ్యూటీ అండ్ డ్యూటీ" మొదలైనవి వీరి ప్రసిద్ధ కథలు.

వేలూరి శివరామశాస్త్రిగారు ఉద్దండపండితుడు. అయిదారుభాషలు ఆయనకు కొట్టినపిండిగా వచ్చు. "కథాషట్కము"; "కథాసప్తకము" అను పేర్లతో వీరి కథా సంపుటాలు వెలువడినాయి. అవిగాక ఇంకెన్నో కథలు ఇతర భాషల

నుంచి కూడా అనువదించారు. 1939-45 మధ్యకాలంలో రెండో ప్రపంచ యుద్ధం జరిగింది. ఆ కాలంలో తీవ్రమైన ఆర్థికమాంద్యం ఏర్పడింది. ఆ దెబ్బకి ఎన్నోమధ్య తరగతి సంసారాలు కుప్పగా కూలిపోయాయి. ఒకప్పుడు సంసారపక్షంగా బతికిన వాళ్ళుకూడా కూలీనాలీ చేసుకునీ, అడుక్కుతినీ బత కాల్సిన పరిస్థితులు ఏర్పడినాయి.

ఆ రోజుల్లో నిరుద్యోగి, విద్యావంతుడూ అయిన ఒక యువకుడి సంసారాన్ని తీసుకుని-'డిప్రెషన్ చెంబు' అనే పేరుతో శివరామశాస్త్రిగారు గొప్ప కథ రాశారు.

'బారిష్టరు పార్వతీశం' రచయితగా తెలుగు దేశమంతటా తెలిసిన మొక్కపాటి నరసింహశాస్త్రిగారు - నవలలూ నాటికలే కాక-హాస్యరసపూరితా లయిన కథలు కూడా రాశారు. "ప్రతిబింబాలు;" "విన్నవి-కన్నవి"-ఈయన కథా సంపుటాలు. "చిత్రం"; గత్యంతరం"; "మహత్తు"; "చావుతెలివి" "భిక్షువు" అన్నవి వీరికథల్లో ఎన్నదగినవి.

1930 నాటికే "చలం" అన్న మూడక్షరాల పేరు ఆంధ్రదేశాన్ని ఆదర గొట్టింది; ఆంధ్ర సాహితీ లోకంలో అపూర్వమైన సంచలనాన్ని రేపింది' అప్పటిదాకా కవు లనుకునేవాళ్ళు, కథకు లనుకునేవాళ్ళు, మహారచయిత లనుకునే వాళ్ళు తమ మొహాలూ తోకలూ వెతుక్కోవలసి వచ్చింది. సంప్రదాయ బద్ధులూ; సదాచార సంపన్నులూ, పెత్తందార్లూ, అతి పెద్దమనుషులూ, అంతా కూడా గుండెలు బాదుకున్నారు; గుసగుసలాడుకున్నారు; గొంతెత్తి అరిచారు; అదేపనిగా తిట్టారు; చాటుగా మాత్రం చలం పుస్తకాలు మాటిమాటికీ చదువు కున్నారు.

గుడిపాటి వెంకటచలం అన్నది ఆధునిక తెలుగు సాహిత్యంలో మామూలు పేరుకాదు-అది ఒక మహాశక్తి; దాదాపు యాభయ్యేళ్ళపాటు తెలుగు పాఠకుల్ని ఊపివేసిన, పాతనంతా ఊడ్చివేసిన ఒక మహా ప్రభంజనం.

ఆధునిక తెలుగు సాహిత్యంలో అసమానులై, అపూర్వ ప్రతిభా వంతులై, ఉద్యమకారు లని చెప్పదగ్గ రచయితలు ముగ్గురే ముగ్గురున్నారు-

విశ్వనాథ; శ్రీశ్రీ; చలమూనూ. విశ్వనాథ మూడువందల ఏళ్ళక్రితం దావాల్సి నంత ముదుసలి ; శ్రీశ్రీ వర్తమానకాలానికి భవిష్యద్వర్తమానాన్ని అందించే మహాకవి; చలం-వందేళ్ళు ముందుగా పుట్టిన మహా రచయిత. శాపగ్రస్తుడై తెలుగుదేశంలో పుట్టిన మహర్షి; మహాప్రవక్త.

చలం సాహిత్యాన్ని విమర్శించడానికి విశ్లేషించడానికి ఏ కొలత బద్దలూ పనికిరావు. చలం నాటకాలు గొప్పవా, నవలలు గొప్పవా, కథలు గొప్పవా అంటే ఏమీ చెప్పలేం.

చలం రాసిన కథలు కొన్నివంద లుంటాయి. ఇంకో వందేళ్ళు పోయినా మాయనిమణులు, మారనిసత్యాలూ వాటిలో చాలా వున్నాయి. వాటిలో అధిక భాగం ఆడదాని అభ్యుదయాన్ని కాంక్షించేవే ; స్త్రీస్వేచ్ఛని ప్రోత్సహించేవే; ఆమెసంకెళ్ళు తెంచేవే—అయినా యింకా అనేకానేక విషయాలగురించి చలం కథలు రాశాడు.

ఆయనభాషనీ శైలినీ శిల్పాన్నీ తూయగల పడికట్టురాళ్ళు లేవు. చలం చేతిలో తెలుగుభాష కొత్తవెలుగులు చిమ్మింది; పదును తేలింది; నిశితమైంది; నిప్పులు కక్కింది.

మనుషుల్లో వుండే దొంగబుద్ధుల్నీ, నీచత్వాన్నీ, లేకితనాన్నీ, సమాజాన్ని పట్టి పీడించే దురాచార, దుస్సంప్రదాయాలనూ, చలం తనరచనల్లో నిర్దాక్షిణ్యంగా చీల్చిచెండాడాడు.

చలం నేలవిడిచి సాము చేశాడనీ, సామాజికసమస్యల పరిష్కారానికి సరియైన మార్గం చూపించలేకపోయాడనీ, అందులో కొంత నిజమున్నా, నిప్పు లాంటి నిజాయతీ చలంరచనలకి బూజు కమ్మకుండా చెదలుపట్టకుండా చేసి, మిగతారచయితలకంటే ఎన్నటికీ ఎత్తునే నిలబెడ్తుంది.

'పాపం' 'కళ్యాణి'; 'ఓషవ్వపూసింది'; 'కర్మమిట్లా కాలింది'; "కన్నీటి కాలువ"; "చలంగారి కలం"; "అదృష్టం"; 'స్టేషనుపంపు'; 'అరాత్రి; 'ఆత్మార్పణ'-ఇవన్నీ చలం కథామణిహారాలు.

"ఓపువ్వు పూసింది' అన్నకథా, యితరరచనల్లో ఆయనచేసిన వర్ణనలూ, రచించిన పదచిత్రాలూ చలాన్ని మామూలు వచన రచయితగానే కాక కవిగా కూడా నిలబెట్టాయి. చలానిది కవితాత్మ!

"ఉత్సవాలు; వాయిద్యాలు; అరుపులు; సంతోషాలు; పాడుస్తున్నారు; తోరణాలు కడ్తున్నారు; జయజయధ్వానాలు చేస్తున్నారు. ప్రతిమబ్బుకి రంగుల్ని అలంకరిస్తున్నారు....ఆత్రుతగా సంతోషాన్ని ఆపుకోలేక అటూయిటూ పరుగెత్తుతున్నారు-అనిలకుమారులు-దుమ్ము దులుపుతూ, అందర్నీ మేలుకోమంటూ, ఎండిన ఆకుల్ని దూరంగా తోసేస్తో-చెట్లు గాలిలోకి నోళ్ళు తెరుచుకుని ఆరగిస్తున్నాయి ప్రథమభోజనాన్ని. కాంతి కాంతి ప్రపంచమంతా కాంతి. ఆకాశాన్నంతా ఆనందంతో నింపుతో కాంతి అలలమల్లే కాంతి విరుచుకుపడుతోంది లోకంమీద....".

ఇది-'ఓపువ్వు పూసింది'లో ఓ ఘట్టం 'on small a night as this...' అని ఆగాడు రాజయ్య ఉమ్మేసుకోడానికని కిటికీ తెరిచి వెన్నెలవంక చూస్తో.

ప్రేమ ఎంతో అనవసరమనీ అదో బూర్జువా జబ్బనీ, డబ్బూ, ఘనతా కుటుంబాభ్యుదయమే ఆదర్శమనీ, ఎంత ఎందరుమొత్తుకున్నా వినక, ఆ కార్తీక మాసపురాత్రి-వెన్నెల-రాళ్ళని చలవరాళ్ళుగా మురుగుకాలవల్ని తేటనీటి సెలయేళ్ళుగా, చీకటిగొందుల్ని ఆకాశమార్గాలుగా, చివరికి అభ్యుదయాసక్తమైన ఇరుకుహృదయాల్ని కూడా కలల్లోకి చిగిర్చేట్టు చేస్తోంది..." ఇది "ఆరాత్రి".

పాషాణ పాక ప్రభువుగా పేరొందిన విశ్వనాథకవి సమ్రాట్టు శిష్ట వ్యావహారిక మనదగ్గ వాడుకభాషలో కథలుకూడా రాశాడు. "నీ రుణం తీర్చుకున్నా, 'ఏమి సంబంధం'మొదలైన కథలు విశ్వనాథ సత్యనారాయణ చిన్నకథలు అను పేరుతో ఒక సంపుటంగా వెలువడ్డాయి. విశ్వనాథవారి కథలు 'వేయి పడగలు' 'మా బాబు' 'జేబుదొంగలు' 'ఏకవీర' వంటి నవలలకీ, ఆయన రాసిన కావ్యాలకీ పోల్చదగ్గవి కావు.

"ఆవిడకూతురు అప్పటికే పదేండ్లపిల్ల. కాలిపొడగరి. చిదిమి దీపం పెట్టవచ్చు. తల్లి చాలా భారీమనిషి. ఆ అమ్మాయికూడా పెద్దదైతే తల్లి యంతది

బొతుందిలాగా వుంది పుష్టిగల పిల్ల, చేతులు పొట్లాలల్లే వున్నవి......" ఇలా సరళమైన శైలిలో సాగుతుంది—విశ్వనాథవారి "ఏమి సంబంధము" అనే కథ.

"నారాయణరావు, కోణంగి, హిమబిందు" వంటి నవలలతో అతి ప్రసిద్ధుడైన అడివి బాపిరాజుగారు - కవి, గాయకుడు, చిత్రకారుడే కాకుండా కథకుడు కూడాను. ఆయనకథల్లో "భోగీర లోయ, వీణ, వసుబాలుడు" మొదలైనవి ప్రధానమైనవి.

తన రచనల్ని సాంఘికచైతన్యానికీ, రాజకీయచైతన్యానికీ సాధనాలుగా వాడిన సురవరం ప్రతాపరెడ్డిగారు — తెలంగాణాసాహితీలోకంలో సుప్రసిద్ధులు. నిజాం నిరంకుశపాలనలో మగ్గుతున్న నాటి తెలంగాణాప్రజల జీవితాన్ని ఆయన తమకథల్లో ప్రతిభావంతంగా చిత్రీకరించారు.

"నిరీక్షణ, పెండ్లిబేరము, చంద్రయ్య భీమా" మొదలైన కథలూ; "మొగలాయీ కథలు" అన్న పేరుతో వచ్చిన కథలూ ప్రతాపరెడ్డిగారి కథల్లో ఎన్నదగ్గవి.

కవీ, పండితుడూ అయిన అబ్బూరి రామకృష్ణారావుగారూ, కవయిత్రి కనుపర్తి వరలక్ష్మమ్మగారూ కూడా స్వాతంత్ర్య పూర్వకాలంలో కొన్ని కథలు రాశారు. రామకృష్ణారావుగారి సూర్యరాజుకథలూ, వరలక్ష్మమ్మగారి "మావూరు, పెంచిన ప్రేమ" మొదలైన కథలూ ఆనాటి మంచికథల జాబితాలోకి వస్తాయి.

గురజాడవారి గిరీశం, మొక్కపాటివారి పార్వతీశం మాదిరిగానే — మునిమాణిక్యంవారి కాంతం కూడా తెలుగుపాఠకులు మర్చిపోలేని పాత్ర. మధ్యతరగతి సంసారాల్లో గల కష్టసుఖాలూ, ఒడిదుడుకులతో పాటు — చిరునవ్వుల గురించీ, చిన్న చిన్న సుఖాలగురించీ మెత్తటిభాషతో, సున్నితమైన హాస్యంతో మధురమైన కథలు రాశారు—మునిమాణిక్యం నరసింహారావుగారు. ఈ రకమైన కథావస్తువు తీసుకుని ఇంత రమ్యంగా, హృద్యంగా రాసింది మునిమాణిక్యం వారే. ఆయనశైలి, ఆయనహాస్యం అన్నీ కూడా ప్రత్యేకమైనవి. అనాటికథకుల్లో ఆయన అతి ప్రసిద్ధుడు.

శ్రీ వాల్మీకి రామాయణానికి రసభరితమైన అనువాదం చేసి పేరుతెచ్చు కున్న శ్రీనివాసశిరోమణిగారు కొన్ని కథలుకూడా రాశారు. "పంచవటి"ఆయన కథల సంపుటి.

ఆట్టే పేరు లేకపోయినా, అరుదుగా రాసినా ఆ రోజుల్లో మంచి కథలు రాసినవారిలో "కరుణమయా" ఒకరు. ఆయన అసలు పేరు కందుకూరి అనంతం. పల్లెటూరి ప్రజలు, ముఖ్యంగా పీడితులూ తాడితులూ అయిన ప్రజల జీవితాల గురించి ప్రజలభాషలోనే రాసిన రచయిత ఈయన. "సన్న జీవాలు, కరుణ మయా కథలు"- ఈయన కథాసంపుటాలు. కరుణమయా కథలు చాలమటుకూ కరుణారసభరితాలు.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారిపేరు వినగానే "మల్లెపూలు, మంచి గంధం" మనసులో పరిమళిస్తాయి. మలయమారుతం మందమందంగా వచ్చి తాకుతుంది. పట్టుతేనెలూ, మిగలబండిన మామిడిపళ్ళరసాలూ గుర్తుకొచ్చి నోరూరుతుంది. అచ్చతెనుగుభాషని అందంగా అలంకరించి అందలమెక్కించిన కథకుడు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు. చలం, శ్రీపాద ల తర్వాత అంత విశిష్టమూ, విలక్షణమూ అయిన శైలి మల్లాదివారిదే. తలలు బోడులైనా తలపులు బోడులు కాని తాతలూ, సరససంగీత శృంగారవార్నిధులైన వారకాంతలూ మల్లాదివారి కథల్లో ఎక్కువగా కనబడతారు. ఈయనకూడా వందకిపైగా కథలు వ్రాశారు. "స్వరమేళ, చెంగల్వ, సర్వమంగళ, మణిదీపాలు, అల్లోనేరేడు" మొదలైనవి ఈయన కథాసంపుటాలు.

"సిక్కని సిగురుల్లో పొద్దు వాటారింది. సింతల్లతోపులో సీకటి వొడి చింది. పికిలిపిట్ట పల్లకుంది; సిలక రెక్కముడుసుకుంది ; గువ్వ గూడెక్కింది; గుట్టుగుడిసెలో దివ్వెలిగింది - ఏడకే ఏడకే సినదాన - సేతిగాజులు సిటిలె ; సెంప కందిపోయె - మొగాన దూమెరుగు లేదు - సూపులో నిగారం లేదు - ఎవరే బిడ్డా నీవు ... ...."

" ఖామోష్" కథాప్రారంభమిది.

రెండో ప్రపంచయుద్ధం ప్రపంచమంతటా ప్రజాజీవితాలతోపాటు-కవులూ కళాకారులూ మేధావుల దృక్పథాలనుకూడా మార్చివేసింది. కల్పనలూ, కలలూ

కనబడని ప్రేయసికోసం నిట్టూర్పులూ ఇలాంటివన్నీ క్రమంగా అంతరించ సాగాయి-వ్యక్తిసమస్యలకంటే సమష్టిసంక్షేమం, సంఘప్రగతీ ప్రధానమైనాయి-సామాన్యమానవుడు కథానాయకు డయ్యాడు.

పాశ్చాత్యకవితాధోరణుల ప్రభావంతో - స్రియలిజంవంటి వెర్రితలలు తెలుగుకవితావనంలోకూడా కనిపించినా, క్రమంగా అవన్నీ కనుమరుగై, కర్షక కార్మిక ప్రగతిని కాంక్షించే అభ్యుదయకవిత అంతటా విస్తరించింది. శ్రీశ్రీ అభ్యుదయకవితా ఉద్యమానికి నాయకుడై మహాప్రస్థానానికి పిలుపునిచ్చాడు. ఆ తర్వాత కొన్నిదశాబ్దాలపాటు వచ్చిన తెలుగుకవిత్వమంతా శ్రీశ్రీ ప్రభావానికి లోనయింది. "1930 దాకా తెలుగుసాహిత్యం నన్ను నడిపించింది ; ఆ తర్వాత దాన్ని నేను నడిపిస్తున్నాను" అంటాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ ప్రభావం, అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రభావం ఆనాటి వచన రచనలపైకూడా ప్రసరించింది. కథావస్తువులు మారాయి. కథాప్రయోజనం మారింది. అసలు సాహిత్యప్రయోజనమే మారింది. అయితే ఒక్కటి మాత్రం నిజం. కవిత్వం మారినంతగా ఆనాటికథ మారలేదు. ఆనాటి సాంఘిక, చారిత్రక, రాజకీయ పరిణామాల ప్రభావం కథపై కంటె కవితపైనే ఎక్కువగా పడింది. ఆనాడే కాదు ఇది ఏనాడైనా ఇంతేనేమో ! కథకుడికంటె కవి త్వరగా స్పందిస్తాడు ; త్వరగా తన్ను తాను మార్చుకుంటాడు ; త్వరగా లోకాన్ని మార్చాలని ప్రయత్నిస్తాడు.

అభ్యుదయసాహిత్యయుగం అని చెప్పబడేకాలంలో—అగ్రగణ్యు డయిన కథకుడు - కొడవటిగంటి కుటుంబరావుగారు. ఆయన మామూలు రచయిత కాదు—మహామేధావి ; సాహిత్యప్రయోజనం తెలిసిన రచయిత ; సాంఘికచైతన్యమూ, రాజకీయ అవగాహనా కలిగిన రచయిత. ఆయనభాష సాధారణం ; ఆయనశైలి సరళం. మధ్యతరగతిజీవితాల సమస్యలూ, ఆ సమస్యలకి గల మూలకారణాలూ, పరిస్థితులప్రభావానికి లోనయ్యే రకరకాల వ్యక్తులూ, వారి మనస్తత్వాలూ - ఇవన్నీ కుటుంబరావుగారికి కథావస్తువులు. ఆయన రాసిన వందలాది కథలు నాటికీ నేటికీకూడా తెలుగుకథకులకి ఎన్నో విధాల మార్గదర్శ

కాలు. "కవిరాట్టు, నిలవనీరు, కొత్త జీవితం, లేచిపోయిన మనిషి" ఇలాంటి వెన్నో కథలు కుటుంబరావుగారిప్రతిభకి నిదర్శనాలుగా నిలుస్తాయి.

కుటుంబరావుగారి తర్వాత అభ్యుదయకథకుల్లో అగ్రస్థానం త్రిపురనేని గోపీచంద్‌గారిది. కుటుంబరావుగారిలాగే ఈయనకూడా అటు నవలాకర్తగాను, యిటు కథకుడిగాను కూడా ప్రసిద్ధి పొందారు. పోనుపోను తమ చివరిరోజుల్లో ఆధ్యాత్మికవాదిగా మారినా – గోపీచంద్‌గారు స్వతహాగా హేతువాది · భౌతిక వాది. గోపీచంద్‌గారి భాష మరీ సామాన్యం. అలాంటి భాషతో, అతి సాధారణ మైన శైలితో – పల్లెటూరి జీవితాలగురించీ, అక్కడి ప్రజల ఆర్థిక సమస్యల గురించీ, ఆర్థిక సంబంధాల గురించీ అద్భుతమైన కథలు రాశారు గోపీచంద్.

"ధర్మాసుపత్రి, భార్యల్లోనే వుంది, భార్యాభర్తలు, దేశం ఏమయ్యేట్టు" ఇవన్నీ కాక ఇంకెన్నో కథాసంపుటాలు గోపీచంద్‌గారివి వెలువడినాయి.

మహాకవి శ్రీశ్రీ కేవలం కవే కాదు – కథకుడు కూడా. స్వాతంత్ర్య పూర్వకాలంలో కొన్నీ, ఆ తర్వాత కొన్నీ ఆయన కథలుకూడా రాశారు. 'చరమరాత్రి' అన్నది ఆయనకథల్లో ప్రసిద్ధమైంది – ఆ పేరుతోనే ఆయనకథల సంపుటికూడా వచ్చింది. అయితే ఆయనకథలు ఆయనకవితలంత విశిష్టమైనవీ విలక్షణమైనవీ కావు.

పల్లెటూరిప్రజల జీవితాలనూ, ముఖ్యంగా రైతుకుటుంబాల జీవితాలనూ చిత్రిస్తూ కథలు రాసిన ప్రముఖుల్లో నార్ల వెంకటేశ్వరరావుగారినీ, జి.వి. కృష్ణా రావుగారినీ కూడా చెప్పుకోవాలి.

నార్లవారి కథలు "కదంబం" అన్న పేరుతో సంపుటంగా వెలువడ్డాయి. జి. వి. కృష్ణారావుగారి "ఉదబిందువులు" చివర్లో కన్నీటిబిందువులు తెప్పించే కరుణారసపూరితమైన కథ.

గ్రామికజనాన్ని చైతన్యవంతుల్ని చేసే గేయాలు జానపదశైలిలో రాసి ప్రసిద్ధుడయిన కొనకళ్ళ వెంకటరత్నంగారు కొన్ని కథలుకూడా రాశారు. న్యాయవాదిగా అడ్వకేట్ జనరల్‌గా ప్రసిద్ధి పొందిన బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు 'జేబురుమాలు, పారిన్' వంటి మంచి కథలు రాశారు. హాస్య వ్యంగ్యరచనలకి పేరొందిన సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు ఖయిదీల దీనావస్థని చిత్రిస్తూ 'బీడీ మారకం' వంటి గొప్పకథ రాశారు.

'లంచం పట్టిన ఆఫీసరు - లాభం చేసిన గొల్లది'- ఆయన రాసిన మరో మంచి కథ. స్వాతంత్ర్యకాలానికి ముందూ, ఆ తర్వాతా కూడా మంచి కథలు అనేకం రాసిన ప్రముఖకథకుల్లో పాలగుమ్మి పద్మరాజుగా రొకరు. ఆయన 'గాలివాన'కథకి అంతర్జాతీయ బహుమతి లభించింది. 'పడవప్రయాణం' ఆయన రాసిన మరో గొప్పకథ. అనువాదసాహిత్యానికి పేరు మోసిన 'చక్రపాణి'గారు స్వంతంగా కూడా కథలు రాశారు.

ఆచంట జానకిరామ్, అందే నారాయణస్వామి, కొమ్మూరి పద్మావతీ దేవి, పాలంకి వెంకట రామచంద్రమూర్తి, పిలకా గణపతిశాస్త్రి, శ్రీ వాత్సవ, రావూరు వెంకట సత్యనారాయణరావు మొదలైనవారుకూడా స్వాతంత్ర్యపూర్వ కాలంలో కథాసాహిత్యాన్ని సుసంపన్నం చేసినవారే.

'ప్రజల మనిషి' రాసి ప్రజారచయితగా ఎంతో పేరుతెచ్చుకున్న వట్టికోట ఆళ్వారుస్వామిగారు 'జైలు లోపల' అన్న కథాసంపుటాన్ని వెలువరించారు. అందులో "జైలులోపల, పరిగె, పతితుని హృదయం" మొదలైన పేర్లతో ఖయిదీల కరుణామయగాథ లున్నాయి. అలాగే ప్రసిద్ధ తెలంగాణాకవి కాళోజీ కూడా కొన్ని కథలు రాశారు.

ఆనాడు ఈ రకంగా నడిచిన తెలుగుకథ స్వాతంత్ర్యానంతరకాలంలో ఇంకెన్నో కొత్త నడకలు నేర్చింది · నాట్యాలు నేర్చింది. వస్తువులో, రూపంలో ఎన్నో మార్పులకి లోనయింది. కొంత పతనమైంది; మరింత పైకి ఎదిగింది. ఏమయినా ఈనాటి తెలుగు కథానిక అన్నిహద్దులూ దాటి అంతర్జాతీయస్థాయికి ఎదిగిం దన్నమాట ముమ్మాటికీ నిజం.



# తెలుగు నాటికలు

- పాతూరి శ్రీరామశాస్త్రి

భరతుడు తననాట్యశాస్త్రంలో

"నాటకం-ప్రకరణం-అంకో-వ్యాయోగ-ఏవ చ
భాణః సమవకార-శ్చ-వీధీ-ప్రహసనం డిమః
ఈహామృగ-శ్చ విజ్ఞేయో దశమో నాట్యలక్షణే"

అని పదిరకాల రూపభేదాలను చెప్పాడు. రూపభేదాలనే రూపకాలనటం
జరిగింది. వీటిలో అంకం, వ్యాయోగం, భాణం, వీథి, ప్రహసనం అనే
అయిదున్నూ ఏకాంకికలు. ఏకాంకికలంటే ఒకే అంకం గలవి. ఈనాడు మనం
వీటినే నాటికలు అంటున్నాం. క్రీస్తుపూర్వమే భరతుడు 'నాటిక' అనేపదాన్ని
ప్రయోగించాడు. కాని అతడు ఉపయోగించిన అర్థం వేరు. నేడు మన మను
కుంటున్న ప్రకృతార్థం వేరు. మనం 'నాటిక' 'ఏకాంకిక' పదాలను సమానా
ర్థంలో వాడుకుంటున్నాము.

"నాటకాలకు తొలిరూపాలు వేదాలలోని సంవాదాలు అని పెద్దలు సిద్ధ
యించారు. ఈ భావాన్ని నిరూఢిచేయడానికి ఋగ్వేదంలోనుంచి పది హే[illegible]
సంవాదాలను ఎత్తిచూపాడు పండితుడు కీథ్. ఈ సంవాదాలన్నీ ఏకాంకికలే
అంటే నాటికలే. నాటికలే నాటకాలకు తొలిరూపాలని అంటే అత్యంతర మ[illegible]
కూడదు. నాటిక, నాటకం అక్కచెల్లెళ్ళయితే నాటికే అక్క.

సంస్కృతంలో నాటికలు క్రీస్తుపూర్వం ఏనాటినుంచో ఉన్నాయి. ఈనాటి[illegible]
రమారమి అరవైయేళ్ళనాడు 1909-10లో మహామహోపాధ్యాయ గణపతి
శాస్త్రిగారు వెలికితీసిన భాసునాటకచక్రం పదమూడింటిలో "మధ్యమవ్యా
యోగం", "దూతవాక్యం" "దూతఘటోత్కచం" "కర్ణభారం" "[illegible]"
ఏకాంకికలే. భాసుడుముప్పైకి పైగా నాటకాలు రాశాడని అంటారు. మనకు

దొరికినవి పదమూడే. పైనచెప్పిన ఐదు ఏకాంకికలూ చాలా గొప్పవి. వీటిలో నాలుగింటిని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి తెలుగు అనువాదాలుగా సుమారు యాభై ఏళ్ళనాడు చదివాను. ఇంత గొప్పనాటికలను భాసుడు క్రీస్తుపూర్వం నాలుగువందల యేళ్ళనాడే రాశాడంటే అంతకుముందు ఎన్నో శతాబ్దాలనుంచీ నాటికలు ప్రచారంలో ఉన్నాయని ఊహించడం సబబు.

సంస్కృతంలోకి మల్లేనే గ్రీక్‌లోనూ ఏకాంకికలు (నాటికలు) అతి పురాతనమైనవి. బహుశా సంస్కృతంలోకంటే పురాతనమైనవేమో ! ఏస్కిలస్ (Aeschylus Bc 524–456) తో పోటీపడి సాఫోక్లిస్ (Sophocles Bc 497–405)ముప్పైకిపైగా నాటకాలు రాశాడట. పోయినవిపోగా మనకు దక్కినవి ఏడుమాత్రమే ! ఈ ఏడూ ప్రపంచ విఖ్యాతిచెందిన నాటికలు. ఏష్కిలస్ 'ఆగెమెమ్నన్' సొఫోక్లిస్ "అంటిగొనె" ఢిల్లీసాహిత్య అకాడమీవారి ప్రచురణలుగా తెలుగులోగూడా దొరుకుతాయి.

సంస్కృతంలోనూ గ్రీకులోనూ నాటికలు ఆవిధంగా ప్రముఖమయ్యాయి. ఇక్కడ మరోసత్యం చెప్పకోకతప్పదు. గ్రీకు, సంస్కృత నాటికలకు పరస్పర ప్రభావం ఉంది. అశ్వఘోషుడి ఊర్వశీవియోగం సంస్కృత నాటికనుండి నాందినీ (Prologue) భరతవాక్యం (Epilogue)నూ గ్రీకునాటికలు అరువుతెచ్చుకుని అది వారిస్వంతమేమోనన్నంత భ్రమ కలిగించేవిగా పరిణతి చెందాయి. అలాగే మనసంస్కృతనాటికలోని బృందగానాన్ని (Chorus) గ్రీకు నాటికలనుంచి అరువుతెచ్చుకుని స్వంతంచేసుకున్నారు. ఇవన్నీ తెలుగు నాటికలలో కూడా ప్రవేశించాయి. స్వల్పరూపాంతరంగూడా చెందాయి.

ఇదీ స్థూలంగా నాటికల పూర్వచరిత్ర. పుస్తకాలనుంచి నేర్చుకున్నదీ నాఅనుభవంలోనిదీనూ.

పూర్వచరిత్ర ఇలా ఉండగా గతాన్నిగురించి గొప్పలు చెప్పుకోవడం తెలుగువారి అలవాటు. ఆ అలవాటు ఎంత ఎదిగిపోయిందంటే, 'ఇప్పుడేముంది! గతం చాలగొప్పది! మాతాతలు నేతులు తాగారు. మామూతులు వాసనచూడండి' అనేదాకావచ్చింది. ఈ ఆలోచన ఆరోగ్యదాయకంకాదు. వెయ్యేళ్ళనాడు గుణగ విజయాదిత్యుని కాలంలో తెలుగికి ఉన్నశాసనం వేసి రాచమర్యాదలు, జరి

పించారు. ఆనాటినుంచి ఈ శతాబ్దపు మొదటిదాకా నాటికలు (ఏకాంకికలు) వెలువడినట్లు దృష్టాంతా లేపీ లేవు. అంతమాత్రాన గురజాడవారి గిరీశం అన్నట్లు 'మనవాళ్ళుత్త వెధవాయలోయ్!' అని న్యూనతపరచడమూ పనికి రాదు. సంస్కృతంలో నాటిక అక్కా నాటకం చెల్లెలే గాని, తెలుగులో చెల్లె లయిన నాటకమే ముందుకు దూకింది. నాటిక కొంచెం, పెద్దదవడంవల్లనేమో కొంచెం నింపాదిగానే బయలుదేరింది. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. చిన్న దైనంత మాత్రాన నాటకం నాటికా కాదు ; పెద్దది అయినంతమాత్రాన నాటిక నాటకమూకాదు. రెండూ విభిన్న ప్రక్రియలు. దేని టెక్నిక్ దానిదే. నాటికలో ముఖ్యంగా, కాలానికీ, స్థలానికీ సమయానికీ సమన్వయం ఉండాలి. నాటకంలో ఈ సమన్వయం అవసరంలేదు వైవిధ్యమూ ఉండాలి.



నాటకం పంధొమ్మిదో శతాబ్దపు చివరలో వస్తే, నాటిక ఈ శతాబ్దపు మొదట్లో వచ్చింది. ఈనాటి నాటికకూ నాటకానికీకూడా బొంబాయిరాష్ట్రంనుంచి వచ్చిననాటకకంపెనీలు స్ఫూర్తి నిచ్చాయి. ఇది వాస్తవం. ఆ ప్రోత్సాహంతోనే 1910లో తొలినాటిక వెలువడింది. ఈ నాటికే తొలి ప్రహసనం రూపంలో. ఆధునిక నాటకాన్నీ, నాటికనూ రాసిన మొదటివాడుగా కీర్తి కందుకూరి వీరేశలింగం పంతులుగారికే దక్కింది. రెండవనాటికను గూడ పాటి లక్ష్మీ నరసమ్మ అనే ముదిత రాయడం ముదావహం.



1910–1947 వరకూ వెలువడిన మొత్తంనాటికలసంఖ్య సుమారు 131. వీటిలో వ్రాతప్రతులుగానే మిగిలిపోయిన నాటికలు చేర్చడానికి అవకాశంలేదు. ఎందుకంటే ఒకకాలాన్ని పునరావలోకనం చేస్తున్నప్పుడు అచ్చులోకి వచ్చినవే లెక్కలోకి వస్తాయిగాని వెలుగులోకి రాని మణిమాణిక్యాలైనా మబ్బులమాటునే ఉండిపోతాయి. ఈ ముప్పైఏడేళ్ళలోనూ వచ్చిన నాటికాసముదాయాన్ని స్టాటిస్టికల్‌గా విశ్లేషించడం అవసరమనుకుంటాను.

1910–1920 — పది (10)
1921–1930 — పదిహేడు (17)

| | | |
|---|---|---|
| 1931–1940 | — | ముప్పయినాలుగు (34) |
| 1941–1945 | — | ఇరవైఆరు (26) |
| 1946 | — | పదిహేడు (17) |
| 1947 | — | ఇరవై (20) |
| అచ్చుతేదీ తెలియనివి | — | ఏడు (7) |
| 1900–1947 వెరశి | — | నూటముప్పైఒకటి (131) |

నాటికలు వెలువడిన మొదటి పదేళ్ళలోనూ పదే నాటికలు వచ్చాయి. తరువాత పదేళ్ళలోనూ పదిహేడు వచ్చాయి. ఆ మరుసటి పదేళ్లలోనూ ముప్పైనాలుగు అంటే రెట్టింపు వెలువడ్డాయి. 1941-45 అంటే ఐదేళ్ళలోనూ ఇరవైఆరు నాటికలు రచించారు. 1946లో పదిహేడు, 1947లో పద్దెనిమిదీ నాటికలు ప్రకటితమయ్యాయి. దీన్నిబట్టిచూస్తే నాటికారచన, ప్రచురణ క్రమేణా పెరుగుతూ వచ్చిందిగాని ఆంధ్రుల కున్న ప్రథ 'సోడాబుడ్డీగాస్‌లా' ఉప్పెనకెరటంలా ఉవ్వెత్తున వచ్చి అంతటితో ఆగిపోలేదు. క్రమంగా పెరుగుతూవచ్చింది నాటికా రచన. స్వాతంత్ర్యంతరువాత ఈ నాటికా రచన విశృంఖలంగా, విరివిగా కొనసాగింది. విశృంఖలం అని ఎందుకంటున్నానంటే దేనిమీదబడితే దానిమీదే నాటికలు రాశారు. బహుశా 'కుక్కపిల్లా సబ్బుబిళ్ళా, అగ్గిపుల్లా కాదేదీ కవితకనర్హం'అనే శ్రీశ్రీగేయం వారికి స్ఫూర్తినిచ్చిందేమో ! 1947 పూర్వం వచ్చిన నాటికలలో ఒక నిర్దిష్టమైన సంఘటనగాని భావస్ఫోరకమైన సన్నివేశంగాని తప్పకుండా ఉండేది.

తెలుగులో ఆధునిక నాటికారచనాకాలాన్ని 1910 నుంచి 1947 వరకూ 37 ఏళ్ళుఅని గ్రహిస్తే మొదటి20సంవత్సరాలనూ తరువాతి 17 సంవత్సరాలనూ రెండుయూనిట్లుగా విభజించుకుంటే శైలీవిశ్లేషణ సులభమౌతుంది. మొదటి ఇరవై యేళ్ళలోనూ గుడిపాటి వెంకటచలాన్ని, భమిడిపాటి కామేశ్వరరావునూ మినహాయిస్తే మిగతావారంతా ఓవిధమైన గ్రాంథికాన్నే వాడారు. వీరిద్దరూ మాత్రం తమ ప్రత్యేకశైలిలో నేడు వ్యావహారికంగా భావింపబడుతున్నశైలిలో రచించారు. గ్రామ్యపదాలనూ విరివిగా వాడారు. ఆతరువాతి పదిహేడు సంవత్సరాలలోనూ రచనాశైలి వివిధపోకడలూ పోయింది. శిష్టవ్యావహారికం

స్థిరమైనస్థానంలో నిలిచింది. వ్యావహారికం రకరకాల పోకడలూ పోయి గ్రామ్య ప్రాంతీయ భాషా శైలులను అనుసరించింది. అచ్చమైన గ్రామ్యంలోనూ రచనలు వచ్చాయి. తరువాత ప్రాంతీయవ్యావహారికంలో వచ్చిన నాటికలకు ఓవిధమైన గ్రహణం పట్టిందనవచ్చు.

తెలుగులో నాటికారచన ప్రారంభమైన 1910 నుంచీ 1947 వరకూ అచ్చుముఖం చూచిన నాటికలపట్టిక సంవత్సరం వారీగా ఈ వ్యాసం చివర పొందుపరిచాను. అలా వెలువడిన నాటికలలోని వైవిధ్యాన్నీ, రచనావిధానాన్నీ వాటిలోని ప్రత్యేకతలనూ రచయితల పరంగా అవగాహన చేసుకోడానికి ప్రయత్నిద్దాం. రచయితల ప్రభావం నాటికలమీద ఉండడం నిర్వివాద మయిన విషయం. అందుకే ఈ పద్ధతిని రచయితలపరంగా అవలోడనం చేయడాన్ని ఎన్నుకున్నాను.

మొట్టమొదటి నాటిక కందుకూరి వీరేశలింగం పంతులుగారి కలంనుంచి 1910 లో వెలువడినట్లు ఇదివరకే చెప్పాను. పేరునుబట్టి చూస్తే ఈ నాటిక ప్రహసనంగా కనిపిస్తుంది ఇది ఇంగ్లీషులోని స్కిట్ (Skit) కు దగ్గిరగా వస్తుంది. స్థూలంగా మన ప్రహసనాలను (నాటికలు) స్కిట్స్ కోవకు చెందినవిగానే పరిగణించాలి. దీనిరచన గ్రాంథికంలోనే సాగింది.

వీరేశలింగంగారి తరువాత ప్రముఖంగా కనిపించేపేరు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిది. వారి మధ్యమవ్యాయోగం భాసుని సంస్కృతనాటికకు అనువాదం. ఈ భాసకృతిని అనువదించినవారిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారూ, యలమర్తి శ్రీనివాసరావుగారున్నూ ఉన్నారు. ఈ ఇరువురి అనువాదాలనూ చదివే భాగ్యం నాకు కలగలేదు. ఇది ఇలా ఉండగా చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి షష్టిపూర్తి 1926 లోనో, 1927 లోనో జరిగింది. అప్పుడు ఆయనరచన లన్నింటినీ పదిసంపుటాలుగా షష్టిపూర్తి ముద్రణలుగా వెలువరిచారు. వాటిలో ప్రథమసంపుటం ప్రహసనాలు. ఆ ప్రహసనాలన్నీ నేను సేకరించిన నాటికలపట్టికలో చేరలేదు. కారణం అవన్నీ విడివిడిగా ప్రచురించక పోవడమే. చిలకమర్తివారు 'మనోరమ' అనే మాసపత్రికను ప్రచురించేవారు. దానిలో వారి ప్రహసనాలు ఉండేవి. బధిర చతుష్టయం, బలవంత బ్రాహ్మ

ణార్థం ఆ పత్రికలోనే చదివాను. బధిర చతుష్టయం అంటే నలుగురు చెవిటి వాళ్ళు. ఒకరు మాట్లాడింది ఇంకొకరికి తెలియదు. పెదవుల కదలికలనుబట్టి ఎదుటివారి సంభాషణను ఊహించుకొని మాట్లాడుతారు. అందులోనుంచే హాస్యం పుట్టుకొస్తుంది. అసలు పేరు గుర్తు లేదుగాని వీరిప్రహసనం "కాసుల పేరు" అనే పేరుతో చిత్తజల్లు పుల్లయ్యగారు సినిమా తీశారు. ఓ వ్యాపారిపంతులు వంట మనిషిని వలచిన సంఘటన. పాపం ఆమె చాలా నీతిమంతురాలు. ఆ విషయం ఆ పంతులుభార్యకు చెబుతుంది. వాళ్ళిద్దరూ కలిసి నాటకం ఆడుతారు. ఈ నాటకంవల్ల ఆయనభార్య కోరుకున్న కాసులపేరు ప్రేయసికి బదులు ఆమెకే దక్కుతుంది. భార్యే ప్రేయసి అయి పంతులును దుయ్యబట్టడంతో అంత మౌతుంది. ఇందులో పరకాంతావ్యామోహాన్ని విమర్శించడం జరిగింది.

మరో ప్రహసనం జనాభా లెక్కలు. ఎన్యూమరేటరు వచ్చి పేరు వగైరా అడిగి రాసుకుంటాడు. ఆయనపేరు రాఘవాచార్యులు. కులం బ్రాహ్మణులు అని రాస్తే ఇంటియజమాని '' ఔరౌరా ! బ్రాహ్మణులని రాస్తావా ? మేము శ్రీవైష్ణ వులం" అని దెబ్బలాడుతాడు. ఇందులో కులతత్వంలోని మౌఢ్యాన్ని, సదా చారంలోని వెంగలితనాన్ని విమర్శిస్తారు. "కనకయ్యపంతులు కంతి"అని మరో నాటిక ఉంది. ఆ నాటికలో కనకయ్య పంతులు కంతి ''నిమ్మకాయంతా ? నారింజకాయంతా ?" అనే వివాదంలో పడి కొట్టుకుని కోర్టు కెక్కుతారు. కన కయ్యపంతులునే కోర్టుకు పిలిపిస్తారు. "నా కంతి ఎంతుంటే మీకెందుకు ?" అని కోర్టులో వాపోతాడు. అనవసరవిషయాలపై ఆసక్తి పెంచుకుని పిల్లలు వాదు లాడుతుంటే "కనకయ్యపంతులు కంతి ఎందుకురా ! ఎందు కీ కీచులాట'' అని పెద్దలు మందలించడం దాకా వచ్చిందీ ఇతివృత్తం. ఇదంతా ఎందుకు చెబు తున్నానంటే చిలకమర్తివారి నాటికలలో ఉన్న వైవిధ్యాన్నీ, సామాజిక ప్రయోజనాన్నీ తెలియజెయ్యడానికే. ఈ ధోరణిలోనే సాగాయి చిలకమర్తి వారి నాటిక లన్నీ.

1919లో వింజమూరి లక్ష్మీనరసింహారావుగారు నాలుగు నాటికలు వెలువరించారు. ఆ నాలుగు నాటికలలోనూ స్త్రీకే ప్రాధాన్యం. అంతేకాకుండా స్త్రీలోని మార్దవాన్నీ, ధైర్యసాహసాలనూ ప్రస్ఫుటంచేస్తాయి. ఇవి నాలుగూ చరిత్రాత్మకాలు. భాష గ్రాంథికమే.

నోరి నరసింహశాస్త్రిగారి నాటికలున్నూ ముఖ్యంగా చరిత్రాత్మకాలే. వారి దో ప్రత్యేకశైలి. గ్రాంథిక శిష్టవ్యావహారికాలమిశ్రమం. అయినా వీరినాటి కలలో విషయవైవిధ్యముంది.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాటికలలో వైవిధ్యముండడమే కాక, వీరిశైలిలో నుడికారంలో విశిష్టత కనబడుతుంది. నాలుగుముక్కలు చదవగానే శ్రీపాదవారి రచన అని తెలిసిపోతుంది.

మారేమండ రామారావుగారు చరిత్రోపన్యాసకులు. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో గూడా ప్రొఫెసరుగా పని చేశారు. (ఒకనాటి నా సహోపాధ్యా యులు.) అందుచేత వీరు రాసిన నాటికలలో చారిత్రకస్ఫురణే ఎక్కువగా ఉంటుంది. వీరిశైలి కొంచెం గడ్డుగా ఉండే శిష్టవ్యావహారికం. దానిమీద ఆయ నకు మోజు ఎక్కువ. వీరినాటికలలో నాటకీయత కన్న పటాటోపం మెండు.

వింజమూరి శివరామారావు నాటిక "రజక లక్ష్మి" (చాకలి లచ్చి). అళియరామరాజు అనెగొందిలోని చాకలిదాని మేడపైన ఆధారపడిన చక్కని మరో చరిత్రాత్మక రచన. నాటకీయత బాగా ఉంది.

చిలకమర్తివారి తరువాత మరో విఖ్యాత హాస్యనాటికారచయిత భమిడి పాటి కామేశ్వరరావుగారు. వీరినాటికారచన ఒకచోట వారు చెప్పుకున్నట్లుగానే రాజమండ్రీలోని మెట్కాఫ్ హాస్టల్ వార్షికోత్సవాలకోసం సాగింది తరువాతనూ వారు నాటికలను రాశారు. వీరినాటికలలో చాలావరకు ఫ్రెంచి నాటకకర్త మోలియర్ నాటికలకు అనుకరణలే. అయినా తమ నాటికలలోని పాత్రలకు తెలుగుదనం మప్పారు. వీరినాటికలలో మరీ ప్రసిద్ధికెక్కిన నాటిక "బాగుబాగు". అందులోని భాగయ్యపాత్ర "బాగుబా గేమిటోయి భగవాన్లూ ! ఆ తురకవెధవ నాటకానికి నే నెందుకు వెళ్ళాలి. వెళ్ళాను పో...." ఇలా సాగుతుంది. భాగయ్య కొంచెం వెర్రిబాగుల పల్లెటూరివాడు. రాజమండ్రీ ప్రాంతంలో ఆ రోజుల్లో "ఏమోయ్ భగవాన్లూ!"అని సంబోధిస్తే "ఏరా ! వెర్రివెధవాయా?"అనే అర్థం తోనే. ఈ"బాగుబాగు" ఎంత ప్రాచుర్యం పొందిందంటే కొందరు కొంటెకోణం గులు కామేశ్వరరావుగారు వెడుతుంటే వెనకనించి "బాగు బాగు" అని అరిచేవా

రట! ఇది భరింపరానిదిగా తయారై "బాగుబాగు" అని అంటే కామేశ్వరరావు గారు ఉడుక్కునే వారనే ప్రథ, పోనీ అపప్రథే అందాం, ఉండేది. నాటిక పేరు గుర్తుకు రావడంలేదు లేదుగాని ఓ పాత్ర ఉచ్చైస్స్వరంలో ఏడుస్తూ "వాళ్ళంతా గొప్పవాళ్ళైపోతున్నార్రోయ్" అని ప్రవేశిస్తాడు. ఇది తెలుగువారి ఓర్వలేనితనానికి ప్రతీక. ఇది ఆనాడూ, ఈనాడూ, ఏనాడూ తెలుగువాడున్నంతకాలం ఉంటుందని నా అభిప్రాయం.

మరో నాటిక "క చ ట త ప లు"లో అనుకుంటాను, కొందరు మిత్రులు సమావేశ మవుతారు. అందులో ఒకడు 'మనమంతా కలిసి ఓ గొప్పపని చెయ్యాలిరా! ఎంత గొప్పపనంటే ఓ లక్షరూపాయలైనా లాభం రావాలి" అంటాడు. రెండోవాడు "లక్షెందుకురా! ఓ పదివేలు చాలు." మూడోవాడు "ఓ వెయ్యి రూపాయలు చాలు," నాలుగోవాడు "ఏమీ లాభం అక్కరలేదు, గొప్పపనిచేస్తే చాలు" అంటే దానికి మొదటివాడు "ఏమీ అక్కరలేదుగాని మనల్ని తన్నకుండా విడిచిపెడితే చాలు" అంటాడు. లక్షరూపాయలు లాభం సంపాదించాలన్న వ్యక్తి తన్నులు తగలకుండా ఉంటే చాలు అనే స్థితికి దిగజారుతాడు. ఇది తెలుగువారి ఆరంభశూరత్వంపై నిశితమైన విమర్శ. అందుకే భమిడిపాటివారి రచనలు మోలియర్‌కు అనుకరణలైనా తెలుగుతనాన్ని నింపుకుని నిజంగా తెలుగునాటిక లేమో నన్నంత తెలుగుదనంతో విలసిల్లుతాయి. వీరికి "హాస్యబ్రహ్మ" అనే బిరుదు ఇచ్చారట. ఆయన హాస్యానికి బ్రహ్మ అయినా కాకపోయినా సృష్టికర్త అనే అర్థంలో, ఫ్రెంచినాటికలకు తెలుగు నేర్పి తెలుగుదనం సంతరించి హాస్యం సృష్టించినందువల్ల వారికి బ్రహ్మత్వం అబ్బిందని నా అభిప్రాయం.

గుడిపాటి వెంకటచలంగారూ, పి. వి. రాజమన్నారుగారూ తమ నాటికలలో స్త్రీజన అభ్యుదయాన్ని ఆకాంక్షించారు. వెంకటచలంగారి స్త్రీ పాత్రలు ముఖ్యంగా మధ్యతరగతి బ్రాహ్మణకుటుంబాలలోనుంచి రాగా, రాజమన్నారుగారి స్త్రీలు పెద్దతరగతి కుటుంబాలనుంచీ, పై తరగతి పురుషులపై ఆధారపడిన కొంత పై తరగతి భావాలకు లోనైన, ఆడవాళ్ళలోనుంచీ వచ్చారు. చలంగారు ఒకవిధమైన స్వేచ్ఛాప్రణయాన్ని (free love) అంటే ప్రణయంలో స్వేచ్ఛను ఉత్తేజపరిచారు. లైంగిక విశృంఖలత్వాన్ని బోధిస్తున్నారని చలాన్ని బహిష్క

శించినవారూ ఉన్నారు. ఆయనరచనలలోని అంతర్గతభావాన్ని అసలా ప్రేమ లోనూ, వివాహంలోనూ స్త్రీకి స్వేచ్ఛ ఉండాలిగాని సనాతనాచారపుసంకెళ్ళతో బంధించరాదనీ, అవసరమైతే ఆ సంకెళ్ళని త్రెంచివేయడం సబబనీ అర్థం చేసుకున్నవారూ ఉన్నారు. చలాన్ని బహిష్కరించి ఆయన భావాలను తిట్టిపోసిన వారు, ఆయనభావాలను అవగాహన చేసుకున్నవారికంటే ఎన్నోరెట్లు ఎక్కువగా ఉన్నారు. చలం నాటికలలోని స్త్రీలకు మానవతా, కారుణ్యమూ అవసరమని వాదించారు. ఇందాక చెప్పినట్టు ఆయన మధ్యతరగతిలో ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాలలోని స్త్రీల మానసిక స్వేచ్ఛకూ, ప్రణయంలోనూ వారి అభిప్రాయాలకు ప్రాముఖ్యం ఉండాలని ఉద్బోధించారు.

రాజమన్నారుగారి స్త్రీలు పై తరగతి అతిశయాలకూ, ఆడంబరాలకూ లోనై క్రింది తరగతివాళ్ళని, ముఖ్యంగా వారికుటుంబాలమీదా, వారి పురుషుల మీదా ఆధారపడిన స్త్రీలను చిన్నచూపు చూడడమే కాకుండా వారిని కించపరచడము కూడా చేస్తారు. వీరినాటికలలో సామాజికస్పృహతో కూడిన చక్కని విమర్శ ఉంది. పై తరగతివారి ఆడంబరాలవల్ల వచ్చే అనర్థాలను ఎత్తి చూపించారు. ఈ ఇద్దరిరచనలూ వ్యావహారికంలోనే సాగాయి. సంస్కృత పదాలను గుప్పకుండా భావాలను తమ పాత్రలచేత సూటిగా, తేటతెలుగులో చెప్పించారు. మంచి సూచనలుకూడా ఇమిడ్చారు. చలంగారి సూచనలను కొందరు వప్పుకోకపోయినా, రాజమన్నారుగారి సూచనలను అంతా అంగీకరిస్తారు.

తల్లావఝుల శివశంకరశాస్త్రీ, బాలాంత్రపు రజనీకాంతరావూ, అబ్బూరి వరదరాజేశ్వరరావూ, కొప్పరపు సుబ్బారావుగార్లు గేయనాటికలు రాసిన ప్రముఖులు. తల్లావఝుల శివశంకరశాస్త్రిగారికి ఈ శతాబ్దంలో గేయనాటికలకు శ్రీకారం చుట్టిన కీర్తి దక్కుతుంది. వారు ఆశ్రమస్వీకారం చేసిన తరువాత శివశంకరస్వామి అయ్యారు. కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి ఉపాధ్యక్షులుగా కూడా ఉన్నారు. వారు స్వయంగా కవులై గేయనాటికలు రాయడమే కాకుండా ఎంత చిన్నవాడైనా, రచన ఓ మాదిరిగా ఉన్నా యువ కవులను ప్రోత్సహించి, పద్య గేయ నాటికారచనకు వారిని ఉత్తేజపరిచేవారు. తల్లావఝులవారి గేయనాటికల నాటకాలశైలి చాలా మెత్తనిదీ, సులభగ్రాహ్యమైనదీను. వీరి స్త్రీవిరోధి, వరపరీక్ష, ప్రభుశాక్య ఇత్యాది నాటికలు ప్రదర్శనా

యోగ్యాలే కాని, సంగీతం సమకూర్చలేకో, తగినంతమంది పాడగలిగిన నటీ నటులు లభ్యం కాకనో ఏ ప్రయోక్తా ప్రదర్శించడానికి ముందుకు రాలేదు. తల్లావఝ్ఝులవారి "పద్మావతీచరణ చారణ చక్రవర్తి" అనే గేయరూపకం అశేష కీర్తి నార్జించుకుంది.

రజనీకాంతరావు ఆతరువాతివాడు. గేయనాటికారచన చేయడమేకాకుండా సంగీతం తన స్వాధీనంలో ఉండడంవల్లా, చండీదాసు, గ్రీష్మఋతువూ రంగ స్థలంమీద ప్రయోగించాడు. అంతేకాకుండా తాను ఆకాశవాణిలో చేరినతరువాత విరివిగా గేయనాటికలు రాయడమే కాకుండా, తనకున్న అవకాశాలను వినియో గించుకుని శ్రవ్యనాటికలుగా ప్రసారం చేయడంకూడా జరిగింది.

వరదరాజేశ్వరరావు రచన ప్రతిమాసుందరి నాటిక, "హెరాల్డ్ బ్రిగ్ హౌస్"నాటిక "ప్రిన్స్ హూ వజ్ ఎ పైపర్" నాటికకు అనువాదానుసరణ. దీనిలో వాక్యాన్నీ, గేయాన్నీ మేళవించాడు. ఈ నాటికలోని వైశిష్ట్యం ఏమిటంటే రచనాశిల్పం. తెర ఎత్తినతరువాత గంటకుపైగా ఈ నాటిక సాగుతుంది. పాత్రలు వస్తూ పోతూనే ఉంటాయి. నాటిక నిరాఘాటంగా సాగిపోతుంది. తెర పడడమూ, నాటిక అయిపోవడమూ ఒకేసారి జరుగుతుంది. రంగవిభజన లేకుండా సాగిన ఈ నాటిక తెర పడడంవల్ల ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా సాగిపోతుంది. దీనిశైలి గ్రాంథికం.

కొప్పరపు సుబ్బారావుగారి "అల్లీ ముఠా" సామాజిక దృక్పథం కలిగిన గేయరూపకం. ఆనాడు ఇది నిజంగా ఒక గొప్ప ప్రయోగం. అందుకే ఇది ఈనాటికీ గొప్ప నాటికలలో తన స్థానాన్ని నిలుపుకుంది. ఉదాహరణకు ఈ నాటికలోని ఒక గేయాన్ని చెబుతాను.

> "లిమిటెడ్ కంపెని పెట్టర బాబూ !
> షేర్లు కొన్ని వేయర బాబూ !
> దివాల తీస్తే దేవుని తప్పు !
> తియ్యకపోతే నీకే ముప్పు !"

ఇది ఆనాడు అమలులో ఉన్న వ్యాపారసంస్థల వైనం, ఈనాడైతే మరో పాదం కలపాల్సి ఉంటుంది – "ప్రభుత్వానికి టోపీ అల్లర బాబూ !" అని.

సామినేని ముద్దుకృష్ణ అనేక నాటికలూ, నాటకాలూ రాసినా, ఆయన 'అనార్కలీ'కి నాటికలలో అగ్రస్థానం ఇవ్వకతప్పదు. అక్బరు నిరంకుశుడైన పాదుషా అయినా అతనిలోని మానవత కొంత తొంగిచూస్తుంది, అనార్కలిని సజీవసమాధి చేసినప్పటికీ. అనార్కలీసమాధిదగ్గర కాపలావానిపాత్ర ఒక అపరూపకల్పన. మాటలు లేవు. సలీం ఆక్రోశిస్తుంటే అతను ప్రదర్శించాల్సిన భావాలను ఎంతో చక్కగా నిర్దేశించాడు ముద్దుకృష్ణ. అందుకే ఈ నాటికకు అకారాదిక్రమంలోనే కాక, శిల్పంలోకూడా అగ్రస్థానం ఉంది. నాటిక లన్నింటిలోనూ ఉత్తమనాటికను పేర్కొనమంటే ముద్దుకృష్ణ "అనార్కలీ" అని నేనంటాను. నాతో ఏకీభవించేవారుకూడా చాలామంది పెద్దలూ పిన్నలూ కూడా ఉండటాన్న "అనార్కలీ"కి అగ్రతాంబూలం తప్పదు.

ఈ కోవకు చెందిన మరోనాటిక ఆమంచర్ల గోపాలరావు రాసిన "మల్లమదేవి ఉసురు." రచనాపాటవమే కాకుండా ఇందులో అద్భుతమైన శిల్పానికి స్థానం ఇవ్వడం జరిగింది. విజయరామరాజు మల్లమదేవి పందిరిమంచంపై పడుకోబోతే ఆ మంచం తనంతట తాను కాలిపోవడం మల్లమదేవి ఉసురుతల్లి అనే శిల్పం అతి నూతనం. శైలి శిష్టవ్యావహారికం.

కొప్పరపు సుబ్బారావుగారు "నేటి నటుడు, చేసిన పాపం, అలీముసా" నాటికలను ఒకే సంపుటంలో ప్రకటించారు. "నేటి నటుడు" ఆనాటి ప్రముఖ నటులతీరును విమర్శిస్తే,'చేసిన పాపం'లో బౌద్ధసాంప్రదాయానికి చెంది రంగస్థల నిర్మాణ సూచనలలో కొత్త పోకడలు పోయింది. "అలీ ముసా".గురించి ఇంతకు ముందే వివరించాను.

విజయనగరం మల్లాదివారి కుటుంబం నాటికారచనను కుటుంబపరిశ్రమ (Family Industry) చేసుకున్నట్లు అనిపిస్తుంది. మల్లాది విశ్వనాథశర్మగారూ, మల్లాది వేంకటకృష్ణశర్మగారూ అన్నాతమ్ములు. పెద్దాయనకొడుకు మల్లాది అవధాని. పాపం చిన్నవయసులోనే పోయాడు. వీరు ముగ్గురూ కలిసి ఇరవైదాకా నాటికలు రాశారు. అందులో పెద్దాయన (విశ్వనాథ కవిరాజుగా కలంపేరుపెట్టుకున్నారు) ఓ ఎనిమిదికిపైగా, చిన్నాయన ఓ నాలుగూ, పిల్లకాయ అవధాని

ఓ ఎనిమిదికి పైగా రాశారు. చిన్నాయన గత 15 20 ఏళ్ళుగా సురభి నాటక సమాజాలకు నాటకకర్తగా ఉంటూ ఇటీవలే పోయారు. ఈయన రచనలలో ప్రత్యేకత ఏమీ కనుపించదు. విశ్వనాథ కవిరాజుగారి "నేపథ్యం" ఆనాటి కంట్రాక్టు నాటకాలపై మంచి కలంపోటు. నాటిక అంతా గ్రీన్‌రూమ్‌లోనే జరుగుతుంది. మిగతావారి నాటికలలోగూడా నాటకాల, నాటకసమాజాల పై నిశితమైన విమర్శ ఉంది. ఇక పిల్లకాయ అవధాని (ఈయన ఉంటే నా యీ దుండేది.) అద్భుతమైన రచన "అసంపూర్ణరామాయణం." ఈ నాటికను నా యెరికలో అప్పట్లో ప్రతి కాలేజినాటకసమాజమూ ఎప్పుడో ఒకప్పుడు ప్రదర్శించింది. ఇదికూడా వాళ్ళనాన్నగారి 'నేపథ్యం'లాగే నాటకప్రదర్శనలకు సంబంధించింది. ఉచితానుచితాలు పాటించకుండా ఆ రోజుల్లో జరిగే నాటక ప్రదర్శనలలో పాడే పాటలను పద్యాలను ప్రదర్శనాపద్ధతులను విమర్శించడం జరిగింది. విశ్వామిత్రుడు దశరథుని తన యాగాన్ని రక్షించడానికి రామలక్ష్మణులను పంపమంటాడు. చిన్నవాళ్ళు వాళ్లెందుకు ? తానే వస్తానంటాడు దశరథుడు. తన ముక్కోపితనంతో దశరథుణ్ణి పద్యంలో శపించడానికి మొదలు పెడతాడు "నేనె కుశికతనయుడనేని" అని. పద్యంలో తరువాత మాటలను మరిచిపోయి అదేమాటలను మూడుసార్లంటాడు. పక్కన ఉన్న ఓ మంత్రి "ఏం విశ్వామిత్రా ! అవునో కాదో నని అనుమానంగా ఉందా?" అని పచ్చిగా విమర్శిస్తాడు. దశరథుడు "విశ్వామిత్రా ! పంపుతానుగాని అక్కడ ముళ్ళు. పొదలూ, పులులూ అవీ ఉంటాయిగదా, మరి నా పుత్రులను ఎలా తీసుకుపోతావు ?" విశ్వామిత్ర పాత్రధారికి బస్సుపాట వచ్చు. అందుకని వెంటనే "బస్సు పుట్టిందోయి బాబు బస్సు పుట్టింది, ఆ బస్సు పుట్టి బళ్ళవాళ్ళ కడుపు కొట్టిందీ" అని పాడుతూ "అటువంటి మహాబస్సు నెక్కించి తీసుకువెడతా" నంటాడు. ఆనాడు అంటే కాంట్రాక్టునాటకాలయుగంలో ఇలాంటి అసందర్భ అనుచిత సంభాషణలను పేరుకెక్కిన పెద్దపెద్ద నటులుగూడా వాడేవారు. వాని విమర్శే ఇది. ఇలా వ్యంగ్యంగానూ, సూటిగానూ, పచ్చిగానూ ఆనాటి నాటకాల విమర్శ జరిగి, నాటిక పేరుకు తగ్గట్టుగానే అర్థాంతరంగా ఆగిపోతుంది "అసం

పూర్ణరామాయణం" నాటిక. అవధాని మిగతా నాటికలలో వస్తువైవిధ్యం ఉన్నదిగాని వాటిల్లో ఏదీ ఈ నాటిక అంత ప్రాచుర్యానికి నోచుకోలేదు.

కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారని, సుప్రసిద్ధులైన కొడవటిగంటి కుటుంబరావుగారికి అన్న. చిన్నతనంలోనే కుటుంబాన్ని విడిచి ఎటో వెళ్ళిపోయారు. ఈయన తెనాలి సాహితీసమితి సభ్యుడు. గొప్పకవి అనీ, అలనాటి భావకవు లందరినీ తలదన్నేటంత భావుకత వ్యుత్పత్తి కలవాడనీ, ఆయనే ఉంటే నవకవిత్వం ఎన్నో కొత్తపుంతలు తొక్కేదనీ పెద్దలుచెప్పగా విన్నాను. 1921 లో "మాయపెళ్ళి" అనే నాటిక రాశాడు. దీని ప్రతి దొరక్కపోవడం వల్ల ఇది ఎంతటి నాటికో తెలుసుకోవడం సాధ్యం కాలేదు.

నాటికల సంఖ్యాబలం చూస్తే చిలకమర్తివారి తరువాత స్థానం, నార్ల వెంకటేశ్వరరావుగారిది. చిలకమర్తివారి నాటికలలో వస్తువైవిధ్యం మెండుగా ఉండగా నార్లవారి నాటికలలో రైతుకుటుంబాల సమస్యలు విరివిగా చోటు చేసుకున్నాయి. వారు రైతుకుటుంబానికి చెందినవా రవడంవల్లనేనేమో రైతుసమస్యలనే స్వీకరించారు. 1947 లో వారు రాసిన 16 నాటికలనూ ప్రచురించడం జరిగింది. భారతజాతికి స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని తెలియంగానేనో, స్వాతంత్ర్య ప్రాప్తి జరిగిన వెనువెంటనో వారిలో ఉత్తేజంకలిగి ఉత్సాహంతో ఈ 16 నాటికలనూ రాసి ఉంటారని నేను అనుకుంటాను. పల్లెటూరి రైతుకుటుంబాలలో ఉండే సమస్యలూ, ఇంటిపెద్దల పట్టుదలలూ, పెళ్ళిళ్ళూ, పేరంటాలూ, ఆచారాలూ. వ్యవహారాలూ, మూఢాచారాలూ వీరినాటికలలో విశేషంగా చోటు చేసుకున్నాయి. ఈ నాటికలలోని రంగాలన్నీ గ్రామీణస్థలాలే ; వీరి రచనాశైలి ముఖ్యంగా వ్యావహారికం. అప్పటప్పట గ్రామ్యంకూడా చోటు చేసుకుంది. "దాంపత్యం" నాటికను తాము ఒక పాశ్చాత్యరచయిత టెక్నిక్‌ను అనుసరించామన్నారు. కాని, ఆ టెక్నిక్ కేవలం పాశ్చాత్యపద్ధతి కాదనీ, భరతుడు పదిరకాల నాటకాలనూ పేర్కొన్న పట్టికలోని భాణమనీ, ఆ సాంకేతికత ఈ నాటికకు ఉందనీ చెప్పక తప్పదు. వీరి నాటికలలో రెండోమూడో పట్టణ వాతావరణానికీ సమస్యలకూ సంబంధించినవి ఉన్నాయి. కాబట్టి నార్లవారి రచనలు ముఖ్యంగా గ్రామాలకూ, కొద్దిగా పట్టణాలకూ సంబంధించినవని గమనించాలి.

జి. వి. కృష్ణారావుగారు మూడునాలుగు నాటికలు ఈ సమీక్షాకాలంలో రాశారుగాని అవి నాకు లభ్యం కావపోవడంవల్ల, వాటినిగురించి ఏమీ చెప్పలేక పోతున్నాను. ఈ వ్యాసంలో అందరి నాటికలనూ వ్యాఖ్యానించడం సాధ్యం కాదుగాని, పీలైనంతవరకూ వివిధ నాటికలలోని వైవిధ్యాన్నీ, విశిష్టతనూ తెలియజేయడానికి ప్రయత్నించాను.

1940–1947 వరకూ వచ్చిన నాటికలలోనూ, ఆ తర్వాత వచ్చిన నాటికలలోనూ పాశ్చాత్యనాటికల టెక్నిక్ అవలంబించారు. మాటలతో, భావాలతో ఆటలాడారేగాని సాంకేతికతలో కొత్తదారులు తొక్కలేదు. ఉదాహరణకు బెర్టోల్ట్ బ్రెఖ్టు అనే ఆయన "ఏలియనేషన్" అనే ఒక ప్రక్రియను వినియోగించాడు. ఆయన తూర్పుబెర్లిన్‌కు చెందినవాడు. ఈ ప్రక్రియ ఎందుకు ఉపయోగించాడో మన రచయితలు పూర్తిగా అవగాహన చేసుకోలేదు. ఈ ఏలియనేషన్ ప్రక్రియతో నాటకం మధ్యలో తన కమ్యూనిష్టుభావాలకు ప్రచారం కల్పించాడు. అంటే నాటకాన్ని (నాటికను) ప్రచారసాధనంగా వాడుకున్నాడు. మనవాళ్ళు తమతమ రాజకీయ సిద్ధాంతాల ప్రచారానికి నాటకాలను వాడుకున్నారు. ఈ ఏలియనేషన్‌ప్రక్రియలో నాటకాన్ని ఓరసవత్తరఘడియలో ఆపేసి ఇది నాటకం, నిజం మాత్రం కాదు అని తెలియజేస్తూ అంతరాయం కలిగించాడు. ఆ అంతరాయాన్ని ప్రచారానికి ఉపయోగించాడు. మనవారున్నూ ఇలాగే చేశారు మూఢంగా అనుకరిస్తూ. ఆయన చేసిందే పద్ధతి మరోటి ఏలియనేషన్ కానేకాదు అనే భావదాస్యానికి లోనై అనుసరించారేగాని టెక్నిక్‌లో నూతన ప్రయోగాలను రూపొందించలేదు. అలా రూపొందించి ఉంటే మన నాటికలు మామూలు మట్టిమనిషిని తనకుతానుగా ఆలోచింపజేసి అతనిలోని మేధశ్శక్తికి మెరుగులుపెట్టి ఉండేవి. మామూలుమనిషి మేధావులలో చేరేవాడు. ఒక కొత్త మేధావివర్గం తయారై మన నాటికలు ఇంతకన్నా గొప్పస్థాయికి చేరుకునేవి. టెక్నిక్‌ను కొత్తనడకలు నడిపిస్తే, కొత్త వెలుగులూ, కొత్త స్ఫూర్తీ మన నాటికలకు అబ్బేవి. ముందుముందు అభివృద్ధి చెందుతాయని ఆశిద్దాం.

వివిధ నాటికలనూ, వాటిలోని విషయాలనూ ఇంత వ్యాఖ్యానించావు గదా, ఈ సమీక్షాకాలంలో మంచి నాటికలను చెప్పలేవా ? అని ప్రశ్నించవచ్చు. సందర్భానుసారంగా ఈ కాలంలో వచ్చిన నాటికలలోని మెళకువలను వివరిం

చాను. అలా కాదు పెద్దపీట వేటికి వేస్తారు అని ప్రశ్నిస్తే మొట్టమొదట పెద్ద పీట ముద్దుకృష్ణ "అనార్కలీ"కి వేస్తాను. తరువాత ఆమంచర్ల గోపాలరావు "మల్లమదేవి ఉసురు"కూ, కొప్పరపు సుబ్బారావుగారి "అల్లీ ముతా"కూ పెద్ద పీటలు వేస్తాను. మిగతా నాటికలకు వాటి స్థానం వాటికి ఉంది. పరంపరగా పెద్దపీటలు వేసే పని పెట్టుకోవచ్చుగాని అవి బహుజనాదరణ పొందవు. అందు చేత ఆ పని చేయలేదు.

# అనుబంధం

| సంవత్సరం | రచయిత | నాటిక |
|---|---|---|
| 1910 | కందుకూరి వీరేశలింగం | బలాత్కార గానవినోదం |
| 1912 | గూడపాటి లక్ష్మీనరసమ్మ | స్వయంవరం |
| 1913 | వేటూరి ప్రభాకరశాస్త్రి | మధ్యమ వ్యాయోగం |
| 1915 | చిలకమర్తి లక్ష్మీనరసింహం | మధ్యమ వ్యాయోగం |
| 1916 | మల్లంపల్లి సోమశేఖరశర్మ | దేవీప్రసన్నం |
| 1919 | వింజమూరి లక్ష్మీనరసింహారావు | కృష్ణకుమారి |
| ,, | ,, | పన్నాబాయి |
| ,, | ,, | వీరమతి |
| ,, | ,, | వీరాబాయి |
| 1920 | బుక్కపట్టణం తిరుమల రాఘవాచార్యులు | చిత్రరథవీథి |
| 1921 | కొడవటిగంటి వెంకటసుబ్బయ్య | మాయపెళ్ళి |
| 1922 | కొత్తపల్లి లక్ష్మయ్య | భరత పట్టాభిషేకం |
| 1923 | జయంతి వెంకట కామేశ్వరరావు | చిత్ర |
| 1923 | గుడిపాటి వెంకటచలం | శివం |
| 1924 | నోరి నరసింహశాస్త్రి | గజ్జల మొలత్రాడు |
| 1924 | గుడిపాటి వెంకటచలం | హరిశ్చంద్ర |
| 1925 | యలమర్తి శ్రీనివాసరావు | మధ్యమ వ్యాయోగం |
| 1925 | మొసలికంటి హనుమంతరావు | బృహన్నల వ్యాయోగం |

| సంవత్సరం | రచయిత | నాటిక |
| --- | --- | --- |
| 1926 | నోరి నరసింహశాస్త్రి | క్షేమాభిక్కుని |
| ,, | శ్రీనివాస శిరోమణి | పరివర్తన |
| ,, | గుడిపాటి వెంకటచలం | శావలిని |
| 1927 | చిలకమర్తి లక్ష్మీనరసింహం | ఆత్మగౌరవం |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | కచటతపలు |
| 1927 | చిలకమర్తి లక్ష్మీనరసింహం | బధిర చతుష్టయం |
| ,, | ,, | బలవంత బ్రాహ్మణార్థం |
| 1929 | భమిడిపాటి కామేశ్వరరావు | బాగు బాగు |
| 1930 | గుడిపాటి వెంకటచలం | రంగదాసు |
| 1931 | ,, | భానుమతి |
| 1932 | ,, | చివరి కుండ |
| ,, | ముద్దా విశ్వనాథం | జన్మభూమి |
| ,, | ఆమంచర్ల గోపాలరావు | మాటపట్టింపు |
| 1934 | సామినేని ముద్దుకృష్ణ | అనార్కలీ |
| ,, | ,, | అపవాదు |
| ,, | చిలుకూరి నారాయణరావు | అశ్వత్థామ |
| ,, | గద్దె లింగయ్య | కలిమాయ |
| 1935 | దువ్వూరి రామిరెడ్డి | కాంగ్రెస్‌వాలా |
| ,, | మల్లాది విశ్వనాథ కవిరాజు | నాటికి నేడు |
| ,, | జి. వి. కృష్ణారావు | సునీథ |
| 1936 | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | కలంపోటు |
| ,, | భాగి నారాయణమూర్తి | పరీక్ష చదువు |
| ,, | ,, | పరీక్ష లపుడు |
| ,, | తల్లావఝుల శివశంకరశాస్త్రి | ప్రభు శాకల్యం |
| 1937 | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | పునాదిరాయి |

| సంవత్సరం | రచయిత | నాటిక |
|---|---|---|
| 1938 | మల్లాది విశ్వనాథ కవిరాజు | అపశ్రుతి |
| ,, | మల్లాది అవధాని | ఆంధ్రరాష్ట్రం |
| ,, | మల్లాది విశ్వనాథ కవిరాజు | కీర్రు గానుగ |
| ,, | పి. వి. రాజమన్నారు | నిష్ఫలం |
| ,, | మల్లాది అవధాని | భారత యోధులు |
| ,, | జి. వి. కృష్ణారావు | భిక్షాపాత్ర |
| ,, | ఆమంచర్ల గోపాలరావు | మల్లమదేవి ఉసురు |
| ,, | పి. వి. రాజమన్నారు | మాతృప్రేమ |
| 1939 | మల్లాది అవధాని | అసంపూర్ణ రామాయణం |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | ఘటన |
| ,, | మల్లాది అవధాని | జగజ్జ్యోతి |
| ,, | ,, | జగన్నియంత |
| ,, | ,, | నవద్వీపం |
| ,, | ,, | ప్రపంచయుద్ధం |
| ,, | ,, | బాలచంద్ర |
| ,, | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | లక్ష్యసిద్ధి |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | వద్దంటే పెళ్ళి |
| 1940 | ముద్దా విశ్వనాథం | ఛాయ |
| 1941 | బుచ్చిబాబు | ఉమర్ ఖయ్యాం |
| ,, | బాలాంత్రపు రజనీకాంతరావు | గ్రీష్మఋతువు |
| ,, | సోమయాజుల వెంకట రమణమూర్తి | గౌరికోసం |
| ,, | బాలాంత్రపు రజనీకాంతరావు | చండీదాసు |
| ,, | జి. వి. కృష్ణారావు | ఫ్రెంచ్ కామెడీ |
| 1942 | వింజమూరి శివరామారావు | రజకలక్ష్మి |

| సంవత్సరం | రచయిత | నాటిక |
| --- | --- | --- |
| 1942 | సూర్యచంద్రులు | సాంధ్యగీతి |
| 1943 | జి. వి. కృష్ణారావు | ఆదర్శశిఖరాలు |
| ,, | బుచ్చిబాబు | తిష్యరక్షిత |
| ,, | గోరాశాస్త్రి | దూరతీరాలు |
| ,, | గరికిపాటి రాజారావు | పశ్చాత్తాపం |
| ,, | అబ్బూరి వరదరాజేశ్వరరావు | ప్రతిమాసుందరి |
| ,, | వావిలాల సోమయాజులు | మధురప్రియ |
| ,, | పాలగుమ్మి పద్మరాజు | రాధాకృష్ణుడు |
| ,, | డి. వి. సుబ్బాశాస్త్రి | విద్యారణ్యుడు |
| ,, | మొదలి వేంకట సుబ్రహ్మణ్య శర్మ | విధినిర్వహణ |
| ,, | సోమయాజుల వేంకట రమణమూర్తి | సిద్ధౌషధం |
| ,, | బాలాంత్రపు రజనీకాంతరావు | సుభద్రార్జునీయం |
| ,, | తల్లావఝుల శివశంకరశాస్త్రి | స్త్రీ విరోధి |
| 1944 | కొప్పరపు సుబ్బారావు | అల్లీముతా |
| ,, | బుచ్చిబాబు | కృష్ణదేవరాయని కరుణకృత్యం |
| ,, | కొప్పరపు సుబ్బారావు | చేసిన పాపం |
| ,, | ,, | నేటి నటుడు |
| ,, | మహీధర రామమోహనరావు | మబ్బుతెర |
| 1945 | మారేమండ రామారావు | నైవేద్యం |
| ,, | ,, | పరిత్యాగం |
| 1946 | ధనికొండ హనుమంతరావు | ఎర్రబుట్టలు |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | ఎవరిగొడవ వాళ్ళది |
| ,, | వింజమూరి శివరామారావు | కళోపాసన |

| సంవత్సరం | రచయిత | నాటిక |
|---|---|---|
| 1946 | సాపిని జోగిరాజు | జీవనరేఖ |
| ,, | పి. వి. రాజమన్నారు | దయ్యాల లంక |
| ,, | మల్లాది వేంకట కృష్ణశర్మ | నామకరణం |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | నా మాటే నెగ్గించి |
| ,, | కందికొండ సత్యనారాయణ | ప్రకృతి-పురుష |
| ,, | ధనికొండ హనుమంతరావు | బుద్ధొచ్చింది |
| ,, | ,, | ప్రొఫెసర్ విండ్సన్ |
| ,, | భమిడిపాటి కామేశ్వరరావు | రెండు రెళ్ళు నాలుగు |
| ,, | మల్లాది వేంకట కృష్ణశర్మ | ఖారసత్వం |
| ,, | వింజమూరి శివరామారావు | విజయ పతాక |
| ,, | పి. వి. రాజమన్నారు | విముక్తి |
| ,, | మల్లాది వేంకట కృష్ణశర్మ | వీరవిహారం |
| ,, | పి. వి. రాజమన్నారు | వృథాయాసం |
| ,, | ,, | సంకల్పం-పర్యవసానం |
| 1947 | ఆచార్య ఆత్రేయ | పరివర్తన |
| ,, | త్రిపురనేని గోపీచంద్ | కరువు రోజులు |
| ,, | ,, | భగ్నజీవితాలు |
| ,, | పి. వి. రాజమన్నారు | వైకుంఠాచార్యులు |
| ,, | నార్ల వెంకటేశ్వరరావు | అర్ధాంగి |
| ,, | ,, | ఇంటిగుట్టు |
| ,, | ,, | ఏకాభిప్రాయం |
| ,, | ,, | కొత్త గడ్డ |
| ,, | ,, | జీవజ్వాల |
| ,, | ,, | దాంపత్యం |
| ,, | ,, | దొంగ – దొర |
| ,, | ,, | ద్రోహం |
| ,, | ,, | నవ కవి |

| సంవత్సరం | రచయిత | నాటిక |
|---|---|---|
| 1947 | నార్ల వెంకటేశ్వరరావు | పై పంట |
| ,, | ,, | ప్రారబ్ధం |
| ,, | ,, | భంగపాటు |
| ,, | ,, | వెలుగు నీడలు |
| ,, | ,, | శకునపక్షి |
| ,, | ,, | ఆడబ్రతుకు |
| ,, | ,, | ఆశాపాశం |

1900-1947 మధ్యకాలంలో వచ్చిన రచనలే గాని ఈ క్రింది నాటికల ప్రచురణ తేదీలు మాత్రం సరిగా తెలియవు.

మల్లాది విశ్వనాథ కవిరాజుగారి –
నేపథ్యం-పునస్సంధానం–రాజీ-లేత విడాకులు–హంసపాదు

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి –
సుమేధ

బలిజేపల్లి రాఘవరావుగారి –
వసతి గృహం.

కృతజ్ఞత :- ఈ నాటికలనూ, రచయితలనూ, తేదీలనూ "A Monograph on Bharata's Natya Sastra" అనే గ్రంథానికి నా సహ రచయిత అయిన డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి పరిశోధనా వ్యాసం "తెలుగు నాటకరంగము" అనుబంధంలో నుంచి సేకరించాను.



# తెలుగులో నాటకాలు

- ఆడపా రామకృష్ణరావు

కాకతీయులనాటి తెలుగుప్రజల నాగరకజీవితంలోని విశేషాలను వర్ణించే "క్రీడాభిరామం"లో నాయకుడు గోవింద మంచనశర్మ తన స్నేహితుడైన టిట్టిభసెట్టితో "ఈ లేమ చరిత మాడుదురు నాటకంబుగ నవనిలోన" అని అంటాడు. ఆ లేమ మాచలదేవి అనే వారాంగన. "ప్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠీప్రతిష్ఠాపారీణ." తన జీవితకాలంలోనే తన కథను రంగస్థలంమీద నటులు ప్రదర్శించేటంత పేరుప్రఖ్యాతులు గడించిన వనిత. ఐతే ఆనాడు ఆమె చరిత్రాన్ని అభినయించిన ఆ నాటకపుస్వరూపం ఎటువంటిదో మనకు తెలియదు. కాని, ఆ ప్రస్తావన చేసిన "క్రీడాభిరామం"మాత్రం ఇప్పటికీ మనకు లభిస్తున్న తెలుగునాటకాలలో మొట్టమొదటిది. వీథి అనే రూపకశాఖకు చెందిన రచన. వినుకొండ వల్లభరాయనిపేర శ్రీనాథుడు రచించిన నాటక మది. దానిలో శ్రవ్యకావ్యలక్షణాలే ఎక్కువగా ఉన్నవనుకోవడం పొరపాటు. దానిని మోపూరు భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శించారనీ, నటులది ద్వారసముద్రమనీ, విటులది ఓరుగల్లనీ కవి స్పష్టంగా చెప్పాడు.

మతపరమైన ఉత్సవాలతోనూ, దేవాలయాలలో జరిగే తిరునాళ్ళతోనూ నాటకప్రదర్శనాలకు కొంత సంబంధం ఉండడం ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో మనకు కనిపిస్తుంది. పాశ్చాత్యసాహిత్యంలో ప్రాచీనతమమైన గ్రీక్‌నాటకాలు డయనైసియస్ అనే మధుదేవతపూజలో జరిపే నృత్యగానాల నుంచి ఆవిర్భవించడమే గాక, ఆ నాటకప్రదర్శనాలు దేవోత్సవాలసమయంలో జరిగేవి. ఆరోగ్యంగా ఉన్న పౌరులందరూ ఆ నాటకాలు చూచితీరాలనే నియమం కూడా ఉండేది. మధ్యయుగంలో యూరప్‌ఖండంలోని వివిధదేశాలలో క్రైస్త

వాలయాలలో పర్వదినాల సందర్భంగా నాటకాలు రూపొంది, క్రమంగా విస్త
రించి, చర్చి అవరణనుంచి కూడలిదగ్గర ప్రదర్శించేటంత జనాదరణ పొందిన
నవి. కాళిదాసు రచించిన విక్రమోర్వశీయనాటకాన్ని ఉజ్జయినీనగరంలో మహా
కాలనాథుని ఉత్సవంలో ప్రదర్శించేవారు. క్రీడాభిరామనాటకంకూడా ఈవిధంగా
భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శితం కావడం గమనించదగిన విశేషం.

“గట్టు దాటి, పుట్ట దాటి, ఘనమైన అడవి దాటి” అన్నట్లు కురవంజి,
జక్కులకథ, యక్షగానం, వీథినాటకం, తోలుబొమ్మలాట, పగటివేషాల వంటి
జానపదరీతులను దాటి సునిర్దిష్ట సాహిత్య ప్రక్రియగా తెలుగులో నాటకం
రూపొందింది 19వ శతాబ్దంలో. 1880-'84 ప్రాంతాల తెలుగుజిల్లాలలో
ధార్వాడ్, పార్సీ నాటకసమాజాలు నాటకాలాడడంవల్ల కలిగిన ఉత్తేజం,
ఇంగ్లీషుసాహిత్యాధ్యయనంవల్ల ఆ భాషలోని నాటకాలవలెనే తెలుగులో కూడా
రచించవలె ననే ఉత్సాహం ఇందుకు కారణాలు.

కోరాడ రామచంద్రశాస్త్రిగారి “మంజరీ మధుకరీయం,” వావిలాల వాసు
దేవశాస్త్రిగారి “నందకరాజ్యం” అప్పటిలో తెలుగులో వెలువడిన స్వతంత్ర
నాటకాలు. సంస్కృతం నుంచి, ఇంగ్లీషునుంచి తెలుగులోనికి అనువాదాలుకూడా
అప్పుడు వెలువడినవి. మొత్తానికి 1900 నాటికి తెలుగులో వచ్చిన నాటకా
లలో వీరేశలింగంగారి “అభిజ్ఞాన శాకుంతలం” (1883), ధర్మవరం కృష్ణ
మాచార్యులవారి “చిత్రనళీయం” (1887), “విషాద సారంగధరం” (1889),
చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి “గయోపాఖ్యానం” (1889), వేదం వేంకట
రాయశాస్త్రిగారి “ప్రతాపరుద్రీయం” (1897), గురజాడ అప్పారావుగారి
“కన్యాశుల్కం” (మొదటి ముద్రణ 1892 లో) ముఖ్యంగా చెప్పుకోదగినవి.

“కన్యాశుల్కం” 1892 లోనే మొదట ప్రదర్శితమైనా, యావదాంధ్ర
జనానికీ సుపరిచితమైనదీ, అభిమానపాత్రమైనదీ 1909 లో ఎన్నో మార్పుచేర్పు
లతో ప్రకటితమైన ద్వితీయముద్రణ పాఠమే కాని మొదటిదికాదు. కనుక ఈ
సమీక్షలో “కన్యాశుల్కం”నాటక ప్రస్తావన సముచితమే. “మధురవాణీ
అంటూ ఒక వేశ్యాశిఖామణి యీ కళింగరాజ్యంలో వుండకపోతే భగవంతుడి
సృష్టికి యెంత లోపం వచ్చి వుండును ?”అని కరటకశాస్త్రి అంటాడు. కళింగ

రాజ్యంమాట అటుంచి మధురవాణిపాత్ర లేకపోతే తెలుగుసాహిత్యానికే తీరని లోపం వచ్చిఉండేదని రసజ్ఞులు ఏకగ్రీవంగా ఒప్పుకుంటారు. ఐతే ఆ మధుర వాణి విస్తరించిన ద్వితీయముద్రణపాఠంలో కనిపించే సరసురాలు కాని మొదటి ముద్రణకు సంబంధించిన పాత్ర కాదుగదా !

'కన్యాశుల్కం' తెలుగునాటకసాహిత్యంలో ఎన్నో నూతనమార్గాల నేర్ప రచి సుస్థిరమైన స్థానాన్ని గడించుకున్నది. ఇతివృత్తం నాటిసాంఘిక సమస్య కావడం ఒక విశేషం. భాష మొత్తం నాటకంలో ప్రజలకు నిత్యపరిచితమైన వ్యావహారికభాష కావడం మరొక విశేషం. రంగస్థల ప్రదర్శనాలద్వారా ప్రేక్ష కులకు కేవలం వినోదమో, విజ్ఞానమో గాక సంఘసంస్కరణకు నాటకాన్ని ఒక శక్తిమంతమైన సాధనంగా రచయిత గుర్తించడం ఇంకొక విశేషం. అన్ని టిని మించిన విశేషం రచయిత మానవతావాదం. ప్రపంచమంత విశాలమైన పరిధి ఈ నాటకకథ కేర్పడి నిత్యజీవితంలో మన కెదురయ్యే వ్యక్తులకు సజీవ ప్రతిబింబాలవంటి పాత్ర లనేకు లీ నాటకంలో మనకు పరిచయ మవుతాయి. గిరీశం, మధురవాణి, అగ్నిహోత్రావధానులు, లుబ్ధావధాని, రామప్ప పంతులు, మీనాక్షి, కరటకశాస్త్రి, శిష్యుడు, వెంకటేశం, హెడ్‌కానిస్టేబుల్, కొండిభట్లు, అసిరిగాడు - అందరూ ప్రాణం పోసుకుని మన మనోవీథిలో సంచరిస్తూనే ఉన్నారు. నాటకనిర్మాణంలో లోపాలు లేవనికాదు. సన్నివేశా లెక్కువ కావడం వల్ల కథలో బిగి తగ్గింది. సౌజన్యరావు, లుబ్ధావధానులువంటి పేర్లు కృత్రిమంగా ధ్వనిస్తాయి. కాని ఇటువంటి నీహారలేశాలవల్ల ఆ నాటకం గౌరవానికి కొరత రాలేదు. తెలుగులో వచ్చిన అద్వితీయనాటకం "కన్యాశుల్కం."

నాటి తెలుగునాటక రంగస్థితినిగురించి అప్పారావుగారు వ్యక్తం చేసిన భావాలను ఈ సందర్భంలో గమనించడం అవసరం. 1909 లో అచ్చయిన 'కన్యాశుల్కం' ద్వితీయముద్రణ పీఠికలో ఆయన ఈ విధంగా వ్రాశారు.

"Itinerant Maharatha troupes staged Hindi plays in the Telugu districts and made money. Local companies copied their example and audiences listened with delight to what they did not understand. The bliss of ignorance could not have been more forcibly illustrated. Kanyasulkam gave little

scope to vulgar stage attractions such as flaring costuirmes, sensuous dances, bad music and sham fights; yet it drew crowded houses and vindicated the claims of the vernacular ......I am glad to find that Hindi plays are on the decline. But the conditions of the Telugu stage can by no means be considered satisfactory...... There are not many good plays ...... Modern life which presents complex social conditions is neglected by play-wrights except for purposes of the broadest farce, and poverty of invention is manifested by the handling of threadbare romantic topics. Few writers display knowledge of technique."

మరాఠీనాటకసమాజాలు తెలుగునాట ఆడిననాటకాల ప్రభావంవల్ల చెమ్కీదుస్తులకు, అసహజమైన కొట్లాటలకు, కర్ణకఠోరమైన సంగీతానికి మన నాటకాలలో స్థానం లభించిందనీ, క్రమంగా హిందీనాటకాల ప్రదర్శనం తగ్గుతున్నా, తెలుగునాటకరంగపు స్థితి తృప్తికరంగా లేదనీ, మంచినాటకాలు అరుదుగా వస్తున్నవనీ, నాటకశిల్పం గ్రహించిన రచయితలు కరువయ్యారనీ, సమకాలీన సామాజిక జీవితం ప్రహసనాలకుమాత్రమే పరిమిత మవుతూ ఉన్నదనీ అప్పారావుగారు వ్రాశారు. నాటి రంగస్థలపు ఆకర్షణ లన్నిటికీ దూరంగా, ఏటి కెదురీతగా, వ్యావహారికభాషలో సామాన్యవ్యక్తులను పాత్రలుగా చేసి, పద్యాలు లేకుండా, చౌకబారునృత్యాలకు తావులేకుండా ఆయన రచించిన 'కన్యాశుల్కం' అశేషజనాదరణ పొందడం విశేషమే.

1900 నుంచి తెలుగునాటకాల స్వరూపాన్ని గమనిస్తే, నాటకప్రదర్శనమే వృత్తిగా పెట్టుకున్న సమాజాల (Professional theatre) విస్తరణ, నటులకు ప్రజలలో పేరుప్రఖ్యాతు లేర్పడి నాటకాలకు ప్రజాదరణ లభించడం, నాటకాలలో ఎక్కువగా పౌరాణికమైన ఇతివృత్తాలూ, అక్కడక్కడ చారిత్రక కథలూ ఉండడం, సంగీతానికీ-పాటలకూ-పద్యాలకూ ప్రాధాన్య మేర్పడడం మనకు కనిపిస్తుంది. 1920 వరకు ఈ విధంగా సాగింది.

పిఠాపురం రాజావారి ఆస్థానపండితుడైన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు "రాధాకృష్ణ" (1909) వంటి పౌరాణికనాటకాన్ని రచించడంతోపాటు

తెలుగువారికి అశేషాదరపాత్రమైన "విప్రనారాయణ" చరిత్రనూ, "కంఠాభరణం" అనే వ్యంగ్య హాస్యనాటకాన్నీ వ్రాశారు. అప్పటికి దేశంలో పెద్ద ఆకర్షణగా రూపుదిద్దుకున్న అవధానాలమీదకూడా ఒకవిసురు విసిరా రా హాస్య రచనలో.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి "బొబ్బిలియుద్ధం" తెలుగుదేశపుచరిత్రపై ఆధారపడ్డ నాటకం కావడమే కాదు, కథకు నాయకుడు రంగారావు గనుక నాయకమరణంతో కూడిన విషాదాంతనాటకం కూడా అది.

విపులజనాదరణ పొందిన తిరుపతి వేంకట కవుల నాటకాలుకూడా ఈ యుగానికి చెందినవే. సంస్కృతం నుంచి వారు తెనిగించిన నాటకాలలో ముఖ్యంగా "ముద్రారాక్షసం", "మృచ్ఛకటికం" ప్రశస్తమైనవి. ఎక్కడా అనువాదమని అనిపించకుండా సాగిన రచన లవి. స్వతంత్రకృతులలో భారత నాటకాలు, వాటిలో "తత్రాపి చ చతుర్థోఽంకః" అని పేరొందిన పాండవోద్యోగ, విజయ నాటకాలు (1911) ప్రత్యేకించి చెప్పుకోతగ్గవి. ఉద్యోగ విజయాలలోని పద్యాలు తెలియని తెలుగువాడే ఆనాడు దేశంలో లేడంటే అందులో అతిశయోక్తి ఏమాత్రం లేదు. "లోకుల రసనలె యాకులుగా మందునట్టి యవివో కవితల్" అని సంకుసాల నృసింహకవి ప్రతిపాదించిన పరీక్షలో ఘన విజయం సాధించిన పద్యాలవి.

> "అదిగో ద్వారక, యాలమంద లవిగో..."
> "నాల్గు పయోధులో యనగ, నాలుగు దిక్కరులో యనంగ నీ నల్గుర తమ్ములున్ ప్రమథనాథసమానులు..."
> "జెండాపై కపిరాజు, ముందు సితవాజిశ్రేణియున్..."
> "అలుగుటయే యెఱుంగని మహామహితాత్ము డజాతశత్రువే..."
> "దగ్గర లేరు మామయును, తండ్రియు...."
> "వంది మాగధులు కైవారంబు సేయకున్నారేల నీరజనాభ నేడు"
> "హరి సారథ్యము లేదు లే వకట దివ్యాశ్వంబులు..."

ఇటువంటి రత్నాలు ఆ నాటకాలలో ప్రతి ఘట్టంలోనూ ఉండడంవల్లి ఆ నాటకాల కంతటి ఆదరణ లభించింది. ఉద్యోగ విజయ నాటక ప్రదర్శనంలో

పాల్గొని ప్రేక్షకులమెప్పు పొందడమే నటనాకౌశలాని కొక గీటురాయి అయిం దా నాడు.

రసవంతమైన కవిత్వమైకూడా ఎక్కడా అన్వయక్లిష్టత లేకపోవడం ఈ పద్యాలలో ఒక విశేషం. ఒక ఉదాహరణం చూడండి :

"దగ్గర లేరు మామయును తండ్రియు, ద్రోణునితోడి పోరు కా
దగ్గది, భార్య గర్భవతి, తల్లి సుభద్ర త్వదేకపుత్ర, నీ
వగ్గె నిరంకుశంబు, పసివాడవు, పాపులు వారు, మేనికిన్
గగ్గురుపాటు పుట్టె కొడుకా నిను యుద్ధము సేయ బంపగన్."

అసలు తెలుగుసాహిత్యం పుట్టననాటినుంచీ తెలుగువారికి భారతంమీద మక్కువ అలవడింది. అందుకే "తింటే గారెలు తినాలి, వింటే భారతం వినా"లని సామెతకూడా వచ్చింది. భారతం ప్రధానంగా ధర్మప్రతిపాదక గ్రంథం కదా. ఇతరులకంటె తెలుగువారికి ధర్మంమీద అమితగౌరవమని అనుకుంటే అది దేశాభిమానం కావచ్చునుగాని సత్యంమాత్రం కాబోదు. కాగా కవిత్రయం కవితా సౌందర్యమూ, రాజకీయవ్యాసంగంపై తెలుగువారికి సహజంగానే అలవడిన ఆసక్తి ఈ ఆదరణకు కారణాలని చెప్పుకోవాలి. లేదా రాజరాజనరేంద్రుని వలె భారతశ్రవణాసక్తివల్ల వారికి ఈ అభిరుచి ఏర్పడి ఉండాలి. ఏమైనా ఇతి వృత్తం సుపరిచితమైనది కావడం, హృదయాన్ని కదిలించే సన్నివేశాలూ, రసార్ణవంలో ఓలలాడించే పద్యాలూ తిరుపతి వేంకటకవుల ఉద్యోగ విజయ నాటకాల బహుళ వ్యాప్తికి కారణాలు.

సంస్కృత నాటక మర్యాదననుసరించి కథలో యథోచితంగా మార్పులు చేశారు. "అశ్వత్థామా హతః" అన్న మాట ధర్మరాజునోట పలికించకుండా ధర్మరాజురూపంతో ఘటోత్కచు డన్నట్లు కల్పన చేశారు. "నీక జయ మగు సూ సుభద్రాకుమార" అని - నీకే జయ మగుగాక, నీకు+అజయ మగుగాక- రెండర్థాలు స్ఫురించే ఆశీర్వచనం ధర్మరాజుతో పలికించడంకూడా ప్రాచీన సంప్రదాయానుసరణాని కొక ఉదాహరణం. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన వంటి రససిద్ధులయిన మహాకవులు రచించిన పద్యాలుండగా తిరిగి ఆ ఘట్టాలనే కథా వస్తువుగా ఎంచుకుని కవిత్రయంవారి రచనతో దీటు రాగల పద్యాలతో ఉద్యోగ

విజయ కథలతో నాటకరచన చేసి కృతకృత్యులు కావడం కష్టం. తిరుపతి వేంకటకవు లీ సాహసకార్యాన్ని సాధించి తెలుగుసాహిత్యానికి వన్నెపెట్టారు.

ఈ పౌరాణికనాటకయుగంలో వెలువడి ఎక్కువగా ప్రజాదరణ పొందిన నాటకాలలో ముఖ్యంగా బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి 'హరిశ్చంద్ర'(1912)ను, ముత్తరాజు సుబ్బారావుగారి 'శ్రీకృష్ణతులాభారం' నాటకాన్ని (1920) చెప్పుకోవాలి. హరిశ్చంద్ర కథలో ఉన్న కరుణరసమూ, హరిశ్చంద్రుని సత్యనిష్ఠా, త్యాగనిరతీ, పద్యాల రమ్యతా, నక్షత్రకుని పాత్రద్వారా హాస్యమూ, డి. వి. సుబ్బారావుగారివంటి నటుల ప్రతిభా ఈ నాటకానికి బహుళవ్యాప్తి కలిగించాయి. "జో! ఇనవంశకౌస్తుభమణీ! జో! లోహితా! యన్న సందడి కన్నుమూసెడి నీకు నెట్లమరె నిద్రాసౌఖ్య మీ రాలపై" - "అంతటి రాజచంద్రునకు నాత్మజవై..." - "వైదికవృత్తి సంపాదింతు నందువా, ఉడుగవు రాచపోకడలు నీకు" - "కాసంత మెరమించి మోసగించెద వేల తోడురావమ్మ విద్యుల్లతాంగి" వంటి పద్యాలన్నీ తెలుగుప్రేక్షకులకు అప్రయత్నంగానే కంఠపాఠమైనవి. "చావు నెఱుగలేని చదువేటి చదువయా" అన్నాడు వేమనయోగి. హరిశ్చంద్రుడు విధివశాన కాటికాపరి కావడం, అక్కడికి అతనిభార్యయే కుమారుని శవాన్ని మోసుకుని రావడం - ఈ శ్మశానఘట్టం ప్రేక్షకులను పూర్తిగా కదిలించివేస్తుంది. ఆ సందర్భంలోని మరుపురాని పద్యాలలో ఒకటి :

> "మాయామేయజగంబె నిత్యమని సంభావించి మోహంబునన్
> నా యిల్లాలని, నా కుమారుడని ప్రాణం బుండునందాక యెం
> తో యల్లాడిన నీ శరీర మిపు డిందున్ కట్టెలం గాలుచో
> నా యిల్లాలును నా కుమారుడును తోడై రారు తప్పింపగన్."

కృష్ణతులాభారనాటకం కూడా స్థానం నరసింహారావుగారి వంటి నటశేఖరుని సత్యభామాపాత్రాభినయంవల్ల కొంత జనాదరణ పొందింది. నారదునిపాత్ర "సర్వేశ్వరుండగు శౌరి కింకరుజేయు ధన మున్నదే భక్తిధనముగాక" వంటి పద్యాలూ, "మీరజాలగలడా నా యానతి సత్యాపతి"వంటి పాటలూ ప్రసిద్ధమైనవి. తిరుపతి వేంకటకవుల నాటకాలలోని కావ్యగుణం వీటిలో కొరవడినా ఇతర కారణాలవల్ల ఇవి రాణించాయి.

ధర్మవరం గోపాలాచార్యులుగారి "రామదాసు" నాటకం కూడా ఆ రోజుల్లోనే వెలువడి బహుళ ప్రచారం పొందింది. "భద్రాద్రిరఘురాము భజనకు జనుచుండ బంధుమిత్రులయాజ్ఞ బడయనేల" అనే ప్రశ్న (?) తెలుగు రంగస్థలం మీద మారుమ్రోగింది. భక్తిప్రధానమైన కథ, నాయకుడు తెలుగుదేశానికి చెందినవాడు కావడం, బళ్ళారి రాఘవాచార్యులుగారివంటి మహానటుడు రామదాసు పాత్ర నభినయించడం ఈ జనరంజకత్వానికి కొన్ని కారణాలు. అయితే చారిత్రకపరీక్షకు నిలువని ఘట్టాలు కథలో చాలా కనిపిస్తాయి. అబుల్ హసన్ తానాషా ఈ నాటకంమూలాన తెలుగువారికి "తానీషా" అయి కూర్చున్నాడు. "రామోజీ, లక్ష్మోజీ" పేర్లు కూడా దీనిలోనివే. అన్నిటినిమించి ఎప్పటివాడో, ఎక్కడో కాశీక్షేత్రంలో వసించిన కబీరు తెలుగుదేశానికి వచ్చి రామదాసుగారికి తారకమంత్రోపదేశం చెయ్యడం ఒక విశేషం. తెలుగువారికి ఆవేశం ఎక్కువ. తొందరగా కదలిపోతారు. నిదానంగా మంచి చెడుగులను పరిశీలించి నిజం గ్రహించే స్వభావం తక్కువ. అందుకే హృదయాన్ని కలించి కన్నీరు తెప్పించే ఘట్టాలున్న నాటకాలకే కావ్యశిల్పంతో నిమిత్తం లేకుండా అధిక ప్రచారం లభించింది.

1920 వరకు తెలుగురంగస్థలంమీద పౌరాణికనాటకాలకే ఎక్కువ ఆదరణ ఉండేది. తరువాత "తరి గాంధీయుగ మేగుదెంచె" కాగా దేశభక్తి పూరిత కథలకూ, సాంఘికచైతన్యం తొణికే కథలకూ ప్రాముఖ్యం కలిగింది. గాంధీగారినే నాటకాలలోనికిలాగి దామరాజు పుండరీకాక్షుడుగారివంటి జాతీయవాదులు "గాంధీ మహోదయం, గాంధీవిజయం" వంటి నాటకాలు రచించారు. పంజాబ్ రాష్ట్రం పూర్వపు పాంచాలదేశం కావడంవల్ల జలియన్‌వాలాబాగ్ దురంతాన్ని పురస్కరించుకుని "పాంచాల పరాభవం" వంటి నాటకాలు వెలువడ్డాయి.

గాంధీగారి సంఘసంస్కరణోద్యమప్రభావం వల్ల సాంఘికనాటకాలకు కూడా నాటినుంచి వ్యాప్తి కలిగింది. "వరవిక్రయం, మధుసేవ, చింతామణి" నాటకాలు కాళ్ళకూరి నారాయణరావుగారి రచనలు వెలువడ్డాయి. ముఖ్యంగా 'వరవిక్రయం, చింతామణి' ప్రజాదరణ పొందాయి. కృష్ణకర్ణామృతకర్త బిల్వమంగళుడు చింతామణి నాటకానికి నాయకుడు. కాని కథ పూర్తిగా కల్పనయే. పాత్రల మనఃపరివర్తన చాలా అసహజంగా ఉంటుంది. ఐనా ప్రేక్షకుల ఆశే

షాదరానికి పాత్రమైన నాటక మది. ఈ రచనలన్నీ వ్యావహారికభాషకు సన్ని హితమైన సరళగ్రాంథికభాషలో సాగాయి.

సాహిత్యగౌరవానికి నోచుకున్న నాటి నాటకాలలో ముఖ్యంగా విశ్వనాథ వారి 'వేనరాజు'ను, 'నర్తనశాల'ను, త్రిపురనేని రామస్వామిచౌదరిగారి 'ఖూనీ,' 'శంబుకవధ' నాటకాలను పేర్కొనాలి. 'నర్తనశాల' విషాదాంత నాటకం. ఎందుకంటే కీచకుడు నాయకుడు. ఆ పాత్రను విశ్వనాథవారు ఎంతో ఉదాత్తంగా చిత్రించారు. 'వేనరాజు'కు సమాధానంగా వెలువడ్డ నాటకం 'ఖూనీ.' వేనుడు ధర్మాత్ముడనీ, ఋషులు స్వార్థంవల్ల అతన్ని హత్య చేశారనీ చౌదరి గారు ప్రతిపాదించారు. 'శంబుక వధ' నాటకరచన సందర్భంగా ఆయన 'వచనమునందుకన్న పద్యమునందు నెక్కువ భావప్రకటనమున కవకాశము గలదన్న వాద మాదరణీయము కా'దని కంఠోక్తిగా వ్రాయడంవల్ల నాటి ప్రేక్షకుల అభిరుచిని గురించీ, రచయితల వైఖరినిగురించీ గ్రహించడానికి వీలుంది.

ఆ కాలంలోనే, జాతీయోద్యమప్రభావంవల్లనే కొప్పరపు సుబ్బారావుగారి 'రోషనార,' పింగళి నాగేంద్రరావుగారి 'నా రాజు,' 'వింధ్యరాణి' వంటి మిశ్ర చారిత్రక నాటకాలు వెలువడినవి.

1943 లో ప్రజానాట్యమండలి స్థాపనతో నాటకాలలో సమకాలీన సాంఘిక జీవన చిత్రణకు, వాస్తవికతకు ప్రాముఖ్యం లభించింది. అప్పుడు వెలువడ్డ నాటకాలలో సుంకర సత్యనారాయణగారూ, వాసిరెడ్డి భాస్కరరావు గారూ కలిసి రచించిన 'ముందడుగు' (1946), 'మా భూమి' దేశంలో గొప్ప సంచలనం కలిగించాయి.

తెలంగాణాలో జమీందారీవ్యవస్థకు వ్యతిరేకంగా కర్షకులు, వ్యవసాయ కూలీలు జరిపిన పోరాటం తెలుగుసాహిత్యంలో ప్రశస్తమైన సృజనాత్మక రచనల ఆవిర్భావానికి కారక మయింది. 'మా భూమి' నాటకానికి ప్రేరణకూడా ఈ ఉద్యమంనుంచి లభించినదే. ఆ ఉద్యమానికి వ్యతిరేకంగా నాటి నిజాం నిరంకుశ ప్రభుత్వ మవలంబించిన దమననీతివల్ల 240 గ్రామాలమీద పోలీసుల దాడి జరిగింది. వేల లెక్కలో ప్రజలను జైలులో పెట్టారు. ఎందరో ప్రాణాలు కోల్పోయారు. స్త్రీల మానభంగాలు, ఆస్తి లూటీలు, చిత్రహింసలు – సర్వ

సామాన్యమైన కాల మది. జాతిలో కలిగిన చైతన్యం సాహిత్యంలో ప్రతిఫలించి తీరుతుంది. 'మా భూమి' ప్రేక్షకులను ఉత్తేజితులను చేసి, వారిలో సంఘంలోని దుస్థితిని గురించి స్పందన కలిగించింది. శక్తిమంతమైన ప్రచారసాధనంగా రూపొందించిన రచన కూడా సాహిత్యగౌరవాన్ని అందుకోగలదని నిరూపించిన నాటక మిది. "ఇందులో అచ్చమైన తెలుగుజాతీయము కుప్పలు కుప్పలుగా ఉంది" అని విశ్వనాథ సత్యనారాయణగారు, "తిక్కన తర్వాత మళ్ళీ ఈనాడు జాతీయభాష విన్నాం"అని పింగళి లక్ష్మికాంతంగారు ప్రశంసించారు.

1900 నుంచి 1947 వరకు వచ్చిన తెలుగునాటక సాహిత్యాన్ని పరిశీలిస్తే, అటు 'కన్యాశుల్కం,' ఇటు 'మా భూమి' మనకు ఎల్లలుగా కనిపిస్తాయి. కృతకభాషకు వ్యతిరేకంగా, నిజంగా ప్రజలు నిత్యజీవితంలో మాటాడే భాషలో నాటి సాంఘిక సమస్యపై ప్రజలలో విజ్ఞత కలిగించి సమాజంలో మార్పు తీసుకురావాలనే లక్ష్యం 'కన్యాశుల్కం.' అటువంటి లక్ష్యంతోనే వెలువడ్డ నాటకం 'మా భూమి.' ఈ రెండు నాటకాలూ సాహిత్యంగా పండితుల మెప్పు పొందడంతో పాటు రంగస్థలంమీద విశేషప్రచారం పొందాయి. ప్రచారానికీ, సాహిత్యానికీ మధ్య అంతరం ఉండనక్కరలేదని స్పష్టంగా నిరూపించాయి.



# తెలుగుసాహిత్య విమర్శలో ఆధునిక ధోరణులు

చేకూరి రామారావు

౧

సాహిత్యం ఎప్పుడు పుట్టిందో సుమారుగా సాహిత్య విమర్శకూడా అప్పుడే పుట్టి ఉండాలి. సాహిత్యం మౌఖికంగా ఉన్నదశలో సాహిత్యవిమర్శ కూడా మౌఖికంగానే ఉంటుంది. ఆదిమసమాజాల్లో బహుశా శ్రోత లందరూ సాహిత్యవిమర్శకులే అయి ఉంటారు. సమాజంలో విభజనలు అంతగా లేని రోజుల్లో, సాహిత్యకర్త, విమర్శకుడు ఒకరిలోనే కలిసి ఉండొచ్చు. లిఖిత సాహిత్యం లేని భాషల్లో సాహిత్యవిమర్శ ఏ రూపంలో ఉందో మనకు తెలి యదు. లిఖితసాహిత్యం ఉన్న భాషల్లో అయినా సాహిత్యవిమర్శ ఖచ్చితంగా లిఖితంగా ఉంటుందో లేదో చెప్పలేం. కాని ముద్రణాసౌకర్యం ఉన్నభాషల్లో సాహిత్యవిమర్శ తప్పకుండా ఉంటుంది.

మనకు తెలుగులో సంస్కృతానికి భిన్నమైన సాహిత్యశాస్త్రం లేదు. మన సాహిత్యశాస్త్రగ్రంథాలన్నీ సంస్కృతసిద్ధాంతాలకు పద్యంలోనో గద్యం లోనో చేసిన అనువాదాలు నన్నయ్య మొదలయిన కవులు తమగ్రంథాల్లో కవి త్వాన్ని గురించిన కొన్ని అభిప్రాయాలు చెప్పారుగాని వాటికి సిద్ధాంతస్థాయి లేదు.

తెలుగులో సాహిత్యవిమర్శ ప్రాచీనకావ్యాలకు వ్యాఖ్యానరూపంలో మొద లయినట్టు కనిపిస్తున్నది. మనకు దొరుకుతున్న తొలిసాహిత్య విమర్శలు అట్లా ఉన్నై. ఈ వ్యాఖ్యానసంప్రదాయం కూడా మనకు సంస్కృతంనుంచి వచ్చిందే. ఇంగ్లీషువాళ్ళు మన దేశంలో ముద్రణాయంత్రం ప్రవేశపెట్టిన తరవాత దేశ విదే

శీయులైన పండితులు ప్రాచీనాంధ్రగ్రంథాలను అచ్చువేసేపట్పుడు టీకా తాత్ప ర్యాలతో అచ్చువెయ్యటం ప్రారంభించారు. వీటితోపాటు, పద్యంలో చమ త్కారం, ఛందోఽలంకారవిశేషాల వంటివి చూపించేవారు. ఈ రకపు వ్యాఖ్యా నాల్లో ఏ పద్యానికి ఆ పద్యమే విడివిడిగా వ్యాఖ్యానించబడటంవల్ల గ్రంథం మొత్తం గురించి ఒక అభిప్రాయం ఏర్పడటం కష్టం.

1820 లో అచ్చయిన కావలి రామస్వామిగారి దక్కమకవుల చరిత్రతో మొదలయిన తెలుగుకవుల చరిత్రలు, సాహిత్యచరిత్రలు కూడా తెలుగులో సాహిత్యవిమర్శకు తొలిరూపాలుగానే గ్రహించవచ్చు. అయితే కవులచరిత్రల్లో కవినిగురించి స్థూలపరిచయాలుమాత్రమే ఉండటానికి వీలుంది. అదీగాక తెలుగు కవుల చరిత్రల్లో ఎక్కువభాగం కాలాన్నిగురించి, కర్తృత్వాన్నిగురించి, గ్రంథ క్రమాన్ని గురించి చర్చించాల్సిరావటంవల్ల వీటిల్లో గ్రంథవిమర్శకు అవకాశం తక్కువ. అయినప్పటికీ ఒక కవినిగురించి, ఒక కావ్యాన్నిగురించి, ఒక ప్రక్రి యను గురించి స్థూలమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకోటానికి ఈ సాహిత్య చరిత్రలు సహాయకారులు. వీరేశలింగంగారు 1886-1897 మధ్యకాలంలో రచిం చిన కవులచరిత్రలో ఈ రకమైన సాహిత్యచరిత్ర కనిపిస్తుంది. వీరేశలింగం గారు సామాజిక సాహిత్యవిషయాల్లో పరిశుద్ధవాది. సాహిత్యంలో అధర్మశృం గారం, సమాజంలో వేశ్యా జీవనం - ఈ రెంటినీ సెన్సారు చెయ్యాలంటారు.

తొలిరోజుల్లో విమర్శలను ఫలానివని విడదీయటం కష్టం. సామాజిక, సాహిత్య, భాషా, ఛందో విషయాలన్నీ దాదాపు కలిసే ఉండేవి. ఆ కాలపు చర్చల్లో కొన్నిటిని కురుగంటి సీతారామయ్యగారీ విధంగా పేర్కొన్నారు. (సీతారామయ్య 1942, పే. 204.)

1. నన్నయ్య వైదీకా ? నియోగా ?
2. ఆంధ్రంబున ననుస్వారంబు కలదా ?
3. కృష్ణరాయలు క్షత్రియుడా ? శూద్రుడా ?
4. నన్నెచోడుడు నన్నయకంటె పూర్వుడా ?
5. నాచన సోమన, యెఱ్ఱాప్రెగడలలో నెవరిస్థాన మెట్టిది ?

6. బట్టుమూర్తి రాజరాజభూషణు లిద్దరా ? ఒక్కడేనా ?

7. ఒంటిమిట్ట వరంగల్లు వాదము.

8. కురు పాండవుల దాయభాగ చర్చ.

9. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతమేనా ?

తెలుగుసాహిత్యవిమర్శలో భాషాంశాలు ఎక్కువచోటు చేసుకోటం ఒక ఆశ్చర్యకరమైన సంఘటన. పుస్తకాలు తాటాకుల్లోనుంచి అచ్చులోకి ఎక్కించేటప్పుడు సరిఅయిన పాఠనిర్ణయం చెయ్యాల్సి ఉంటుంది. అట్లాంటి నిర్ణయం చేసేటప్పుడు భాషాఛందోవిషయాలు సహజంగా ఎక్కువ స్థానం ఆక్రమిస్తై. కాని తెలుగుసాహిత్యవిమర్శకు పట్టిన దుర్గతివల్ల భాషాచర్చలే సాహిత్యవిమర్శగా అప్పటినుంచి ఇప్పటివరకు చెలామణి అవుతున్నై. వీరేశలింగంగారి విగ్రహతంత్ర విమర్శనము మొదలుకొని మొన్నమొన్నటి కొత్త సత్యనారాయణ చౌదరి రామాయణకల్పవృక్ష ఖండనం వరకు ఇదే పరిస్థితి సాగింది. తొలి రోజుల్లో ఇందుకు భాషావివాదాలు కొంత కారణమయినై. గ్రాంథిక వ్యావహారిక భాషల విషయంలో ఆవేశరహితంగా మాట్లాట్టం ఇప్పటికీ మనకు చేతకావటం లేదు.

తెలుగులో పత్రికారచన ప్రారంభ మయినతరవాత తెలుగుకావ్యాల పరిశీలన వ్యాసరూపంలో జరుగుతూ వచ్చింది. కావ్యాల్లో అలంకారాల్ని గురించి, రసాన్నిగురించి చేసే చర్చలు అప్పటి వేదం వేంకటరాయశాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి మొదలయినవారు చేశారు. ఆ రకమైన సంప్రదాయం పటిష్ఠంగా విశ్వనాథ సత్యనారాయణ, పాటిబండ మాధవశర్మ వంటివాళ్ళు ఇటీవలి వరకు సాగించారు. బహుశా ఈ సంప్రదాయం ఇంకా కొంతకాలం సాగొచ్చు.

నా ఈ ప్రసంగంలో నిర్వాహకులు ఏర్పరచిన కాలపరిమితితోపాటు కొన్ని విషయపరిమితులు కూడా ఏర్పరచుకొంటున్నాను. ఇంతవరకు ప్రస్తావించిన సాహిత్యవిమర్శనాధోరణులను గురించి ఇంకేమీ చెప్పను. అంటే భాషావివాదాలు, టీకాతాత్పర్య వ్యాఖ్యానాలు, అలంకార గుణదోషాలు, రసభంగ, రసాభాసాది పరిశీలనలను నా ప్రసంగంలో విమర్శించబోను. అందుకు కారణం

అవి ముఖ్యమైనవి కావని కాదు. ఆ పని నాకన్నా సమర్థంగా చెయ్యగలిగిన వాళ్ళు చాలామంది ఉన్నారు. అదీగాక ఆ రకమైన విషయాలమీద చేసిన పరిశీలనలు ఇతరత్రాకూడా దొరుకుతై.

సాహిత్యవిమర్శలో మనం ఆధునికం అనుకుంటున్న విమర్శనాధోరణులను మాత్రమే నా ఈ ప్రసంగానికి ప్రముఖవిషయాలుగా ఎంచుకొంటున్నాను. సాహిత్యవిమర్శమీద ఇంతవరకు వచ్చిన గ్రంథాల్లోనూ, వ్యాసాల్లోనూ ఆధునికతకు తగిన స్థానం దొరకలేదని నా ఉద్దేశం. దొరికినా ఇంతకుముందు పేర్కొన్న విషయరాశిలో ఆధునికత మరుగున పడిపోయినట్లు కనిపిస్తుంది.

నిర్వాహకుల అనుమతితో ఆధునికవిమర్శనాధోరణుల ఆరంభవికాసాలను నాకు దొరికినంతవరకు పరిశీలిస్తాను. ఇది సమగ్రంగా ఉంటుందని ఆశ పెట్టలేనుగాని కొత్త ఆలోచనలకు కొంతైనా ప్రేరకంగా ఉండొచ్చు.



"The need of a constantly expanding market for its products chases the bourgeoisie over the whole surface of the globe. It must nestle everywhere, settle everywhere, establish connexions everywhere."

—Manifesto of the Communist Party,

[పెరుగుతున్న ఉత్పత్తులను అమ్ముకోటం కోసం బూర్జువావిధానం భూమండలమంతా విస్తరిస్తుంది. అన్ని ప్రాంతాలను చేరుకుంటుంది. అన్ని చోట్లా కుదురుకొంటుంది. అన్ని ప్రాంతాలతో సంబంధాలు ఏర్పరచుకొంటుంది.]

ప్రపంచచరిత్రలో జరిగిన సామాజికపరివర్తనలను అంతస్సంబంధం ఉన్న క్రమబద్ధపరివర్తనలుగా మార్క్స్-ఎంగిల్సులు విశ్లేషించి చూపారు. ఇంగ్లండులో పారిశ్రామికవిప్లవం భూస్వామ్యవిధానానికి చరమగీతం పాడింది. అంతకన్నా అభివృద్ధికరమైన బూర్జువానాగరికత అవతరించింది. నిశ్చలత భూస్వామ్యవిధానపు లక్షణం. బూర్జువానాగరికత అతివేగంగా ప్రపంచంలో

వ్యాపిస్తుంది. ఈ స్వభావం దాని పుట్టుకలోనే ఉంది. ఆర్థికమైన పునాదులతో పాటు సాంఘికపరిస్థితిని, మనుష్యుల ఆలోచనావిధానాన్ని ఈ కొత్త నాగరికత మారుస్తుంది. ఈనాడు మనం అనుకొంటున్న ప్రజాస్వామ్యభావాలు, సంఘ సంస్కరణ భావాలు ఈ నాగరికత సృష్టించినవే. ఈ నాగరికత యూరపులో ముందు పుట్టటంవల్ల దీన్ని ఐరోపానాగరికత అని, పాశ్చాత్య నాగరికత అని అంటున్నాం. ఆ భావాలు ఇంగ్లీషుచదువులవల్ల మనకు సంక్రమించటంవల్ల వాటిని ఇంగ్లీషువారి భావాలు అనుకుంటున్నారు. ఈ భావాలను ప్రచారం చేసే వారిని పాశ్చాత్య నాగరికతావిమోహితులు అని ముద్ర వేస్తున్నాం. అసలు వాస్తవం ఏమిటంటే, మన దేశంలో విద్యావంతు లయినవారు బూర్జువా ప్రజా స్వామ్యభావాలచేత ప్రభావితు లయి, మన దేశంలో కూడా ఆ రకమయిన మార్పుల్ని తీసుకురావటానికి ప్రయత్నించారు. సాహిత్యవిమర్శలో బూర్జువా భావాల వ్యాప్తి ఆధునికతకు ప్రారంభంగా గుర్తిస్తున్నాం.

తెలుగుసాహిత్యవిమర్శలో ఈ రకమైన ధోరణిని సమర్థంగా ప్రవేశ పెట్టినవారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. అంతకుముందు వెన్నేటి రామచంద్ర రావు రచించిన మను వసు చరిత్ర రచనావిమర్శనము (1899) వంటి గ్రంథా లలో ఈ ధోరణి కొంత కనిపిస్తున్నప్పటికీ, మొదటి పటిష్ఠమైన వ్యక్తీకరణ రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము అనే గ్రంథంలో జరిగింది. ఈయన 1880 సంవత్సరం డిసెంబరు 10న జన్మించారు. 1899 సంవత్సరం మద్రాసు క్రైస్తవకళాశాల విద్యార్థిగా ఉండి ఆ కాలేజీలో ఆంధ్రభాషాభిరంజనీ సమాజం వారి సమావేశంలో కళాపూర్ణోదయంమీద ఉపన్యసించారు. ఆ తరవాత పైచదు వులకు ఇంగ్లండు పోయి తిరిగివచ్చి 1914లో తన అభిప్రాయాలను ఇంకా వివరంగా 'కవిత్వతత్త్వవిచారము' అనే పేరుతో గ్రంథంగా వ్రాసి ప్రకటిం చారు. తన అభిప్రాయాలను చర్చించటానికి పింగళి సూరన రచించిన కళాపూ ర్ణోదయాన్ని ఆలంబనంగా తీసుకున్నారు.

ఆ కాలంలో కళాపూర్ణోదయంమీద, పింగళి సూరన్నమీద విమర్శకుల ఆసక్తి గుర్తించదగింది. 1892 ఆగస్టు 10న మద్రాసు క్రైస్తవ కళాశాలలో వి. దక్షిణామూర్తి అనే ఆయన పింగళి సూరన్న కవితావిశేషాలనుగురించి ఉప

న్యసించినట్టు తెలుస్తున్నది. వింజమూరి రంగాచార్యులుగారు రచించిన "పింగళి సూరనార్యుడు"అనే గ్రంథం 1914 లో అచ్చయింది. ఈ పుస్తకం కవిత్వ తత్త్వవిచారంకంటె ముందే ప్రచురింపబడినట్టు కురుగంటి సీతారామయ్యగారు (1942) అంటున్నారు. "ఈ గ్రంథం రెడ్డిగారి పింగళి సూరనార్యుడి విమర్శన ప్రకటించకపూర్వం ప్రకటింపబడ్డది. రెండూ చదివితే పాఠకులకే తెలుస్తుంది" (సీతారామయ్య, 1942, పే. 187).

మొన్న మొన్నటివరకు విమర్శకులు కళాపూర్ణోదయంమీద ఆసక్తి చూపిస్తూనే ఉన్నారు. దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు 1942 ఫిబ్రవరి భారతిలో "కళాపూర్ణోదయము-కథావధాన కౌశలము" అనే వ్యాసం రచించారు. జి. వి. కృష్ణారావుగారు "స్టడీస్ ఇన్ కళాపూర్ణోదయం(Studies in Kalapurnodaya) అనే గ్రంథం రాసి మద్రాసు యూనివర్సిటీనుంచి డాక్టరేట్ డిగ్రీని తెచ్చుకున్నారు. ఇంకా చాలామంది పత్రికల్లో వ్యాసాలు ప్రకటించి ఉండవచ్చు. ఇంతమందిని కళాపూర్ణోదయం ఆకర్షించటానికి ఒక కారణాన్ని ఊహించొచ్చు. ఆధునిక సాహిత్య పరిశీలనలో కథాకథనం, పాత్రపోషణ, నాటకీయసంభాషణ అనే విలువలు కొత్తగా వచ్చినై. ఈ రకమైన పరిశీలనకు ఆటు భారతం తరవాత మళ్ళీ నిలువగలిగింది కళాపూర్ణోదయం. అదీగాక కళాపూర్ణోదయంలో కవి చెప్పిన కథాక్రమానికి, సంఘటనల కాలక్రమానికి వ్యత్యయం ఉంది. ఈపద్ధతి ఆధునిక కాలంలో వచ్చిన నవల అనే సాహిత్యప్రక్రియతో కనిపిస్తుంది. కావ్యాన్ని, లేక ఒక గ్రంథాన్ని ఏకవిషయంగా గ్రహించి పరిశీలించటానికి కళాపూర్ణోదయంలో వీలుంది. అంటే కళాపూర్ణోదయకథలో వివిధభాగాలు పరస్పరాపేక్షకాలు. ఇంగ్లీషులో చెపితే highly structured story. రామలింగారెడ్డిగారి మాటల్లో "ఐక్య మను కథాలక్షణమును పరీక్షించు పద్ధతి యేదనగా ఉన్నభాగములను తీసివేయవచ్చునా ? క్రొత్తవి ఏవయినా చేర్చవచ్చునా ? "అని విమర్శించుట. ఈ కార్యములు పొసగనివాయెనా ఐక్యము స్ఫుటము. సాధ్యములాయెనా ఐక్యభావ మపక్వము. కథను ఇట్లా తీర్చిదిద్దటంవల్లనే పాత్రల్లో వైవిధ్యం సాధ్యమయింది. ఆ కాలానికి భిన్నంగా ఎప్పుడో తరవాతికాలంలో

రాబోయే నవలాలక్షణాలు కనిపించటంవల్లనే కళాపూర్ణోదయం ఆధునికకాలంలో ఎక్కువ మందిని ఆకర్షించింది.

పాత్రపరిశీలనం అనేది ఇంగ్లీషుసాహిత్యంలో అయినా బహుశా నవలా సాహిత్యం వచ్చింతరవాతనే అలవాటయిన విమర్శనధోరణి అనుకుంటాను. నవలల పరిశీలననుంచి నాటకాలు, పురాణాలకుకూడా ఈ పరిశీలన వ్యాపించింది. అదే ఈ కాలపు ఈ విమర్శావ్యాసాల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ధోరణిలో జరిగిన ఇంకో పాత్రపరిశీలన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 1934 జనవరి భారతిలో ప్రకటించిన "నిగమశర్మ అక్క" అనే వ్యాసం. పాండురంగమాహాత్మ్యంలోని నిగమశర్మోపాఖ్యానంలో నిగమశర్మ అక్క అపూర్వమైన పాత్ర. అందువల్ల అది విమర్శకులను ఆకర్షించింది.

పాత్రపరిశీలనంలో ఇంకో ప్రధానాంశం ఏమిటంటే ఆ పాత్ర ప్రవర్తన ఎంత సహజంగా ఉంది ? ఆ పాత్ర వివిధఘట్టాలలో ఎంత వేరు వేరుగా ప్రవర్తించింది ? అనే విషయాలు పరిశీలించటం. వీటినే సహజత్వం, వైవిధ్యం అనొచ్చు. ఒకపాత్ర సంపూర్ణంగా అన్నిఘట్టాల్లోను ఆదర్శంగా ప్రవర్తిస్తే అది సహజం కాదు. ఒకపాత్రకున్న మంచిచెడ్డలు రెండూ సాహిత్యంలో చిత్రించాలి. నిగమశర్మ అక్క తమ్ముడికి అన్నివిధాలా నీతులు చెప్పి, ఆ తమ్ముడు విన్నట్టే నటించి ఆ తరవాత అక్కముక్కెరకూడా ఎత్తుకుపోగా తనముక్కెర పోయినందుకు అక్క ఏడ్చినట్లుగా రామకృష్ణుడు చిత్రించాడు. ఇందుకు రామకృష్ణుని హాస్యప్రియత్వం కారణంగా అనంతకృష్ణశర్మగారు సూచించారు. 1937 జనవరి భారతిలో భారతుల పున్నయ్యశాస్త్రిగారు "కవికి నిగమశర్మ అక్కను ఆదర్శప్రాయమైన ఒకానొక ధీరోదాత్త స్వరూపురాలుగా పోత పోయవలె నను సంకల్పము లేదు. యథాస్వభావముగా లోకములోని యొకానొక పాత్రను నిరూపించుటయందే"అని నిగమశర్మ అక్కపాత్రలోని లోపాన్ని సమర్థించటంలో ఈ సహజత్వ ప్రీతి కనిపిస్తుంది. దీన్నే రామలింగారెడ్డిగారు "సర్వకాల సర్వావస్థలయందును, ఏకరీతిగా ప్రవర్తించువారుండుట యరుదు" అని పాత్ర ప్రవర్తనలో వైవిధ్యం కావాలని సూచించారు. అంతేకాక "ఎట్టి సమయములందును వస్తువుల సర్వసులక్షణములను వర్ణించుట గొప్ప యుపలక్షణము"అనికూడా నిష్కర్ష చేశారు. రామలింగారెడ్డిగారిని విమర్శించినవారిమీద

ఆయన భావాలప్రభావం ఉన్నట్టుగా నండూరి బంగారయ్యగారు 1936 ఆగస్టు భారతిలో "తిక్కన ద్రౌపదీచిత్రరచనము - ఉద్యోగపర్వము" అనే వ్యాసం చూసి తెలుసుకోవచ్చు. ద్రౌపది ఏడ్చిన తీరుసు విమర్శించినందుకు అభ్యంతరం చెపుతూ బంగారయ్యగారు "ఈ ద్రౌపదీవాక్యముల సందర్భశుద్ధిగాని అపురూపమైన తేజముగాని, అద్వితీయ సౌందర్యముగాని యాలోచింపక వారు చేసిన విమర్శనము సమీచీనము కాదని నీవు నిశ్శంకముగా వచింపవచ్చును" అని పాఠకుల్ని హెచ్చరించారు.

రామలింగారెడ్డిగారు కవిత్వతత్త్వవిచారంలో ముఖ్యమైనవాటిని ఈ కింది విధంగా లెక్కగట్టొచ్చు.

1. కవిత్వానికి భావనాశక్తి ముఖ్యం, అలంకారాలు కాదు.
2. కథలో యూనిటీ ఉండాలి.
3. సాహిత్యప్రక్రియాభేదానికి సామాజికపరిస్థితులు కారణం.
4. కావ్యంలో విషయం, శైలీ రెండూ ముఖ్యం.
5. పాత్రల్లో, పాత్రల ప్రవర్తనల్లో వైవిధ్యం ఉండాలి.
6. కావ్యాలు అలంకారశాస్త్రాదేశాలకు భిన్నంగా ఉండాలి.
7. కావ్యంలో వర్ణనలకు కథకు పరస్పరసంబంధం ఉండాలి.
8. సంభాషణలు నాటకీయంగా ఉండాలి.

ఈ విషయాలన్నీ ప్రధానంగా కళాపూర్ణోదయం, కొంతవరకు తిక్కన భారతాన్ని తీసుకొని పరిశీలించారు. వీటన్నిటినీ సాహిత్యవిమర్శలో ఆధునిక లక్షణాలుగా గుర్తించవచ్చు. ఈ శతాబ్దంలో వచ్చిన సాహిత్యవిమర్శలను పరిశీలిస్తే రామలింగారెడ్డిగారి అభిప్రాయాలు ఎంతబలంగా సాహిత్యవిమర్శను నడిపించినయ్యో గుర్తించవచ్చు. ఒకటి రెండు ఉదాహరణలు ఇంతకు పూర్వమే ఇచ్చాను.

రామలింగారెడ్డిగారు చెప్పిన భావనాశక్తి సాంప్రదాయికవిమర్శలో లేదు. దీన్ని రామలింగారెడ్డిగారు చాలా రకాలుగా వివరించారు. "భావనాశక్తి యనగా

విషయములు మనసులో ప్రతిబింబించునట్లు చేయు సామర్థ్యము. ఒక్క ప్రతి బింబించుట యననేల ప్రత్యక్షముగా నవతారమెత్తునటుల చేయుట.'' "పాత్రో చితములైన మాటలను ప్రయోగించియు, విషయమునకుం దగినరీతిని సొగసైన వర్ణనములం జేసియు వృత్తములు సాక్షాత్తుగ నెదుట గనులగట్టినట్లు చేయుట.'' ఇదియే యన్నింటికిని మించిన కవితాలక్షణము. ఇంగ్లీషుసాహిత్యంలో " imagination" అనేదానికి సమానార్థకం విలియం బ్లేక్ "one power alone makes a Poet : imagination" అన్నాడు. (చూ. నారాయణరావు, 1978.) కోలరిజ్ ఈ సిద్ధాంతాన్ని primary and secondary imaginations గా విభజించి, రెండోదాన్ని కావ్యహేతువుగా సూచించాడు. దీన్నే భావనాశక్తిగా రామలింగారెడ్డిగారు ప్రయోగించారు ఇది రససిద్ధాంతంకన్నా భిన్నం. కవి సృష్టించిన పాత్రలు, విషయం కావ్యంద్వారా కవి భావించినరీతిలో చదువరికి కూడా కళ్ళకు కట్టినట్టు చూపించటం ఈ భావనాశక్తి. కవి పాత్రల మనోభావాలను తానుకూడా అనుభవిస్తే తప్ప వాటిని సహజంగా చిత్రించలేదని ఈ సిద్ధాంతం చెప్తుంది. అదేకాలంలో వచ్చిన భావకవిత్వాన్ని సమర్థించటానికి ఈ సిద్ధాంతం పనికొచ్చింది. కురుగంటి సీతారామయ్యగారీ అభిప్రాయాన్నే ఈ విధంగా చెప్పారు. "భావకవిత్వం పాశ్చాత్యానుకరణం కాబట్టి వాళ్ళ సారస్వతపంథలను, విషయవివేచనం చేసి చెప్పటం వాళ్ళకు చాలా దోహదం చేసింది. కాబట్టి గ్రంథం యెట్టిదైనా, యే ఉద్దేశ్యంతో రాశినా, దానివల్లమాత్రం సారస్వత క్షేత్రంలో చాలా ఉపకారమై నవ్యకవు లనుసరించే నవ్యతకు నీళ్ళుపోసి పెంచి నవ్యాంధ్ర సారస్వతంలో వక ముఖ్యవిషయ మైంది.'' (సీతారామయ్య, 1942 పే. 184).

రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారానికి సహజంగానే సాంప్రదాయిక పండితులనుంచి వ్యతిరేకత వచ్చింది. కురుగంటి సీతారామయ్య 1915 అక్టోబరులో అలంకారతత్త్వవిచారము అనే గ్రంథం ప్రకటించారు. కాశూరి వ్యాసమూర్తిగారు "కవిత్వతత్త్వవిచార ఖండన'' అనే గ్రంథం ప్రకటించారు. అక్కిరాజు ఉమాకాంతంగారూ, నోరి నరసింహశాస్త్రిగారూ కూడా దీన్ని వ్యతిరేకించారు (చూ. ఎస్. వి. రామారావు 1974, పే. 147.).

కట్టమంచి రామలింగారెడ్డికృషిని తక్కువచేసే ప్రయత్నం ఇటీవలివరకు జరిగింది. "లక్షణగ్రంథముల ఆంతర్యము ఆయనకు అవగతము కాలేదని చెప్ప వచ్చును"అని ఎస్. వి. రామారావుగారు నిర్ధారణచేస్తే, పాటిబండ మాధవశర్మ గారు (1975) "ఇంతకుము కళాపూర్ణోదయకావ్యముయొక్క తత్త్వము రెడ్డిగారికి పూర్తిగా తెలిసిందా ?" అని ప్రశ్నించుకొని 'పైపై చమత్కారమే తప్ప అసలు గ్రంథముయొక్క అంతస్తత్వం రెడ్డిగారికి తెలియలే దనిపిస్తుంది'అని తేల్చారు. రామలింగారెడ్డి వాదాలను సోపపత్తికంగా ఖండించటం వేరు. కాని వీళ్ళు ఈ పద్ధతిని ఎన్నుకోక వక్రమార్గాలద్వారా ఆయనప్రాముఖ్యాన్ని తగ్గించా లనుకు న్నట్టు వీళ్లరాతలను చూస్తే అనిపిస్తుంది.

కురుగంటి సీతారామయ్యగారు తన 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు' అనే గ్రంథంలో (1942) రామలింగారెడ్డిగారి ప్రయత్నాన్ని తక్కువచేసి మాట్లా డారు. అది అట్లా ఉంచి, రామలింగారెడ్డిగారి పదవివల్ల కవిత్వతత్త్వవిచారానికి పేరు వచ్చిందనే అపప్రథకూడా కల్పించారు. "ఈ కవిత్వతత్త్వవిచారం వెలు వడగానే ఆయన గొప్పవా డౌటచేత పత్రికలుకాని, వ్యక్తులుకాని దాన్ని విమ ర్శించటానికి మొగమాటపడ్డారు" (పే. 171) అనీ, "ఒక్క అక్కిరాజు ఉమా కాంత పండితుడుమాత్రం నిజం తెలిపి విమర్శించాడు. పాశ్చాత్యవాతావరణంలో చేతులు మొగిడ్చి కూర్చున్నవారికి ప్రాచ్యకావ్య విషయము లెట్లు తెలియును ?" అన్నాడు. 'మిగిలినవాళ్ళంతా రెడ్డిగారి పదవికి దాసులైపోయారు' (పే.175) అనీ సీతారామయ్యగారు (1942) రాశారు.

ఇట్లాంటి అభిప్రాయాన్నే దాదాపు రెడ్డిగారిని విమర్శించిన పండితులంతా వ్యక్తం చేశారు. ఉదాహరణకు నోరి నరసింహశాస్త్రిగారి వాక్యాన్ని సీతా రామయ్యగారు (1942 పే. 184) ఉదాహరించారు. "కవిత్వతత్త్వ విచారము నకు వచ్చిన ప్రచారము రెడ్డిగారికి కావ్యరసగ్రహణంలోగాని, విమర్శనలోగాని ఉన్న దక్షతవల్ల రాలేదనీ, యెన్నో యితర కారణాలవల్ల వచ్చినదనీ మేము మనవి చేస్తున్నాము." అయితే ఈ విమర్శకుల్లో సీతారామయ్యగారే నయం. ఆంధ్రసాహిత్యచరిత్ర గమనంలో కవిత్వతత్త్వ విచారం నిర్వహించిన పాత్రను సరిగ్గా గుర్తించారు. అట్లా తనకంటే ముందే గుర్తించిన విశ్వనాథ సత్యనారా యణగారి అభిప్రాయాన్ని ఉదాహరించారు. "ఈ రోజుల్లో (1914) కట్టమంచి

రామలింగారెడ్డిగారు తమ కవిత్వ తత్త్వవిచారము వ్రాసి విమర్శనపథాల్లో గొప్ప దృక్పథం కలిగించి నవ్యసాహిత్యానికి కొత్తబోదెలు తవ్వారు." (పే.184)

సీతారామయ్యగారుకూడా తమ సొంతమాటల్లో ఇట్లా అన్నారు : "నవ్య కవు లనుసరించే నవ్యతకు నీళ్ళుపోసి పెంచి నవ్యాంధ్రసారస్వతంలో ఒక ముఖ్యవిషయ మైంది" (పే. 184). "నవ్యకవుల కొక ప్రోత్సాహ మియ్యడమే కాక రెడ్డిగారు చేసిన పని సరియైన విమర్శనం బైలుదేరడానికి మార్గం చూపించనే చూపించింది. అప్పటినుంచీ కొంత నూతనమార్గంలో విమర్శవాఙ్మయావలోడనం జరిగింది" (పే. 185). "ఇప్పుడు ప్రతి భారతి మొదలైన పత్రికల్లో సరియైన మార్గాల్లో ప్రవర్తించిన విమర్శనలు పరిశ్కృతంగా ప్రకటింపబడుతున్నై. వీటితోపాటు కొడవటిగంటి కుటుంబరావు మొదలైనవాళ్ళు లలితకళా ప్రయోజనాలను సిద్ధాంతాలను అనువదిస్తూ కవితాసామాన్యానికి వాటి ననువర్తింపజేస్తూ రాస్తున్నారు (పే. 186).

కాలానికి అవసరమైన విమర్శ కట్టమంచిది. కాలగమనం ఇష్టంలేక అన్నీ తాటాకుల్లోనే ఉన్నాయనే తత్త్వం ఆయన వ్యతిరేకులది. (వీరిలో తరతమ భేదా లుండొచ్చు.) ఫ్యూడల్ బూర్జువా భావాల సంఘర్షణే ఈ విమర్శల్లో కనపడుతున్నది. రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వవిచారంలో 'అనవసరములైన పెక్కు విషయములు చోటు చేసుకున్నవి' అని విమర్శకు లన్నవి నిజంగా అనవసర మైనవి కావు. సాహిత్యానికి, సమాజానికి సంబంధం ఉందని నమ్మే రెడ్డిగారు సాంఘికవిషయాలు ప్రస్తావించటంలో ఆశ్చర్యం లేదు. అసంబద్ధం అంతకన్నా కాదు. ఇంకా ఫ్యూడల్‌సమాజంలో ఉన్న భారతస్త్రీ పరిస్థితిగురించి, వివాహవ్యవస్థనుగురించి, ప్రబంధాల్లో వర్ణించిన మొరటు శృంగారాన్నిగురించి రామలింగారెడ్డిగారు చాలా తీవ్రమైన వ్యాఖ్యలే చేశారు. బూర్జువా సమాజం తెచ్చిన ఒక విలువ 'స్వేచ్ఛ' బూర్జువామేధావులు కావాలనుకుంటున్న స్వేచ్ఛ వ్యక్తి నిష్ఠ మైనది. మనదేశపు పెళ్ళిళ్ళనుగూర్చి "మనలో పెండ్లికి మనసునకు సంబంధము లేదు. పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజము కాదు. మరి పితృ పితామహజము. మనసును నిరోధించి పీడించు వర్గములలో ముఖ్యములు జాతిభేదములు. తమతమ యుపశాఖలను మీరి హృదయము వ్యాపింపగూడ దట. దీనివలన కలుగు ఫలమేమనగా "అమనస్క వివాహములు" అనీ,

పెళ్ళిలో అన్ని మంత్రములూ తంత్రములూ ఉండును ఒక్కటితప్పు ఎయ్యది ? అత్మతంత్రము. వివాహము సంస్కారమట. హృదయబహిష్కార మనగూడదేమో !" అనీ తీవ్రంగా మన వివాహవ్యవస్థను విమర్శించారు. ఇందులో కనిపించేది వ్యక్తిస్వేచ్ఛాప్రబోధం. కల్పనలో స్వేచ్ఛ, కథలో స్వేచ్ఛ, వర్తనలో స్వేచ్ఛ, వివాహంలో స్వేచ్ఛ - ఇవి అచ్చంగా బూర్జువా విలువలు. అయితే ఈ స్వేచ్ఛ సామాజికవ్యవస్థకు మూలమైన ఆర్థికసంబంధాలు మారితే తప్ప గుర్తింపబడదనీ, బూర్జువాసమాజంలో అయినా సామాజికసంబంధాల నతిక్రమించే స్వేచ్ఛ ఉండదనీ, రామలింగారెడ్డి గుర్తించకపోవటం సంగతి వేరు. దాన్ని వివరించే సిద్ధాంతం అప్పటి కంత ప్రచారంలో లేదు. అయితే తాను చూసిన ఇంగ్లీషు బూర్జువాసమాజాన్ని భారతఫ్యూడల్ సమాజంతో పోల్చి బూర్జువావిలువల్ని బోధించటంలో వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి మొదలైన వంటివారి ప్రయత్నంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి పాత్రనుకూడా మనం సరిగ్గా అంచనా వేసుకోవాలి. "సామాన్యజనుల జీవితము కావ్యార్హము (పే. 61)" అనీ, "కలియుగాదినుండి ఇంతదాకా జమకు ఖర్చుపకు రాని సాధారణజనులు నేటికిగదా గణ్యులైరి. ఇకముందు పూజ్యులగుదురుగాక !" (పే. 64). అనీ అభ్యుదయరచయితవలె చెప్పిన రామలింగారెడ్డిగారు ఒక సందర్భంలో "శుద్ధాంతమనగా సేవకులు మొదలగు నీచులతో సావాసమన్నమాట" (పే. 121). అని మళ్లీ సామాన్యులను నీచులుగా చూడటం బూర్జువా మేధావి సహజంగా పడే పొరపాటు.

ఇంత సంప్రదాయవిరుద్ధంగా వాదించిన రామలింగారెడ్డిగారు భాషవిషయంలో సంప్రదాయాన్ని వదలకపోవటం ఆశ్చర్యకరమే. అంతటి హేతువాది త్రిపురనేని రామస్వామిచౌదరి కూడా భాషవిషయంలో హేతువాది కాలేకపోయాడు. తెలుగుదేశపు మేధావుల్లో ఇదొక విచిత్రమైన వైరుధ్యం.

కవిత్వతత్త్వవిచారం చదివితే బహుశా కథనాత్మక విమర్శ కూడా ఈయనతోనే ప్రారంభమయినట్టు తోస్తుంది. ఈయన మొదటివాడయినా, కాకపోయినా ఈయన ఒరవడిమాత్రం తరువాతివారు గ్రహించి ఉండవచ్చు. కథనాత్మక విమర్శ అంటే తాను విమర్శిస్తున్న గ్రంథంలో కథను విమర్శకుడు తన సొంతవాక్యాల్లో చెపుతూ వ్యాఖ్యానాన్నికూడా జోడించటం. ఉదాహరణకు దీన్ని చూడండి :

"సిద్ధుండు చూచినాడు. చూచినదే రెండవమాట లేక పరిరంభణమునకు మొదలిడినాడు. ఋషుల రసికత యీ మాత్రమే కదా ! సౌమనస్యమున, ఋషులకుఁ, బాళయగాంధ్రకు, మృగములకును భేదము శూన్యము."

ఈ రకపు కథనాత్మకశైలి ఇంతకన్న వెర్రిగా ఈనాటి తెలుగుపరిశోధక గ్రంథాలలో విరివిగా కనిపిస్తుంది.

విమర్శసాహిత్యంలో ఒక చెప్పుకోదగిన వ్యాసం 1917 ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో ప్రచురింపబడిన "విమర్శనా పద్ధతులు" అనేది. దీని కర్తలు కూచిమంచి వెంకట సుబ్బారావు, కోరాడ రామకృష్ణయ్య గారలు. ఇందులో మూడురకాలయిన విమర్శపద్ధతుల్ని ప్రతిపాదించారు.

1. చారిత్రక పద్ధతి :

"జాతీయజీవనమున జరుగుచున్న మార్పుల కనుగుణ్యముగా ఒక్కొక్కప్పుడు కవితయందలి రుచియు మారుచుండును. కావున ఒక్కొక్క కాలమున ఒక్కొక్కవిధము లైన కావ్యములు ప్రాముఖ్యములోనికి వచ్చుచుండును. ....... ఇట్లు జాతీయధర్మములు వాఙ్మయమున ప్రతిబింబితములై యుండుననియు, ఆ జాతీయజీవితమున కలుగుచుండెడి మార్పులు కవితాధోరణినికూడ మార్చుచుండు ననియు, ఈ మొదలగు విషయములు చారిత్రక విమర్శనముననే తేలును." ఈ అభిప్రాయాన్ని ఇటీవల వచ్చిన నారాయణరావు (1973) గారి కవితావిప్లవాల స్వరూపం అనే పుస్తకంలో చెప్పిన అభిప్రాయాలతో పోలిస్తే ఈ పై వ్యాసంలో ఆధునికత ఇంకా స్పష్టంగా కనిపిస్తుంది. "సమాజంలో వస్తున్న మార్పులకి శ్రోతల సాహిత్యాభిరుచులను రూపొందించగల శక్తి ఉంది. అలాంటి మార్పులు జరిగినప్పుడు ఒక కొత్త కవితారూపం వాళ్ళకోసం ఏర్పడుతుంది." (నారాయణరావు 1978, పే. 217) అయితే నారాయణరావుగారిచర్చ ఇంతకన్నా విస్తారమైనది, ఉదాహరణపూర్వమైనది.

2. కవిజీవితమును గూర్చిన విమర్శనము :

"కవి గ్రంథములను, అందలి విశేషాంశములను పూర్తిగ గ్రహింపవలయు నన్నచో ఆ కవిజీవితమునుగురించి మనకు కొంత తెలియవలయును.

3. కవితావిమర్శనము లేక కవిత్వతత్త్వ విచారణ :

ఈ మూడిట్లో మొదటిరెండు భారతీయ సంప్రదాయంలోవి కావనటం స్పష్టం. ఈ పద్ధతుల ప్రభావం తరవాత విమర్శకులమీద స్పష్టంగానే కనిపిస్తున్నది. చారిత్రకపద్ధతి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి రచనల్లో విపులంగా చూడొచ్చు. కవిజీవితాన్ని గూర్చిన విమర్శనం భావకవిత్వాన్ని గురించి చేసిన విమర్శల్లో కనిపిస్తుంది. ఉదాహరణకు 1928 మార్చి 'భారతి'లో నిడమర్తి సత్యనారాయణమూర్తి 'కృష్ణపక్షము' అనే వ్యాసం రాస్తూ ''........ఈతని కవిత మనకు పూర్తిగ నర్థము కావలెనన్నచో కవియొక్క జీవితము మనకు తెలియవలయును" అని సిద్ధాంతప్రతిపాదన చేసి "ఈ గ్రంథమును రచించిన కృష్ణశాస్త్రిని నేను స్వయముగ నెరుగుదును"అని తన పరిశీలన ప్రారంభించారు.

రామలింగారెడ్డిగారు ప్రవచించిన మార్గంలో అనంత కృష్ణశర్మగారు కొన్ని విమర్శలు రాశారు. ఆయన రాసిన "నిగమశర్మఅక్క''గురించి ఇంతకు ముందే ప్రస్తావించాను. కావ్యాన్నిబట్టి ఆ కాలపుపరిస్థితులను తవ్వి తీయటానికి ప్రతినిధిగా రాయలనాటి రసికత అనే వ్యాసాన్ని గ్రహించొచ్చు. కృష్ణదేవ రాయలకాలంలో ప్రబంధాలనుబట్టి ఆ కాలపు ప్రజాజీవితాన్ని విశదీకరించటానికి అనంతకృష్ణశర్మగారు ప్రయత్నించారు. అయితే ప్రబంధాల్నిబట్టి ప్రజా జీవితాన్ని అంచనావెయ్యటంలో ప్రమాదాన్ని వారు గమనించినట్టులేదు. లేక వినోదంకోసమే ఆ వ్యాసం రచించారేమో తెలియదు.

ప్రబంధాల్లో, వర్ణనల్లో ఎక్కువభాగం ప్రజాజీవిత ప్రతిబింబాలు కావు. పారిజాతాపహరణంలో వర్ణించిన కోపగృహం ఆ కాలపు ధనవంతులఇళ్ళల్లోనైనా ఉంటుందని అనుకోను. మనుచరిత్రలో వర్ణించిన అభ్యంజనస్నానం, ఆ పద్ధతి జరగాలంటే ఒక పూట పడుతుంది. అందువల్ల "అప్పటివారు సామాన్యముగా అభ్యంగమే నిత్యస్నానముగా నుంచుకొన్నట్లు కానవచ్చుచున్నది'' అని వర్ణించటం సత్యదూరంగా ఉంది. అయితే అప్పటివారికన్న మనం కొన్ని విషయాల్లో ఎట్లా మెరుగో ఇదే వ్యాసంలో చూపించారు. ''ఇందు కొక ముఖ్యకారణం స్త్రీ యనగా కేవలము భోగవస్తువే యని ఇదివరకు మన కుండిన

భావము పాశ్చాత్యపండితుల సంసర్గముచే నశించుచుండుటయే. వారికిని మన వలె మానమర్యాదలును, సుఖదుఃఖములును గలవనుట పూర్వకాలమువారికన్నా నేడు మనవారు ఎక్కువ గమనించుచున్నారు. ఇది శ్లాఘ్యవిషయమే"అని సరిగ్గా గుర్తించారు. 1929 లో అచ్చయిన వేమన అనే గ్రంథంలో వేమనపద్యాల్లో సాంఘికస్థితిని గురించి కొన్ని విషయాలు చెప్పారు అందులో వేమన సంసార స్థితిగతులను గురించికూడా చెప్పటానికి ప్రయత్నించారు. అయితే ఇక్కడ కూడా ఒక ప్రమాదం ఉంది. వేమనపద్యాలు ఒక సంప్రదాయం. పద్యాల్లో కనిపించే వేమన ఒక కాలానికి చెందిన కవిగా భావించటం కష్టం. అదీగాక శర్మగారు ఉన్నదానికన్నా ఎక్కువ ఊహిస్తారని నా కో అనుమానం.

3

తెలుగుసాహిత్యంలో సుమారుగా 1910 నుంచి 1935 వరకుకూడా భావ కవితాయుగం అనొచ్చు. నిజానికి భావకవితాయుగానికి అభ్యుదయకవితాయుగా నికి స్పష్టమైన విభజన లేదు. శ్రీశ్రీ అభ్యుదయకవితా ప్రవర్తకు డనుకొంటే 1934 నుంచి అభ్యుదయకవితాయుగంగా గుర్తించవచ్చు. కాని శ్రీ శ్రీ కవి త్వాన్ని నవ్యకవిత్వంలో భాగంగానే గుర్తిస్తే సుమారుగా 1940–45 వరకు నవ్యకవితాయుగ మనొచ్చు. వీటి వివరాల్లోకి పోయేముందు ఇటీవల నా దృష్టి కొచ్చిన ఒక విమర్శను ప్రస్తావించకుండా ఉండలేను.

బంగోరె (బండి గోపాలరెడ్డి 1979) మాలపల్లినవలపై "ప్రభుత్వ నిషే ధాలు'' అనే పుస్తకం అచ్చేశాడు. అందులో 1923 జనవరి 25తేదీ ఆంధ్ర దిన పత్రికలో ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లినవల మొదటిభాగం విడుదల అయినప్పుడు దాన్ని ఆహ్వానిస్తూ వింజమూరి రంగాచార్యులుగారు ప్రకటించిన వ్యాసం ముద్రించబడింది. మాలపల్లినవల మొదటిభాగం 1922 నవంబరు – డిసెంబరులలో బయటికొచ్చింది. సుమారుగా అచ్చయిన నెలరోజుల్లోనే వింజ మూరి రంగాచార్యులుగారు రచించిన సమీక్షావ్యాసం వచ్చింది. ఈనాటికీ సమీక్ష కులకు వరవడిగా ఉండదగినది. సమకాలిక సాహిత్యాన్ని అంచనా కట్టటం ప్రతిభావంతుడైన విమర్శకుడికే సాధ్యం. ఆ విమర్శ గొప్పదనాన్ని అప్పటి

కన్నా మనం ఇప్పుడే సరిగ్గా గుర్తించగలం. అది అచ్చై అర్ధశతాబ్దం దాటింది. ఆనాడే "వాడుకభాషలో గ్రంథములు వ్రాయవచ్చునా కూడదా ? అనే చర్చలు చేసే దినాలు గడిచిపోయినవి"అని 1923 లోనే ప్రకటించటానికి ఎంత ముందు చూపు కావాలి ? ఇటీవలికాలంలో ప్రభుత్వాన్ని, ప్రభుత్వసంస్థల్ని ఆశ్రయించిన కొందరు పండితుల అభిప్రాయాలతో పోలిస్తే ఈ ముందుచూపు విలువ మన కింకా స్పష్టంగా తెలుస్తుంది.

"నాకు తెలిసినంతవరకు నాటకరూపమైన కన్యాశుల్కము మినహాయించగా వాఙ్మయంలో శాశ్వతంగా నిలవటానికి ఆశించే గ్రంథం పూర్తిగా వాడుక భాషలో వ్రాయబడడం మనకు ఇదే మొదటిపర్యాయం అని తలుస్తాను. ఈ విషయంలోకూడా లక్ష్మీనారాయణగారు నిర్భయంగా కొత్తదారి తీశారు"అని చివర్లో "మొత్తంమీద నవల అని పెద్ద అక్షరములతో వ్రాయదగిన గొప్పగ్రంథం తెలుగులో బయలుదేరినందుకు ఆంధ్రులు గర్వించవలసియున్నది" (బంగోరె, 1979 పే. 52-53). ఈ వాక్యం ఈ నాటికీ సత్యం. కాని ఆనాడు ఇట్లా రాయటానికి సమకాలిక సాహిత్యాన్ని అంచనా వేయగలిగిన ప్రతిభ, ముందు చూపు, ధైర్యం కావాలి. అప్పటికి నవలల పేరుతో కొన్నిపుస్తకాలు సాహిత్యంలో ప్రసిద్ధు లయినవాళ్ళు రాసినవి ప్రచారంలో ఉన్నాయని తెలుసుకొంటే రంగాచార్యులుగారి అంచనావిలువ అర్థ మవుతుంది.

రంగాచార్యులుగారి విమర్శ గొప్పతనం ఇంకా స్పష్టపడాలంటే 1971లో అచ్చయిన డా॥ బొడ్డపాటి వేంకట కుటుంబరావుగారి "ఆంధ్రనవలా పరిణామము"అనే ఉస్మానియా సిద్ధాంతగ్రంథంలో ఈ వాక్యాలు గమనించండి :

"నాగరకప్రపంచము గొడ్డుపోయినట్లుగ నిందుఁ జిత్రింపఁ బడినది జానపదజగత్తు. ధన, విద్యా, కుల సంపదలతోఁ దులఁదూఁగువా రెందఱో యుండఁగా, నిందు వర్ణింపఁబడిన ప్రధానపాత్రలు సంఘ జఘన్యజ వర్గముపి. పూర్వసంప్రదాయ ధిక్కారమున కీ యుగవాతావరణము నండఁ జూచుకొని యింత తెగించిన నవలా ప్రథమ ప్రయత్న మిదియే............ఈ ప్రణాళికా బాహుళ్యము నవల కెంత బలము నాపాదించినదో యంత దౌర్బల్యము నాపాదించినది. (పే. 279-280)

ఈ విమర్శమీద వేరే వ్యాఖ్యానించటం అవసరానికి మించిన ప్రాముఖ్య మియ్యటమే అవుతుంది.

సమకాలిక సాహిత్యాన్ని సమీక్షలద్వారా అంచనా వేసే పద్ధతికి మంచి ఒరవడిగా ఉందన్న ఉద్దేశంతో వింజమూరి రంగాచార్యులుగారి సమీక్షను ప్రస్తావించాను. వీరేశలింగం, చిలకమర్తి, గురజాడల రచనలమీద సమకాలిక మైన పత్రికలు పరిశోధిస్తే చాలా విషయాలు బయటపడొచ్చు. వీరిలో గురజాడ అప్పారావుగారిమీద ఇప్పటివరకూ విమర్శలు వస్తూనేఉన్నై. అవి ప్రత్యేకంగా పరిశోధించదగిన అంశాలు.

౪

ఇక నవ్యకవిత్వం సంగతి. నవ్యకవిత్వం తొలిరోజుల్లో వచ్చినదాన్ని భావకవిత్వం అంటాం. ఈ భావకవిత్వ లక్షణాలను గురించి, భావకవిత్వ మనే పేరును గురించి, అందులో ఒక్కొక్క కవి కవిత్వాన్నిగురించి ఎన్నోవ్యాసాలు భారతి, ఆంధ్రపత్రిక, ఆ తరవాత ప్రతిభ మొదలైన పత్రికల్లో విరివిగా వచ్చినై. భావకవిత్వం వచ్చేటప్పటికి పత్రికలసంఖ్యకూడా పెరిగింది. ఈ చర్చ లన్నింటినీ ఇక్కడ విపులంగా చర్చించటానికి వీలు పడదుగాని, కొన్ని ముఖ్యమైనవాటిని మాత్రం ప్రస్తావించుకోవాలి. సమకాలపుకవుల కవిత్వాన్ని గురించి వచ్చిన విమర్శలలో భావకవితావిమర్శన సాహిత్యంరాశిలోనూ, వ్యాప్తి లోనూ, అంతకుముందు వచ్చిన (బహుశా తరవాత వాటికంటే కూడా) ఇతర సాహిత్య విమర్శలకన్నా ఎక్కువ చెప్పుకోదగింది గా మనం గుర్తించొచ్చు. వీటిల్లో భావకవిత్వపు లక్షణాలను చెపుతున్నవిగా నేను గుర్తించినవి, నాకు దొరి కినవి త్వరగా కదిలే ఫిల్ములాగా కొన్నిటిని ప్రస్తావిస్తాను.

ఇంతకుముందే ఇంకో సందర్భంలో పేర్కొన్న నిడమర్తి సత్యనారా యణమూర్తిగారు "భావకవిత్వమునందు (కవి) పాఠకునితో ప్రథమైక వచన మున ప్రసంగించును. మనల నాతడు తన యాంతరంగికవర్గములో చేర్చుకొని తన సుఖదుఃఖములను మనకు చెప్పుటయేగాక తన జీవితమునందలి సూక్ష్మ విషయముల నన్నింటిని మనకు చెప్పుచుండును అని రాశారు. దీన్నిబట్టి భావ

కవిత్వంలో కవే ప్రధాన పాత్రధారి అవుతాడని వైయ్యక్తికమైన అనుభవాలను సరాసరిగా పాఠకుడికి కవితారూపంలో చెప్పుకుంటాడని విమర్శకుడు గుర్తించి నట్టుగా మనం చెప్పొచ్చు. "సమాజరహితమైన ఆత్మ వ్యక్తి 'నేను' భావకవిత్వాని కంతటికీ ఆలంబనం" అన్న నారాయణరావుగారి (1978) పరిశీలనకు దగ్గరగా ఉంది సత్యనారాయణమూర్తిగారి విమర్శావాక్యం.

1925 సెప్టెంబరు "భారతి"లో పారనంది జగన్నాథస్వామిగారు హృదయేశ్వరి-నేను చదివినది అనే వ్యాసం రాస్తూ "హృదయేశ్వరి ఒక కథ కాదు, బాహ్యప్రకృతి వర్ణన కాదు. అది కవియొక్క హృదయతత్త్వమును వ్యక్త పరచే గీతాసాహిత్యం. హృదయేశ్వరియొక్క అంగసౌష్ఠవముగాని, జీవితచిత్రములు కాని కావ్యమునకు ప్రధానములు కావు, అని రాశారు. దీన్నిబట్టి భావ కవిత్వం కథాప్రధానం కాదని, స్త్రీ అంగవర్ణన భావకవిత్వంలో ఉండదని గ్రహించవచ్చు. ఈ అభిప్రాయాల్నే ఇటీవలి విమర్శకుడు ఇంకా అందంగా "వస్తువర్ణన ప్రధానమైన ప్రబంధకవిత్వం స్త్రీవర్ణన. శరీరపరంగా చేస్తే, అనుభూతి ప్రధానమైన భావకవిత్వం స్త్రీహృదయం మాత్రమే స్పృశించింది. ప్రబంధ కవిత్వానికి స్త్రీ అంటే కేవలశరీరం. భావకవిత్వానికి స్త్రీ కేవలం హృదయం. అక్కడ ఆమెకు హృదయం లేదు. ఇక్కడ ఈమెకు శరీరం లేదు"అనీ "అనుభూతి కావ్యవస్తువు కావడంవల్ల కావ్యస్వరూపంలో కలిగిన ఒక ముఖ్యమైన మార్పు - ఖండకావ్యం రావడం, కథనతిరస్కారం అని ఈ మార్పుకి పేరు పెట్టవచ్చు" అనీ స్పష్టమైన రీతిలో చెప్పారు. ( నారాయణరావు 1978; పే. 123. )

1925 నవంబరు భారతిలో "ఎంకిపాటలు-స్వర్ణయుగము"అనే వ్యాసంలో దశిక సూర్యప్రకాశరావుగారు ఆ పాటల్లో అందాలు చూపించటానికి ప్రయత్నించారు.

౨౩

1928 ఏప్రిల్‌నెలలో మద్రాసు ఆంధ్రమహాసభహాలులో ఉపన్యసింపబడి ఆ తరవాత ఆంధ్రపత్రికలో అచ్చయిన "నేటికాలపు కవిత్వం" అనే ప్రసంగాలు 1929లో పుస్తకరూపంలో వచ్చాయి. ఒక సమకాలిక సాహిత్య

శాఖమీద అతిశక్తిమంతంగా విరుచుకుపడ్డ మహావిమర్శగా అక్కిరాజు ఉమా కాంతంగారి నేటికాలపు కవిత్వానికి ఆంధ్రవాఙ్మయంలో శాశ్వతమైన స్థానం ఉంటుంది. ఆ తరవాత ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా ఉమాకాంతంగారి ఆరోపణలకు సమాధానం చెప్పుకోటానికి నవ్యకవితాప్రవర్తకులు, వారి అభి మానులు సుమారు 1946 వరకూ ప్రయత్నించారు. సమకాలిక సాహిత్యప్రక్రియ మీద ఈ రకమైన పుస్తకం ఇంతకుముందూ రాలేదు, ఆ తరవాతా రాలేదు. కురుగంటి సీతారామయ్యగారి "నవ్యాంధ్రసాహిత్యరీతులు" (1942) సమకాలిక సాహిత్యంమీద వచ్చినా దాని ధోరణి వేరు. ఉమాకాంతంగారి తార్కిక పటిమ ఇంకెక్కడా కనపడదు. సీతారామయ్యగారి పుస్తకంలో విషయరాశి ఎక్కువ. పరిశోధకుల కవసరమయ్యే విషయగ్రహణకు మాత్రమే పనికొస్తుంది. ఉమా కాంతంగారి అత్యద్భుతమైన వాదనాపటిమ, తార్కికపద్ధతి, స్పష్టమైన వాక్య విన్యాసం ఆయనపుస్తకం గుణాన్ని అధికం చేసినై. ఒక్కటేలోపం కాలపరి ణామాన్ని గమనించకపోవటం.

భావకవిత్వంమీద ఆయనచేసిన ఆరోపణలు పూర్తిగా అబద్ధాలు కావు. ఉదాహరణకు ఆయన చూపించిన విస్తరణ, నిదర్శన పరంపరలు, అయో మయం, పులమడం వంటి దోషాలు భావకవుల్లో కనిపిస్తై. అయితే ఈ దోషాలు అందరు భావకవుల్లోనూ కనిపించకపోవచ్చు. ఉదాహరణకు ఆయన చూపించిన నిదర్శనపరంపర కృష్ణశాస్త్రిలోనూ, పులుముడు ఏకాంతసేవలోనూ కనిపించే మాట నిజమే. అట్లాగే శబ్దవాచ్యం ఏకాంతసేవలో ఎక్కువగా కనిపిస్తుంది. కాని, కాలంమార్పుతో పాటు చదువరుల అభిరుచులుకూడా మారొచ్చునని ఉమా కాంతంగారు గుర్తించలేదు. ఆయనదృష్టిలో తెలుగులో ఉత్తమకవిత్వమే లేదు. అందువల్ల ఆయనకు భావకవిత్వం నచ్చకపోవటంలో ఆశ్చర్యం లేదు. అయితే ఈయనమీదకూడా ఆధునికభావాల ప్రభావాన్ని గుర్తించొచ్చు. ఉదాహరణకు "జాతి స్వతంత్రమై సర్వసమృద్ధమై, ధర్మార్థకామాలు అకలుషితాలై వర్తిస్తున్న దశలో వలె, జాతి పతితమై, జీవితం కుళ్ళుడుతో ఉన్న దశలో ఉత్తమకవి తోదయానికి అనుకూల్యాలు ఉండవు" (పే. 242). కవితాప్రక్రియకి లేక కవితోన్నతికి జాత్యున్నతికి సంబంధం ఉంది అనటం సాంప్రదాయిక మయిన

భావన అనుకోను. అట్లాగే కృతికర్త ప్రవృత్తిని బట్టి కృతితత్త్వం నిర్ణయించటం ఉచితం" (పే. 284). ఇదికూడా సాంప్రదాయికభావన కాదు.

ఇంతవరకు ఉమాకాంతంగారి ఆలోచనల్లో అభివృద్ధి నిరోధకత్వం ప్రచార మైనంతగా ఆయనవిమర్శలో ఉన్న మంచి విషయాలకు ప్రశస్తిరాలేదు. భావకవిత్వంలో ఎంకిపాటలమీద జరిగిన చర్చలు సాహిత్యాభిమాను లందరూ ఎరిగినవే. ఎంకిపాటల్లో ఉన్న గుణంవల్లనే ఆపాటలమీద అంతచర్చ జరిగింది. ఎంకిపాటల్ని నిర్దాక్షిణ్యంగా "చిల్లర శృంగారం" అని విమర్శించిన ఉమాకాంతం గారే ఆ పాటల్లోఉన్న గొప్పదనాన్ని లేక కొన్ని మంచి గుణాల్ని గుర్తించటంలో వెనకపడలేదు. ఉదాహరణకు చూడండి : "ఎంకిపాటలవంటి వాటిలో కొన్నిటిలో తప్ప తక్కిన ఈ కాలపుకృతుల్లో అనేకానేకాల్లో ఈ దోషం (విస్తారము) కనపడుతున్నది" (పే. 42). ఈ అభిప్రాయాన్నే మహాప్రస్థానం పీఠికలో చలం రాసిన ఈ వాక్యాలతో పోల్చండి. "కవి-ముఖ్యం సహజ సౌందర్యం తక్కువైనప్పుడు సులభంగా సూటిగా చెప్పేసి ఇంత ధ్యానానికీ, మౌనానికీ, కార్యాలకీ, విజయాలకి వ్యవధి ఇవ్వరాదా అని చలంకోర్కి. ఆ పని స్త్రీలూ చెయ్యరు, దేశనాయకులూ చెయ్యరు. ఎంకీ, శ్రీశ్రీ తప్ప. కవిత్వంలోనూ, జీవితంలోనూ economy of words and thoughts లేకపోవడం దేశభక్తిహీనమైన పాపం."

అట్లాగే 1926 ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో "ఎంకిపాటల గాలి దుమారం"అనే పేరుతో బసవరాజు అప్పారావుగారు రాసిన వ్యాసంలో "మిత భాషణమే ప్రధానకావ్యగుణం. అది ఈ పాటలలో కొల్లలుగా ఉంది. ఈ ముగ్గురూ ఒకళ్ళతో ఒకరు సంప్రదించుకొన్నట్లుగా గాని ఆధారాలు లేవు. దీన్ని బట్టి చూస్తే ఉమాకాంతంగారి విమర్శనాశక్తి తెలుసుకోగలం. అట్లాగే ఎంకిపాటల్లో గుణాల్ని ఇంకా రెండుమూడు చోట్ల గుర్తిస్తారు. ఉదాహరణకి "ఈ కాలపు ఖండకృతుల్లో ఛాందసపుమాటలే ఎక్కువగా కనపడుతున్నవి. ఎంకిపాటలవలె కావ్యత్వసిద్ధి పొందినవి అరుదుగా కనబడుతున్నవి"(పే. 66) అనీ, ఇంకోచోట "ఎంకిపాటలు సుమబాలవంటివి కొన్నిమాత్రమే ఆత్మనాయకత్వం చేత వచ్చిన సంకుచితదృష్టి లేనివి కనబడుతున్నవి" (పే. 124) అని అన్నారు.

ఇకపోతే, భాషవిషయంలో సాంఘిక అభ్యుదయవాదులకన్నా చాలా ముందున్నారు. ఉదాహరణకు భావకవిత్వంలో భాషనుగురించి ఈయన వ్యాఖ్యానం చూడండి: "ఇక తెలుగులో అరసున్నలు, గజడదబలూ, గసడదవలూ మొదలయిన వికారాలు వెనకటివలెనే ఉన్నవి'' అని భావకవిత్వంమీద ఈయన చేసిన ఆరోపణ ఎవరూ కాదనలేనిది. అయితే భావకవిత్వం భాషలో తీసుకొచ్చిన సారళ్యాన్ని ఈయన గుర్తించకపోలేదు. "పాతబడ్డ తుప్పుమాటలు, మూలగొట్టుమాటలు మాత్రం లేక భాష ఇప్పటి కృతుల్లో ప్రసన్నత్వాని కొచ్చింది" (పే. 1౬౯). ఆయన వాదనాపటిమకు ఒక్క చిన్న ఉదాహరణ : ప్రతి పద్యానికి తాత్త్వికమైన అర్థాన్ని చెప్పే తత్త్వాన్ని తూర్పారబడుతూ, "లంజకొడక అని తిట్టి దానికి తత్త్వార్థ మున్నది అనవచ్చును. లంజ అంటే ప్రకృతి. కొడుకు అంటే పరిణామం. లంజకొడకా అంటే పరిణామమైన ఓ మనిషీ అనవచ్చును." ఈ వాక్యాలవిలువ ఎంకిపాటలమీద వచ్చిన పలువ్యాఖ్యానాలను పరిశీలిస్తే తెలుస్తుంది. ఉదాహరణకు 1925 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో పురాణం సూరిశాస్త్రిగారు ఎంకిపాటలమీద రాస్తూ వాటిల్లో వైష్ణవ తత్త్వం కనిపిస్తున్న దన్నారు.

ఉమాకాంతంగారి తెలుగువచనశైలి, తార్కికమైన వాదనాపద్ధతి ఈనాటి చాలా రచనల్లో కనిపించదు. ఆ పద్ధతిలో ఈనాటి సాహిత్యప్రక్రియలైన అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం — ఈశాఖలమీద సమగ్రమైన పరిశీలన - పొగడనీ, తెగడనీ - వస్తే సాహిత్యానికి చాలా మేలు జరిగి ఉండేది.

ఉమాకాంతంగారి వచనరచననుంచి ఈనాటి విమర్శకులు నేర్చుకోవలసింది చాలా ఉంది. స్పష్టమైన ఊహలతో, సరళమైన వచనం రాయటం ఈనాటి విమర్శకుల్లో చాలామందికి చేతకాదు. తెలుగుమాటల వాడకంలో ఆయనచూపిన మార్గం చాలా గొప్పది. మామూలు తెలుగుమాటలతో క్లిష్టమైన భావాన్ని క్లుప్తీకరిస్తా రీయన. ఉదాహరణకు అయోమయం, పులమడం, దండగ్గణం, ప్రకాశగణం, భూమిగణం, ఊగుడుమాటలు, రాయిగుద్దుడు వాదం, ఉడుకుసోది— ఇట్లాంటివి.

ఇంగ్లీషు, సంస్కృతం కొటేషన్లు ఇచ్చినప్పుడు వాటి భావాలన్నీ తెలుగులోకూడా ఇయ్యటం ఉమాకాంతంగారి అలవాటు. ఈనాటి తెలుగువిమర్శకులు అడుగడుక్కీ ఇంగ్లీషు సంస్కృతభాషలనుంచి తెలుగుభావం చెప్పకుండా కొటేషనులు ఇస్తుంటారు. ఉమాకాంతంగారి అలవాటు మనపండితులు అనుసరిస్తే చదువరులకు కష్టం తొలుగుతుంది.

ఉమాకాంతంగారి నిర్భీతి, స్పష్టత ఈనాటి ఆధునికవిమర్శకుల్లో కనిపిస్తున్న వచనంలో సారళ్యం, వాదనాపటిమ అంతగా కనపడవు.

౬

సమకాలికమైన సాహిత్యం వస్తున్న రోజుల్లోనే దాన్ని ప్రశంసిస్తూ గాని లేక ఖండిస్తూగాని వచ్చిన విమర్శాసాహిత్యాన్ని పరిశీలిస్తే, భావకవిత్వంమీదనే ఎక్కువ విమర్శాపరంపర వచ్చినట్టు తోస్తున్నది. ఒక్కో కవిని గురించికూడా విడివిగా వ్యాసాలు వచ్చినై. కృష్ణశాస్త్రి, వేదుల, నండూరి, నాయని, విశ్వనాథ, అబ్బూరి – ఇట్లా ఒక్కొక్కరిమీదనే చాలా వ్యాసాలు వచ్చినై. అభ్యుదయ కవిత్వంలో శ్రీ శ్రీ మీద వచ్చినంతగా ఇతరకవులమీద రాలేదు.

భావకవిత్వంమీద వచ్చిన విమర్శల్లో కొన్ని ఇంతకుముందు చూశాం. ఉమాకాంతంగారి పుస్తకం తరవాత వచ్చిన విమర్శలనుకూడా కొన్నిటిని పరిశీలించాల్సి ఉంది. అవి తరవాతనే వచ్చినట్టు అచ్చయిన తారీకుల్నిబట్టి కనుక్కోవచ్చు. ఈ విమర్శావ్యాసాలు ముఖ్యంగా ప్రతిభ, భారతి సంపుటాల్లో కనిపిస్తున్నై. భావకవిత్వాన్ని ఆ రోజుల్లో నవ్యకవిత్వం అనికూడా పిలిచేవారు. ఈ నవ్యకవిత్వానికి మనస్ఫూర్తిగా వత్తాసు ఇచ్చిన విమర్శకులు ఇద్దరు ముగ్గురు కనిపిస్తున్నారు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 1936 ఆగస్టు భారతిలో శివశంకరశాస్త్రిగారి పద్మావతీ చరణ చారణ చక్రవర్తిమీద, 1938 ఏప్రిల్ ప్రతిభలో వేదుల సత్యనారాయణశాస్త్రిగారి "దీపావళి"మీద వ్యాసాలు రాశాడు. వావిలాల సోమయాజులుగారు 1940 అక్టోబరు - 1941 జనవరి (సంపుటి 50 - సంచికలు 1 & 2) ప్రతిభ సంచికల్లో "గేయరచనలు - ఆధునికులు" అనే వ్యాసం ప్రకటించారు. బహుశా వీరు ఇతర పత్రికల్లో కూడా

వ్యాసాలు ప్రకటించిఉంటారు. వీరు భావకవిత్వాన్ని విశ్లేషణ చేసేదానికన్నా ఆ కవిత్వాన్ని చదవటంవల్ల కలిగిన అనుభూతిని వ్యాసరూపంలో వ్యక్తం చేశారు. అట్లాగే 1937 ఫిబ్రవరి ప్రతిభలో గొడవర్తి సూర్యనారాయణగారు "నవ్యసాహిత్యం-ప్రణయము" అనే వ్యాసంలో "మానవుడు ఎప్పుడు రూప లౌల్యం పవిత్ర మైనదనీ, సంగమకార్యం కన్నా ప్రేమ ఉత్కృష్ట మైనదనీ గ్రహిస్తాడో అప్పుడే అతనిలోని మానవత్వం బహిర్గత మౌతుంది" అని భావ కవిత్వంలోని ప్రణయసిద్ధాంతాన్ని వర్ణించారు.

అనుభూతిప్రధానమైన విమర్శ, అనుభూతిప్రధానమైన కవిత్వంతోపాటే (లేక వెనువెంటనే) రావటం ఆశ్చర్యకరం కాకపోయినా గుర్తించదగిన విశేషం.

నవ్యకవిత్వంలో భాగస్వామిగా ఉంటూ భావకవిత్వాన్ని తన వ్యాసాల ద్వారా సైద్ధాంతికంగా సమర్థించినవారు నోరి నరసింహశాస్త్రిగారు. 1935 జన వరి ప్రతిభ సంచికలో "నవ్యకవిత్వము - దాని ఉద్దేశ్యము" అనే వ్యాసంలో అట్లాంటి విశ్లేషణపూర్వకమైన ప్రతిపాదన చేశారు.

"ఈ కాలపు కవిత్వంలో నూతనత్వము దేనిలో ఉన్నది ? అని అజీర్ణ వ్యాధి కలవాళ్ళు ప్రశ్నింపవచ్చును" అని చేసిన వ్యాఖ్యలో ఉమాకాంతంగారిని గుర్తుపట్టటం కష్టం కాదు.

ప్రాచీనకవిత్వంలో శిల్ప మెక్కువ అనీ, శివకవిత్వంలో జీవ మెక్కువ అనీ ఈ రెండూ నవ్యకవిత్వంలో మిళితమయినయ్యని నోరి నరసింహశాస్త్రిగారు సమర్థించారు.

"కవితోద్రేకము లేనిది వారు సామాన్యముగా వ్రాయరు. ఈ గుణము వల్లనే ఈ కవిత్వానికి భావకవిత్వమని ప్రచారములోకి వచ్చింది. కొందరిలో శిల్ప మెక్కువ, కొందరిలో జీవ మెక్కువ. కాని మొత్తముమీద అందరిలోనూ శిల్పమూ, జీవమూ మిళితమై ఉన్నవి." "మునుపు శివకవులు చేసి విఫలమైన ప్రయత్నమే నేడు నవ్యకవులు చేస్తున్నారు" అని రాస్తూ శివకవులు విఫలమైన

చోట భావకవులు సఫలమయ్యా రన్నారు. భావకవిత్వానికి సిద్ధాంతబలాన్ని కూర్చిన వారిలో నోరి నరసింహశాస్త్రిగారు ప్రముఖంగా కనిపిస్తున్నారు. కొత్త కవిత్వం, కొత్త సాహిత్యసిద్ధాంతాన్నికూడా తయారు చేసుకుంటుందన్న నారాయణరావుగారి (1978, పే.219) ప్రతిపాదన కిది స్పష్టమైన ఉదాహరణ. నారాయణరావు కవిత్వాన్ని గురించి కవిత్వం రాయటం అనేది ప్రధానంగా ఉద్దేశించారు. కాని విమర్శల్లో కూడా ఈ ధోరణిని గుర్తించొచ్చు.

ఇక భావకవిత్వాన్ని వ్యతిరేకిస్తూ వచ్చిన విమర్శల్నికూడా కొన్నిటిని పరామర్శిద్దాం. 1937 భారతిలో సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు "తృణ కంకణ విమర్శనం"అనే వ్యాసం రాశారు. ఈయనకు ఆ పుస్తకం ఎన్నిసార్లు చదివినా అర్థం కాలేదట. అర్థం కాలేదని ఊరుకోక పండితుల కలవాటయిన పద్ధతిలో అపశబ్దాలు, దుష్టసమాసాలు ఏకరువుపెట్టారు.

ఎంకిపాటలమీద అయితే ఒక గాలిదుమారమే రేగింది. 1926 ఆంధ్ర పత్రిక సంవత్సరాదిసంచికలో బసవరాజు అప్పారావుగారు "ఎంకిపాటల గాలి దుమారము" అనే శీర్షికతోనే ఒక వ్యాసం రాశారు. 1926 నవంబరు భారతిలో ఎంకిపాటల్ని సమర్థిస్తూ డి. ఎ. నరసింహంగారు ఒక వ్యాసం ప్రకటించారు. "చిల్లర శృంగారము"అని కొటేషన్లలో ఉండటంవల్ల ఈ వ్యాసకర్తకు ఉమాకాంతంగారి వాదంతో పరిచయం ఉన్నట్టు కనిపిస్తుంది. 1925 నవంబరు భారతిలో దశిక సూర్యప్రకాశరావుగారు "ఎంకిపాటలు-స్వర్ణయుగము" అని రాస్తూ ఎంకిని కాపుపడుచుగా గుర్తించారు. ఇంకా పొక్కులూరి లక్ష్మీనారాయణగారు అనే ఆయన "ఎంకినాయుడు బావలు సంకర దంపతులని వారి శృంగారం అసభ్యమని, అవినీతికరమని, ఆంధ్రభాషకు అనర్థదాయక మనీ అన్నారని బసవరాజు అప్పారావుగారు ఎంకిపాటల గాలిదుమారంలో పేర్కొన్నారు. అదే వ్యాసంలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ఎంకినాయుడు బావలు "సాక్షాత్తు శృంగారరసాధిష్ఠాన దేవతలగు రతీమన్మథులే" అన్నారని అప్పారావుగారు రాశారు. ఈ వ్యాసంలో అప్పారావుగారు పై వాదాలన్నిటినీ నిరాకరించి వాస్తవచిత్రణ ఇయ్యటానికి ప్రయత్నించారు. మొదట ఎంకినాయుడు బావలు భార్యాభర్తలుగా సంకల్పింపబడలేదని, కొన్నాళ్ళయినతరవాత ఉత్తమ ఇల్లాలుగా జేసి పాటలు రచించారని అప్పారావుగారు రాశారు. "మొదటి ఎంకి

అసలు తూర్పువాళ్ళ ఎంకి, రెండవఎంకి పేరుకుమాత్రమే ఎంకి" అని ఎంకి చిత్రణలో కవి చూపించిన భేదాన్ని వివరించారు.

1926 మే 10, 22, జులై 17, ఆగస్టు 18 గోలకొండ పత్రికద్వారా బూర్గుల రామకృష్ణారావుగారు ఎంకిపాటలచర్చను తెలంగాణాకు తీసుకొచ్చారు. ఎంకిపాటల విమర్శలలో చర్చకు వచ్చినవి భాష పాత్రములేనని ఆ రెంటి విషయంలో ఎంకిపాటల్ని సమర్థించటమే రామకృష్ణారావుగారు చేసింది. వీరు ఎంకి పాటల్ని మనసారా సమర్థించారు. బసవరాజు అప్పారావుగారు ఇంతకుముందు ప్రస్తావించిన వ్యాసంలో ఎంకిపాటల్లో వాడిన భాష రచయితది కాకపోవటంవల్ల సహజంగా ఉండదని విమర్శించారు. దానికూ్కడా "కవి తన స్వకీయజీవితానుభవముల నైనప్పటికి ఏ కారణముననైన నేమి ఇతర పాత్రములద్వారా పాడదలచినప్పుడు ఆ పాత్రల కనువగు భాషను వాడక తప్పదు" అని సమర్థించారు.

తెలంగాణప్రసక్తి వచ్చినప్పుడు 1941-1942 సంవత్సరాల్లో "తెలంగాణ" దినపత్రికలో "నవ్యకవితా నీరాజనము" అనే వ్యాసం చెప్పుకోదగింది. కట్టమంచి రామలింగారెడ్డిగారు స్థాపించిన ఆధునికమార్గంలోనే రామానుజరావుగారి పరిశీలన సాగుతుంది. "ఉద్రేకమే కవితకు ప్రాణాధారమని ఒకానొక యభిప్రాయము. ఉద్రేకము లేనిది ఏ మహాకార్యము నెరవేరుట దుస్తరము" అనే వాక్యాలు రామలింగారెడ్డిగారిని గుర్తుకు తెస్తున్నై. అట్లాగే 'మార్పు జగల్లక్షణము' అన్నా, 'ఒక జాతి సారస్వతము ఆ జాతి జాతీయజీవనమునకు అద్దమువంటిది'అన్నా, 'సంఘజీవితమునకు, సాహిత్యమునకు విడదీయరాని సంబంధము కలదు' అన్నా విమర్శలో ఆధునికపద్ధతినే రామానుజరావుగారు సూచిస్తున్నారు. రామానుజరావుగారు, రామకృష్ణారావుగారు, లక్ష్మీరంజనంగారు – వీరి వ్యాసాల్లో ఒక సామాన్యలక్షణం ఉంది. వీరు నవ్యకవిత్వంలో గురజాడ అప్పారావుగారి నుంచి కాళోజీ నారాయణరావుగారి వరకు అన్ని ధోరణులను సమానదృష్టితో ఆదరించారు, ఆహ్వానించారు. ఇక్కడ ప్రధానంగా గుర్తించాల్సిం దేమిటంటే : తీరాంధ్రంలో నవ్యకవిత్వ ధోరణులకు ప్రశంసలూ, ఖండనలూ విరివిగా వచ్చినై. తెలంగాణపు విమర్శకులుమాత్రం ఈ ధోరణుల నన్నిటినీ నిండుహృదయంతో ఆహ్వానించారు. అంటే సంప్రదాయవాదులనుంచి

రావల్సినంత ప్రతిక్రియ రాకపోవటం తెలంగాణాలో విశేషం. దీని క్కారణం విమర్శకు లాలోచించాల్సి ఉంది. సాహిత్యరంగంలో అప్పటివరకు స్తబ్ధంగా ఉండిన తెలంగాణ కొత్తజీవాన్ని పోసుకుంటున్నతరుణం కావచ్చు అది. అందు వల్ల తెలంగాణ కొత్తధోరణులను ఆహ్వానించి ఉండొచ్చు.

రామానుజరావుగారికి సహనభావం ఎక్కువ. రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పారావు వంటి తొలికాలపు కవులతో మొదలయి, గడియారం శేషశాస్త్రి, దుర్భాక రాజశేఖర శతావధాని, విశ్వనాథ సత్యనారాయణ వంటి సాంప్రదాయికులను, దువ్వూరి రామిరెడ్డిగారి వంటి కర్షకకవులను, కృష్ణశాస్త్రి వంటి భావకవులను, శ్రీ శ్రీ వంటి విప్లవకవులనుకూడా పక్షపాతం లేకుండా మెచ్చుకున్నారు. రామానుజరావుగారి వ్యాసాలు భారతరాజకీయ స్వాతంత్ర్యం (1947) తరవాతనే ఎక్కువున్నట్టున్నై. వాటిల్లో ఎక్కువభాగం రేడియో ప్రసం గాలనుకుంటాను. ఘాటైన ధోరణిగాని, గాఢమైన విమర్శగాని రామానుజరావు గారి వ్యాసాల్లో ఉండవు. తెలంగాణాపాఠకులకు ఆధునికకవిత్వాన్ని పరిచయం చేసిన విమర్శకుల్లో రామానుజరావుగారికి స్థానం ఉంది.

౭

భావకవిత్వం దాదాపు 1940 వరకూ కొనసాగింది. 1935 ఉదయిని రెండో సంచికలో శ్రీశ్రీ రాసిన "ఎగిరించకు లోహవిహంగాలను" అనే గేయంతో పాటు నాయని సుబ్బారావుగారి ఫలశ్రుతిలోని ఖండికకూడా అచ్చయింది. నిజా నికి అభ్యుదయకవిత్వం నవ్యకవిత్వంలో భాగంగా - కాంగ్రెసులో భాగంగా 1942 వరకూ కమ్యూనిస్టు లున్నట్టు - ప్రసారమయింది. నవ్యకవిత్వంలో వచ్చిన ఇతర శాఖలు : రుక్మిణీనాథశాస్త్రి, మాచిరాజు దేవీప్రసాదులు రాసిన ప్యారడీలు (వికటకవిత్వం). పఠాభి రచించిన అహంభావ కవిత్వం, శ్రీశ్రీవంటి వాళ్ళె మధ్యలో రచించిన స్రియలిస్టు, ఝెరియలిస్టు కవిత్వాలు. వీటన్నిటిమీద ఆనాటి పత్రికల్లో విమర్శలు వచ్చినై.

నవ్యకవిత్వంలో పిఠాపురం యువరాజు రావు వేంకట మహీపతి గంగాధర రామారావు అనే ఆయనకావ్యాలు, పఠాభి వచనపద్యాలు, శ్రీశ్రీ

కొంతె కోణాల్లో వైచిత్రి ఎక్కువ కనిపిస్తుంది. పఠాభి ఫిడేల్‌రాగాల డజను రాసిన ఇంట్రోలో శ్రీ శ్రీ "విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం" అని ప్రకటించాడు.

1942-1943 ప్రతిభ ఏడో వాల్యూములో "కవిత్వము-వైచిత్రి" అనే పేరుతో పా. ప. (? పాలగుమ్మి పద్మరాజు) గారు ఒక వ్యాసం రాస్తూ వైచిత్రిని ఇట్లా వివరించారు. "పద్యానికి రెండు పక్కలున్నాయి. ఒకటి ఆంగికస్పర్శ (sensory feelings), రెండవది అర్థవిస్తీర్ణత. ఛందస్సు ఎక్కువగ ఆంగికస్పర్శకు చెందినది. అలంకారం అర్థవిస్తీర్ణతకు చెందినది...కవిత్వానికి ఉంటాయని చెప్పే అనేకం ఈ పై రెండుగుణాలు కలియికవల్ల వచ్చే ఒకానొక క్రొత్తదనమే వైచిత్రి. పద్యాన్ని మనకి పరిచయం చేసేదీ, చనవు చేసేదీ కూడా ఈ వైచిత్రే." నిరాడంబరంగా ఉన్న పద్యం సజీవ మయినదయినా తొందరగా ప్రజలదృష్టిని ఆకర్షించలేదు" అని సిద్ధాంతీకరించి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, పఠాభి, వేదుల మొదలయిన కవులనుంచి ఉదాహరణ లిచ్చారు.

నవ్యకవిత్వపురోజుల్లో ముఖ్యంగా భావకవిత్వపు చివరిరోజుల్లో ఆనాటి చదువరులకు, విమర్శకులకు వైచిత్రిమీద ప్రేమ ఉన్నట్టు ఈ పై అభిప్రాయాలు తెలియజేస్తున్నై. భావకవిత్వంనుంచి అభ్యుదయకవిత్వానికి జరిగిన పరిణామంలో ఈ వైచిత్రీమయ కవిత్వం ఇంకా విమర్శకులు గుర్తించని లింకులాగా కనిపిస్తున్నది.

శ్రీశ్రీ రచనల్లో (పద్యంలోనూ, గద్యంలోనూ) ఈ వైచిత్రీవ్యామోహం విపరీతంగా కనిపిస్తుంది. దాన్ని టెక్నిక్ పేరుతో శ్రీశ్రీ సమర్థించుకుంటాడు. 1935 ఫిబ్రవరి 'ఉదయని' సంచికలో "ముత్యాల సరం - ఒక కృషి" అనే వ్యాసంలో శ్రీశ్రీ ఇదే చేసినట్టు మనం గుర్తుపట్టొచ్చు. కవిత్వము, సంవిధానము అనే అంశాలను కొన్ని కూర్పులు (combinations) చేసి (+కవిత్వం - సంవిధానం) అనే పద్ధతికి అనంతకృష్ణశర్మగారి 'గాథాసప్తశతీసారము' అనే గ్రంథంలో నుంచి ఈ పద్యం ఉదాహరించాడు.

"ప్రీతిపాత్రమైన పెండ్లాము చచ్చిన
యింటిపాడు చూచి యేడ్వలేక

చనడు పొలము విడిచి పనిలేక యున్నను
పామరుండు కాపువాడు కంటె !"

'టెక్నిక్ లేని కవిత్వాన్ని ఊహించలేను' అని ఆరుద్ర "త్వమేవాఽహం" (1949) అనే పుస్తకానికి రాసిన ఒక లఘుటిప్పణిలో చెపుతాడు.

ప్యారడీలలో విశేషాలగురించి పైన పేర్కొన్న ప్రతిభ సంపుటంలోనే మాచిరాజు దేవీప్రసాద్‌గారు 'వికటకవిత్వం' అనే వ్యాసం రాశారు. ఈనాడు ఆ రకపు కవిత్వమూ లేదు, ఆ సంబంధి వ్యాసాలూ లేవు. నిరాదరణవల్ల అంత రించిపోయిన ఒక ఆధునిక కవితావినోదం వికటకవిత్వం. ఉన్నదాన్నయినా సంపుటీకరించుకోవటం అవసరం.



తెలుగుసాహిత్యంలో ఉద్యమంకంటే ముందు అభ్యుదయ సాహిత్యం పుట్టింది. అభ్యుదయకవిత్వం శ్రీశ్రీ తో స్పష్టమైన రూపం తీసుకున్నది. శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలసంపుటికి చలం 1942 లో పీఠిక రచించాడు. ఆ సంపుటిలో 1934 నుంచి రచించిన గీతాలున్నై. 'నయాగరా' సంపుటి 1944లో వచ్చింది. అభ్యుదయరచయితల సంఘం 1943 లో ఏర్పడింది. అభ్యుదయపత్రిక 1946 అక్టోబరులో మొదలయింది. అభ్యుదయ మొదటిసంచిక పెదపూడి సాహిత్య పాఠశాలా సంచికగా వచ్చింది. చదలవాడ పిచ్చయ్యగారు అభ్యుదయ పత్రికకు సంపాదకులు గాను, అభ్యుదయ రచయితల సంఘానికి కార్యదర్శిగాను వ్యవహరించారు.

అభ్యుదయ కవిత్వం భావకవిత్వంలో నుంచే దానికి ప్రతిక్రియగా పుట్టింది. శ్రీశ్రీ భావకవికత్వం నుంచి వైచిత్రితో కూడిన ప్రయోగాలు చేస్తూ అభ్యుదయకవిగా స్థిరపడ్డాడు. ఇంతకుపూర్వం సూచించినట్టుగా అభ్యుదయ కవిత్వం నవ్యకవిత్వంలో భాగంగానే గుర్తించబడింది. అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడినప్పుడు చాలామంది భావకవులు అభ్యుదయ కవితావేదికనుంచి తమ ప్రవచనాలను వినిపించారు.

భావకవిత్వం తన కవిత్వాన్ని సమర్థించే బలమైన విమర్శనవర్గాన్ని సృష్టించుకొంది. కాని, అభ్యుదయకవిత్వం అట్లాంటి విమర్శకవర్గాన్ని సృష్టిం

మకోలేకపోయింది. అభ్యుదయకవిత్వానికి వ్యాసపరంపరలతో సిద్ధాంతపరంగా సమర్థించిన కె. వి. రమణారెడ్డి కవిగా 1950 ప్రాంతంలో బయటికొచ్చాడు. ఆయనవిమర్శలు ఆ తరవాతనే. రాచమల్లు రామచంద్రారెడ్డి విమర్శకుడిగా బయటి కొచ్చేప్పటికి అభ్యుదయకవిత్వోద్యమం చారిత్రకవిశేష మైపోయింది. ఆ రామచంద్రారెడ్డిగారు 1964 లో వచ్చిన నవత పత్రికమీద రాసిన సమీక్ష ద్వారా జనందృష్టిలో కొచ్చారనుకుంటాను. 'సంవేదన' 1967 లో మొదలైంది.

అభ్యుదయకవిత్వపు తొలిరోజుల్లో విమర్శకవర్గం లేని లోటును భావ కవులు పూర్తిచేశారు. వాళ్ళను తన కార్యదక్షతాతంత్రంతో చదలవాడ పిచ్చయ్య గారు అభ్యుదయవేదిక మీదకి తీసుకొచ్చారు.

1947 జనవరి 17, 18, 19 తేదీలలో మద్రాసులో జరిగిన నాల్గవ అభ్యుదయరచయితల సమావేశంలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, వేదుల సత్య నారాయణశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి పాల్గొన్నారు. అంతేకాదు, తమకు తోచినట్లుగా అభ్యుదయకవిత్వాన్ని సమర్థించారు. వీళ్ళ వ్యాసాలు 1947 మార్చి అభ్యుదయసంచికలో వచ్చినై. హనుమచ్ఛాస్త్రిగారు "కావ్యవస్తువు" అనే వ్యాసంలో శ్రీశ్రీ భిక్షువర్షీయసీలో నుంచి "దారిప్రక్క చెట్టుక్రింద, ఆరిన కుంపటి విధాన, కూర్చున్నది. ముసిల్దొకతె, మూలుగుతూ ముసురుతున్న ఈ గతాలతో వేగలేక'' అనే పాదాలను ఉదాహరించి వ్యాఖ్యాన పూర్వకంగా సమర్థించారు. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ''మన సాహిత్యంలో మార్పులు'' అన్న వ్యాసంలో అన్నవస్త్రాలు లేనివాడుకానీ, అక్షరాస్యుడు కానివాడు కానీ లేకపోవడమే అభ్యుదయము. మానవుడు మానవుడుగా జీవించేటట్లు చేసేదే అభ్యుదయ రచన''అని నిర్వచించారు. పిలకా గణపతిశాస్త్రి గారు అభ్యుదయరచన అన్న వ్యాసంలో ''అయితే ప్రస్తుత పరిస్థితుల్లోమాత్రం సాంఘికదృక్పథం ఎక్కువగా కలిగిన రచనలు బాగా కావాలి. క్రమక్రమంగా అటువంటి రచనలు ఎక్కువగా వస్తాయని నిశ్చయంగా చెప్పవచ్చును." పైన వివరించినదే అభ్యుదయరచయితల దృక్పథ మనుకుంటాను. దృక్పథంలో అభి ప్రాయభేదం ఉండవలసిన ఆవశ్యకత ఉండదనుకుంటాను" అని సందేహంగా చెప్పారు.

1947 ఏప్రిల్ "అభ్యుదయ"లో చిలుకూరి నారాయణరావుగారు "అభ్యుదయ రచయితల సంఘం - నవ్యసాహిత్య పరిషత్తు" అనే వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో అదే శీర్షికతో భారతిలో మల్లవరపు విశ్వేశ్వరరావుగారు నవ్యసాహిత్యపరిషత్తువారు అభ్యుదయరచయితల సంఘము నాక్రమించుకొన్నారనీ ధ్వని కలిగేటట్లు సూచించారనీ పేర్కొని "నిజమాలోచిస్తే నవ్యసాహిత్య పరిషత్తుకు అభ్యుదయ రచయితల సంఘానికి ఎట్టి భేదమును లేదు" అని ప్రకటించారు.

ఈ సంఘటనలను పరిశీలిస్తే రెండు మూడు విషయాలు తోస్తున్నై. అభ్యుదయ కవిత్వం కూడా నవ్యత కోసమే యత్నించినది కనుక నవ్యసాహిత్య పరిషత్తు అభ్యుదయకవిత్వానికీ, అభ్యుదయరచయితల సంఘానికీ, స్వాగతం చెప్పింది; తనలో భాగంగానే గుర్తించింది. ఆ కారణంగా అభ్యుదయరచనలను సమర్థించే భారం తమ నెత్తిన వేసుకొన్నారు. అయితే అభ్యుదయరచయితల సంఘంలో కమ్యూనిస్టుల ప్రాబల్యం ఉందనేది ఇపుడు రహస్యం ఏమీ కాదు. నవ్యకవులకు కమ్యూనిజంతో పెద్ద స్నేహం లేదు. వాళ్ల సమర్థనలు అభ్యుదయ సాహిత్యానికి కొంత గౌరవప్రతిపత్తులు కలిగించినా సిద్ధాంతబలం లక్ష్యశుద్ధి కలిగించలేకపోయినై. వాళ్ళ సమర్థనలు ఈనాడు చూస్తే చాలా అమాయకంగా కనిపిస్తై. ఆ సమర్థించినవారు తరువాత ఎక్కువకాలం అభ్యుదయ రచయితల సంఘానికి మిత్రులుగాకూడా మిగలలేదు. 1955 లో జరిగిన ఆంధ్ర ఉప ఎన్నికలలో అభ్యుదయ రచయితలకు, కమ్యూనిస్టులకు స్పష్టమైన వ్యతిరేకులుగా కూడా తయారయ్యారు.

నవ్యసాహిత్యపరిషత్తులో సభ్యులుగా ఉండి కమ్యూనిస్టులతోనూ, అభ్యుదయ రచయితలతోనూ సంబంధాలు పెట్టుకోకుండా మొదటినుంచీ దూరంగా ఉన్న కవి పండిత విమర్శకుడు నోరి నరసింహశాస్త్రిగారు. అనుమానం లేని సనాతనవాది. భాష విషయంలో అభ్యుదయవాదిగా కొంతకాలం ఉన్నట్టు ఆయన చేసిన సమీక్షలవల్ల తెలుస్తున్నది.

1940 అక్టోబరు - 1941 జనవరి 2, 3 సంచికలు ఒకటిగా వచ్చిన ప్రతిభ సంపుటంలో సురవరం ప్రతాపరెడ్డిగారి కథల పుస్తకాన్ని (ప్రతాపరెడ్డి

కథలు) సమీక్షిస్తూ "ఏ మండలమువారు ఆ మండలముతెలుగులో రచనలు చేసి నప్పుడే భాష సజీవముగా ఉంటుంది. ఈ విషయము స్వతంత్రబుద్ధితో గమ నించినందుకు శ్రీ ప్రతాపరెడ్డిని మేము ప్రత్యేకముగా అభినందిస్తున్నాము" అని రాశారు.

అదే సంచికలో దీక్షితుల కథలను సమీక్షిస్తూ "శ్రీ దీక్షితులు భాషా వాదములో పాల్గొన్నవారు. అట్టివారు ఈ కథలలో కొన్నిచోట్ల వ్యవహారములో లేని గ్రాంథికరూపాలు, వ్యావహారికరూపాల ప్రక్కనే క్రియారూపాలలోకూడా ఇంకా ప్రయోగించుతూ ఉండడము ఇంకా శోచ్యము. పూర్వము గ్రాంథిక భాషలో వ్రాసిన దురభ్యాసము మనస్సుకు పోయినా, వారికి చేతికి పోయి ఉండదు" అని చాలా తీవ్రంగా రాశారు. కాని, విశ్వనాథ సత్యనారాయణ గారితో పాటు వీరూ తరవాతరోజుల్లో భాషవిషయంలో కూడా వెనక్కి వెళ్ళి పోయారు. తరవాత భారతిలో గ్రాంథికభాషలోనే వ్యాసాలూ, సమీక్షలూ రాశారు.

నరసింహశాస్త్రిగారు మిగతా విషయాలలో మొదటినుంచీ 'సనాతనిష్ఠే.' 1937 జులై ప్రతిభలో "కావ్యప్రయోజనము"అనే వ్యాసంలో "నా మతములో వేదశాస్త్రము తెలిసి ప్రమాణబుద్ధి కలిగి, అనుష్ఠాతలూ ఉపాసకులూ అయిన వారే ఉపదేశాధికారము కలవారు" అని సందేహానికి అవకాశం లేకుండా ప్రక టించారు. 1939 జనవరి—ఏప్రిల్ ప్రతిభలో "తెలుగుకవిత్వములో ఫ్యాషనులు" అనే వ్యాసంలో సనాతనత్వాన్ని ఫ్యాషను చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాను" అని లక్ష్యప్రకటన చేశారు. కమ్యూనిస్టులమీద, అభ్యుదయకవులమీద, వారిని సమర్థిస్తున్నవారిమీద విసుర్లు విసిరారు, విమర్శలు చేశారు నరసింహశాస్త్రిగారు. ఇదే సంచికలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు "ఈమధ్య సామ్యవాదులను టోపీ వెయ్యటానికి 'ఆకలి'ని చేపట్టినారు" అన్నారు.

1940 జులై ప్రతిభలో "అహంభావ కవిత్వధోరణి : చిత్రకవిత్వము" అనే వ్యాసంలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారిమీద కొంచెం దురుసుగా రాశారు. "ఇంగ్లీషు కొంచెము వచ్చునేమోకాని ఉద్గ్రంథాల బాగోగులు తెలుసుకో గలిగినంత భాషాజ్ఞానము లేదు. ఆయన శ్రీశ్రీని వెనక వేసుకువస్తూఉంటాడు.

కాని ఆయన విమర్శలు వాటిపద్ధతులు శ్రీశ్రీ గాని, సామాన్యముగా అహంభావ కవులు గాని అంగీకరిస్తా రనుకోను"అని రాశారు. సనాతనభావాలను వయసుతో పాటు పెంచుకుంటూ భాషవిషయంలో వెనక్కి మళ్ళిన విమర్శకులు నోరి నరసింహశాస్త్రిగారు.

సాహిత్యవిమర్శలో మార్క్సిస్టుధోరణి సరిగ్గా ఎప్పుడు మొదలయిందో స్పష్టంగా చెప్పాలంటే చాలా పత్రికలూ, పుస్తకాలూ గాలించాలి. నాకు తెలిసినంతవరకు రాయిస్టులు ఈ పద్ధతిని ప్రారంభించినట్టున్నది. శిష్ట్లా ఉమా మహేశ్వరరావుగారి 'నవమి చిలుక' 1938 లో అచ్చయింది. 1940 జులై ప్రతిభలో సమీక్ష అయింది. ఆ సమీక్షలో ఆ పుస్తకానికి చివర జి. వి. కృష్ణారావుగారి ఈ మాట ఉన్నట్టుగా ఉటంకించబడింది.

"భావకవులు పురాణకవులమీదికి విప్లవం చేసి జమీందారులను ఆశ్రయించి వారి కనుసన్నలకు నృత్యం చేసే కవిత్వాన్ని కేపిటలిస్టురుచులకు అనుగుణంగా మార్చి వారి అందుబాటులోకి వచ్చారు. ఇప్పుడు ప్రజాసామాన్యం భావకవులమీదికి ప్రోలిటేరియన్ విప్లవం చెయ్యడానికి సిద్ధపడుతుంది." కావ్యజగత్తు అనే పుస్తకంకూడా సుమారు అదే రోజుల్లోనో, కొంచెం తరవాతో రాసి ఉంటారు.

ఇప్పుడు అభ్యుదయకవిత్వంగా పరిగణిస్తున్న గీతాలను అప్పటికే రాసినా, శ్రీశ్రీ అప్పటికింకా భావకవిత్వాన్ని వెనకేసుకొస్తూనే ఉన్నారు. 1937 నవంబరు భారతిలో "విశ్వం ప్రేమగీతాలు" అనే వ్యాసం రాస్తూ "అతివాదులంతా తిట్లు తింటూనేఉంటారు. భవిష్యత్తులో జయించితీరుతారు. .... .... నేడు సామ్యవాదులు జైళ్ళలో పడుతున్నా, భావగీతాలు పరిహాసభాజనం అవుతున్నా దీనిలో ఏమీ విచిత్రం లేదు. నేడు భావకవిత్వానికి యౌవనదశ నడుస్తున్నది. భావకవులు ఉద్రేకం, ఆవేశం లేనిదే గీతాలు వ్రాయరు" అని అతివాదులనూ, సామ్యవాదులనూ, భావగీతాలనూ ఒకేసారి ప్రశంసిస్తూ రాశారు.

తొలిరోజుల్లో వచ్చిన మార్క్సిస్టు విమర్శల్లో కొన్ని యాంత్రికంగానూ, మరికొన్ని అమాయకంగానూ కనపడతై.

ఫ్యూడల్ కేపిటలిస్టు సమాజస్వభావాల ననుసరించి వచ్చే కవితా స్వరూపాల విషయంలో పరిశోధన ప్రపంచసాహిత్యంలోనే తగినంత జరిగినట్టు కనిపించదు. ఆర్థికమూలానికి ఉపరితల నిర్మాణంలోని కళలకు ఉన్న సంబంధాన్ని గురించి ఎక్కువగా యాంత్రికవిమర్శలే వచ్చినై.

అమాయకపు విమర్శకు ఉదాహరణగా ఆనాటి కొడవటిగంటి కుటుంబరావుగారు 1938 జులై ప్రతిభలో "సాహిత్యంలో కలగవలసిన మార్పు" అనే వ్యాసం తీసుకోవచ్చును. మనను వేధించుతున్న సమస్యలలో నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళు ఆర్థిక దుస్థితివల్ల కలిగేవే నని నూటికి తొంభై తొమ్మిదిమంది రచయితలకు తెలియదు" అన్నారు. అంతవరకు పేచీలేదు. కాని అదే వ్యాసంలో చివర "మః మీద పడి తినచూస్తున్న అరవలను, ఆంగ్లేయులను ఇంకొకవిధంగా కాకపోతే మన సాహిత్యంద్వారానైనా సంస్కరించగలుగుతామేమో" అని అమాయకంగా (naive) గా రాశారు.

అరవలను, ఆంగ్లేయులను ఒక గాట కట్టెయ్యటం తప్పు. దోపిడీవర్గాన్ని కాని, సామ్రాజ్యవాదులను గాని సాహిత్యంద్వారా సంస్కరిద్దా మనుకోటం అమాయకత్వం.

1946 ప్రతిభలో దేచిరాజు కృష్ణశర్మ అనేఆయన "ఏది అభ్యుదయము" అనే వ్యాసం రాస్తూ "ఊర్ధ్వముఖంగా, సుగుణోపేతంగా, సునిశితంగా, మనోజ్ఞంగా, బుద్ధిప్రేరణతో ఏ భావాన్నయినా వ్యక్తీకరించితే అది అభ్యుదయము" అని రాశారు. 1946 లో ఏ భావం అయినా వ్యక్తీకరణ భేదాన్నిబట్టి అభ్యుదయ భావం అవుతుంది అని అనుకొనేవాళ్ళున్నారంటే అభ్యుదయసాహిత్యంతో పాటే అభ్యుదయవిమర్శ రాలేదనే అర్థ మవుతుంది.

అభ్యుదయసాహిత్యానికి రాజకీయ సిద్ధాంతబలమూ, కమ్యూనిస్టుపార్టీ అండా ఉన్నై. అభ్యుదయ సాహిత్యానికి ఒక దృక్పథం ఇయ్యాలంటే రాజకీయ సిద్ధాంతం తెలిసినవారే ఇయ్యగలుగుతారు. వారికి సాహిత్యం తెలియకపోతే పార్టీఆదేశాలు, తాఖీదుల, డాక్యుమెంట్ల స్థాయికి దిగజారిపోతుంది. రాజకీయసిద్ధాంతంతో తగిన పరిచయం లేకపోతే అమాయకపువిమర్శలు తయారవు

తయ్యాని ఇంతకుముందే ఉదాహరించాను. ఈ రెంటినీ సమదృష్టితో సమబాధ్యతలో నిర్వహించగలిగినవాళ్ళే అభ్యుదయవిమర్శకులు కాగలుగుతారు. తొలి రోజుల్లో ఆ రకమైన విమర్శలు చేసినవారిలో మద్దుకూరి చంద్రశేఖరరావుగారు ప్రముఖులుగా నాకు కనిపిస్తున్నారు.

1946 మే 11 నుంచి జూన్ 10 వరకు నెలరోజులు తెనాలితాలూకా పెదపూడిలో జరిగిన సాహిత్యపాఠశాలలో "ఆంధ్రసాహిత్యంలో కొత్త పోకడలు" అనే అంశంమీద చంద్రశేఖరరావుగారు పాఠం చెప్పారు. ఆ పాఠం అభ్యుదయ మొదటిసంచికలో అచ్చయింది. మార్క్సిస్టుదృక్పథంతో సాహిత్యరీతులను విశ్లేషణ చేశారు నూతనాంధ్ర జాతీయవికాసానికి వీరేశలింగం, అప్పారావు, రామమూర్తిగార్లు చేసిన సేవని గుర్తించారు. దేశభక్తి కవిత్వం, భావకవిత్వం, చలం, ఉన్నవ లక్ష్మీనారాయణ, రామస్వామిచౌదరి మొదలైనవాళ్ళ రచనలు, నిర్వహించిన పాత్రను అంచనా వేశారు. సోషలిస్టుభావాల వ్యాప్తిని గుర్తించారు. ప్రజాకవిత్వధోరణులను పరామర్శించారు. స్రియలిస్టు నిలవ్వని తీర్పు చెప్పారు. 17 పేజీల వ్యాసపరిధిలో చాలా సమగ్రంగా ముఖ్యరీతు లన్నిటినీ విశ్లేషణ చేసి చూపించగలిగారు.

సామాజికవ్యవస్థను మార్చే శక్తులకు తన కవిత్వంద్వారానే కాకుండా విమర్శలద్వారా కూడా బలం ఇచ్చినవాడు శ్రీశ్రీ. అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డతరవాత ఆదృక్పథాన్ని ప్రచారంచెయ్యటంలో శ్రీశ్రీ ఎప్పుడూ వెనకపడలేదు. శ్రీశ్రీ సాహిత్యవిమర్శల్లో ఎక్కువభాగం లక్ష్యప్రకటనలు. సాహిత్యంలో వర్గదృక్పథాన్ని సోషలిస్టురాజకీయాలతో సంబంధాన్ని, విప్లవచైతన్యోపదేశాన్ని సమర్థిస్తూ ఉపన్యాసాలు చేశాడు ; వ్యాసాలు రాశాడు.

1945 డిసెంబరు 31 – 1946 జనవరి 2 తారీకుల మధ్య తెనాలిలో జరిగిన మూడో అభ్యుదయరచయితల సంఘాన్ని ప్రారంభిస్తూ "సాహిత్యంలో విప్లవం"అనే అంశంమీద ఉపన్యసించాడు. అది '1946 మార్చి తెలుగుతల్లి'లో అచ్చయింది. అదే సమావేశంలో ఒక సభకు అధ్యక్షుడుగా ఉండి "సాహిత్యం ఎందుకు ? ఎవరికి ?" అని ఉపన్యసించాడు. పెదపూడి సాహిత్యపాఠశాలలో (1946 మే-జూన్) "ఏది విప్లవపంథా" అనే పాఠం చెప్పాడు. 1955 జులై

30, 31 తారీకుల్లో బెజవాడలో ఐదో అభ్యుదయ రచయితల సంఘసమావేశం గంభీరమైన అధ్యక్షోపన్యాసంలో ఆనాటి ఆంధ్ర ఉపఎన్నికలలో "ఫౌల్ చేసి గోల్‌చేసి నెగ్గి పట్టపగ్గాలు లేకుండా విజృంభిస్తున్న ప్రతీపశక్తుల్ని" నిరసించ మని ఉద్బోధించాడు. కాని శ్రీశ్రీ విమర్శకుడిగా చేసిన గ్రంథపరిశీలనలో మార్క్సిస్టువిశ్లేషణ అంతగా కనపడదు. ఆయన శ్రీశ్రీ, గురజాడమీద రేడియో ప్రసంగాలద్వారా ( ? 1956) చేసిన విమర్శల్లో గాని, ఇతర పరిశీలనల్లో గాని మంచి విమర్శకుడిగా కనిపించేమాట నిజమే అయినా అందులో మార్క్సిస్టు పద్ధతి ఎంతవరకు ఉన్నది ? అనే విషయం తెలిసినవాళ్ళు చెప్పాలి.

అభ్యుదయరచయితలసంఘానికి సోదరసంస్థ ప్రజానాట్యమండలి ప్రజలకు పాటల, బుర్రకథల, నాటకాల రూపంలో చైతన్యాన్ని కలిగించటం దానిలక్ష్యం. నాజర్ బుర్రకథలు (రచన, పాట రెండూ) సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు జంటగా రాసిన బుర్రకథలు, నాటకాలు ప్రజానాట్యమండలి వారు ప్రదర్శనలద్వారా ప్రచారం చేశారు. అట్లాంటివానిలో 'ముందడుగు, మా భూమి' నాటకాలు ప్రసిద్ధి చెందినై. తెలంగాణప్రజలు భూస్వామ్యవిధానానికి వ్యతిరేకంగా జరిపిన పోరాటాన్ని చిత్రించే నాటకం 'మా భూమి.' దీన్ని ప్రజా నాట్యమండలి 1947 లో ఆంధ్రదేశమంతటా ఎన్నోసార్లు ప్రదర్శించింది. ఈ నాటకం అచ్చుపుస్తకాన్ని 1947 ఆగస్టు అభ్యుదయలో ప్రయాగ కోదండరామ శాస్త్రిగారు సమీక్ష చేశారు. దానిమీద తీవ్రమైన వాగ్వాదాలు చెలరేగినై. కన్యా శుల్కం తరవాత ఒక ప్రజాసమస్యమీద వచ్చిన గొప్పనాటకం 'మా భూమి.' కన్యాశుల్కంలాగే ఇది కూడా తీవ్ర తర్జనభర్జనలకు గురి అయింది. కన్యా శుల్కంమీద ప్రతికూలవిమర్శలు రాసినవాళ్ళు సాంప్రదాయికులు. కాని "మా భూమి"పై విమర్శ చేసినవారు అభ్యుదయ సాహిత్యాభిమానులే. అభ్యుదయ సాహిత్య విమర్శకు, సాహిత్యవిమర్శచరిత్ర అర్థం చేసుకోటానికీ ఈ చర్చను కొంత పరామర్శించాలి.

ప్రయాగ తన విమర్శలో ఇట్లా అన్నారు.

"ఇందులో ఒక రంగానికీ మరో రంగానికీ ఎలా సంబంధం లేదో అలాగే ఒక పాత్రకూ మరో పాత్రకూ కూడా లేదు. ఒక పాత్రలో క్రమబద్ధమైన గమనం లేదు. కనుకనే అన్నిపాత్రలూ నిర్జీవంగా నీర

మునిమాణిక్యానికి సంబంధం లేదు. ఈ మూడుకూడా విషాదాంతాలు. సున్నితమైన హాస్యాన్ని చూపిన మునిమాణిక్యం మధ్యతరగతి తెలుగు జీవితాలలో విషాద భారాన్ని కూడా హృదయాలను కదిలించే విధంగా వెలువరించారు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి తెలుగు తనంమీద అభినివేశం చెప్పనలవికానిది. స్మశానవాటిక, మిధురానురాగము వారితొలి రచనలు. తెలుగువారి చరిత్ర నుంచి గ్రహింపబడిన కథలు ఆధారంగా వ్రాయబడ్డవి. ఆతరువాత ఆయన 'ఆత్మ బలి', 'రక్షాబంధము', నవలలుకూడా రచించారు. ఈయన వ్రాసిన పెద్ద కథలని పిలువబడే నవలికల్లో "వడ్ల గింజలు," 'ఇల్లు పట్టిన వెధవాదబడుచు" వంటివి ప్రసిద్ధాలు.

1920-47 చివరి భాగంలో, ముఖ్యంగా రెండో ప్రపంచయుద్ధం పూర్తి అయ్యాక తెలుగు సాహిత్యంలో మరో నూతనాధ్యాయం ప్రారంభమైనదని చెప్పవచ్చు. తరువాతి యుగానికి ప్రాతినిధ్యం వహించగల రచయితల తొలి రచనలు 1944-47 మధ్యకాలంలో వచ్చాయి. కొడవటిగంటి కుటుంబరావు తొలి రచనలు ఇప్పటివే! ఇక గోపీచంద్ "అసమర్థుని జీవ యాత్ర", బుచ్చిబాబు "చివరకు మిగిలేది" కూడా 1947కు ముందు రచనలే! 1919-20లో తరువాతి తరంలోనికి అద్దంపట్టే రచనలు వచ్చినట్లే ఈ ముగ్గురు ప్రముఖ రచనలు కూడా ఈ యుగం చివరి రోజుల్లో వచ్చి రానున్న యుగ లక్షణాలను ప్రతిపాదించాయి. కుటుంబరావు వాస్తవిక రచనలు, గోపీచంద్ తాత్విక రచనలు, బుచ్చిబాబు మనస్తత్వాత్మక రచలు 1947 నుంచి ఈనాటివరకు వస్తున్న అసంఖ్యాకమైన నవలలకు మూలంగా చెప్పుకోవచ్చు. రచనా కాలాన్ని బట్టి ఈ నవలలు 1900-1947 మధ్యకాలానికి చెందినా, నిజానికి అవి తరువాతి ఆధునిక యుగానికి చెందినవి. అందువల్ల వానిని గురించిన చర్చ ఇక్కడ అప్రస్తుతం.



సుబ్బయ్యగారి మార్పులు :—

1. దాదా ! యే తగాదా వచ్చినా యీయనే తీర్చేవాడటగా !

2. అన్న చంపుతాడా ?

పుడ్రచెయ్యి తీసి ఎడంచెయ్యి పెట్టమన్నట్టుగా ఉన్నై వెంకటసుబ్బయ్యా గారి సవరణలు. భాషలో సహజత్వాన్ని చంపటానికి దగ్గరిమార్గాలు సుబ్బయ్యా గారి సవరణలు.

ప్రయాగకూడా భాషవిషయంలో చాలా పొరపాటు పడ్డట్టు తోస్తున్నది. నాగరకులకు పల్లెటూరిభాష మొరటుగా కనిపించవచ్చు. అంతమాత్రాన వాటిని బూతు లనటం తొందరపాటు. పాత్రల సహజత్వం అయినా అంతే. పట్టణాల పాత్రలతోనే పరిచయం ఉన్నవారికి పల్లెపాత్రలు అసహజంగా కనిపిస్తై. ఈ నాటకాన్ని చూసినవాళ్ళు ప్రశంసావర్షాలు కురిపించారు. తెలంగాణ ప్రజాసమస్యను కోస్తాజిల్లాలలో కళాత్మకంగా ప్రచారంచేసిం దీ నాటకమే. కన్యాశుల్కానికి లాగే దీనికీ నాటకలక్షణాలు పట్టకపోయి ఉండొచ్చు. అదే దీని విశిష్టత కూడా. రెండిట్లోనూ ఉన్నది జీవితం, నిజమైన మనుషులు.

నాటకం మొత్తంగా వర్గదృక్పథాన్ని ప్రదర్శించబట్టే, దాని ప్రమాదాన్ని శత్రువర్గం పసిగట్టింది. అప్పటి కాంగ్రెసు ప్రభుత్వం ఎక్కువ ఆలస్యం చెయ్యకుండా నిషేధించింది.

"మా భూమి" నాటకసమీక్ష పర్యవసానంగా చెలరేగిన విమర్శపరంపరలో అభ్యుదయపత్రిక తొక్కినపంథా ఆక్షేపణీయ మైన"దని ఆరోపిస్తూ ఆ పత్రిక సంపాదకవర్గసభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు, కొమర్రాజు వినాయకరావుగారు. ఇది 1947 సెప్టెంబరు 14 "ప్రజాశక్తి" లోను, అక్టోబరు అభ్యుదయలోనూ అచ్చయింది.

ఇంత సంచలనాన్ని కలిగించిన ఆ విమర్శను, ఆ విమర్శకు సరిఅయిన నాటకాన్ని సాహిత్యచరిత్ర మరిచిపోకూడదు.

అభ్యుదయసాహిత్యం, అభ్యుదయ విమర్శలూ 1947 తరవాతనే ఎక్కువగా వచ్చినై.



అఖండమైన కాలంలో మనం చేసుకొనే విభాగాలు మన సౌకర్యంకోసమే, ప్రకృతిసహజ మైనవి కావు. పరిణామశీలమైన సాహిత్యంలో సమాజంలోలాగే మార్పులు ఒక సుముహూర్తం చూసుకొని జరగవు. పూర్వాపరాల అంతస్సంబంధం విడదీయలేనంతగా ఉంటుంది.

సమగ్రతకోసం నిర్వాహకు లేర్పరచిన 1947 అనే పరిమితిని అతిక్రమిస్తాను. తరవాతి సంవత్సరాలలో విశేషాలను రేఖామాత్రంగా ప్రదర్శిస్తాను.

స్వాతంత్ర్యానంతరం దేశీయపరిపాలనవల్ల జరిగిన ఒక మార్పు విద్యా విస్తృతి. యూనివర్సిటీలలో డిగ్రీలకోసం చాలా రంగాలలో పరిశోధన జరిగింది. అదే పద్ధతిలో తెలుగుసాహిత్యంమీద కూడా జరిగింది. అంతకుముందు పరిశోధకులు స్థూలంగా స్పృశించిన విషయాలమీద విస్తృతమైన పరిశోధనలు యూనివర్సిటీలలో జరిగినై.

పూర్వాపరాలను చర్చించటం, కార్యకారణాలను చూపించటం, కొత్త వ్యాఖ్యలు, ప్రతిపాదనలు చెయ్యటం, పాతప్రతిపాదనలలోని మంచి చెడుగులను చర్చించటం, సమగ్రంగా అతివ్యాప్తి అవ్యాప్తులు లేకుండా చెప్పటం - ఇవి యూనివర్సిటీ పరిశోధనగ్రంథాలలో ఉండాల్సిన కొన్ని లక్షణాలు. కాని తెలుగు పరిశోధనగ్రంథాలు చాలావాటిల్లో ఈ లక్షణాలు కనపడకపోవటం మన దురదృష్టం. ఇందు కపవాదం వెల్చేరు నారాయణరావుగారి "తెలుగులో కవితా విప్లవాల స్వరూపం" (1978). దీనికి ఆంధ్రవిశ్వవిద్యాలయం డాక్టరేటుడిగ్రీ ఇచ్చింది.

విద్యావిస్తృతి వలన పాఠకలోకం పెరుగుతుంది. వాళ్ళ అభిరుచుల ననుసరించి రకరకాల పత్రికలు పెరుగుతై. సాహిత్యాభిరుచి ఉన్న పాఠకుల

కోసం సాహిత్యపత్రికలుకూడా బయలుదేరతై. సాహిత్యపత్రికల్లో ఒక విశేషం ఉంది. పెద్దసంస్థల దన్ను ఉన్న "భారతి"లాంటి సాహిత్యపత్రికలో తప్ప పట్టుమని పదిసంవత్సరాలు ఒడిదొడుకులు లేకుండా ఏ సాహిత్యపత్రికా నడవలేదు. సుభాషిణి, సాహితి, జయంతి, సంవేదన, పీఠిక అనే పత్రికలు కాలగర్భంలో కలిసిపోయినై. ఇప్పటి సృజన, నూతన, ప్రజాసాహితి, అరుణతార, స్పందన ఎన్నాళ్ళు బతుకుతయ్యో ఎవరూ చెప్పలేరు. ఈ మధ్యలో ఇంకా కొన్ని కొత్త సాహిత్యపత్రికలు పుట్టొచ్చు, గిట్టొచ్చు. అయినా వాటి సాహిత్యసేవను ఆధునికమయిన డాక్యుమెంటేషన్ పద్ధతులతో రికార్డు చెయ్యాల్సిన అవసరం ఉంది.

ఈనాటి సాధారణపాఠకుల్లో కూడా సాహిత్యాభిలాష కలుగుతున్న దనటానికి చాలా దినపత్రికలు నిర్వహిస్తున్న సాహిత్యవేదికలు ఆధారం. "ఆంధ్ర జ్యోతి"వంటి వారపత్రికలు, "స్వాతి" వంటి మాసపత్రికలు కూడా విమర్శలకంతో ఇంతో ప్రాధాన్యాన్ని మిగతా పత్రికలకన్నా ఇస్తున్నై. 1947 తరవాత జరిగిన గణనీయమార్పుల్లో ఇదొకటి.

కొన్ని స్వచ్ఛందసంస్థలు హైదరాబాదులోనూ, ఇతర ప్రాంతాలలోనూ కొన్ని సభలు చేయించి పండితులచేత విమర్శకవ్యాసాలు రాయించి, ఉపన్యాసాలిప్పించి వాటిని ప్రచురించటం కూడా 1947 తరవాతనే ఎక్కువగా జరిగింది. ఆంధ్రసారస్వతపరిషత్తు ప్రచురించిన మహాభారతోపన్యాసాలు, భాగవతోపన్యాసాలూ అట్లా వచ్చినవే. ఇటీవలికాలంలో హైదరాబాదులో "యువభారతి" అనే సంస్థ చాలా విమర్శకగ్రంథాలను ప్రాచీనాధునికసాహిత్యంమీద ప్రచురించింది.

దేశీయప్రభుత్వం వచ్చిన తరవాత కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు ఏర్పడినై. ప్రాచీనసాహిత్యం పునర్ముద్రించటం, నిఘంటువులూ, పదకోశాలూ, పదప్రయోగకోశాలూ తయారుచేయించటంతో పాటు సాహిత్యఅకాడమీ కొన్ని విషయాలమీద పోటీలు నిర్వహించి పుస్తకాలు ప్రకటించింది. ఆ పద్ధతిలో కూడా కొన్ని విమర్శక గ్రంథాలు వచ్చినై. తూమాటి దొణప్పగారి ఆంధ్ర సంస్థానాలు, సాహిత్యపోషణము (1969). తెలుగు హరికథా సర్వస్వం(1973) వంటి పుస్తకాలు అట్లా వచ్చినవే.

ఇదికాక కొంతమంది స్వచ్ఛందంగా తమ సాహిత్యపిపాసకొద్దీ గ్రంథాలు రాసి తామే గాని, ప్రచురణసంస్థల కిచ్చిగాని ప్రచురింపజేయటం కూడా 1947 తరవాత విరివిగానే జరిగినై. కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారిమీద, మహోదయం పేరుతో గురజాడ అప్పారావుమీదా కె. వి. రమణారెడ్డిగారు వేసిన పుస్తకాలు, కన్యాశుల్కం నాటకకళ, సాహిత్యతత్త్వము. శివభారతదర్శనము అనే పేరుతో సర్దేశాయి తిరుమలరావుగారు వేసిన పుస్తకాలు ఈ కోవకు చెందినై.

1947 తరవాత గ్రంథప్రచురణ అధికమయింది. గ్రంథాలకు పీఠికలు రాయించి అచ్చేసుకోటం బాగా అలవాటయింది. ఈ పద్ధతి అంతకుముందుకూడ ఉన్నా ఇటీవల ఎక్కువయింది. వీటిల్లో సాహిత్యవిమర్శ చాలా వచ్చింది. ఉదాహరణకి 1950 లో అచ్చయిన శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాలసంపుటికి, దీక్షితులుగారి 'ప్రజావాఙ్మయం' అనే పుస్తకానికి చలం రాసిన పీఠికలు ఉత్తమ సాహిత్య విమర్శలు. "కవిత్వంలోనూ, జీవితంలోనూ economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్నా హీనమైన పాపం. ఆత్మలోకంలో దివాలా" "కృష్ణశాస్త్రి తనబాధను అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరిబాధనూ తనలో పలికిస్తాడు. కృష్ణశాస్త్రిబాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపుబాధ అంతా శ్రీశ్రీ బాధ". "చెప్పుకోతగిన ఒక్క కవీ మన కృష్ణశాస్త్రి ఉన్నత హిమాలయ శిఖరాల్లో కురిసిన కవితావర్షం పాయలై, దేశాలవెంట ప్రవహించి చివరికి సైడు కాలువల్లో పడుతున్న సమయాన తన భీషణాతపజ్వాలలతో ఆవిరిపొగలు రేపి, ఆకాశమార్గాన విహరింపజేసి రక్షించాడు." "తాము వేటిని ఎదిరించలేక ప్రతి దినమూ లొంగిపోతున్నారో, ఆ నిరంకుశాధికారుల నెత్తిమీద నాలుగుదెబ్బలు కొట్టాడని యువకులు చలంమీద చూపే అభిమానం చాలదు శ్రీశ్రీ కి. తామూ ఇంకో నాలుగుదెబ్బలు కొట్టమంటున్నాడు శ్రీశ్రీ". ఇట్లాంటి వాక్యాల్ని సాహిత్య విమర్శగా గుర్తించక తప్పదు. పీఠికల్లో సాహిత్యవిమర్శ ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అంశం.

అట్లాగే శ్రీశ్రీ వివిధ గ్రంథాలకు రాసిన పీఠికల్లో సాహిత్యవిమర్శ ఉంది. ముఖ్యంగా ఆరుద్ర త్వమేవాఽహానికి, అప్పారావుగారి ముత్యాలసరాలకు

విశ్వనాథశాస్త్రి సారాకథలకు, మల్లారెడ్డి శంఖారావానికి రాసిన పీఠికలు ఆధు నిక సాహిత్యవిమర్శలే. "దేశభక్తి" గీతాన్ని గురించి రాస్తూ "ఏకకాలంలో ప్రభుసమ్మితంగానూ, కాంతాసమ్మితంగానుకూడ మానవత్వాన్ని ఉపదేశించడం ఈ గీతం ప్రత్యేకత" అన్నారు. (12-7-1958). విశ్వనాథశాస్త్రి సారాకథ లను గురించి "వీటిలో కథనం ఉంది, కవిత్వం ఉంది, డ్రామా ఉంది. జీవి తాన్ని నిశితంగా పరిశీలించటం ఉంది. ఆ చూసినదానిమీద వ్యాఖ్యానించి నట్టుగా కనిపించని వ్యాఖ్యానం ఉంది" అని విమర్శించారు. పైకి వాచ్యంగా కని పించకుండా పాత్రల సంభాషణల ద్వారా జీవితంమీద వ్యాఖ్యానించటం విశ్వ నాథశాస్త్రి పద్ధతి. దీన్ని గ్రహించి పీఠికలో వ్యక్తం చేశారు శ్రీశ్రీ (14-5-1962).

కె. వి. రమణారెడ్డిగారు తమ గ్రంథాలకు రాసినా ఇతరుల గ్రంథాలకు రాసినా వారి పీఠికలు అచ్చంగా సాహిత్యవిమర్శలే. 1970 లో అచ్చయిన శ్రీశ్రీ సాహిత్య సంపుటాలకు రాసిన పీఠికలు మామూలు పీఠికలు కావు. అవి సాహిత్యవిమర్శలే. శ్రీశ్రీ సాహిత్యంమీద సమగ్రపరిశీలన చెయ్యగల అధి కారం ఉన్న ఒకరిద్దరిలో ప్రథముడు రమణారెడ్డిగారు. ఆధునికకవులలో ఇత రుల పుస్తకాలకు పీఠికలు చాలా ఎక్కువ రాసిన గౌరవం కుందుర్తి ఆంజనే యులుగారిది అనుకుంటాను. గోపాలచక్రవర్తిగారి కలంకలం మొదలుకొని (1958) ఎన్. గోపీ రచించిన తంగేడుపూలు (1976 దాకా ఎన్ని గ్రంథాలకు పీఠికలు రచించారో! వాటిల్లో ఆయన సాహిత్యప్రయోజనం, రీతి, ఛందస్సు లనుగురించి తమ అభిప్రాయాలను వ్యక్తంచేశారు. వచనకవిత్వాన్ని గురించి మాట్లాడిన చోట్ల చర్వితచర్వణంగా అనిపించొచ్చు.

ఏటుకూరి ప్రసాద్ రచించిన "ఎర్రజండా" అనే పాటల పుస్తకానికి (1973 మే), రాంభట్ల కృష్ణమూర్తిగారు రచించిన 'సంజాయిషీ' అనే పీఠికలో శ్రీశ్రీ మీద కుందుర్తి మీద నిశితమైన విమర్శ ఉంది. ఇది వివాదాస్పదమైన పీఠిక.

చెరబండరాజు 'జన్మహక్కు' అనే పాటల పుస్తకానికి చే. రా. రాసిన 'పదునెక్కిన ప్రజాకవి' అనే పీఠికలో చెరబండరాజు, శివసాగర్, గద్దర్ పాటలమీద క్లుప్తమైన పరిశీలన ఉంది.

వివిధ సంకలనాలకు రాసిన పీఠికలలోకూడా సాహిత్యవిమర్శ ఉంది. "అడుగుజాడ గురజాడది" అనే సంకలనానికి (1962), కె. వి. రమణారెడ్డి, శ్రీశ్రీ యుగం (1961) అనే సంకలనానికి "యుగకర్త" గురించి ఆరుద్రపీఠిక, మహాసంకల్పం అనే సంపుటికి (1975) నండూరి రామమోహనరావు పీఠిక - ఇవి కూడా సాహిత్యవిమర్శలుగా లెక్కగట్టి పరిశీలించాల్సినవి.

పత్రికలు ఎక్కువైన తరవాత పత్రికల్లో సమీక్షద్వారా కొంత సాహిత్య విమర్శ జరుగుతుంది. అయితే మన సమీక్షకులు పుస్తకాలు శ్రద్ధగా చదివే అలవాటు లేక కేవలం గ్రంథపరిచయాలతోనే సంతృప్తిపడతారు. కాని విపుల మైన సాహిత్యసమీక్షలు చేసినవారుకూడా లేకపోలేదు. ఆరుద్ర సినీవాలీమీద కె. వి. రమణారెడ్డి విశాలాంధ్రలో (? 1962) చేసిన సమీక్ష కొన్ని సంచికల్లో సీరియల్‌గా వచ్చింది. సమీక్షలను శ్రద్ధగా చేసినవారిలో మొట్టమొదటగా చెప్పుకోవలసినవారు రాచమల్లు రామచంద్రారెడ్డిగారు. సంవేదనలో ఆయన కాళోజీ "జీవనగీత" మీద, దిగంబరకవుల రెండోసంపుటంమీద, ఆదేపల్లి రామ మోహనరావు రచించిన "శ్రీశ్రీ కవితాప్రస్థానం" మీదా నిశితమైన విమర్శలు రాశారు. మొదటిదాంట్లో కాళోజీ కవి కాదనీ, రెండో దాంట్లో "సమాజం దిగం బర కవులను కవు లనుకునేంతగా కుళ్ళిపోలేదనీ, మూడోదాంట్లో గతితార్కిక భౌతికవాదం తెలీకుండా శ్రీశ్రీ అర్థం కాదనీ వాదించారు.

కాకూరి హనుమంతరావుగారి "సాహితీజగతి"ని (1963) భారతిలోను, రా. రా. గారి "సారస్వత వివేచన"ను 'వీచిక'లోను (1976) చాలా విపులంగా సమీక్షించాడు. వీటిమీద వాదప్రతివాదాలు ఆ పత్రికల్లోనే జరిగినై.

ఈ పైన అతి స్థూలంగా పేర్కొన్న విమర్శలను సేకరించి వర్గీకరించి ప్రకటించినపుడే వాటిమీద విపులమయిన పరిశీలన చెయ్యటానికి వీలుంది.

1948 నుంచే ప్రభుత్వనిర్బంధాలు ఎక్కువ కావటంతో 1949-50 సంవత్సరాలనుంచి అభ్యుదయరచయిత లొక్కొక్కరే రాజకీయాలను వది లెయ్యటమో, కవిత్వం మానుకోటమో, ప్రేమగీతాలు రాసుకోటమో, సినిమా ల్లోకి ప్రవాసం వెళ్ళిపోవటమో చేశారు. ఆనాటి తెలంగాణాప్రజల భూస్వామ్య

వ్యతిరేకపోరాటంమీద కవులు పాటలల్లారు. కథలు, నవలలు అల్లారు. వీటిమీద పరిశీలనలు, విమర్శలు చాలా తరవాత వచ్చినై. ఆ పోరాటసాహిత్యంమీద లింగుట్ల ప్రేమసాగర్ అనే విద్యార్థి ఆంధ్రాయూనివర్సిటీకి 1979 లో సిద్ధాంత వ్యాసం సమర్పించాడు.

అభ్యుదయరచయితల సంఘాన్ని పునరుద్ధరించే ప్రయత్నం 1955 ఉప యెన్నికల తరవాత ఒకసారి జరిగింది. అభ్యుదయపత్రిక మళ్ళీ మొదలయింది. కానీ మూడేండ్లకంటే ఎక్కువ బతికినట్లులేదు. ఇప్పు డీ పత్రిక మద్రాసు అభ్యుదయరచయితల సంఘంవారు నడుపుతున్నారు.

1970 జులైలో "సెవెన్ స్టార్స్ సిండికేటు" అనే సంస్థవారు ఏర్పర చిన సదస్సులో ఈ సంఘాన్ని మళ్ళీ బతికించి నిలబెట్టారు.

సుమారు 1962 ప్రాంతంలో వచనకవిత్వం ఉద్యమంగా మొదలయింది. అభ్యుదయరచయితల సంఘం నామమాత్రావశిష్టంగా ఉండింది. కమ్యూనిస్టులు పార్లమెంటరీ రాజకీయాల్లో మునిగిఉన్నారు. ఆ తరవాత భారతచైనా తగాదాం వల్ల పార్టీలో చీలికలు బయటికి వచ్చినై. ఆ రోజుల్లో 'వస్తువు'మీద దృష్టి తగ్గి రీతికి ప్రాముఖ్యం హెచ్చింది. కుందుర్తిగారు 'ఫ్రీవర్స్ ఫ్రంటు' అని ఒక సంస్థ స్థాపించారు. తాను అభ్యుదయవాది నంటూనే వివిధభావాల అభావాలవాళ్ళను ఒక వేదికమీదకి తీసుకొచ్చారు. అప్పటినుంచి ఒక పదేళ్ళపాటు వచనకవిత్వం మీద విరివిగా వ్యాసాలు వచ్చినై. ఆ వ్యాసపరంపరలో కొన్ని "వచన కవిత వివిధకవుల పథాలూ, దృక్పథాలూ" అనే పేరుతో ఫ్రీవర్స్ ఫ్రంట్ వారే 1967 సం॥లో ప్రకటించారు. 1972 నుంచి ఒక ఏడాది, రెండేళ్ళపాటు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో మొదలై "భారతి"లో చేకూరి రామారావుకూ, సంపత్కుమారకు జరిగిన చర్చ 1978 లో ఒక పుస్తకంగా వచ్చింది. దీంట్లో ఒక్క వచనకవిత్వంమీదనే కాక ఛందస్తత్వంమీద కూడా చర్చ జరిగింది.

వచనకవిత్వం అనే ఉద్యమంమీద తిరుగుబాటుగా, సంఘంలోని కుళ్ళుకు ప్రతిక్రియగా 1965 లో కేశవరావు (నగ్నముని), యాదవరెడ్డి (నిఖిలేశ్వర్), రాఘవాచారి (జ్వాలాముఖి), భాస్కరరెడ్డి (చెరబండరాజు), మనోహన్ సహాయ్ (భైరవయ్య), వెంకటేశ్వరరావు (మహాస్వప్న) అనే ఆరుగురు

కవులు దిగంబరకవులుగా బయటికొచ్చారు. 1965, 1966, 1968 సంవత్సరా లలో వాళ్ళ కవితాసంపుటాలు ఒక్కొక్కటే ప్రచురించారు. ఎంకిపాటల మీద గాలిదుమారం రేగితే, దిగంబరకవులమీద ఒక తుఫానే రేగింది. ఒక ఐదా రేళ్ళపాటు తీవ్రమైన చర్చలు జరిగినై. ఈ చర్చలో అశ్లీలం, సభ్యత మొద లయిన విషయాలు చర్చించబడినై. కవిత్వంలో స్వేచ్ఛ, లైసెన్సు దిగంబర కవిత్వమూలంగా వ్యాపించినై.

1970 ఫిబ్రవరిలో విశాఖలో పెద్దఎత్తున శ్రీశ్రీ కి అరవయ్యేళ్ళు నిండిన సందర్భంలో సన్మానం జరిగింది. ఫిబ్రవరి 1వ తేదీన మెడికల్‌కాలేజి ఆవర ణలో జరిగిన గోష్ఠిలో "రచయితలకు సవాల్" అనే కరపత్రం పంచిపెట్టారు. అది విశాఖవిద్యార్థులు తయారుచేసింది. అందులో "అదృష్టవశాత్తు దేశంలో ఇప్పటికి నిజమైన సాంఘిక విప్లవపరిస్థితులు ఏర్పడ్డాయి. తుపాకిదెబ్బకి వెరవ కుండా విప్లవపంథాలో జనం వెల్లువలా విరుచుకుపడుతున్నారు" అని 1967లో శ్రీకాకుళంలో మొదలయిన విప్లవకమ్యూనిస్టుల (మార్క్సిస్టు- లెనినిస్టు పార్టీ) సాయుధపోరాటానికి 'కమిటీ' కావలిసిందని సవాల్ చేశారు. ఆ కరపత్రం రేపిన ఆలోచనఫలితంగా 1970 జులై 2 రాత్రి హైదరాబాదు స్టేషన్ కెదురుగా ఉన్న ఇంపీరియల్‌హోటలులో సమావేశమైన శ్రీశ్రీ, రమణారెడ్డి, వరవరరావు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, నగ్నముని మొదలయినవారు దీర్ఘచర్చల అనంతరం 4 ఉదయానికి శ్రీశ్రీ అధ్యక్షతన విప్లవరచయితల సంఘంగా ఏర్పడ్డారు. సెవెన్‌స్టార్ సిండికేటువా రేర్పరచిన సదస్సులను బహిష్కరించారు. అప్పటి నుంచి రాజకీయవిప్లవంలో రచయితల బాధ్యతగురించి చాలా పత్రికల్లో చాలా చర్చలు జరిగినై. వి. ర. సం. ఏర్పడ్డ తరవాత రాజకీయాలకి, సాహిత్యానికి సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఈ విషయాలమీద రమణారెడ్డి, కుటుంబరావు వరవరరావు మొదలయినవారు సృజనలో చాలా వ్యాసాలు రాశారు. నిమగ్నత- నిబద్ధత అనే రాజకీయభావాలు సాహిత్యవిమర్శలో భాగాలుగా చేరినై.

వి. ర. సం. ఏర్పడ్డ తరవాత సాహిత్యంలో జరిగిన ఒక మార్పు ప్రజల భాషలో, మాండలికాల్లో సాహిత్యరచన జరగటం. శివసాగర్, గద్దర్, వంగపండు ప్రసాదరావులు జానపదబాణీల్లో కవిత్వం రాస్తే, అల్లం రాజయ్య వంటివారు తెలంగాణ మాండలికంలో కథలు రాస్తున్నారు.

ఈ కవిత్వాన్ని సమర్థిస్తూ ప్రజాసాహితి, సృజన, అరుణతార పత్రికల్లో వ్యాసాలు వస్తున్నై. సాహిత్యంలో మాండలిక ప్రయోగంమీద 'నూతన' పత్రికలో ఒక ఏడాది నుంచి చర్చ జరుగుతున్నది.

విప్లవసాహిత్యరీతులమీద పరిశీలన ఇంకా జరగాల్సే ఉంది. శివసాగర్ పాటలు అన్నీ ఒక సంపుటంగా రాలేదు. గద్దర్‌పాటలు కొన్ని కాయితాలమీద అచ్చయి దొరుకుతుంటే కొన్ని పాటగాళ్ళనోళ్ళలో మాత్రమే ఉన్నై. వంగపండు ప్రసాదరావుపాటలు ఏరువాక, పొలికేక అనే పుస్తకాలుగా అచ్చయినై. ఆదిలాబాదు, కరీంనగర్, సిరిసిల్ల, పండితాపురం రైతుపోరాటాలమీద పాటలు చాలా ప్రచార మవుతున్నై. జనం పాటలు, జననాట్యమండలి పాటలు అని కొన్ని పుస్తకాలు వచ్చినై. వీథిభాగోతం, వొగ్గుకథ వంటి రూపాలలో కూడా కొన్ని కవితారూపాలు ప్రచారంలోకి వచ్చినై. వచనకవిత్వం రాసే చెరబండరాజు వంటి కవులు పాటలు రాస్తున్నారు. శివసాగర్‌వంటివారు జానపదబాణీలో పాటలే కాక గేయకవిత్వం, వచనకవిత్వం కూడా రాస్తున్నారు. రమణారెడ్డి, వరవరరావులు గేయాలు, వచనకవిత్వం రాస్తున్నారు. నగ్నముని, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు కేవలం వచనకవిత్వమే రాస్తున్నారు. ఈ కవితారీతులమీద వచ్చిన వ్యాసాలు చాలా కొద్ది. జరిగిన పరిశీలనలు బహుస్వల్పం. ప్రచురించే పత్రిక లున్నై కాని చేసేవాళ్ళె కనపడటంలేదు.

## ౧౦

కట్టమంచి రామలింగారెడ్డిగారు (బహుశా ఇంకా నా దృష్టిలోపడని ఇతరులు కూడా) తెలుగుసాహిత్యవిమర్శకు అంతకుముందున్న బంధాలను ఛేదించారు. కొత్తవిలువలను ప్రవేశపెట్టారు. సాహిత్యానికీ, సమాజానికీ ఉన్న సంబంధాన్ని గుర్తించటం ఈ శతాబ్దంలో ప్రారంభమయింది.

ఈనాడు మనకు మార్క్సిస్టుసిద్ధాంతబలంతో విమర్శలు చేస్తున్న రమణారెడ్డి, రామచంద్రారెడ్డి ఉన్నారు. రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారం అనే గ్రంథం లేకపోతే ఇప్పుడు ఆ పని అంతా ఇప్పటి విమర్శకులు చేసుకోవాల్సి

వచ్చేది. మార్క్సిస్టు విమర్శకు దారి సుగమం చేసినవాడు రామలింగారెడ్డిగారు. భాషలో గిడుగు రామమూర్తి, కవిత్వంలో గురజాడ అప్పారావులు చేసిన పని లాంటిదే కట్టమంచి రామలింగారెడ్డిగారు విమర్శనరంగంలో చేసింది.

సాహిత్యవిమర్శలో ఆధునికత అనే విషయంమీద సాగినచర్చ అయినా ఈ వ్యాసపరిశీలనకు దొరకనివి చాలా ఉండి ఉంటై. వివిధ ప్రక్రియలకి మార్గాలకు సంబంధించిన వ్యాసాలను ఒకచోట చేరిస్తే ఆధునికతనుగాని, ప్రాచీనతను గాని విమర్శించి చూపవచ్చు. ఆ పని జరగాల్సిన అవసరాన్ని నేను గుర్తించటమూ, ఇతరులచేత గుర్తింపజేయటమూ ఇందులో నేను ప్రధానంగా ఉద్దేశించింది.

ఈ విషయం ఒక వ్యాసపరిధిలోకి ఇమిడేది కాదని వ్యాసం పూర్తయ్యేటప్పటికి తెలుసుకోగలిగాను. ఈ వ్యాసంలో ప్రస్తావించిన అంశాలమీద విడి విడిగా ఎన్నో వ్యాసాలు, పుస్తకాలు రావాల్సిఉంది.

ఈ పరిశీలన ఫలితంగా ఒకటి చెప్పవచ్చు. పాతమార్గాలనుంచి వేరుపడటంవల్ల సాహిత్యవిమర్శలో వైవిధ్యానికి అవకాశం కలిగింది. సమాజానికి, రాజకీయాలకి సాహిత్యంకాని, సాహిత్యవిమర్శకాని అతీతంగా ఉండదని ఇవాళ బల్లగుద్ది వాదించాల్సిన పని లేదు. తొలి ఆధునికవిమర్శకులే ఆపని చాలావరకు చేసిపెట్టారు. ఆ మార్గంలో విమర్శలు రాయటమే ఈతరం విమర్శకులు చెయ్యాల్సిన పని.

[ ఈ వ్యాసరచన కొందరి సహాయంవల్లనే సాధ్య మయింది. విషయసేకరణ కవసరమైన అపురూపగ్రంథా లందించి కె. కె. రంగనాథాచార్యులు, కాచినేని రామారావులు సాయపడ్డారు. వ్యాసాలు వెతుక్కోటంలో చిరుమామిళ్ళ రామచంద్రరావు, అయిలోని ఉషాదేవి, ఎస్. కె. దుర్గాదేవి (మా పరిశోధక విద్యార్థులు) సాయం చేశారు. తన పరిశోధనకు రాసిపెట్టుకున్న నోట్సును సంపత్కుమారాచారి వరంగల్లు నుంచి పంపించారు. చదలవాడ పిచ్చయ్యగారు తమ ఇంటిలో కాఫీ, భోజన సదుపాయాలతోసహా తొలినాటి "అభ్యుదయ"సంచికల బైండు పుస్తకం నా కందించారు. ఈ వ్యాసం తయారవుతున్న తొలిదశలో

నేను చెపుతుండగా కొంత చేకూరి రంగనాయకి రాసిపెట్టింది. మరింత రామచంద్రరావు రాసిపెట్టాడు. తమ గ్రంథాలయాన్ని వాడుకోనిచ్చిన అంతర్జాతీయ తెలుగుసంస్థవారికి కృతజ్ఞతలు. మిగతావాళ్ళు నా కావ్తలు కావటంవల్ల విశేషించి కృతజ్ఞతలు చెప్పటంలేదు. — చేరా.]

# ఉపయుక్త గ్రంథసూచిక

[చాలా వ్యాసాల వివరాలు వ్యాసంలోనే వివరంగా ఇచ్చినందు వల్ల ఇక్కడ మళ్ళీ ఇయ్యటం లేదు. వివరిభాగాలు ఎక్కువగా జ్ఞాపకం మీద ఆధారపడి రాసినవి. వాటి కన్నిటినీ ఇక్కడ సూచించటానికున్న ఇబ్బందులవల్ల వదిలెయ్యాల్సి వస్తున్నది.]

1. అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి (1971, మొదటిముద్రణ 1929) "వేమన". వాల్తేరు : ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్సు.

2. ,, (1978 ; మొదటిముద్రణ 1954) "సారస్వతాలోకము." మచిలీపట్టణం : త్రివేణి.

3. అనంతం అండ్ లక్ష్మీకాంతం (1977) "కరపత్రాల దుమారం, తెరవెనుక భాగోతం." విశాఖపట్నం : బుక్‌లవర్స్ పబ్లికేషన్స్.

4. ఆంజనేయులు, కుందుర్తి అండ్ గోపాలచక్రవర్తి "వచనకవిత ; వివిధ కవుల పథాలూ, దృక్పథాలూ." హైదరాబాదు : ఫ్రీవర్స్ ఫ్రంట్.

5. ఆంజనేయులు, డి. (1973) Dr. C. R. Reddy - New Delhi : Sahitya Akadmi.

6. ఉమాకాంతం, అక్కిరాజు (1925) "వాఙ్మయ పరిశిష్టభాష్యం : నేటికాలపు కవిత్వం." మద్రాసు : వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

7. గోపాలరెడ్డి, బండి (బంగోరె. 1979)
"మాలపల్లిపై ప్రభుత్వ నిషేధాలు."
తిరుపతి : బంగోరె ప్రచురణలు.

8. చంద్రశేఖరరావు, మద్దుకూరి (1974)
"చంద్రం వ్యాసావళి."
విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

9. చెరబండరాజు (1978) "జన్మహక్కు (పాటలు)"
హైదరాబాదు : గ్రంథకర్త.

10. నారాయణరావు, వెల్చేరు (1978)
"తెలుగులో కవితావిప్లవాల స్వరూపం."
విజయవాడ : విశాలాంధ్రప్రచురణాలయం(పంపిణీదార్లు)

11. ప్రసాద్, ఏటుకూరి (1978) "ఎర్ర జండా (పాటలు)"
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ యువజనసమాఖ్య.

12. మాధవశర్మ, పాటిబండ (1975)
"తెలుగులో సాహిత్య విమర్శ."
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ.

13. రమణారెడ్డి, కె. వి. (సం. 1970)
"శ్రీ శ్రీ సాహిత్యం" (5 సంపుటాలు)
విశాఖపట్నం : శ్రీ శ్రీ సన్మానసంఘం.

14. రామకృష్ణారావు, బూర్గుల ( ? దుర్ముఖి)
"సారస్వత వ్యాసముక్తావళి."
హైదరాబాదు : ఆంధ్రసారస్వత పరిషత్తు.

15. రామమోహనరావు, అద్దేపల్లి (1968)
"శ్రీ శ్రీ కవితాప్రస్థానం"
మచిలీపట్నం : ప్రభాకర్ పబ్లికేషన్స్.

16. రామలింగారెడ్డి, కట్టమంచి (1947 ఎనిమిదవ ప్రచురణ)
"కవిత్వతత్త్వవిచారము."
వాల్తేరు : ఆంధ్ర విశ్వకళా పరిషత్.

17. రామానుజరావు, దేవులపల్లి (1955)
"సారస్వత నవనీతము."
హైదరాబాదు : గ్రంథకర్త.

18. రామారావు, చేకూరి అండ్ కోవెల సంపత్కుమార (1973)
"వచన పద్య - లక్షణ చర్చ."
హైదరాబాదు : నాగార్జున ప్రింటింగ్ ప్రెస్.

19. రామారావు, ఎస్. వి. (1974) "తెలుగులో సాహిత్య విమర్శ."
హైదరాబాదు : పసిడి ప్రచురణలు.

20. లక్ష్మీరంజనం, ఖండవల్లి (1970)
"లక్ష్మీరంజన వ్యాసావళి."
హైదరాబాదు : గ్రంథకర్త.

21. సీతారామయ్య, కురుగంటి (1942)
"నవ్యాంధ్ర సాహిత్యవీథులు - అను నవ్యసాహిత్యచరిత్రము"
(1827-1942). హైదరాబాదు : గ్రంథకర్త.



# ఉద్యమాలు - వాదోపవాదాలు

- బూదరాజు రాధాకృష్ణ

1–0. క్రీ.శ 1900–47 మధ్యకాలంలో తెలుగు సాహితీపరులు అనేక చర్చోపచర్చల్లో, వాదప్రతివాదాల్లో పాల్గొన్నారు. అయితే వాటి వివరాలన్నీ ఏ ఒక్క ఆధారగ్రంథంలోనూ లభించటంలేదు. ఆనాటి చర్చలు అప్పటి పత్రికల్లో సాగినాయి. కొన్ని ప్రత్యేకగ్రంథాలుగా లభిస్తున్నాయి. కొన్ని వ్యాస సంకలనాల్లో, సిద్ధాంతవ్యాసాల్లో దొరుకుతున్నాయి. అప్పటిపత్రికలన్నీ ఇప్పుడు దొరకటంలేదు ; దొరికినవాటిలోకూడా పరిశోధకుల పుణ్యమా అని పుస్తకాల అట్టలేగాని మధ్యకాగితాలు కనిపించటంలేదు. సిద్ధాంతవ్యాసాలు ఒకవిధంగా Postmortem analysis వంటివి ; ఉద్యమాలు గాని, వాదోపవాదాలు గాని తీవ్రస్థాయిలో ఉన్నప్పుడు రాసినవి కావు. చాలామంది వ్యాసకర్తలకు ఆ యా వాదోపవాదాలతో ప్రత్యక్ష సంబంధం లేదు. రచనాకాలానికి ఆ చర్చలకు సంబంధించిన పూర్తి వివరాలు దొరకటమూ లేదు.

1–1. చర్చనీయకాలంలోని సామాజిక రాజకీయ స్థితిగతులకూ, నేటి పరిస్థితులకూ పెద్ద మార్పేమీ లేదు. క్రీ. శ. 1900 నాటికే తెలుగుదేశంలోని ప్రఖ్యాత సంప్రదాయపండితులుకూడా ఏ కొద్దిమందో తప్ప ఆంగ్లభాషాసాహిత్యాలు అధ్యయనం చేసినవారే. వారివారి చిత్తవృత్తులనుబట్టి, అభిరుచులనుబట్టి తమకు నచ్చిన పాశ్చాత్యవిజ్ఞానం సంపాదించడమే కాక తమకు అనుగుణమైన సిద్ధాంతరాద్ధాంతాలను సేకరించుకున్నవారే. ఈ కాలంలో రెండు ప్రపంచ యుద్ధాలు జరిగినా వాటి ప్రత్యక్షప్రభావం భారతీయులమీద లేనట్లే. కాకపోతే ఆ మహాయుద్ధాల మధ్యకాలంలోనూ, రెండో ప్రపంచయుద్ధం తరువాతనూ పాశ్చాత్యసాహితీ ప్రపంచంలో వచ్చిన మార్పులన్నీ మనవారిమీద తలకొకవిధమైన ప్రభావం చూపాయి. ఈ కాలంలో లిపిజ్ఞానంకూడా సంపాదించకుండానే భాష్యాంతపాండిత్యం సంగ్రహించి మహావిద్వత్కవులకు అక్షరజ్ఞాన మిచ్చిన చర్ల బ్రహ్మయ్యశాస్త్రివంటి విద్వాంసులు లేకపోలేదు. వారికి సంప్రదాయబద్ధ

మైన చదవంతా సంస్కృతంద్వారా, శ్రుతంద్వారా లభిస్తుండేది. కాని రాను రాను సంస్కృతభాషాపాండిత్యం ఆంగ్లభాషాపాండిత్యం ముందు తల వంచక తప్పలేదు. నాటి రాజకీయ సామాజిక పరిస్థితు లందుకు ముఖ్యకారణాలు. కొత్తదనం కోసం కవి పండితులు తపించటం మరో ప్రధానహేతువు. ఈ కాలంలో అనేక వాదోపవాదాలే గాక కనీసం నాలుగు మహోద్యమాలుకూడా వచ్చి సాహితీస్వరూపాన్ని చాలా మార్చివేశాయి.

1-2. ఏ వాదం ఎప్పుడు పుట్టిందో, ఎవరు మొదలుపెట్టారో కాలక్రమంలో ఏది ముందో, ఏది వెనకో నిర్ణయించుకోవటం సిద్ధాంత పరిశోధన వ్యాసకర్తల పని. నిజానికి ఒక ఊహ పుట్టి, అది పునఃపునః పరిశీలనలో ఒక అభిప్రాయమై, వాదమై ఉద్యమ మయ్యేలోగా ఎన్నో మార్పులు వస్తాయి. ఒకరి అభిప్రాయంలోని ఒక్క చెణుకు ఉద్యమంగా పరిణమించటానికి ఎందరో చెప్పిన ఎన్నో ఆలోచనలు. ఎందరో చేసిన ఎన్నో పనులు తోడ్పడతాయి. ఇంతాచేసి ఆ వుద్యమం దరిద్రమనోరథంలాగా అణగారిపోవచ్చు. అందువల్ల కేవలం తేదీలు, గంటలు, నిముషాల లెక్కనగాక ఆయా వాదప్రతివాదాలవల్ల సాహిత్యానికి కలిగిన ప్రయోజనం లెక్కన వాటిని పరిశీలించటం మంచిది. ఆ ప్రయోజనసిద్ధికి కారకులయిన మహావ్యక్తులను మాత్రమే పరిగణించటం మేలు. అబ్బూరివా రన్నట్లు బౌద్ధుల "ధర్మకాయం"లాగా "సారస్వత మహాకాయం"కూడా సాహితీపరు లందరి సమష్టికృషి ఫలితంగా విస్తరిస్తుందే కాని ఏ ఒక్కరివల్లనో ప్రశస్యం కాదు. అంచేత వాది ప్రతివాదులకు తుల్యప్రాధాన్యమివ్వక తప్పదు.

1-3. క్రీ. శ. 1900 లో ఖచ్చితంగా మొదలైన చర్చలకు అంతకు ముందు బీజావాపనం జరగలేదని భావించటం అంత మంచిది కాదు. కొన్ని రకాల చర్చలు ముద్రణభాగ్యం పొందకపోయి వుండవచ్చు. రచనాకాలానికీ, ప్రచురణకాలానికీ మధ్య అనేక సంవత్సరాల వ్యవధానం కూడా వుండవచ్చు. అందువల్ల ఈ వ్యాసంలో గంటల నిముషాల కాలభేదాన్నిగాని, వాద ప్రతివాదాలు చేసిన ప్రతివ్యక్తినీ గాని సూచించటం జరగలేదు. స్థలాభావమే గాక గ్రంథవిస్తరభీతితోబాటు వ్యాసరచనోద్దేశం కూడా ఈ పద్ధతికి కారణాలు. నిర్దిష్టకాలంలో తెలుగుసాహితి స్వరూపస్వభావాలు మార్చిన మహోద్యమాలు

నాలుగు : వ్యావహారికభాషోద్యమం, భావకవితోద్యమం, అవధానకవితోద్యమం, అభ్యుదయకవితోద్యమం. తక్కిన వాదోపవాదాలన్నీ వీటితో పోలిస్తే, స్వల్ప ప్రయోజనవంతాలు. స్థూలంగా ఈ విషయాలను పరిశీలించి ప్రయోజన నిరూపణ చేయుటయే వ్యాసలక్ష్యం.

1-4. క్రీ.శ. 1875 నాటికే మొదలైన పాత్రోచితభాషావాదం, సరళ గ్రాంథికవాదం 1910 వ్యావహారికభాషోద్యమానికి జీవం పోశాయి. సంస్కృత నాటకాల్లో మధ్యనీచపాత్రలు ప్రాకృతభేదాల్లో ప్రసంగించటం వేదం వేంకట రాయశాస్త్రిని పాత్రోచితభాష పేరిట వ్యావహారికప్రయోగం చేయటానికి పురికొల్పింది. అముద్రితగ్రంథచింతామణిలో మొదలైన చర్చలు ఇరవయ్యోశతాబ్ది నాటికి అనుసర్తలు, అనుకర్తలు సంఖ్యాధికులు కావటంతో తరవాతివారిలో చాలామందికి ఉపాదేయమయినాయి. గురజాడవారి కన్యాశుల్కం మొత్తం వ్యావహారికంలో ప్రచురితం కాగానే పాత్రోచితభాష వరకు పరవాలేదని సరిపెట్టుకొన్న పండితులకు సరిపడలేదు. ఫలితంలో గ్రాంథికవ్యావహారిక భాషావాదాలు 1910 నుంచి 1914 వరకు చాలా తీవ్రంగా జరిగాయి. దేశం నాలుగు మూలల్లో చర్చలుజరిగాయి. వ్యాకరణాదిశాస్త్రాలు చదివిన పండితులు ముందుకు వచ్చి పోరాడినా ఈ వాదోపవాదాలను గమనిస్తూ చర్చల్లో అంతగా పాల్గొనని సాహితీపరు లనేకు లుండేవారు. ఆ చర్చలప్రభావం వీరిమీద ఎంతగా పడ్డదో అంతగా సాహితీస్వరూపం మారిందనిమాత్రం గుర్తించాలి. పానుగంటి లక్ష్మీనరసింహారావు ఎత్తిపొడుపు తగిలినవాళ్ళు తమకు తోచినపద్ధతిలో వ్యావహారికంలోనే రాయటం మొదలుపెట్టారు. పత్రికల్లో 1938 వరకు గ్రాంథికం నడచినా గేయకవితలో వచనంలో వ్యావహారికం అంతకు చాలాముందే చోటు చేసుకొంది. కందుకూరి వీరేశలింగం ప్రబంధవాఙ్మయంమీద ఎత్తిన ధ్వజం క్రమపరిణామంలో, భాషలో, ఛందస్సులో, భావంలో కొత్తదనానికి దారి తీసింది. వ్యావహారికవాదులు కేవలం శాస్త్రమీమాంసలే చేయలేదు. ప్రపంచ సాహిత్యంలోని ఉత్తమరచనల్లో అక్కడక్కడి ఆధునికభాషా రూపా లెట్లా చోటు చేసుకొన్నవో నిరూపిస్తుండేవాళ్ళు. ఆ ప్రభావం మన రచయితలకు ప్రోత్సాహకమైన దనటంలో విప్రతిపత్తి లేదు. గ్రాంథిక వ్యావహారిక వివాదం వివరాల జోలికి పోదలచలేదు. కాని, దాని ప్రభావం భావకవితోద్యమానికి దారి తీసిందని మాత్రం చెప్పదలిచాను.

1-5. క్రీ. శ. 1910 కి ఒకటిరెండు సంవత్సరాలు అటుఇటుగా గురజాడ అప్పారావు నీలగిరిపాటలు, ముత్యాల సరాలు, అబ్బూరి రామకృష్ణారావు జలాంజలి, రాయప్రోలు సుబ్బారావు లలిత, కట్టమంచి రామలింగారెడ్డి ముసలమ్మ మరణం మొదలైన ఆధునికరచనలు వెలుగుచూశాయి. కన్యాశుల్కం రూపకం కాబట్టి దానిమీది విమర్శనలు ఆ ప్రక్రియకేగాని "కవిత"కు అన్వయించ లేదు. రాయప్రోలు, కట్టమంచుల రచనలమీద ఆంగ్ల గ్రీక్ సాహిత్యాల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఇవేవీ ప్రబంధధోరణిలో లేవు. చంపూకావ్యాలు కావు. గురజాడ తప్ప తక్కినవాళ్లు సంప్రదాయబద్ధమైన ఛందోరీతులను, భాషాధోరణులను పాటించారు. రాయప్రోలువారి తృణకంకణం (1913) పండిత విమర్శకులను ఆకర్షించింది. ఆయన "అమలిన శృంగార" తత్త్వం, "భావకవితా" ధోరణి విమర్శలపాలయింది. కృష్ణశాస్త్రి, వేదుల, నండూరివంటి యువకవులెందరో ఆకర్షితులైనారు. వాస్తవానికి సర్వవిధాలా నవ్యత్వం గురజాడ కవిత్వంలోనే కనిపించినా, అప్పట్లో చాలామందికి రాయప్రోలు సంస్కరణధోరణి బాగా నచ్చింది. ఆంగ్లసాహిత్యంలోని కాల్పనికోద్యమ (romanticism) ప్రభావము ఆకర్షించినంతగా కాలానికి ముందే పరుగెత్తే గురజాడపంథా ఎక్కువ మందిని వశపరచుకోలేదు. Wordsworth మొదలయిన కవుల ప్రభావంవల్ల జానపదకవితాధోరణులు వచ్చాయి. పల్లెపాటలు, జానపదభాషకవులను వ్యామోహపెట్టాయి. ఆత్మాశ్రయత్వం, స్త్రీజనాదరణ, ప్రణయకవిత్వంవంటి అనేక లక్షణాలు "భావ"కవిత్వంలో వచ్చాయి. గ్రాంథికభాషలో వ్యావహారికరూపాలు మేళవించటం, గేయరచనలు చేయటం, దేశీయవృత్తాలను యథేచ్ఛగావిరిచి పంక్తులురాయటం,దేశభక్తి,రాష్ట్రాభిమానంవంటి సామాజికరాజకీయభావాలను ప్రదర్శించటం వంటి అనేక నూతన లక్షణాలు వచ్చాయి తెలుగుకవిత్వానికి. రామలింగారెడ్డి కవిత్వతత్త్వవిచారంమీద వచ్చిన విమర్శలవంటివే ఈ రచనలమీద కూడా వచ్చాయి. వందలమంది రచయితలు ఈ ధోరణిలో రాస్తున్నా దేవులపల్లి కృష్ణశాస్త్రి, నండూరి సుబ్బారావు వీరందరికీ ప్రతీకలుగా నిలిచారు. ఒకప్పుడు కట్టుబొట్టులో కూడా దేవులపల్లిని అనుకరించటమే భావకవిగా చెలామణి

కావటానికి అవసరమయిం దనిపిస్తుంది. అందువల్ల భావకవిత్వాన్ని అధిక్షే పించ దలచినవారికి - ముఖ్యంగా నేటికాలపు కవిత్వం రాసిన అక్కిరాజు ఉమా కాంతానికి - దేవులపల్లి నండూరులే ప్రధానప్రతిస్పర్థు లయినారు.

1-6. భావకవిత్వంమీది విమర్శన లన్నింటిలో ప్రధానమైనవి ఇవి : [1] భావంలేని కవిత్వం ఉండదు. కాబట్టి భావకవిత్వ మనేది సరైన పేరు కాదు. [2] భావకవిత్వంపేరిట ప్రచురితమైన కవితల్లోని లక్షణాలన్నీ పూర్వం భారతీయసాహిత్యంలో ఉన్నవే. కాబట్టి ఇందులో కొత్తదనం లేదు. [3] భావ కవులకు అటు భాషమీదగాని, ఇటు ఛందస్సుమీద గాని అధికారం లేదు. [4] ఆత్మాశ్రయధోరణి లోకవృత్తప్రదర్శకం కాదు. అహంకారపూరితం కూడా. అందువల్ల ఉపాదేయం కాదు. [5] జానపదపాత్రచిత్రణ అనౌచిత్యభూయిష్ఠం. వాచ్యతాదోషజుష్టం. [6] పరభాషాప్రభావదాస్యంవల్ల భావకవితారచనల్లో స్వతంత్రత లోపించింది. పై విమర్శల్లో కొన్ని సత్యాలు లేకపోలేదు. భావ కవిత్వం సమకాలప్రజాజీవితాన్ని గాని, సమస్యలను గాని ప్రతిబింబించనందు వల్ల, ఊహామయజగత్తులో ఊహాప్రేయసులతో విరహబాధలతో దుఃఖసంకటా లతో నిండినందువల్ల సామాజికప్రయోజనం దాని కేమీ లేనిమాట వాస్తవం. ఉమాకాంతంగా రన్నట్లు భావకవిత్వంలో రేఖామాత్రంగా కావ్యాత్మను సూచిం చటం గాక "పులుముడు" ఎక్కువైన మాట నిజమే. భాషాధికారాదులు వ్యక్తి నిష్ఠం కాబట్టి వారిలో అంతరా లుండటం సహజమే. ఇది యావదుద్యమానికీ ఆపాదనీయం కాదు. భావకవిత్వాన్ని విమర్శించేటప్పుడు సాంప్రదాయికమైన లక్షణగ్రంథసిద్ధాంతాలను ప్రమాణంగా తీసుకోవటం సమంజసం కాదు. కాళిదాస వాల్మీకులవంటివారు సహస్రాబ్దానికి ఒకరుండవచ్చు. వారితో ప్రతివారినీ పోల్చి అప్రతిభులని నిందించటం కూడా సమంజసం కాదు. వ్యావహారికవాదుల సహాయం, సాహితీసమితి స్థాపన, "ప్రతిభ" అనే పత్రికను నడపటం-ఇవన్నీ భావకవితోద్యమానికి తోడ్పడ్డాయి.

1-7. భావకవితోద్యమానికి ప్రత్యక్షంగా సహాయపడకపోయినా దానితో వైరుధ్యం లేకుండా, కవిత్వాన్ని నిజానికి పద్యరచనను-వాడవాడలా ప్రచారం చేసిన మరో మహోద్యమం అవధానకవితోద్యమం. ఇదికూడా 1910 సం॥ ప్రాంతాల్లోనే మొదలయింది. దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

అనే ఇద్దరు మహనీయులు "తిరుపతి వేంకటకవు" లనే పేరిట ఆ ప్రాంతాల్లో రంగప్రవేశం చేశారు. ఆశుకవితాప్రదర్శనంతో, అష్టావధాన, శతావధాన ప్రదర్శనలతో తెలుగుసాహితీప్రపంచాన్ని కల్లోలపరిచారు. గురుశిష్యుల అభిప్రాయ భేదాలు కారణంగా మొదలైన ఈ ఉద్యమం, చివరికి వైదీకి నియోగి భేదాలుగా పర్యవసించింది. లోకజ్ఞులయిన చెళ్ళపిళ్ళ వ్యావహారికవాదాన్ని సమర్థించాడు, భావకవిత్వాన్ని మన్నించాడు. సంప్రదాయధోరణిలో మొదలయిన వీరి కవితావేశం చివరికి సంప్రదాయజ్ఞుల అజ్ఞానాన్ని ప్రదర్శించటానికి పనికి వచ్చింది. వచనరచనలో, నాటకరచనలో వీరు సిద్ధహస్తు లనిపించుకున్నారు. సమర్థు లయిన నటులవల్ల వీరి నాటకాలకు రాగూడని ప్రచారగౌరవాలు లభించాయి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రితో "మేఘసందేశం"మీద వచ్చిన వివాదం బోలెడు సాహిత్యం సృష్టించింది. పిఠాపురాస్థానకవులయిన ఓలేటి వేంకటరామశాస్త్రి, వేదుల రామకృష్ణశాస్త్రి కలిసి "వేంకట రామకృష్ణకవు" లనేపేరున తిరుపతివేంకటకవుల పాండవాశ్వమేధ నాటకంమీద శతఘ్ని (1911) ప్రయోగిస్తే వారిమీద వీరు పాశుపతం (1911) వేశారు. వారు పరాస్త్ర పాశుపతం (1918) వేస్తే, వీరు పురశ్చరణం చేశారు. గీరతము, గుంటూరిసీమ అనే గ్రంథాలనే ప్రచురించారు తిరుపతి వేంకటకవులు. కొప్పరపు సోదరకవులకూ, వీరికీ ఎన్నో పోటీలు జరిగాయి. చర్ల చలపతిశాస్త్రి శృంగభంగం, చర్ల నారాయణశాస్త్రి సత్యసందేశం, వేంకటరామకృష్ణకవుల కోకిల కాకం, వేలూరి శివరామశాస్త్రి బిడాలోపాఖ్యానం, కొప్పరపువారి జ్ఞానోపదేశం, నారాయణాస్త్రం, జల్లిసీమ, సత్యనిరూపణం, తిరుపతి వేంకటకవుల హితోపదేశం, నమస్కారం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పాణిగృహీతా శ్రవణానందశృంఖల, తిరుపతి వేంకట కవుల శృంఖలాతృణీకరణం, బెల్లంకొండ రామారావు గుంజాగర్వభంజనం, తిరుపతి వేంకటకవుల కలభాలభంజనం మొదలైనవి ఇటువంటి వాదోపవాదాలకు సంబంధించినవే. బెల్లంకొండ రామారావు, తాతా సుబ్బరాయశాస్త్రి, పురుహిళ్ల రామశాస్త్రిలతో తిరుపతివేంకటకవులు పర్యశబ్దవిచారం చేశారు. దానికి మూలకారణం రామకృష్ణ మహాభారతపీఠికలోని "పప్పశం."

1-8. అవధానోద్యమసందర్భంలోని వాదోపవాదాలు చాలావరకు పద్యాల్లోనే నడిచాయి. పీఠికొక శతావధాని వెలిశాడు. పద్యరచన ఒక వినోదమయింది. ఇదంతా సంప్రదాయధోరణిలోనే జరిగినా భాషలో శైథిల్యం వచ్చింది.

చివరకు నాటకమంటే పద్యపఠనం అనే భావం ప్రజలకు కలిగింది. ఇన్ని జరిగినా అవధానులధాటికి బీటలు వారింది సంప్రదాయధోరణే అంటే భావకవితోద్యమం అప్పటి కెంత బలపడిందో తెలుస్తుంది. పైన పేర్కొన్న మూడు మహోద్యమాలూ 1900-1915 మధ్యలో వచ్చాయి. ఆ తరవాత ఇరవయ్యేళ్లకు గాని - ద్వితీయ ప్రపంచసంగ్రామం తరవాతగాని - అభ్యుదయకవితోద్యమం రాలేదు. ఈ మూడు ఉద్యమాలూ జరుగుతున్నకాలంలోనే మరికొన్ని చర్చలూ, వాదోపవాదాలూ వచ్చాయి. వాటిలో కొన్ని ఈ ఉద్యమాలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తోడ్పడ్డవి. మరికొన్ని ఈ ఉద్యమాలకాలంలో ఆనుషంగికంగా చర్చకు వచ్చినవి. ఇవిగాక వీటితో సంబంధం లేనివి మరికొన్ని జరిగాయి. కన్యాశుల్కంమీద, కవిత్వతత్త్వ విచారంమీద వచ్చిన విమర్శలు ఈ ఉద్యమాలకు తోడ్పడ్డాయి. 1912 లో కన్యాశుల్కం ద్వితీయముద్రణ రాగానే దానికి నాయకు డెవరు ? అందులోనిది శృంగారమా, రసాభాసా, అసలు శృంగారమంటే ఏమిటి ? అనే చర్చలు జరిగి రాయప్రోలువారి అమలిన శృంగారప్రసక్తిని కూడా పనిలో పనిగా లేవదీశాయి. ఈ చర్చ ఎంతదూరం వెళ్లిందంటే 1911 లో శృంగారగ్రంథాలను ప్రభుత్వం నిషేధించటం, వావిళ్ళవారు వ్యాఖ్యమాడి పండితప్రతులు అచ్చువేయవచ్చుననే ఆజ్ఞ తెచ్చుకోవటం దాకా వెళ్ళింది. తిరుపతి వేంకటకవుల శ్రవణానందం ఆ రోజుల్లో విద్యార్థిలోకాన్ని ఊపివేసింది. కవిత్వతత్త్వ విచారం సంప్రదాయవిమర్శ ధోరణులకు గొడ్డలిపెట్టు అయింది. కురుగంటి సీతారామభట్టాచార్యుల "అలంకారతత్త్వ విచారం" కాశూరి వ్యాసమూర్తి కవిత్వ తత్త్వవిచారవిమర్శనం ప్రతివాదగ్రంథాల్లో చెప్పదగ్గవి. పాశ్చాత్యవిమర్శనపద్ధతులను ప్రవేశపెడుతూనే రామలింగారెడ్డి భారత స్త్రీలమీద, పాతివ్రత్యంమీద విసిరిన విసుర్లు కోపతాపాలకు దారితీశాయి. అంతకుముందు విమర్శలు లేవనికాదు; పాశ్చాత్యప్రభావం వాటిమీద లేదనీకాదు. రామలింగారెడ్డి భాషాతీవ్రత ప్రదర్శించేవాడేగాని ఆయనభాషలో నవ్యత లేదు. అయినా ఆయన భావనవ్యత యువకవులనూ, పండితులనూ ఆకర్షించింది. భావకవితోద్యమానికి ఆయ నిచ్చిన సహాయసంపద విస్మరణీయం కాదు. ఫలితంలో భావకవితావాదం బలపడింది.

1-9. ఈ కాలంలో అనుషంగికంగా చర్చకు వచ్చిన విషయాలు కొన్ని లేకపోలేదు. ఏది ఉత్తమకవిత్వమనే ప్రసక్తి రాగానే విమర్శకులదృష్టి సహజంగా నన్నయతిక్కనల కవితాగుణాలను పరిశీలించదలిచింది. కవిత్రయాను వాదం సరిగా లేదుకాబట్టి ఆంధ్రమహాభారతాన్ని సంస్కరించాలనేమాట పన ప్పాకం అనంతాచార్యుల "సంస్కృతాంధ్ర భారతముల యందలి శంతనుపౌత్రు ప్రభుత్వముం గూర్చిన యొక చర్చ" (వైజయంతి-1894) అనే వ్యాసంలో పూర్వశతాబ్దిలోనే వచ్చింది. అసలు విషయం మరుగున పడిపోయి అది కురు పాండవదాయభాగనిర్ణయంగా పరిణమించింది. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, పారనంది రామశాస్త్రి, చివుకుల అప్పయ్యశాస్త్రి, శివపురపు వీరభద్ర పాకయాజి, భమిడిపల్లి వీరవేంకట దీక్షితులు, బొబ్బిలి రాజా శ్రీ వేంకటశ్వేతాచలపతి రంగారావు బహద్దర్ మొదలయినవారు ఈ చర్చల్లో పాల్గొన్నారు. బాలగంగాధర తిలక్ Arctic Home ప్రభావం వీటి మీద ఎక్కువ. ఈ వాదాలు 1907-1915 మధ్య కాలంలో చెలరేగి తిరుగా 1928-1948 మధ్యకాలంలో పునర్దర్శనమిచ్చాయి. ఈ వాదాల ద్వారా సంప్ర దాయ పరిరక్షణకు ప్రయత్నాలు జరిగాయి. పండితుల స్వోత్కర్ష ఫలవంతంగా ఉండేది. సామాజిక ప్రయోజనంగాని, సాహితీప్రయోజనం గాని లేవనే చెప్పాలి. అనుషంగికంగా చర్చకు వచ్చిన మరోవిషయం బుర్రా శేషగిరిరావు విమర్శాదర్శ (1914). పానుగంటి లక్ష్మీనరసింహారావు 'విమర్శాదర్శవిమర్శాదర్శము (1915) దానికి సమాధాన గ్రంథం. ఈరెంటిలోనూ పాశ్చాత్యవిమర్శన పద్ధతుల ప్రభావ ముంది. రెండో వారిలో సంప్రదాయ సంరక్షణకోసం విమర్శన పద్ధతులను అనుగుణంగా మలుచుకోవటం కనిపిస్తుంది. అప్పటి కవితా లక్షణాలను, ఆదర్శాలను చర్చించినవి కాబట్టి ఈ గ్రంథాలకు సాహితీ ప్రయోజనముంది.

1-10 పైన పేర్కొన్న మూడు ఉద్యమాలతోనూ సంబంధం లేని వాదోపవాదాల్లో వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) రేకెత్తించిన ఒంటి మిట్ట- ఓరుగల్లు వాదం కొంతకాలంపాటు జనాకర్షణ సాధించింది. పురాణం హయగ్రీవశాస్త్రి 1848లో మాటవరసకు పేర్కొన్న ఏకశిలానగరమాహాత్మ్యం 1906లో అచ్చయింది. చిదానందయోగి రాసిన మూడాశ్వాసాల కావ్యమిది. ఒబిలి గ్రామవాస్తవ్యుడు రామదాసు బయటకు తీసిన ఈ గ్రంథం ఆధారంగా పోతన జన్మస్థలం కడపజిల్లాలోని ఒంటిమిట్ట అని వాసుదాసు వాదించారు.

వైష్ణవ ప్రపంచంలో ఆయనకున్న ప్రసిద్ధినిబట్టి, ఒంటిమిట్ట కోదండ రామాలయాన్ని పునరుద్ధరించటం బట్టి కొంత కోలాహలం కల్పించింది. ఎంత తీవ్రంగా ఈ వాదం తలెత్తిందో అంత సులభంగానే అంతరించింది వాసుదాసు గారితోబాటే. సాహితీ దృష్టితో చూస్తే ప్రయోజనవంతమైన వాదోపవాదాలు మనువసుచరిత్రల విషయంలో ఈ శతాబ్దారంభంలోనే పొడచూపాయి. వెన్నేటి రామచంద్రరావు మనువసుచరిత్ర రచనావిమర్శనములో (1899) తులనాత్మక పరిశీలన చేశారు. మరుసటేడు విమర్శస్వరూపం వివరిస్తూ పాశ్చాత్యపద్ధతి మంచిదన్నారు. తారతమ్య పరీక్ష పనికిరాదని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి మనువసు ప్రకాశికలో (1903) వాదించి దేనికదే గొప్పదన్నారు. తరవాత మనువసు విమర్శనానుబంధం (1906), మనువసు ప్రకాశికానుబంధం ప్రచురించారు. వఝ్ఝల చిన సీతారామశాస్త్రి ప్రభృతులు అనేకులీవాదంలో పాల్గొన్నారు. కాలక్రమాన ఈ వాదం రామరాజభూషణభట్టుమూర్తి భట్టుమూర్తి కవులొకటా కాదా అనే అంతర్బహిస్సాక్ష్యాలతో చారిత్రిక విమర్శనగా పరిణమించింది. పనిలోపనిగా అష్టదిగ్గజా లెవరనే ప్రశ్న వచ్చింది. అలాగే ఆముక్తమాల్యదా క్రీడాభిరామ కర్తృత్వాలు ప్రసక్తాలైనాయి. ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వ వివాదం 19వ శతాబ్ది నాటిది. దాన్ని పునరుద్ధరించారు. ఇటువంటివే నన్నిచోడకాలం, అరణ్య పర్వశేషోన్నయం, ఆంధ్రపంచకావ్యా లేవనేప్రశ్న జానుదెనుగు నిర్వచనం, కాసట బీసట గొడవ మొదలైనవి. వీటివల్ల సాహితీప్రయోజనం కొంతవరకు నెరవేరింది. అఖండయతిని గురించి, శమంతకాదిశబ్దాల సాధుత్వాసాధుత్వాలను గురించి ఎన్నో వాదోపవాదాలు జరిగాయి. చిత్రమేమంటే (అప్పటికి) నిన్న మొన్నటి సాహితీపరుల విషయంలోకూడా కర్తృత్వ ప్రశ్నలు ఉదయించాయి.

1-11 క్రీ.శ. 1916 నుంచి 1935 వరకున్న కాలంలో జరిగిన చర్చలు ఏ మహోద్యమానికీ ప్రత్యక్షంగా సంబంధించినవి కావు. 1915కు కొంచెం ముందుగా బయలుదేరిన వివాదాలు 1916-35 మధ్య కాలంలో తీవ్రరూపం ధరించాయి. వాటిలో ప్రధానమైనవి కర్తృత్వవిషయాలు. కన్యాశుల్కం గురజాడ అప్పారావు రాయనేలేదని గోమఠం శ్రీనివాసాచార్యులు రాశాడనీ ఒకవాదం. అటువంటిదే చిన్నయసూరి బాలవ్యాకరణం స్వతంత్రరచన కాదనీ శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి హరికారికలకు అది అనువాదమనీ వచ్చినవాదం. మొదటిది త్వరలోనే సమసిపోయిందిగాని రెండోది రమారమి పన్నెండేళ్ళు జరిగింది. దీని

ప్రయోజనం పరిమితం. ఉద్యమాలతో దీనికి సంబంధంలేదు. కానీ ఇదే ఒక ఉద్యమంలాగా నడిచింది. బాలవ్యాకరణ వ్యాఖ్యాత కల్లూరి వేంకటరామశాస్త్రి తమ గుప్తార్థప్రకాశికలో ఈ విషయము మొదట రేకెత్తించారు. సుంకర రంగయ్య అనే శిష్యుడు కారణంగా ఆయనకు కులద్వేషం కలిగి ఈ విధంగా పరిణమించిందని ప్రతిస్పర్ధులంటారు. గుప్తార్థప్రకాశికకు అనుబంధంగా హరి కారికలనేగాక తమ వాదాన్ని సమర్థిస్తూ ప్రతివాది భయంకరం రాఘవాచార్యుల సమరాంగణ పార్థమూర్తీయ మని దేశమాత పత్రికలో చేసిన అభియోగప్రత్యభి యోగాలను కల్లూరివారు ప్రచురిస్తే, ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వానికి అనుబంధంగా వఝల చిన సీతారామస్వామిశాస్త్రి ద్వంద్వయుద్ధోపశమనమనే తాతా సుబ్బరాయుడుశాస్త్రి వాదనలను ప్రకటించారు. శిష్టు కృష్ణమూర్తికి సమ కాలికుడైన వేదం వేంకటరమణశాస్త్రి హరికారికలే అనువాదమని చెప్పినట్లు వేదం వేంకటరాయశాస్త్రి డైరీ సాక్ష్యమిస్తున్నది. ఈ వివాదంలో చిన్నయసూరి కనుకూలంగా వాదించినవారిలో కందుకూరి వీరేశలింగంనుంచి దువ్వూరి వేంకటరమణశాస్త్రివరకు అనేకులున్నారు. కల్లూరివారి 14 యుక్తులనునిరాకరించి 1927-28లలో దువ్వూరివారు అంతస్సాక్ష్యంద్వారా హరికారికలే అనువాదమని నిరూపించారు. వారి రమణీయంలో వివరాలు చూడవచ్చు. పార్థమన్యు శ్రీ మహోత్సవం పేరిట పన్నెండేళ్లునడిచిన యుద్ధం అసందర్భ ప్రస్తావనలతో అకస్మాత్తుగా ఆగిపోయింది. ఇది ఇలా వుండగా 1919లో బహుజనపల్లి సీతా రామాచార్యుల ప్రౌఢవ్యాకరణానికి హరికారికాశేషసర్వస్వ మనేపేరిట భాగవతం రామమూర్తిశాస్త్రి అనువాదం ఒకదాన్ని ఆయనకుమారుడు వేంకటభాగవతశాస్త్రి ప్రచురించాడు. అయితే దీనిమీద అంత రాద్ధాంతమేమీ జరగలేదు.

1-12 భావకవితోద్యమంతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా ఆఉద్య మంలో ప్రధానుడుగా పరిగణింపబడ్డ నండూరి సుబ్బారావు ఎంకిపాటలమీద లేచిన దుమారం, భావకవికాకపోయిన 'నవ'రచయితయైన గుడిపాటి వెంకట చలంమీద రేగిన వివాదం, ఉన్నవ వెంకట లక్ష్మినారాయణ మాలపల్లి మీద వచ్చిన తీవ్రవిమర్శ గ్రాంథిక వ్యావహారిక వివాదాలతో సంబంధం లేకపోయినా సూర్యరాయాంధ్ర నిఘంటువు మీద వచ్చిన విమర్శలూ 1916-1936 మధ్య చెలరేగిన సాహితీవివాదాల్లో ప్రముఖమైనవి. అలాగే నాటక రచనాస్వరూపానికి సంబంధించి ఈ కాలంలో చెలరేగిన వాదోపవాదాలు తరవాతకూడా నడిచినా

వాటికి బీజావాపనం ఇప్పుడే జరిగింది. ఎంకిపాటలకు వచ్చిన ప్రచారం మరే భావకవితారూపానికి రాలేదు. నాయికానాయకులు జానపదులు. భాష జానపదం. రచన గేయం. విషయం శృంగారం. అనేకవిషయాల్లో ఇతర భావకవితారచనల కన్నా ఇది విలక్షణం. అందువల్ల సంప్రదాయవిమర్శకులనుకూడా ఎంకిపాటలు ఆకర్షించినంతగా మరే రచనా ఆకర్షించలేదు. ఇతరగేయరచయితలున్నా ఇన్ని సంప్రదాయవిరుద్ధలక్షణాలున్న మరో రచయిత లేడు. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికల్లో జనవరాజు అప్పారావు సమర్థనలు రాగా ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో పొక్కులూరి లక్ష్మీనారాయణ 'అనర్థకవాఙ్మయ'మని తీవ్రవిమర్శ చేశాడు. నేటికాలపు కవిత్వంలో ఎంకిపాటల స్తనశల్యపరీక్ష జరిగింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఆపాటలకు అనన్యప్రచారం చేశాడు. బూర్గుల రామకృష్ణరావు గోల్కొండ పత్రికలో సమర్థనలు రాశాడు. ఫలితంలో ఎంకిపాటలు నీచశృంగార వర్ణన మన్నవారుకూడా మంచికవిత్వమనే అన్నారు. కాకపోతే కొన్నిచోట్ల భాష కృతక జానపదంగా ఉందనీ, కొన్ని భావాలు జానపదుల భావనాశక్తికి అతీతంగా ఉన్నాయనీ ఆక్షేపించారు. వ్యావహారిక రచనలకు ఎంకిపాటలిచ్చినంత ప్రోత్సాహం, సమర్థన మరోరచన ఏదీ ఇవ్వలేదని చెప్పవచ్చు.

1-13. చక్కని చిక్కని వ్యావహారికవచనం రాసినవాళ్ళలో గుడిపాటి వెంకటచలం అగ్రగణ్యుడు. స్త్రీస్వాతంత్ర్యంమీద, సెక్సువిషయంలో ఆయనకు ఆనాటివారిలో కోటికొక్కరుకూడా లేని ప్రత్యేకాభిప్రాయా లున్నాయి. బహుశా అందువల్లనే కాబోలు ఏ తెలుగురచయితకూ వెయ్యని భయంకరశిక్షలకు ఆతణ్ణి గురిచేశారు. అది అతని రచనలు ప్రచురించటానికికూడా నిరాకరించటం. 1924 లో సొంతంగా సరస్వతీగ్రంథమండలి పెట్టుకొని చిత్రాంగి ప్రచురించవలసివచ్చింది. 1926 లో శశిరేఖ, పద్మరాణి; 1927 లో మైదానం ప్రచురించినతరవాత రచయితగా చలం నిలదొక్కుకున్నాడు. ఆ రోజుల్లో చలంరచనలు చదవటం సమాజదృష్టిలో పెద్ద నేరం. అంతా దొంగచదువులే చదివారు. బహుశా ఈ నిర్బంధంకూడా చలానికి ఎంతో తోడ్పడిందనిచెప్పాలి. 1937 లో మ్యూజింగ్స్, బ్రాహ్మణీకం ప్రచురించిన తరవాత బుర్రా సుబ్రహ్మణ్యం, శ్రీవాత్సవ, కె. వెంకటరామశాస్త్రి, 'పా' మొదలైనవాళ్ళు విమర్శ తీవ్రతరం చేశారు. అప్పట్లో చలమే సమాధానం చెప్పుకోవాల్సి వచ్చింది. 1949 తరవాతనే బాహాటంగా చలాన్ని సమర్థిస్తూ రాసేవారు ఏర్పడ్డారంటే

సంఘం అతణ్ణి ఎంత హింసించిందో ఊహించవచ్చు. అతని అభిప్రాయాలతో ఏకీభవించినా లేకపోయినా అతని రచనాశిల్పాన్ని, భాషాపాటవాన్ని అభినం దించక తప్పదు.

1-14. ఉన్నవవారి మాలపల్లికి బహిరంగంగా వచ్చిన విమర్శలకన్నా పరోక్షంగా వచ్చిన ప్రమాదమే పెద్దది. అందుకు రాజకీయసామాజిక కారణా లున్నాయి. జస్టిస్‌పార్టీ ఉద్యమం, భూస్వామ్యవ్యవస్థ దొంగదెబ్బలుకొట్టి ఆ గ్రంథాన్ని నిషేధం పాలు చేశాయి సామాజికస్పృహతో వెలువడ్డ గొప్ప తెలుగునవల మాలపల్లి అనటంలో విప్రతిపత్తి లేదు. ఆ పద్ధతిని వ్యతిరేకించే వర్గం ఎంత బలవత్తరంగా అప్పుడుండేదో మాలపల్లికి జరిగిన అపచారమే నిరూపిస్తుంది. సూర్యరాయాంధ్ర నిఘంటునిర్మాణం తలపెట్టినప్పుడే వివాదం మొలకెత్తింది. 1916 లో వేదం వేంకటరాయశాస్త్రిని ప్రధానసంపాదకుడుగా ఉండమని ఆహ్వానించినప్పుడే ఆయన "ఆంధ్రభాషాసర్వస్వార్థ నియమకతిప యములు" నిర్ణయించగా వాటిని అంగీకరించక జయంతి రామయ్యకు పట్టాభి షేకం చేసి మొదలుపెట్టారు. మొదటిసంపుటం అచ్చుకాగానే గిడుగు వెంకట రామమూర్తి అక్షరాక్షరశోధనం చేసి వందలసంఖ్యలో తప్పులు చూపటం మొదలుపెట్టాడు. ఆరంభించిన మహారాజు అన్నవేద అయినాడే గాని నిఘం టువు ప్రామాణ్యం సంపాదించలేదు – నిన్నమొన్నటిదాకా పూర్తికానూ లేదు – ఈ కాలంలోనే నాటకరంగవిమర్శ మొదలయింది పురాణం సూరిశాస్త్రిరచనతో. నాటకంలో పద్యాలూ, కీర్తనలూ అవసరమా కాదా ? అనే దొక ప్రశ్న. నాటక ప్రదర్శనపద్ధతులు ఏవని మరో విచికిత్స. "కష్టాంత" నాటకాలు పనికివస్తాయా రావా ? అని ఇంకో మీమాంస. సారంగధరనాటక ప్రదర్శనాన్ని విమర్శిస్తూ జంఘాలశాస్త్రి పేరిట పానుగంటి లక్ష్మీనరసింహారావు సాక్షివ్యాసాల్లో ఎన్నో ధర్మపన్నాలు చెప్పి తన నాటకాల్లో వాటన్నిటినీ విస్మరించాడు. అప్పటి కింకా స్త్రీలే స్త్రీపాత్రలు ధరించటం మొదలుకాలేదు. సకృత్తుగా తప్ప. విమ[illegible] లెట్లా ఉన్నా, వాస్తవంలో పద్యభూయిష్ఠమయిన నాటకాలకే అప్పట్లో ప్రే[illegible] దరణ లభించింది.

1-15. ఈ కాలంలో మహాభారతం మరోసారి విప్రతిపత్తి కా[illegible] మయింది. పండితలోకంలో పెద్దసంచలనం తెచ్చిన భారతవిమర్శ పెంద

వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి మహాభారతచరిత్రం (1928). తరవాతికాలంలో ఆయన రాజసూయరహస్యం (1938), పరీక్షిత్తు మొదలయినవి వచ్చాయి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి మహాభారతచరిత్ర నిరాకరణం, మహాభారతరహస్య విమర్శనం, శిష్టా సూర్యనారాయణశాస్త్రి మహాభారతరహస్యం, పిరుసూర్య నారాయణ కురుసామ్రాజ్యాధిపత్యం, శ్రీమదాంధ్రమహాభారతసంశయవిచ్ఛేదం, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి మహాభారత తత్త్వకథనం వంటివి ఈ కోవకు చెందిన రచనలు. వీటి ప్రయోజనం సంప్రదాయపరిరక్షణ. అయినా ఏకోన్ముఖత లేదు. పరమపవిత్రగ్రంథమైన భారతాన్ని సంశయించటానికీ, ప్రశ్నించటానికీ సనాతనవాది పండితులే సమకట్టటం విశేషమనీ విలక్షణమనీ చెప్పాలి. సంప్రదాయపద్ధతి వాదోపవాదాలకు దారితీసిన మరో విషయం రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ నాచన సోమనగురించి వ్రాసిన వ్యాసం. నడకుదుటి వీరరాజు విమర్శ తరంగిణిలో పై వాదాన్ని సమర్థించగా అనేకులు ఎర్రనకు అపచారం జరిగిందని ఖండించారు. ఇందువల్ల జరిగిందల్లా సోమనాభిమానులు ఎర్రనను, ఎర్రన ప్రియులు సోమనను తక్కువచూపు చూడటంమాత్రమే. 1935 ప్రాంతంలో మల్లాది సూర్యనారాయణశాస్త్రి దశరూపకాన్ని కొల్లాపురం వాస్తవ్యులు వెల్లాల సదాశివశాస్త్రి దశరూపకఖండనం రాసి నిరసించటం, దానికి దశరూపకఖండనాభాస నిరాసం అని ప్రత్యుత్తర మివ్వటం వంటివి జరిగాయి. ఇందుకు సంస్కృతలక్షణగ్రంథాలను తెలుగులో సవిమర్శకంగా చర్చించటమొక్కటే ఫలితం, పరమావధికూడా.

1-16 ద్వితీయ ప్రపంచయుద్ధం పరిసమాప్తమయ్యేనాటికి ప్రపంచ సాహిత్యంలో అనేక నూతనభావాలూ, ప్రక్రియలూ, సిద్ధాంతాలూ వచ్చాయి. అవన్నీ తెలుగు సాహిత్యంలో చోటు చేసుకోవటం మొదలయింది. అప్పటికి భావకవితావాదం మరుగున పడిపోయి గతానుగతికమై పోయింది. ఛందోబందోబస్తులను సమూలంగా తెంచటం, వచనకవిత పద్యం ప్రవేశపెట్టటం, వాస్తవికత, సామాజిక స్పృహా ప్రయోజనాలు కవితాదర్శాలు కావాలనటం, దేశభక్తి కన్నా ప్రపంచశాంతిప్రియత్వం ప్రకృష్టమనుకోవటం మొదలైన అనేకాదర్శాలతో మరోమహోద్యమం ఆరంభమయింది. నవ్యకవితను అంటే భావకవిత్వాన్ని విమర్శించేవారు తగ్గిపోయారు. విమర్శిస్తే దువ్వూరి రామిరెడ్డివంటి కవులు సహించేవారుకాదు. వారే అభ్యుదయ కవితోద్యమం మొదలైనప్పుడు ప్రథమ

విమర్శకులైనారు! నిజానికి ఆధునిక కవితారీతుల్లో అనేకాలకు గురజాడ అప్పారావు ఆద్యుడైనా సంప్రదాయదూరుడైన అప్పారావుకన్నా సంప్రదాయ సన్నిహితుడైన రాయప్రోలే తరవాతి భావకవులకు ఆదర్శప్రాయుడైనాడు. భావకవితోద్యమం పలాయనవాదం వంటివాటికి దారితీసి ఆవిర్భవించినంత త్వరలోనే అణగారిపోయింది. అందుకు ప్రధానకారణం రచయితల అశక్తత కాకపోవచ్చు గాని అనుక్షణం మారిపోతున్న ఆదర్శాలూ, ప్రపంచసాహితీ ధోరణులూ అనకతప్పదు. దాదాయిజం, సర్రియలిజం, నిహిలిజం, ఇమేజిజం వంటి నానాసిద్ధాంతాలు ప్రపంచంలో ఏమూల వచ్చినా తెలుగుకవులు ప్రతి స్పందించారు. ఈ తరంవారికి గురజాడ రచనల్లోనే భావకవిత్వాల్లో కన్నా ఎక్కువ నూతనత్వం కనిపించింది. ముత్యాలసరాల్లాగా మరికొన్ని కొత్త ఛందస్సులు సంతరించుకోవాలనీ, ప్రజాసామాన్యం పాడుకొనేపాటల బాణీలు వాడాలనీ, ఇవేమీ వద్దు కేవల వచనంలో రాయాలనీ, వచనపద్యాలు రచించా లనీ, సామాజికచైతన్యాన్ని ప్రకోపింపచేయాలనీ, ప్రపంచకార్మికులు ఏకమై జాతి మత విచక్షణలేని సమతారాజ్యం స్థాపించాలనీ వీరు భావించారు. నయాగరా, మహాప్రస్థానం ఈ అభ్యుదయకవితాధోరణికి ఆద్య గ్రంథం, ఆదర్శ రచన. నానావిధదూషణలతో భావకవులూ, భావకవితాధోరణితో అప్పటికి రాజీపడిన పండితప్రకాండులూ ఈ సరికొత్త ఉద్యమానికి స్వాగతం చెప్పారు. ఆదిలో భావకవులయిన అభ్యుదయవాదులు తెచ్చిపెట్టిన కొత్తదనమేమీ లేదని అలవాటుగా చేసే విమర్శనలు చేశారు. రకరకాల పేర్లు పెట్టారు. శ్రీశ్రీ, కాళోజీ, ఆరుద్ర, నారాయణబాబు, తిలక్, పఠాభి, శిష్ట్లా వంటి అనేక అభ్యుదయ రచయితలకు మొదట వెక్కిరింతలే దొరికినా కాలక్రమాన అనుయాయులు అసంఖ్యాకులయినారు. క్షుద్ర సాహితీకర్త అని వేళాకోళం చేసినవారే శ్రీశ్రీ మహాప్రస్థానం – కవిత – "అద్భుత గీతా"లన్నారు.

1-17. అభ్యుదయకవితోద్యమాన్ని దెబ్బతీయదలచినవారు అందుకు ఆద్యుడని యుగకర్త అని భావిస్తున్న గురజాడను విమర్శించటం మొదలు పెట్టారు. అప్పటికింకా ఆయనకు అకవి, కుకవి, కాకవి అనే ప్రశంసలు రాలేదు. 1910 నాటికే కన్యాశుల్కనాటక విమర్శనం సంపాదకుడు పూండ్ల రామకృష్ణయ్య అముద్రితగ్రంథ చింతామణిలో రాసింది, కన్యాశుల్కస్థగ్రామ్య భాషావాదవిమర్శనమని కాశీభట్ట బ్రహ్మయ్య ఆర్యమత బోధినిలో రాసిందీ

ఖండనగ్రంథాలుగా ఉన్నాయి. వీటికి ప్రత్యుత్తరాలుగా కన్యాశుల్కంలో స్త్రీ వ్యక్తులనుగురించి శ్రీశ్రీ సమదర్శినిలో, శ్రీ గురజాడ అప్పారాయకవి అని చింతా దీక్షితులు భారతిలో రాశారు. ఆ తరవాత అవిచ్ఛిన్నంగా అనేక సమర్థక వ్యాసాలు వచ్చాయి. 1947 నాటికే అభ్యుదయకవితోద్యమం వేరుదన్ని నిలబడింది ; శ్రీశ్రీ కి మహాకవి గౌరవం లభించింది.

1-18. క్రీ. శ. 1900 నుంచి 1947 వరకున్న సాహితీయుగాన్ని ప్రయోజనదృష్టితో స్వభావాన్నిబట్టి మూడు దశలుగా విభజించవచ్చు. ప్రథమ ప్రపంచయుద్ధానికి ముందుకాలం, రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలం, ద్వితీయ ప్రపంచయుద్ధానంతర కాలమని, వ్యావహారికభాషావాదం, భావకవితావాదం, అవధానకవితావాదం అనే మూడు మహోద్యమాలు 1915 కు ముందే బయలుదేరాయి తెలుగుసాహితీచరిత్రలో. నాలుగో మహోద్యమం అభ్యుదయకవితోద్యమం ద్వితీయప్రపంచయుద్ధానంతరకాలంలో బయలుదేరింది. మొదటి మూడు ఉద్యమాలూ పరస్పరాధారితాలు కాకపోయినా పరస్పరసహకారులు. ఈ మొత్తం కాలంలో వచ్చిన వాదప్రతివాదాలను అయిదు విధాలుగా విభజించవచ్చును. (1) సిద్ధాంతచర్చలు — ఇవి నాలుగుఉద్యమాల గుణదోషాలను సమీక్షించేవి. (2) తులనాత్మక విమర్శలు - మను వసుచరిత్రల పరిగణన, సోమన ఎఱ్ఱనల పోలికల వంటివి. (3) కవి కాలనిర్ణయ, కావ్యకర్తృత్వ సంబంధి వివాదాలు - ఆముక్తమాల్యద, ఆంధ్రశబ్దచింతామణి, క్రీడాభిరామ కర్తృత్వ విషయికచర్చల వంటివి. (4) కేవల శాబ్దిక లాక్షణిక వాదోపవాదాలు - పార్థమన్యుశ్రీమహోత్సవం మొదలయినవి. (5) వైయక్తిక వివాదాలు - తిరుపతి వేంకటకవులకు ఇతరులతో వివాదం, చలం నండూరి గురజాడలమీద విమర్శల వంటివి. వీటిలో మొదటి రకానికి సాహిత్యప్రయోజన ముంది. రెండో రకానికి చెందిన కవిత్వ తత్త్వవిచారం వంటివి. విమర్శధోరణులనే మార్చినందువల్ల ప్రయోజనవంతాలు. మూడో రకం చర్చలకు చారిత్రకప్రయోజనం మాత్రమే ఉండగా, నాలుగో రకం వాదప్రతివాదాలకు పాండిత్యప్రకర్షే పరమప్రయోజనం. చివరి రకం చర్చలు సాహిత్యానికి అనన్యప్రచారం తెచ్చిపెట్టాయన్నదే పరమప్రయోజనం.

1-19. చర్చనీయకాలంలోని వాగ్వాదాలు చాలావరకు పందొమ్మిదో శతాబ్దంలో పుట్టినవారు చేసినవే. వారిలో చాలామంది పట్టుదలతో తామునమ్మిన

విషయంలో తీవ్రవిమర్శలకు దిగినా తమ వాదంలోని లోపాలు తామే గుర్తించి నప్పుడు తల వొగ్గినవాళ్ళే. ఇది గొప్ప విశేషం. వ్యక్తిగతదూషణల అవహేళ నల పాళ్ళు ఆనాటివారివిమర్శల్లో ఎక్కువ. అయితే ఆ లక్షణం ఈ నాటికీ తెలుగువిమర్శకులను వదిలిపోలేదు. జరిగిన ప్రతిచర్చా సాహితీలోకానికి ఉప కారకం కాకపోయినా, అసలు చర్చలు జరగటమే సాధ్యమైనందుకు సంతో షించవలసిందే. ఇప్పటి వసతులు, ముద్రణ గ్రంథాలయసౌకర్యాలు లేనిరోజుల్లో మహోద్యమాలు నడపటం మాటలతో పని కాదు. మొత్తంమీద ఈశతాబ్దారంభం నుంచి స్వాతంత్ర్యోద్యమం అయ్యేటంతవరకు తెలుగుసాహితీ ప్రపంచంలో వచ్చిన వివాదాలవల్ల నిజం నిగ్గుదేలటమే కాకుండా భావవాద పలాయనవాద సాహిత్యం సామాజిక ప్రయోజనవంతమైన అభ్యుదయ కవితోద్యమానికి దారి యిచ్చి తప్పుకుందని చెప్పవచ్చు.

## ఉపయుక్త ప్రధాన గ్రంథసూచిక

1. అక్కిరాజు ఉమాకాంతం – 1928 – నేటికాలపు కవిత్వం (వాఙ్మయ పరిశిష్టభాష్యం, వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్స్), మద్రాసు,

2. సింగిరెడ్డి నారాయణరెడ్డి – 1967 – ఆధునికాంధ్ర కవిత్వము (సంప్ర దాయములు : ప్రయోగములు), సికింద్రాబాదు.

3. కె. వి. రమణారెడ్డి – 1969 – మహోదయం, విశాలాంధ్ర ప్రచుర ణాలయం, విజయవాడ.

4. ఎస్. వి. రామారావు – 1979 – తెలుగులో సాహిత్యవిమర్శ, పసిడి ప్రచురణలు, హైదరాబాదు.

5. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య– 1968–చలం : జీవితం – సాహిత్యం, దేశికవితామండలి, విజయవాడ.

6. కురుగంటి సీతారామభట్టాచార్య / పిల్లలమర్రి వేంకట హనుమంతరావు | 1949—51 నవ్యాంధ్ర సాహిత్య వీథులు.

# తెలుగు రచనా భాషా పరిణామం

[ఉపన్యాస సంక్షిప్త పాఠం]

- ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి

తెలుగుభాషాచరిత్రను పరిశీలిస్తే మొదట్నించీ అది మూడు పాయలుగా విస్తరిస్తున్నట్లు కన్పిస్తుంది. 1. గద్యపద్యాల్లో కనిపించే కావ్యపద్ధతి. 2. దాని పక్కనే వచనశాసనాల్లో కనిపించే వ్యవహారభాషాపద్ధతి. 3. ఈ రెండింటి లోనూ కన్పించకుండా సాధారణజనంలో ఉండి ఉంటుందని చెప్పడానికి వీలున్న పామరభాషాపద్ధతి. ఈ మూడురకాల పాయలూ లిఖితరూప చరిత్ర కన్పిస్తున్నాటినుంచి ఉండిఉండాలి. నన్నయభారతానికి 2, 3 వందల సంవత్స రాలకు ముందునుంచే నన్నయగద్యానికి తుల్యమైన గద్యం, ఆయనపద్యానికి తుల్యమైన పద్యం శాసనాల్లో కన్పిస్తున్నాయి.

కొన్నివందల సంవత్సరాలుగా తనకు ముందు పండితులు, కవులు రచన కుపయోగించిన శైలిని అనుసరించి నన్నయ భారతరచన చేశాడు. అంటే నన్న యకు చాలాకాలం ముందే లిఖితరూపంలో ఉన్న కావ్యభాషకూ, వ్యవహార భాషకూ చాలాదూరం ఏర్పడిందని చెప్పవలసిఉంటుంది. మనం నన్నయనాటిది అనుకున్న భాష నన్నయనాటిది కాదు. ఈనాటిభాష అనుకుంటున్నది ఈనాటిదీ కాదు. ఈనాడు ఆధునికం అని మనం అనుకుంటున్న రూపాలు నన్నయనాటి నుంచే కొద్దిగానో, గొప్పగానో శాసనాల్లో కనిపిస్తాయి. నన్నయ్య సమకాలీన శాసనాల్లో ఏఅయి, ఇస్తిమి లాటి రూపాలున్నాయి.

ఒకభాషలో సాహిత్యం ప్రారంభమైన దశలో ఆ సాహిత్యభాషకూ, ఆనాడు జనం మాట్లాడుకుంటున్న భాషకూ దూరం ఉండే అవకాశం లేదు. అంటే ఏ భాషలోనైనా మొదటిసారిగా వచ్చిన కావ్యభాష సమకాలీన వ్యవహార భాషకంటే భిన్నంగా ఉండటానికి వీల్లేదు. కావ్యభాష ఎవడో ఒకడు సృష్టిం చింది కాదు. రచయిత తన కాలంలో వ్యవహారంలో ఉండే భాషలోనే పెద్ద

మనుషులు అనుకునేవాళ్ళు ఉపయోగించే భాషారూపంలో రచన చేస్తారు. ఈ భేదం మొదట్లో చాలా తక్కువగానే ఉంటుంది. కాని, భాషకు రచనాసంప్రదాయం ఏర్పడ్డ తర్వాతనే శిష్టులు వాడే రచనాభాషకు, సామాన్యులభాషకు భేదం ఏర్పడుతుంది. భాష కేవలవ్యవహారరూపంలో ఉన్నప్పుడు ఈ భేదం ఏర్పడే వీలు తక్కువ. 11వ శతాబ్ది మొదటిభాగంలోనే కావ్యభాషకూ, వ్యవహారభాషకూ చాలా దూరం కన్పిస్తున్నదనీ, ఆనాటి వ్యవహారభాష ఈనాటి వ్యవహారభాషకు కొంచెం దగ్గరగా ఉందనీ మనం అంటున్నామంటే ఈ రెండు శైలులకూ అంతకు చాలా కాలం ముందే దూరం ఏర్పడి ఉంటుందని గ్రహించాలి. అంటే తెలుగులో రచనాసంప్రదాయం నన్నయకంటే చాలాకాలం ముందే ఉందన్నమాట. భాషలో రచనాసంప్రదాయం ఏర్పడిననాడు ఆ రచయితల పాండిత్యాన్నిబట్టీ, వాళ్ళకు సంఘంలో ఉన్న స్థానాన్నిబట్టి ఒక రచనకూ, రచయితకూ ప్రాముఖ్యం ఏర్పడుతుంది. తరవాత రచన చేసినవాళ్లు ఆయన లాగే రాయాలనీ, అతనిభాష ఎంత గొప్పదో, అతనిరచన ఎంత గొప్పదో అట్లాగే అనిపించుకోవాలనీ ప్రయత్నం చేస్తారు. ఆ పద్ధతిలో అనేక రచనలు రావడాన్ని శైలీకరణం (Stylization) అనవచ్చు. అంటే తెలుగులో నన్నయకు ముందే గద్యపద్యభాష శైలీకృతం అయిందని చెప్పవలసి ఉంటుంది. నన్నయకాలంలో పండితులు, సంస్కృతాంధ్రాల్లో రచన చేయగలిగిన కవులు చాలామంది ఉన్నట్లు భారతం అవతారికవల్ల మనకు తెలుస్తుంది. వాళ్ళందరూ తెలుగులో అనేక రచనలు చేసి ఉండవచ్చు. వాళ్లు అనుసరించిన భాషకూడా నన్నయభారతంలోని భాషవంటిదే కావచ్చు. కాకపోతే మనకు భారతంమాత్రమే ఆనాటి రచనగా మిగిలింది. దీన్నిబట్టి నన్నయ తనకాలపు తెనుగును ప్రమాణీకరించడమో, సంస్కరించడమో, ద్రవరూపంలో ఉన్నదాన్ని స్థిరీకరించడమో చేసి, భారతరచన చేశాడనే అభిప్రాయం సరైంది కాదని స్పష్టంగా చెప్పవచ్చు.

నన్నయ తరువాతికవు లందరూ తమకావ్యాల్లో కుడిఎడమగా నన్నయ భాషనే అనుసరించారు.కాని దీనికిసమాంతరంగా వ్యావహారికభాష శాసనాల్లో కనిపిస్తుంది. కావ్యరచనకు తప్ప చదువుకున్నవాళ్ళ తక్కిన వ్యాసంగం ఈ భాషలోనే జరిగేది. పాఠప్రవచనాలు, వ్యాకరణానికో, అలంకారశాస్త్రానికో వివరణలు చెప్పే సందర్భాలు, ఇంట్లో మాట్లాడుకోవడం, లౌకిక వ్యవహారాలు ఈ

భాషలోనే సాగిఉంటాయి. ఈ పాయ అనేకరకాలైన పరిణామాలను పొంది నట్లు శాసనాలు పరిశీలిస్తే తెలుస్తుంది. కొంతకాలానికి ఈ భాషకూడా కావ్యభాష లాగా శైలీకృతం అయింది. కావ్యరచనలో కాకుండా ఇతరరచనల్లో ఇది కన్పి స్తుంది. అన్నమాచార్యుల కీర్తనల్లో సమకాలీన వ్యవహారభాషను చూడవచ్చు. 16వ శతాబ్దానికి చెందిన రాయవాచకంలో, తరువాత వచ్చిన కైఫియతుల్లో, యక్షగానాల్లో, తాతాచార్యుల కథలు మొదలైన సామాన్యజనానికి ఉద్దేశించిన సాహిత్యంలో వ్యావహారికభాష కన్పిస్తుంది. అంటే వ్యావహారికభాషకూడా శైలీకృతమై రచనావ్యాసంగానికి ఉపయోగించారన్నమాట. నిజానికి కావ్య భాషలో కూడా అనేకమైన వ్యావహారికరూపాలు 15, 16 శతాబ్దాలనుంచే ప్రవే శించడం చూడవచ్చు. సముచ్చయార్థకంగా దీర్ఘాన్ని "రోసీరోయరు"మొదలైన విధంగా ధూర్జటి రచనల్లో చూడవచ్చు.

సముచ్చయార్థకంగా ను వర్ణం లోపించి పూర్వాచ్చు దీర్ఘంకావటం ఉన్నట్టు కేతన ఆంధ్రభాషాభూషణంవల్ల మనకు తెలుస్తుంది. ఉదా: "వీటీ దెమ్చితారు, మమ్మూ దలంచి." ఈ కావ్యభాష, వ్యావహారికభాష అన్న రెండుపాయల్తో పాటు ఏ విధమైన రచనలకూ ఉపయోగించని (బహుశా జానపద సాహిత్యం మాత్రమే చోటుచేసుకున్న) చదువుకోనివాళ్ల మాట్లాడేభాష ఒకటి ఎప్పుడూ కొనసాగుతూనే ఉంటుంది. దాన్ని మనం పామరభాష అందాం. అయితే లక్షణ కర్తలు వ్యావహారికభాషను, పామరభాషను కలిపివేసి కావ్యప్రయోగయోగ్యం కాని భాష నంతటినీ "గ్రామ్యం" అన్నారు.

"గ్రామ్యం" అంటే వీరి ఉద్దేశంలో నియమం లేనిది. అంటే కావ్యరచ నకు ఉపయోగించనిది. అయితే వ్యావహారికభాష శైలీకృతమయిన అర్వాచీన కాలంలో వ్యావహారికభాషకూ, పామరభాషకూ మధ్య ఉన్న భేదం మనకు స్పష్టంగా తెలుస్తుంది. అయినా లాక్షణికులు అర్వాచీనకాలంలో కూడా ఈరెండు శైలులనూ రచనలో నిషేధించారు. దీన్నిబట్టి చూస్తే కావ్యాల్లో ప్రయోగించిందీ లాక్షణికులు ఒప్పుకున్నదీ, నన్నయకంటే ముందున్న ప్రాచీనభాషాస్వరూప మనీ, ఎప్పటి కప్పుడు మార్పులకు లోనౌతున్న చదువుకున్నవాళ్ళభాష వ్యావ హారికభాష అనీ చెప్పవచ్చు. తమిళం,గ్రీకు మొదలైన భాషల్లోతప్ప తదితర భా షల్లో శిష్టుల వ్యవహారభాషనుంచే రచనాయోగ్యమైనప్రమాణభాష ఏర్పడుతుంది.

కావ్యరచనలో మాత్రం ప్రాచీనమైన భాష, ఇతర వ్యాసంగాల్లో వ్యావహారికభాష కొనసాగుతున్న దశలో 19 శతాబ్ది మధ్యభాగంలో చిన్నయసూరి "బాలవ్యాకరణం" వచ్చింది. ఈ వ్యాకరణం శైలీకృతమైన కావ్యభాషకు వ్యాకరణం. ఈ వ్యాకరణాన్ని చాలావరకు అనుసరించే లక్ష్యగ్రంథంగా ''నీతి చంద్రిక'' రాశాడు. అప్పుడే ముద్రణాసౌకర్యాలు రావడం, పాశ్చాత్య విద్యావిధానం అమలుచేసి, తెలుగును మరింత విస్తృతంగా ఉపయోగించవలసి రావడం కారణంగా ఎలాంటి భాషలో పాఠ్యగ్రంథాలు ఉండాలి, ఎలా పరీక్షలు రాయాలి అన్న విషయంలో వాదోపవాదా లేర్పడ్డాయి. ప్రాచీనతమీద ఉన్న గౌరవం, ప్రాచీనవ్యవస్థంతా నాశన మైపోతుందన్న భయం మొదలైన భాషేతరకారణాల వల్ల లాక్షణికమైన భాషలోనే అధ్యయనం ఉండాలనే వాదం బలీయ మయింది. ఈ దశలో గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు మొదలైనవాళ్ళు వ్యావహారికభాషనే రచనాయోగ్యమైన భాషగా అంగీకరించాలన్నారు. 1897 లో అప్పారావుగారి "కన్యాశుల్కం" వచ్చింది. అయితే దీని మొదటి ఎడిషన్‌లో గ్రాంథిక, వ్యావహారికాలు కలగాపులగమైన భాష కన్పిస్తుంది. రెండో ఎడిషన్‌లో కళింగమాండలికంలో శిష్టభాష ఉత్తమసాహిత్యప్రక్రియను సృష్టించటానికి ఉపకరణమైంది. తరువాత ఆయన రాసిన కథలూ, పాటలూ కూడా వ్యావహారిక భాషకు దగ్గరగా ఉన్నాయి.

కావ్య వ్యావహారిక భాషలమధ్య రాజీగా మరో భాషారూపాన్ని కొంతమంది సృష్టించారు. అదే సరళగ్రాంథికం. ఇది వీరేశలింగంగారి నుంచి కన్పిస్తుంది. ఆధునికభాషలో ఆలోచించి గ్రాంథికభాషలోకి తర్జుమాచేస్తే ఏర్పడేది సరళగ్రాంథికం. "ఏం కొంపలు కాలిపోతున్నాయా ?'' అనే వాక్యాన్ని "ఏమి? కొంపలు కాలిపోవుచున్నవా ?" అని, ''ఎగాదిగా చూశారు" అన్నదాన్ని "ఎగందిగన్ జూచిరి" అనీ, ఆధునికభాషనుంచి స్ఫూర్తిని తీసుకొని ప్రాచీనకావ్యభాషా ప్రత్యయాలను తగిలించడం సరళగ్రాంథికం ఉపయోగించినవాళ్లు చేసిన పని. ఇది అటు ప్రాచీనకాలంలోగానీ, ఇటు ఆధునికకాలంలోగానీ వ్యవహారంలో లేని భాషాప్రయోగం. ఐతే ఈ మార్గంలో రచనలు చేసినవాళ్ళు చాలామంది 19 వ శతాబ్దం చివర, 20 వ శతాబ్దం పూర్వార్థంలో కన్పిస్తారు. 1800-1947 మధ్య సరళగ్రాంథికం రాసినవాళ్ళలో కొమఱ్ఱాజు లక్ష్మణరావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కట్టమంచి రామలింగారెడ్డి, కాశీనా

ఘని నాగేశ్వరరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, సురవరం ప్రతాపరెడ్డి మొదలయినవా రున్నారు. ఇరవయ్యో శతాబ్ది మొదలయ్యేనాటికి తెలుగురచనా భాష పొందిన పరిణామం ఇది.

ఆధునిక వ్యావహారికభాషలో రచనలు చేయడం గురజాడ అప్పారావు తోనే మొదలైందని చెప్పాలి. తరువాత ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి వ్యావహారికరచన చేయడంలో ఒక మైలురాయి అని చెప్పవచ్చు. మాలపల్లి వచ్చింతర్వాత ఆ నవల్లోని విషయాన్నిబట్టి భాషనుబట్టి వచ్చిన ప్రాముఖ్యంవల్ల ఆధునిక వ్యవహారభాషను ఒక శక్తిమంతమైన అభివ్యక్తీకరణ సాధనంగా ఉపయోగించవచ్చునని తేలింది. గుడిపాటి వెంకటచలం, తాపీ ధర్మారావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, నార్ల వెంకటేశ్వరరావు, శ్రీశ్రీ, గోపీచంద్, కొడవటిగంటి కుటుంబరావు, బుచ్చిబాబు మొదలైనవాళ్ళు ఆధునికభాషలో ఈ కాలంలో రచనలు చేశారు. విశ్వనాథ సత్యనారాయణలాంటివాళ్ళు, అటూ ఇటూ కూడా ఉండే వాళ్ళు; కొన్ని వాడుకభాషలో, కొన్ని సరళగ్రాంథికంలో ఆయన రాశారు. నవ్యసాహిత్య పరిషత్తులో ఉన్నప్పుడు వ్యావహారికభాషలోనే రచనలు చేయాలని చెప్పాడు. వార్ధక్యం వచ్చింతర్వాత గ్రాంథికవాది అయ్యాడు. కొమర్రాజు మొదలైనవాళ్ళు సరళగ్రాంథికంలోనే రచనలు సాగించారు.

1915 లో గ్రాంథిక వ్యావహారికభాషావాదాల ఉద్యమం కాస్త తగ్గిపోయింది. ఒక రకంగా గ్రాంథికమే గెల్చింది. పైకి గెల్చినట్టు అనిపించినా నిజంలో ఓడిపోయింది. అసలైన కావ్యభాషలో రాయలేకపోవడమే ఈ ఓడిపోవడానికి కారణం. పానుగంటి, చిలకమర్తివంటి సరళగ్రాంథికంలో రాసినవాళ్లని వదిలేస్తే గ్రాంథికంలో రాసిన చాలామంది సృజనాత్మక రచయితలు కారు. వీళ్ళల్లో పరిశోధకులు, వ్యాసకర్తలు మాత్రమే చాలామంది ఉన్నారు. సృజనాత్మక రచనలు చేసేవాళ్ళు నూటికి తొంభైమంది ఆధునికభాషలోనే రచనలు చేశారు. పత్రికలుకూడా దీనికి చాలా దోహదం చేశాయి. దీంతో సరళగ్రాంథికం పాఠ్యగ్రంథాల్లోమాత్రమే మిగిలి ఇతరరంగాల్లో ముఖ్యంగా mass media సినిమా, రేడియో వార్తాపత్రికల్లో వ్యావహారికభాష స్థిరపడ్డది.

పామరభాషకుకూడా సాహిత్యస్థాయి నండూరి గేయాలవల్ల వచ్చింది. (ఇక్కడ పామరభాష అన్నదాన్ని చదువుకోనివాళ్ళభాష అన్న అర్థంలో వాడుతున్నాను.) అయితే ఈ మార్గాన్ని ఇతరులెవరూ అనుసరించలేకపోయారని చెప్పాలి. స్వాతంత్ర్యోద్యమం సందర్భంగా అనేకమైన గీతాలు, అసంఖ్యాకమైన గేయరచనలు వాడుకభాషలో వచ్చాయి. అయితే ప్రత్యేకంగా ఒక ప్రాంతీయ మాండలికంలో రచనలు చేయడం 1947 దాకా రాలేదు. ఇటీవలే పోరంకి దక్షిణామూర్తి, మాధవపెద్ది గోఖలే, దాశరథి రంగాచార్య లాంటివాళ్ళు ఈ ప్రయత్నం చేస్తున్నారు.

1947 నాటికి ఆధునిక వ్యావహారికభాష సృజనాత్మక రచనలకు ఒక "ఒరవడి" అయిందే కాని శైలీకృతం కాలేదు. ఆయా ప్రాంతాల రచయితల్లో ఆయా మాండలికాల ప్రభావంవల్ల వైవిధ్యం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. ఇప్పుడిప్పుడే సినిమా, రేడియో, పత్రికాభాషల ప్రభావంవల్ల ఆధునికభాషలో స్వరూపం, ఏకరూపత వస్తున్నది. వీలైనంతవరకూ వైవిధ్యం తగ్గి, కొన్ని రూపాల ఎంపికలో ఏకరూపత రావడమే శైలీకరణం. ఈ శైలీకరణంలో ఒక ప్రాంతపు భాషాస్వరూపం ప్రభావం ఎక్కువగా ఉండడం జరుగుతుంది. దీనికి కారణం ఆర్థిక, రాజకీయాది భాషేతరకారణాలే కాని భాషాగతంగా ఒక ప్రాంతపు భాష ఎక్కువదీ, ఒక ప్రాంతపుభాష తక్కువదీ కావడం కాదు.

నన్నయగారి గద్యపద్యాల్లో ఆనాడు శైలీకరణం జరిగినటువంటిభాషకీ, ఆధునికభాషకీ చాలా భేదం ఉంది. ఒక రచయిత రచనను తీసుకుంటే అది ప్రాచీనమో, ఆధునికమో చెప్పడం ఎట్లా ? ఇద్దరురచయితల రచనలను పోల్చి ఎవరు ఎక్కువ ఆధునికులో, ఎవరు ఎక్కువ ప్రాచీనులో చెప్పడం ఎట్లా ? విషయం, భాష ఇవి రెండు ప్రధాన ఆధారాలు. నన్నయగారు భారతం తీసుకున్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లిలో ఆనాడు భూస్వాములకూ, రైతులకూ ఉన్న సంబంధంగురించి రాశారు. దీన్నిబట్టి నన్నయగారు తీసుకున్న విషయం ప్రాచీనమనీ, ఉన్నవ లక్ష్మీనారాయణగారు తీసుకున్న విషయం ఆధునికమనీ తెలుసుకోవచ్చు.

ఇక భాషవిషయానికి వస్తే, ఒక్కొక్క రచనను తీసుకుంటే ఇది చాలా ఆధునికం, ఇది ఇంతకంటే కాస్త తక్కువఆధునికం, ఇది మరీ ప్రాచీనం అని చెప్పడానికి ఏదయినా మార్గం ఉందా అంటే మనం ఇంట్యూటివ్‌గా చెప్ప వచ్చు. చిన్నయసూరిగారి నీతిచంద్రిక పాతపద్ధతిలో ఉంది. వీరేశలింగం రచన సరళగ్రాంథికం – ఈ విధంగా. కాని మళ్ళీ వీరేశలింగంగారి రచన చిన్నయసూరిగారి గద్యపద్యాత్మకమైన రచనాపద్ధతికి చెందిందా ? ఈనాటి వ్యావహారానికి చెందిందా? మధ్యకాలపు శైలీకృతమైన వ్యావహారానికి చెందిందా అని పరిశీలించాలంటే విషయాన్ని విడిచిపెట్టి కేవల భాష ఆధారంగానే చెప్ప వలసి ఉంటుంది. దీనికి కొన్ని ప్రమాణాలను సిద్ధం చేసుకొని ఒక రచన ప్రాచీనత ఆధునికతలను కొలిచే పద్ధతిని సిద్ధం చేశాను. ప్రాచీనత – ఆధునిక తల మధ్య ఉన్న అంతరాలను రచనాధర్మాలుగా నిష్కర్షగా చెప్పటానికి ఒక ప్రక్రియను ఊహించాను.

స్ఫూర్తి అన్నది ఒక ప్రమాణం. ఒక రచన చదివినప్పుడు దాని నుడికారం మనం మాట్లాడుకొనేట్లుగానే ఉందా ? లేకపోతే ఏదో విలక్షణంగా అనిపిస్తోందా ? అని ఆలోచిస్తే నూరుపాళ్ళు ఆధునికం అనిపిస్తే 100 పాయింట్లు, ఏ మాత్రమూ ఆధునికం అనిపించకపోతే "0" పాయింట్లని లెక్క కట్టుకోవచ్చు.

ప్రకృతి – ప్రత్యయ స్వరూప నిర్మాణాలు మరొక ప్రమాణం. ప్రకృతులు పాతవా కొత్తవా అని చూడటం ఒక ఎత్తు. వాటి సంబంధం వ్యాకరణప్రక్రియ ఆధునికమా కాదా అనేది మరొక ఎత్తు. ఉదాహరణకి : "తేరం బూని" అనే ప్రయోగంలో "తేరు" "పూను" అనే ప్రకృతులు ప్రాచీనం. 'పూని' లో క్త్వార్థకం ప్రాచీనమూ, ఆధునికమూకూడా."అనువాడు"లో ప్రకృతులు ఆధునికం గాని వాటి వ్యాకరణసంబంధం ప్రాచీనం. కాని "అనేవాడు"లో ఆ సంబంధం ఆధునికం. ఈ విధంగా ఎన్ని ప్రకృతులు ప్రాచీనం ; ఎన్ని ఆధునికం; ఎన్ని వ్యాకరణ కార్యాలు ప్రాచీనం, ఎన్ని ఆధునికం అనే లెక్కతో ప్రాచీనాధునిక తల భేదాలు తెలుసుకోవచ్చు.

వాడినపదాల్లో దేశ్య అన్యదేశ్యాల నిష్పత్తి, వీటిలో ఎన్ని వ్యవహార సిద్ధమైన పదాలు అన్నవి ఇతర ప్రమాణాలు. ఇవన్నీ ఆధారంగా ఒక రచన ఎన్ని పాళ్ళు ప్రాచీనమో, ఎన్ని పాళ్ళు ఆధునికమో చెప్పవచ్చు.

ఈ పరిశీలనకు వచనరచననుమాత్రమే ఎన్నుకున్నాను. నన్నయ, తిక్కన, చిన్నయసూరి, ఏనుగుల వీరాస్వామయ్య, వీరేశలింగం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, విశ్వనాథ సత్యనారాయణ, గురజాడ అప్పారావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, చలం గార్ల రచనలనుంచి భాగాలను పరిశీలనకు ఎన్నుకున్నాను. ఈనాటి ఆధునికభాష నన్నయ, తిక్కనలకాలంలో వ్యవహారంలో ఉన్న భాషకు సన్నిహితమైందే. కాబట్టి తమకాలంలోని వ్యావహారికభాషను వాళ్ళు ఎంతవరకు తమ రచనల్లో ఉపయోగించారో పరిశీలించవచ్చు. పైన చెప్పిన రచయితల రచనలనుండి యాథయ్యేసి పదాల మేరకు తీసుకొన్న భాగాలనూ, వాటిలోని ప్రాచీనత ఆధునికతలపాళ్ళను తెలిపే పట్టికనూ అనుబంధంగా ఇస్తున్నాను. [ఆధునికతను + గుర్తుతోను, తద్భిన్నాన్ని - గుర్తుతోనూ సూచించాను.]

పట్టికనుబట్టి నన్నయభాష 82 శాతం ఆధునికతకు దూరం అనీ, తిక్కనభాష 75 శాతం దూరమనీ చూడవచ్చు. చిన్నయసూరి మిత్రభేదం మిత్రలాభం కంటె కావ్యభాషకు సన్నిహితం. సరళగ్రాంథికరచనలు:- కందుకూరి, పానుగంటి, చిలకమర్తి మొ॥వాళ్లవి. ఆధునికభాషకే దగ్గరగా ఉన్నాయని గుర్తించవచ్చు. అంటే స్ఫూర్తిలోను, (నుడికారంలోను) ప్రకృతులఎంపికలోనూ ఇవి ఆధునికం అంటే ఆధునికభాషలో ఆలోచించి, గ్రాంథిక ప్రత్యయాలను తగిలించటంవల్ల ఏర్పడ్డది కాబట్టి కృతకంగా మార్చిన ఆధునిక భాషే "సరళ గ్రాంథికం" అని నిరూపపించవచ్చు.

కేవల ఆధునికరచనల భాషలో ఉన్న సూక్ష్మభేదాలు గురజాడ, ఉన్నవ, చలం రచనలకు కట్టిన లెక్కల పోలికలో తెలుస్తుంది. ఈ విధానం సూచనామాత్రంగా చేసినదే. దీన్ని మరింత పరిశోధనలో ఇతోధికంగా శాస్త్రీయం చేయవచ్చు.

నన్నయ : భారతము - ఆదిపర్వము.

అయ్యుదంకుండు గురుహితకార్యధురంధరుం డయి గురుపత్నీ నియోగంబునం బౌష్యుం డను రాజు దేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరం

27)

బూని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతి త్వరితగతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీత సత్కారుండై యిట్లనియె...

అనినం బౌష్యుం డిట్టి మహాత్మున కీఁ గాంచితిఁ గృతార్థుండ నైతి నని మనంబున సంతసిల్లి ....

తిక్కన : భారతము - ఉద్యోగపర్వము.

కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుం బ్రాపై పొదలిన నెదిరికి "నజయ్యుల" గుదురుపరుల యొత్తులేని రాజ్యంబు పూజ్య మహిమం బరఁగు వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీ కొడుకులకు నిలుపు గావించుట యగునని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందునుం గల రప్రియం బగుం గాకేమి యని పథ్యంబు వలుకువారు లేరు. జూదంబు నప్పుడే నడ్డపడి ...

చిన్నయసూరి : మిత్రలాభము.

ఓరీ పాంథ ! విను. మునుపు యౌవనమందు మిక్కిలి దుష్టుఁడ నయి యుంటిని. అనేకములగు గోవులను, మనుష్యులను వధించి మితి లేని పాపము సంపాదించి భార్యాపుత్రులనుఁ బోగొట్టుకొని యేకాకి నయి నిలిచితిని. అనంతర మొక పుణ్యాత్ముఁడు నాయందు దయచేసి "యింక మీఁదట గోవులను మనుష్యులను వధింపకు. సత్కార్యములు చేయుము" మని చెప్పెను. అది మొదలుకొని పాపకృత్యములు విడిచి మంచి కార్యములు చేయుచున్నవాఁడను. వృద్ధుఁడను. బోసినోటివాఁడను. గోళ్లు పోయినవి.

చిన్నయసూరి : మిత్రభేదము.

బదరికావనమందు సారోదం బను కాసారంబు గలదు. అక్కడ కొక్క ముసలికొక్కెర వచ్చి నయనంబులు నిమీలించి, యాహారంబు

మాని, దుష్కరం బయిన తపము చేయుదానివలె నొంటికాలితో నిలువం బడి యుండెను. ఒక యెండ్రి యా తెల్లఁగుఁ జూచి కరము వెఱఁగుపడి డాయం బోయి యిట్లనియె, "ఓయి బకోత్తమా ! నీ వనయంబు క్రశిమంబు వహించుచున్నవాఁడవు. చేరువఁ బాఱాడు మీనంబులఁ జూడనయిన నొల్లవు. ఈ యునికి యేదియో నొక్క మహార్థం బర్థించి పూనిన యనశనవ్రతానుష్ఠానంబు ....

కందుకూరి వీరేశలింగం : స్వీయచరిత్రము.

మా శాస్త్రపాఠశాలలోని విద్యార్థులు ఇన్నీసుపేటలో నొక బాలికాపాఠశాలను సహితము స్థాపింప నుద్దేశించిరి. అట్లుద్దేశించినవారిలో పెద్దిభట్ల వేంకటప్పయ్యగారు మొదలయినవారు ముఖ్యులు. విద్యార్థులు పగలు బాలికాపాఠశాలలో పనిచేయుటకు వలనపడనందునను, ధనవ్యయము చేయుటకు శక్తులు కానందునను, వారిపక్షమున నే నా పనికిఁ బూని మిత్రులచేత చందాలు వేయించి యిన్నీసుపేటలో 1881వ సంవత్సరమున నొక బాలికాపాఠశాలను స్థాపించితిని. మా శాస్త్రపాఠశాలాధ్యక్షు లయిన మెట్కాఫుదొరగారు వ్రాయుటచేతఁ గొంతకాలము శ్రీ పీఠాపురపు రాజుగారు ....

పానుగంటి లక్ష్మీనరసింహారావు : సాక్షి.

వారి యిష్ట మేమిటి ? ఇంటర్మీడియేటు క్లాసులోనికి వచ్చు బుద్ధిమంతుఁడైన బాలునకుఁ బదునాలు సంవత్సరము లుండవచ్చును గదా ? తిన్నఁగ నాలుగుమాటలు మాటలాడుటకైన, శక్తి కలిగి యుండఁడు కదా ? అట్టి బాలునకు దేశభాషను మానుటకుఁ గాని, చదువుటకుఁ గాని స్వేచ్ఛయా ? వానికిఁ దోచినయెడల మానవలసినదా ? వాఁ డంతటి దీర్ఘాలోచనపూర్వకమగు కార్య మా వయసులోఁ జేయఁగలఁ డనియే మీ రనుకొందురా ? మీ రట్టివయసులో నట్టి యాలోచనఁ జేసికొనఁగలరా ? బలాత్కారము చేసినందువలన భాషాభిరుచి గలుగదు. కాన ....

చిలకమర్తి లక్ష్మీనరసింహం : విజయలక్ష్మి.

రామేశముగారి సంసారస్థితి కొంత చెప్పవలయును. కుమారుడు ప్లీడరువృత్తికి రాకమునుపే నాలుగైదేళ్ళక్రిందట నాగభూషణముగారు కుమారునకు వివాహప్రయత్నము చేయజొచ్చిరి. నాగభూషణముగారు మంచి సాంప్రదాయములోనివారు గనుకను, రమారమి పదియెకరముల భూమి గలవారు గనుకను చాలామంది తమతమ కన్యల నిచ్చెదమని వచ్చిరి. పిల్ల చక్కగా లేదని కొన్ని సంబంధములును, సాంప్రదాయము మంచిది కాదని కొన్ని సంబంధములును, వరదక్షిణ తగినంత లేదని కొన్ని ....

విశ్వనాథ సత్యనారాయణ : వేయి పడగలు.

ఈ వార్త పరగణా యంతయు వ్యాపించెను. "క్రొత్త దివానుగారు రాజుగారికన్నఁ జండప్రచండుఁడు. ఒడప్పు దగ్గఱపెట్టుక మనవలె" నని సర్వజనులకుఁ దెలిసిపోయెను. దివానుగారు కోటలోని యుద్యోగుల నందరిని బరిశీలించెను. అనవసరమైనవారి నందఱను దొలఁగించెను. కోటలో నలువదిమంది గుమాస్తా లుండిరి. వారిలోఁ బాతికమంది నుంచి మిగిలినవారిని విడుదల చేసెను. ఇంచుమించుగా నిరువదిమంది కాసా వాండ్రను గూడఁ దొలఁగించెడివాఁడే కాని రాణివాసమునుండి యత్యంత రములు వచ్చెను. అడవిజంతువులు చాల చచ్చిపోయినవి గనుక నచట (నున్న) ....

గురజాడ అప్పారావు : ఆణిముత్యాలు.

ఆదివారం మధ్యాన్నం నాలుగుగంట లప్పుడు పువ్వులతోటలో ఒక పరుపు మావిడి చెట్టుక్రింద యిసకలో మేవఁంతా పాతికమంది కూర్చు న్నాం. గావంచా పరచుకొని మాకు అభిముఖంగా శాస్త్రుల్లుగారు కూచు న్నారు. నేను బల్లచెక్క తెచ్చి వెయ్యబోతే, "వొద్దురా, మీరంతా కింద కూచుంటే, నేను బల్లమీద కూచుంటాన్రా?" అన్నారు. రెండు లేత కొబ్బరికాయలనీళ్ళు తాగి, తాంబూలం వేస్తూ, శాస్త్రుల్లుగారు బౌద్ధమతం విషయమై (ఉపన్యసించారు)

ఉన్నవ లక్ష్మీనారాయణ : మాలపల్లి.

బండి దేవాలయానికి పోయే మెట్లదగ్గిర ఆగింది. కోడలూ, రామా నాయుడూ దిగారు. లక్ష్మమ్మ మీరు నొగలు పట్టుకుంటే దిగుతానని మెల్లిగా జారింది. పూజారి అప్పయ్య హాజరుగా వున్నాడు. చాలా పొడుగాటివాడు. అరవయ్యోపడిలో వుంటాడు. కొంచం అదంగిరేకలమనిషి, సంసారం లేదు. చిన్నప్పుడే భార్య వెళ్ళిపోయింది. పొట్ట లోపలికి పోయి యెప్పుడూ అక్కుళించే వుంటుంది. జామారు పింజబోసి మోకాళ్ల మీదికి దోపుకొని తడి ....

చలం : అరుణ.

పదిహేనేళ్ళకిందట నన్ను ప్రేమించింది. ఆ పదిరోజులూ - కాదు ఆ మూడు రోజులే. కాని అప్పుడైనా ప్రేమించిందా ? ఏమోమరి. ప్రేమే ఐతే పదిరోజుల్లో - నన్ను చేతులు జాచి ఏడుస్తున్న నన్ను - పిల్లని మరిపించి చెరువుకి వెళ్ళే తల్లిలాగు నవ్వుతూ వెళ్ళిపోతుందా ? కాని పది రోజుల ప్రేమ అనేది వుండకూడదా ? ఆజన్మాంతమూ అనే పురాణ పవిత్రపదం పనిచెయ్యడం మానదుకదా మనసుల్లో ! నాకు ....

ఏనుగుల వీరాస్వామయ్య : కాశీయాత్ర చరిత్ర,

౨౭ తేది ఉదయాన ౪ ఘంటలకు ప్రయాణమై ౬ కోసుల మార్గములో నున్న షాపుర మనే యూరు ౧౦ ఘంటలకు చేరినాను. దోవలో పాలమాకుల యనే జలసౌఖ్యము గల గ్రామమున్నది. ఆ పాలమాకుల వరకు బాట సరాళము. కొంత కొంత దూరము రాతిగొట్టుగా వున్నది. జలచర్ల వదిలిన వెనక పర్వతసమూహముల దర్శనము దారిలో నిది వరకు లేదు. సాధారణమైన యడవి నడుమ బాట పోవుచున్నది. ఆ గ్రామంలో ......

## భాష

| విషయం | | స్ఫూర్తి | ప్రకృతి ప్రత్యయం | వాడుకతో తుల్యం | పాతవి కొత్తవి | దేశ్యం అన్యం | | |
|---|---|---|---|---|---|---|---|---|
| నన్నయ | | −100 | −38 | −50 | −33 | −23 | −2.47 | 82 శాతం (—) |
| * పే. 21 | −1 | | +12 | | +14 | +27 | + .53 | 18 శాతం (+) |
| తిక్కన | | −100 | −37 | −50 | −27 | −13 | −2.27 | 75 శాతం (—) |
| * పే. 96 | −1 | | +13 | | +23 | +37 | + .73 | 25 శాతం (+) |
| చిన్నయసూరి మిత్ర | | − 50 | −26 | −35 | − 3 | −22 | −1.36 | 46 శాతం (—) |
| లాభం పే. 393 | −1 | + 50 | +24 | +15 | +47 | +28 | +1.64 | 54 శాతం (+) |
| మిత్రభేదం | | −100 | −30 | −36 | −22 | −16 | −2.04 | 68 శాతం (—) |
| పే. 399 | −1 | | +20 | +14 | +23 | +34 | + .96 | 32 శాతం (+) |
| వీరేశలింగం | | | −11 | −16 | − 1 | −20 | − .43 | 16 శాతం (—) |
| స్వీయచరిత్ర పే.168 | +1 | +100 | +39 | +34 | +49 | +30 | +2.52 | 84 శాతం (+) |
| పానుగంటి | | | −27 | −21 | | −15 | − .57 | 19 శాతం (—) |
| సాక్షి I పే. 13 | +1 | +100 | +29 | +29 | +50 | +35 | +2.43 | 81 శాతం (+) |
| చిలకమర్తి | | | −11 | −14 | − 2 | −14 | − .41 | 13.6శాతం (—) |
| విజయలక్ష్మి పే.130 | | +100 | +39 | +26 | +49 | +36 | +2.59 | 56·38శాతం (+) |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| విశ్వనాథ | | | −17 | −26 | − 1 | −12 | − .56 | 18.7 శాతం (−) |
| వేయిపడగలు పే. 52 | +1 | +100 | +33 | +24 | +49 | +48 | +2.44 | 81.3 శాతం (+) |
| గురజాడ ఆణిముత్యాలు | | | − 1 | − 1 | | − 9 | − .11 | 6.7 శాతం (−) |
| పే. 1-2 | +1 | +100 | +49 | +49 | +50 | +41 | +2.89 | 93.3 శాతం (+) |
| ఉన్నవ మాలపల్లి | | | | | −2 | − 4 | − 6 | 2 శాతం (−) |
| పే. 65-66 | +1 | +100 | +50 | +50 | +48 | +46 | +2.94 | 98 శాతం (+) |
| చలం అరుణ | | | | | − 1 | − 9 | −10 | 3.3 శాతం (−) |
| పే. 24 | | +100 | +50 | +50 | +49 | +41 | +2.90 | 96.7 శాతం (+) |
| ఏనుగుల | | | −6 | − 8 | | −14 | −23 | 8.3 శాతం (−) |
| పే. 356 | +1 | +100 | +44 | +42 | +50 | +36 | +2.72 | 91.7 శాతం (+) |

ఆధారగ్రంథం : "గద్యచంద్రిక" సంపాదకుడు : విశ్వనాథ సత్యనారాయణ,
ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ.

# హైదరాబాద్ ఉర్దూ సాహిత్యంలో తీరు తెన్నులు

డా॥ రాజబహదుర్ గౌడ్

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం చీలిపోయిన తెలుగునేల ఖుతుబ్ షాహీల కాలంలో తిరిగి సమైక్యతను సాధించిందని చెప్పొచ్చు. తెలుగు — ఉరుదూ — ఈ రెండు భాషలు ఆ కాలంలో "దఖనీ" స్వరూపంలో వికాసం చెందడం ప్రారంభించాయి. నాల్గవ ఖుతుబ్‌షాహీ రాజైన మహమ్మద్ ఖులీ ఖుతుబ్ షా స్వయంగా తాను కవియై "దివాన్ ఖులీ ఖుతుబ్షా" పేరుతో ఒక కవితాసంకలనాన్ని రూపొందించాడు.

దఖనీభాషయొక్క మౌలికలక్షణా లేవంటే:

[1] ఢిల్లీ పరిసర ప్రాంతాలలో వ్యవహారంలో ఉన్న "ఖరిబోలి" అనే మాండలికంనుండి మౌలికపదసమృద్ధిని సాధించుకోవడం.

[2] ఆనాడు ప్రచారంలో ఉన్న "బ్రిజ్" అనే సాహిత్యభాష నుండి కూడా తగినన్ని పదాల్ని స్వీకరించడమే కాకుండా పంజాబీభాషనుండి కూడా కొన్ని పదాల్ని తనలో కలుపుకోవడం. ముఖ్యంగా ఏకవచనం బహువచనంగా పరివర్తనం చెందే విధానాన్ని అనుసరించడం.

ఉదా:—షాయర్ ఏక॥ షాయ్‌రన్ బహు॥

కితాబ్ ఏక॥ కితాబన్ బహు॥

[3] సంస్కృతభాషలోని పదాల్ని వాటి మూలరూపాల్ని కాకుండా అపభ్రంశరూపాలనుమాత్రం స్వేచ్ఛగా తనలో కలుపుకోవడం.

ఉదాహరణకు: సంస్కృత శబ్దమైన విద్యుత్ శబ్దానికి అపభ్రంశరూపమైన "బిజిలి"రూపాన్ని గ్రహించడం.

[4] ఇది తన నిర్మాణానికి అనుగుణంగా స్థానికభాషలైన గుజరాతీ, మరాఠీ, కన్నడము, తెలుగు మున్నగు భాషలలోనుండి అనేక పదాల్ని, వాటి సహజస్వరూపంతో గాని, కొద్ది మార్పులతో గాని తనలో కలుపుకోవడం.

ఉదాహరణకి : "ఒద్దు," "పరిహాసము" అనే అర్థాలుగల 'నక్కొ' "గమ్మత్"అనేపదాలు మరాఠీనుండి, 'గంప, గుత్తా' అనే పదాలు తెలుగునుండి స్వీకరింపబడ్డాయి.

[5] దఖనీభాషలో ఆనాడు వెలువడిన సాహిత్యం ఆనాటి హిందూ మహమ్మదీయుల మతవిశ్వాసాల, ఆచారాల ఏకీకరణకు ప్రాతినిధ్యం వహించింది. అట్లాగే దఖనీ సూఫీల మార్మికరచనలు హిందూవేదాంతానికీ, ఈరానీ "తసవ్వుఫ్" యొక్క ఏకీకరణకి తోడ్పడ్డాయి. "చంద్రబదన్ మాహియా" అనే కథాకావ్యం హిందూస్త్రీ ఒక మహమ్మదీయుణ్ణి, ప్రేమించిన వృత్తాంతాన్ని చెబుతుంది.

ఈ విధంగా"దఖనీ"సాహిత్యసృష్టిచేస్తూ క్రమంగా దక్షిణదేశంలో బరహన్‌పూర్, అహమదాబాదు నుంచి రాయచోటి బెంగుళూరుల వఱకు ఒక సంబంధ భాషగా అభివృద్ధి చెందింది.

ఈ వ్యావహారికధోరణికి ప్రతికూలంగా ఢిల్లీ, లక్నో ప్రాంతాలలో ఆధునిక ఉరుదూభాష (Modern Urdu) శిష్టులు మాట్లాడుభాషగా తనరూపు దిద్దుకుంటున్నది. ఆనాడు ఈ రెండు ధోరణులు ఒకవైపు సహజీవనాన్ని చాటుతూనే, మరొకవైపు సంఘర్షణకు లోనైనాయి. "వాలి" ఔరంగాబాద్ దఖనీలో ప్రారంభమై ఢిల్లీ ఉరుదూలో లీనమైపోయింది. పిమ్మట మొదటి ఆసిఫ్‌జా ఔరంగాబాదు ముఖ్యపట్టణంగా స్వాతంత్ర్యాన్ని ప్రకటించడంతో దఖనీకి పతనం ప్రారంభమై క్రమంగా సాహిత్యపు విలువలనుండి దిగజారిపోవడం తటస్థించింది. 18వ శతాబ్దపు ఉత్తరభాగంలో రెండవ ఆసిఫ్‌జా యైన నిజామ్ అలీఖాన్ తన ముఖ్యపట్టణాన్ని హైదరాబాదుకు మార్చడంతో "దఖనీ"ని వ్యవహారం నుండి తప్పించి దానిస్థానంలో శిష్టవ్యావహారికమైన ఢిల్లీభాష హైద్రాబాదు సంస్కృతిని పరిపాలించడం ప్రారంభించింది. 19వ శతాబ్దపు ప్రారంభ

దశలో కూడా "చందూలాల్ షాదన్" శిష్టవ్యావహారికాన్నే ప్రోత్సహించి పోషించాడు. ఈతనికాలంలోనే "ఖయాన్" అని కవి వ్రాసిన కవిత ఈవిధంగా ఉంది.

"కౌన్‌యేహేగనిగూడ తలే కొఠెకే ఖజా
ఘారేజొచెకొ మెరే దేఖ్‌కే హర్ ఇన్‌దవా"

తరువాత ఆయనభాష ఈ విధంగా మారింది.

"హైజొ ఇస్కందరే దౌరాఖా వజీరే ఆజమ్
జిన్‌కే హైసాయయే అల్‌తాఫ్‌మే ఆలమ్‌చల్‌తా"

ఈ విధంగా దఖనీభాషను నిరసించడం, ఢిల్లీ ఉరుదూను అంగీకరించడంతో 19 వ శతాబ్దపు పూర్వార్థం ముగిసింది. 19వ శతాబ్దపు ఉత్తరార్థంలో "దాగ్, అమీర్ మినాయ్" అను కవులు హైదరాబాదుకు వలసరావడంతో ఢిల్లీఉరుదూ ఉత్కృష్టత పరాకాష్ఠ నందుకుంది. దీనితో దక్కన్‌పీఠభూమిపై ఉన్న హైద్రాబాదు, ఢిల్లీకి ప్రతిరూపంగా మారిపోయింది. ఇప్పటినుండే ఉరుదూ సాహిత్యం గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ఢిల్లీఉరుదూ కది స్వర్ణయుగం.

ఈ కాలంలోనే శామ్‌సుల్ ఉమేరా అనే అతడు ఇంగ్లీషు ఫ్రెంచిభాషల్లో ఉన్న ఎన్నో శాస్త్రీయగ్రంథాల్ని ఉరుదూభాషలోకి అనువదించడంలో ఎంతో కృషి చేశాడు. ఫ్రంట్ విలియమ్ కాలేజీలో సమర్థులయినవారిచే అనువదించబడ్డ గ్రంథాలెన్నో హైద్రాబాదు నలంకరించాయి. కవితాక్షేత్రంలో కూడా ఆనాడు 'ఢిల్లీభాషే' ప్రబలమైన భాషగా ప్రసిద్ధి కెక్కింది.

మరొకవైపు వాసిల్ మాయల్‌వంటి కవులు ఢిల్లీఉరుదూకవుల ఆధిక్యతని తగ్గించడానికీ, స్థానికకవులలో పాతుకొనిపోయిన న్యూనతాభావాన్ని పోగొట్టి ప్రోత్సహించడానికి కంకణం కట్టుకున్నారు. ఈవిధంగా ఇరవయ్యో శతాబ్దపు మధ్యకాలానికి ఢిల్లీ ఉరుదూ అధిక్యతకి ప్రతికూలంగా నాటబడిన "దఖనీ"బీజం ముల్కీ ఉద్యమరూపంగా మొలకెత్తడం మనం గమనించగలం.

దాగ్, అమీర్ మినాయ్‌ల అసభ్యకరమైన ఉద్రేకపూరితమైన చవకబారు ప్రేమ సాహిత్యాన్ని ప్రతిఘటించడంతో మొలకెత్తిన ఈ ఉద్యమం 20 వ శతాబ్దపు ఉషోదయానికి మహావృక్షమై భాషా, సాంస్కృతిక పునర్వికాసపు ఫలాలను అందించడం ప్రారంభించింది.

ఈ ఉద్యమంయొక్క ముఖ్యోద్దేశాలివి.

[1] సాహిత్యానికీ, మానవజీవితానికీ సన్నిహితత్వ మేర్పరచి, జీవితంలో ఆశ, ఆత్మవిశ్వాసాల్ని కల్పించడం.

[2] సామాన్య ప్రజానుగుణమైన వాడుకను సాహిత్యంలో సిద్ధింపజేసి భాషను సులభగ్రాహ్యంగా తీర్చిదిద్దడం.

[3] వ్యాసరచనను, నవలా రచనను, శాస్త్రీయసాహిత్యాన్ని రూపొందించడం.

[4] సామాన్య జనసమ్మతమైన పాత్రికేయరచనల్ని ప్రోత్సహించడం.

[5] క్షీణించిన భూస్వామ్యవర్గంయొక్క అసభ్యకరమైన అవసరాలకు వ్యతిరేకంగానూ, అభ్యుదయకర సామాజిక ఉద్దేశాలకు ఉపయోగకరంగానూ హాస్య వ్యంగ్య పూరితమైన సాహిత్యాన్ని ఉత్పన్నం చేయడం.

ఆనాటి వివిధభాషా సాహితీవేత్త లయిన సయ్యద్ అహమద్ ఖాన్, ఖ్వాజా అల్‌తాఫ్‌హుస్సేన్‌హాలీ, షిబ్లీ, నజీర్ అహమ్మదు, భరత్, విద్యాసాగర్, వీరేశలింగం, సుబ్రహ్మణ్యభారతి మున్నగువారి సాహిత్యసృష్టికి పైన పేర్కొనబడిన సాహిత్య పునర్వికాసోద్దేశాలే ఊపిరై నిలిచాయి.

మధ్యయుగాలనాటి భూస్వామ్యదీవి-హైద్రాబాదు, పునరుత్థాన మయిన హిందూదేశపు పరిసరాలలో - సంసర్గరహితంగా ఎంతోకాలం ఉండలేకపోయింది. 1919 లో ఉన్నతస్థాయి విద్యాబోధనార్థమై ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడకపూర్వమే 1917 లోనే ఒక అనువాదకార్యాలయం స్థాపించబడడం ఉరుదూసాహిత్యచరిత్రలోనే ఒక గొప్పమలుపు సంభవించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆనాడు తక్కువ వ్యయంతో ఉన్నతస్థాయి విద్యా

ర్జనకు అవకాశా లుండడంవల్ల మధ్యతరగతి, క్రిందితరగతి బాలురు అధిక సంఖ్యల్లో ఉన్నతవిద్యవైపు ఆకర్షింపబడ్డారు. అయినప్పటికీ అప్పటి వ్యవస్థ భూస్వామ్యకుటుంబాలనుంచి వచ్చిన బాలుర కనుకూలంగా పక్షపాతధోరణిని ప్రదర్శించడంవల్ల స్థానిక మధ్యతరగతి మేధావివర్గాలను అంతగా ఆకర్షించే అవకాశాలు తగ్గిపోజొచ్చాయి. ఈ పక్షపాతధోరణే ఆర్థికప్రగతికి అడ్డుగోడై నిలిచింది. మరొకవైపు విశ్వవిద్యాలయ మయితే నేమి, అనువాద కార్యలయ మయితే నేమి యు.పి., పంజాబ్ మున్నగు ప్రాంతాలలోని మేధావివర్గాలను ఆకర్షించడం ప్రారంభించాయి. ప్రభుత్వంలోనూ, అటు న్యాయస్థానాల్లోనూ పర్షియన్‌కు బదులుగా ప్రవేశ పెట్టబడిన ఉరుదూ భాష, ఉత్తరప్రదేశ్, పంజాబ్, బీహార్లలోని యోగ్యతగల మేధావుల నెందరినో ఆకర్షించింది. ఇది కొంతవరకు ఉద్రిక్తభావ ధోరణుల్ని సృష్టించింది. అనువాదక్షేత్రంలో ఆనాడు రెండు కూటము లేర్పడ్డాయి. ఒకటి వహీదుద్దీన్ సలీమ్ కూటమి. రెండవది చౌధరీ బర్కతలీ కూటమి. మొదటిది సులభమైన స్పష్టమైన భాషకు ప్రాతినిధ్యం వహిస్తే, రెండవది కష్టమైన, క్లిష్టమైన పరిషియన్ అరబిక్ భాషలను ఆరాధించింది. ఉద్యోగ నియామకాల పోటీలలో స్థానికులకు ఔత్తరాహులకు విరోధం చెలరేగింది.

సృజనాత్మక సాహిత్యక్షేత్రంలో ఒక నిజమైన కాల్పనిక కవితయొక్క పునర్వికాసాన్ని దర్శించగలం. ప్రకృతితో సంబంధం గల "నజమ్, గజల్" కవితల్నే కాక, సాంఘికసమస్యల్ని చిత్రించే కవితల్ని ఆనాటి కవుల కలాలు సృష్టించాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం వెలువరించిన "ముజలాయ్‌ఉస్మానియా" పత్రిక కవుల కళాసృష్టికి కాణాచియై నిలిచింది. క్రమంగా సాహిత్య పత్రిక లెన్నో వెలువడ్డాయి. పాత్రికేయరచనకూడా విస్తృతి చెందడం ప్రారంభించింది. 1930—40 ప్రాంతానికే దాదాపు డెబ్భై వార్తాపత్రికలు, జర్నల్సు ఉరుదూలో వెలువడ్డాయి. ఔరంగాబాదు కేంద్రంగా మౌల్వీ అబ్దుల్ హక్ పండితుని ఆధ్వర్యంలో నడుపబడిన "అంజుమన్ తరక్కీయి ఉరుదు" అనే పత్రిక ఆనాటి ఉరుదూ భాషాసాహిత్యాలకు ఎనలేని సేవ చేసింది.

సికందరలీ వాజద్, అగ్బర్ వఫాఖానీ, బాఖీ, మహమ్మదలీ నయ్యర్, తహసిన్ సర్వరి, అబ్దుస్సమద్ రజ్వీ, మహమ్మదలీఖాన్ మైకాష్, మగ్దూం

మున్నగు మహాకవు లెందరో ఆనాటి ఉరుదూసాహిత్యాకాశంలో మెరుపుతారలై ప్రకాశించారు. ఈ సందర్భంలో విద్యార్థిసంఘాల కార్యకలాపాలద్వారా ఉరుదూ నాటకరంగంకూడా ఉత్తేజితమైంది. జాఫ్రుల్‌హసన్, మీర్ హసన్, మగ్దుం మొహిద్దిన్ మున్నగు ప్రముఖులు నాటకరంగాభివృద్ధికి తోడ్పడ్డారు. "దఖనీ," "ఢిల్లీ ఉరుదూ"ల సంఘర్షణ ఫలితంగా దఖనీకవిత అత్యున్నత ప్రచారాన్ని పుంజుకున్న దీ సందర్భంలోనే. గులామలీ, దాన్‌ఖానీ అజాజ్ హుస్సేన్, ఖట్బా మున్నగువారి దఖనీ కవితావల్లరికి ఆలంబనాలై నిలిచారానాడు. కాని, వీరి కవితాధోరణి కేవలం వ్యంగ్య చమత్కారాలకే పరిమితమైపోయి అనుకున్న ఆశయాన్ని అందుకోలేకపోయింది.

ఇకపోతే ఇరవయ్యో శతాబ్దపు పూర్వభాగం ఎన్నో కనీవినీ యెరుగని క్రొత్త సంఘటనలకు సాక్ష్యంగా నిలిచింది. సామ్యవాదంయొక్క విజయపరంపరలూ, ప్రపంచ పెట్టుబడిదారీ విధానంలో కలిగిన క్లిష్టపరిస్థితులూ, ఒక క్రొత్త దృక్పథానికి దారి చూపడంవల్ల హిందూదేశంలోని సామ్రాజ్యవాదవ్యతిరేక విముక్తిపోరాటం ఆనాడు ఒక క్రొత్త శక్తిని పుంజుకొని ముందుకు నడిచింది. దేశంలోని శ్రామికవర్గం ఒక సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తిగా రూపొంది సామ్యవాద వ్యవస్థకోసం ఆతురతతోఎదురుచూస్తున్నది.

మరొకవైపు రైతాంగానికీ, భూస్వాములకీ మధ్య సంఘర్షణలు తలెత్తాయి. మొత్తంమీద స్వేచ్ఛకోసం, ప్రజాస్వామ్యపు హక్కులకోసం ప్రజలు ఒక ఉద్యమరూపంలో కదిలారు. ఆనాటి సాహిత్యం ఈ ఉద్యమానికి అద్దం పట్టింది. 1936 లో అభ్యుదయ రచయితల ఉద్యమం ఒక శక్తివంతమైన సాహిత్యోద్యమంగా రూపు దిద్దుకున్నది. అంతకుముందు ఏర్పడి ఉన్న సాహితీదృక్పథాల్ని మొదలంటా కదిలించి, సృజనాత్మక రచయితల ముందు ఒక నవ్యదృక్పథాన్ని నిలిపిం దీ ఉద్యమం. సులేమాన్ అరిబ్, యూసుఫ్ నాజమ్, లతీఫ్ సాజిద్, నాజర్ హైద్రాబాదీ, రషీద్ ఆజర్, కన్వాల్ పర్‌షాద్, ఇబ్రహీం జాలిస్, హుస్సైనీషాహెద్, ఖైరత్‌నదీమ్, ఇష్రత్, ఇగ్బాల్ మతీన్, షాజ్‌తమ్ కనాత్ మున్నగు యువరచయిత లెందఱో ఈ నవ్యపథానికి నాంది పలికారు.

ఖాజీ అబ్దుల్‌గఫార్ సంపాదకత్వంలో నడిచే "పయామ్" పత్రిక, ఎం.నర సింగరావుగారిచే నడుపబడిన "రయ్యత్" పత్రిక నవ్యకవుల కలాల విన్యాసా లకు రంగస్థలాలై నిలిచాయి. మానవతాదృక్పథంతో కోట్లకొలది పీడిత ప్రజ లకు అండగా నిలవడం, - సామ్రాజ్యవాద, ఫాసిస్టు వ్యతిరేక సామ్యవాదస్థాప నం - ఇవి వారి సాహిత్యోద్యమ లక్ష్యాలు. జాగీర్దార్లకు, దేశముఖులకు వ్యతి రేకంగా జరిగిన తెలంగాణా పోరాటానికీ, నిజాం ప్రభువుయొక్క ఆధిపత్యానికి వ్యతిరేకంగా జరిగిన ప్రజాస్వామ్యపోరాటానికి అనాటి అభ్యుదయసాహిత్యం ఆలంబనమై నిలిచింది.

మగ్దూం, ఆరిబ్ — వీరిద్దరూ తెలంగాణాపోరాటాన్ని చిత్రిస్తే, మరొక వైపు మైకాష్ విసునూరు దేశ్‌ముఖ్ దుండగాలకు వ్యతిరేకంగా జరిగిన జనగామ పోరాటాన్ని వర్ణించారు. తాజ్‌పత్రిక ఈ రచన లన్నింటికీ ఆనాడు రంగస్థలం. అఖ్తర్‌హసన్ సంపాదకత్వంలో సాగుతూఉండే "పయామ్" కూడా ఈ రచ నల్ని ప్రకటిస్తూ ఉండేది. ఈ పోరాటంపట్ల చూపించే సానుభూతికి ఫలితంగా ఆరీబ్, అఖ్తర్‌లకు జైలుజీవితం ప్రాప్తించింది. అనాటి మేధావి వర్గంలో ఉత్తరదేశ ధోరణికి వ్యతిరేకంగా, ఒక స్థానికభావం "దఖనీ జాతీయత." "హైద్రాబాదు ప్రత్యేకత" మున్నగు పేర్లతో అవతరించింది.

20వ శతాబ్దపు అర్ధభాగానికి ఈ ధోరణి మజ్లిస్‌నాయకుడైన ఖాసింరజ్వీ నాయకత్వంలో "స్వతంత్ర హైద్రాబాదు" నినాదం క్రింద తీవ్రరూపం దాల్చింది. ఈ సందర్భంలో అభ్యుదయరచయితల సంఘంకూడా విచ్ఛిన్నమైంది. ఇబ్రహీం జాలిస్, నాజర్ హైద్రాబాదీ, షాహదు సిద్దిఖి మొదలగువారు కొందరు "స్వతంత్ర హైద్రాబాదు" నినాదంతో ఖాసిం రజ్వీని బలపరిచారు. కాని మగ్దూం, ఆరిబ్, హుసైనీ షాహద్, అతిఖ్‌షా, ఇన్‌బాల్ మతీన్ మున్నగు అభ్యుదయ వాదులు భూస్వామ్యవ్యవస్థకి వ్యతిరేకంగా తమ కలాలను, గళాలనూ కూడా అంకితం చేశారు.

పోలీసుచర్య "ఆజాదు హైద్రాబాదు" ధోరణిని సమూలంగా కదిలించి వేసింది. షాహెదు సిద్దిఖి మున్నగు కవు లెందరో తిరిగి అభ్యుదయ రచయితల పక్షంలో ప్రవేశించారు. అప్పటినుంచీ మన దక్షిణాపథంలో ఈ సృజనాత్మక ఉరుదూ సాహిత్యం జాతీయసాహిత్యంలో అంతర్లీనమై, ఈ సంధికాలపు సామాజిక, సాంస్కృతికావసరాలను తన సహజ ఆధునికధోరణిలో ప్రతిబింబింపజేయగలుగుతున్నది.

దఖనీ కవితాధోరణిలోనే ఒక ప్రత్యేకత ఉంది. దీనికి ప్రాతినిధ్యం వహించిన సర్వార్ డండా, సులైమాన్ ఖాతిబు లీనాడు లేరు ఈనాటి యువ రచయితలు మాత్రం తమ కావ్యసృష్టిని హాస్యానికే అంకితం చేస్తున్నారు.

